అరుమూడగు - గచ్చువిచ్చగు, వమ్మగు, నగానికి నగమగు.
అరువంట్య-చలిపందిరి, పానీయశాల.
అరువాపి-కొంత మేలురకము.
అరె - చెప్పులుకుట్టు సూది, ఒక దినుసు బాణము, ఒక చెట్టు, మరాటివాఁడు, అరెరె.
అరెకుఁడు-ఆరక్షః=తలారి, కొత్వాలు.
అరెకోల-బరికోల, మునికోల.
అరెతీఁగ-పానీయవల్లి + [జాజి +.
అరెపువ్వు-ఒక సుగంధ ద్రవ్యము, ఏలు
అరెబొట్టె-కోడికాలి ఒంటిగోరు.
అరెమరాటీలు-బొమ్మలాటగాండ్రు.
అరెము-ఆరాము, ఆటతోఁట, అరవము.
అరెవడ్లు-సూదులవంటి కొనలుగల వడ్లు.
అరేరు-నాగేళ్లబారులో రెండవది.
అరోగి(గ)ణము-ఓగిరము, ఆరగింత.
అరోగిణమొనర్చు-కుడుచు, సాపడు.
అర్గురు-అరుగురు, అర్వురు.
అర్గురుతల్లులకొమరుఁడు-కొమరసామి.
అర్చు-అరుచు, అఱచు, బొబ్బరించు,
అర్చుతీర్చు-కోర్కెతీర్చు, ఊరార్చు.
అర్చుపేర్చు-చెలరేఁగు, ముమ్మరించు.
అర్జము-చూ. అరజము.
అర్తి-అరితి, వంత, వగపు, పీడ.
అర్దము-అఱుతూములు-అఱుము.
అర్పు-అఱుపు, ఆఱావు, బొబ్బరింత.
అర్వేరము-అరివేరము, జగడము.
అర్వేలవారు-నియోగిశాఖీయులు.
అఱ(గట్టు)బెట్టు-బట్ట ఎండవేయు.
అఱడి-అట్టు, దూఱు, వమ్ము, చెడ్డ, వెత.
అఱడిచేయు-చెఱచు, వమ్ముచేయు, తిట్టు.
అఱడివడు-అవ్వపడు, పొల్లపోవు.
అఱడిపుచ్చు-వమ్ముచేయు, అవ్వపెట్టు.
అఱడిపె(వె)ట్టు-దండుగచేయు, కష్టపెట్టు.
అఱడిపోక-వమ్మగుట, వగచుట.
అఱడిపో(వో)వు-వమ్మగు, చెడు.
అఱవసంద్రము-పాల్కడలి-క్షీరాబ్ధి.
అఱావు-అఱుపు, అర్పు, బొబ్బ.
అఱిచను-అఱిపోవు, నశించు, పోవు.
అఱిపోవు-నశించు, చెడు, నష్టపోవు.
అఱు - ఇంకు, తగ్గు, చచ్చు; నూగారు, ఎండు, అయిదునొకటి.
అఱుగంట్లకచోరము-గంధమూలి +
అఱుగాళ్లజీవము-సాలీడు.
అఱుగురు-అర్గురు, అర్వురు, అఱుమంది.
అఱుచు-అర్చు, అఱచు, ఎండించు.
అఱుదూఱు-నింద-ఆడిక, అరడి.
అఱుదొండ-అదొండ, అడవిదొండ.
అఱుపు-జెట్టీల బొబ్బరింత, కూఁత.
అఱుము-అర్దము, అఱుతూములు.
అఱుమ్రాఁడగు-తాఱుమాఱగు, చెడు.
అఱుమ్రాఁడుచేయు-చెఱచు, తగ్గించు.
అఱుమోముల(వేల్పు)సామి-కుమారస్వామి
అఱురిక్కలల్లెపోఁగు-కృత్తిక *
అఱువ-సీమ-ఎల్ల-హద్దు, మేర.
అఱువాళవారు-అళువారు, శివభక్తులు.
అఱువాళ్లు-వడ్లు కొంచెమెండుట.
అఱువురు-అఱుగురు, అర్వురు.
అఱువేలవారు-నియోగి బ్రాహ్మణులు.
అఱుస-అఱుకుంచముల కొలఁత.

ఆలం(క)కి(గుడి)-కుర్చీవంటి ఒక పల్లకి. ఒకానొక బాలక్రీడ.
ఆలకా(పు)పరి-పసులఁగాచు గొల్ల.
ఆలకి-ముండమోపి, దిక్కులేనిది.
ఆలకించు-ఆలక్ష్ = ఆలించు. చెవియొగ్గు.
ఆలగోడు-పశువుల కష్టము.
ఆలచాలు-చేఁప నీటిలో పోయినదారి.
ఆలతి(త్తి)-ఆలప్తిః = రాగాలాపము.
ఆలతిసేయు-రాగ మాలాపించు.
ఆలన-మొఱవినుట, ఏలుబడి.
ఆలపించు-కళలువేయుచు రాగముపాడు.
ఆలపుఁదిండయగారు-నారదుఁడు.
ఆలపుచ్చు-త్రోసిపుచ్చు. ఉపేక్షించు.
ఆలపుటాలము-వేడుకపోరు.
ఆలపోతు-ఆఁబోతు, అచ్చుపెద్దు.
ఆలము-కల్ల, వేడుక, పోరు, ఆలవోక.
ఆలముచేయు-పోరుసల్పు, ఉపేక్షించు.
ఆలమెకము-నక్క-ఊళమెకము.
ఆలయము-గుడి, కోయిల.
ఆలరి-తుంటరి, ఆకతాయ. అవివేకి.
ఆలతేఁడు-ఆఁబోతు, బసవఁడు.
ఆలవట్టము-ఆలావర్త = రాజులకు పట్టెడు తెల్ల(గుడ్డ)గొడుగు-సూరెపాను.
ఆలసించు-జాగుచేయు, తడయు.
ఆలాకు-దండుగ, వమ్ము. రూ. అలాకు.
ఆలా(గు)-ఆ రీతిగా, ఆ మాదిరిగా.
ఆలాగే-అల్లే. ఆ రీతిగనే
ఆలాపించు-చూ. రూ. ఆలపించు.
ఆలాయమగు-పొల్పడు, తయారగు.
ఆలాయము-సిద్ధము, తయారు, పాత్రము.
ఆలావట్టము-చూ. ఆలవట్టము.
ఆలి-ఇల్లాలు. ఆలు, ఎగతాళి. కపటము. పిచ్చి. నాలి. గట్టు. కట్ట.
ఆలించి విను-శ్రద్ధతో విను.
ఆలించు-ఆలక్ష్ = ఆలకించు. ఆదరించు
ఆలిఁ(గొను)జేయు-గేలిచేయు. వెఱచు. గెంటు. మోసగించు.
ఆలిఁబుచ్చు-చిన్నపుచ్చు. క్రిందుచేయు.
ఆలిచిప్ప-నత్త(కప్ప)చిప్ప. కాకిచిప్ప.
ఆలితనము-దీనత, భార్యాత్వము.
ఆలిసేయు-గేలిచేయు, వెఱచు, ఈసడించు.
ఆలిపైదోడు-భార్య తోఁబుట్టువు.
ఆలు-ఇల్లాలు, ఆఁడుది, ఆవులు, పురుష నామాంత్యపదము ఉ॥ రేవణకాలు.
ఆలుగడ్డ-ఉరలగడ్డ, బంగాళాదుంప.
ఆలుచిప్ప-ఆలిచిప్ప-శంబూక.
ఆలుడి-మంచి నడవడి, శీలము
ఆలుపు-జారీచెంబు, ఉర్లగడ్డ. పడవ.
ఆలుబక(బొఖా)ర-ఆరుక-కమ్మరేఁగు +
ఆలువరి = చూ. ఆడువరి.
ఆలువు-మెట్టతాఁబేలు
ఆలెగాఁడు-ఇంటినౌకరు, కొల్వుకాఁడు.
ఆలెప్రొయ్యి-పెడ (జంట) ప్రొయ్యి.
ఆల్తి-కొలఁత నమూనా-ఆది.
ఆల్బకరా-ఆల్బకోడా. కమ్మరేఁగు +
ఆళతి-ఆలతి, రాగాలాపము
ఆ(ళతి)ళీ-కొలఁత నమూనా-అసె-ఆళతి.
ఆళుగ-ఉడుమువంటి ఒక అడవిజంతువు.
ఆళుతనము-దొరతనము, పదవి.
ఆళులు-కింకరులు, వరగలు, ఆళ్లు.

ఆళువ-చూ. రూ. ఆళుగ
ఆళువరి-ఆలు (డు) వరి. అలంగము.
ఆళువారు-జ్ఞాని, విష్ణుభక్తుఁడు, గరుడుఁడు.
ఆళ్లకోస-చెమరుఁగాకి, ముదికాకి.
ఆళ్లు-ఆరికెలు, ఆరుగలు, వరగలు
ఆళ్వారు = ఆళువారు
ఆళ్వారుగడ్డ-చిలగడదుంప
ఆవంకవ్-ఆయెడ. ఆవైపు. ఆప్రక్క.
ఆవంత-ఆవగింజంత-రవ్వంత
ఆవ-ఆవగింజ, చీడ. గుర్తు, మాగాణి, గడ్డి వామి, మేట.
ఆవకాయ-మామిడికాయల ఊరుగాయ.
ఆవగించు-కూరలకు ఆవ రుబ్బిపెట్టు.
ఆవజకాఁడు-రుంజ మ్రోగించువాఁడు.
ఆవజము-అవాద్యమ్ = రుంజయనువాద్యము. రూ. ఆరజము.
ఆవజీఁడు-చూ. ఆవజకాఁడు
ఆవటమగు-తగు, శోభిల్లు.
ఆవటము-పొందిక. తయారు. సిద్ధమైన.
ఆవటముచేయు- } పొత్తుచేయు. తిను. కూర్చు. పూను, సేకరించు
ఆవటించు- }
ఆవటిలు-ల్లు = కలుగు, పొత్తగు.
ఆవడ-ఆమవడ, ఆడవిబీలు +
ఆవడబీలు-ధామార్జనము
ఆవడి-ఆపద, ఆవ(లి)ళి. ఆవిడి.
ఆవడిసేయు-బాధపెట్టు.
ఆవపాలు-తోఁచు, గుర్తుకువచ్చు.
ఆవమల్లె-ఒకదినుసుమల్లె.
ఆవము-ఆవాపః-ఇటుకలబట్టి, ఈసడింపు, ఆడిక, అవడు.
ఆవరించు(కొను)-చుట్టుకొను. క్రమ్ము. కప్పు
ఆవరింత-ఆవరించుట, అప్పళింత
ఆవర్జా-కాతాపుస్తకము, దివచర్య.
ఆవర్జు-ఇచ్చిపుచ్చుకోలు లెక్క.
ఆవర్ధా-ఆవర్జా, కాతాపుస్తకము,
ఆవల-ఆవైపు. అవ(వు)ల, ఆవలిది.
ఆవలి-ఆవడి, ఆవళి, ఆవిడి. చీఁదఱ.
ఆవలించు-నోరుతెఱచు, వగులు.
ఆవలింత-ఆవలించుట, ఆవులింత.
ఆవలింతలు వచ్చు-విసుగుకల్గించు.
ఆవలినాఁడు-ఎల్లుండికి పరదినము.
ఆవలిమొన్న-మొన్నటికి పూర్వదినము.
ఆవలిమోమిడు-అనిష్టము తెలుపు.
ఆవలియెల్లుండి-ఆవలినాఁడు.
ఆవలు-ఆవాలు, ఆఱలు,
ఆవళి-ఆవడి(లి),-చీఁదఱ-హావ(ళి)డి.
ఆవాలు-ఆవగింజలు, ఆవలు, సాసూలు.
ఆవి-ఊపిరి, ఊరుపు. ఆవిరి, ఉక్క.
ఆవించు-ఆవిరిపై ఉడికించు, ఊర్చు.
ఆవికుడుము-ఆ(విరి)యి కుడుము.
ఆవిగొను-ఉడుకు, వెచ్చగిలు.
ఆవిడ-ఆబిడ(డ్డ). ఆవిడె, ఆ(పె)మె.
ఆవిడి-ఆపద, చీఁదఱ, ఆవ(డి)(లి)ళి.
ఆవిడె-ఆబిడె-ఆమె, ఆపె, ఆకె.
ఆవిరి-వేఁడినీటి పొగ-ఆ(వి)యి.
ఆవి(రి)పట్టు-ఆవిరిని పీల్చు.
ఆవిరిల్లు-ఆవిరిచే చెమర్చు, కలఁతపడు,
ఆవిలి-మాంత్రికుని గాజుపాత్ర, బట్టి.
ఆవు-ఆఁబసి, గిడ్డి, తొడుకు-గోవు.
ఆవుఉచ్చ-పంచితము, బ్రహ్మాంబువు.

ఆవునోటివాఁడు-గుట్టుదాఁచనివాఁడు.
ఆవుర-నోరు తెఱచుట-ఆవురింత.
ఆవురావురను-తిండికై తహతహపడు.
ఆవురించు-నోరుతెఱచు, చచ్చు.
ఆవురింత-నోరు తెఱచుట-ఆవుర.
ఆవురు-ఏడ్పుయొక్క మ్రోఁత,తహతహ.
ఆవురుకొను-ఉమ్మగిలు అమరుకొను
ఆవురుగడ్డి-వట్టివేరు, ఉశీరము
ఆవులించు-చూ: ఆవలించు.
ఆవులింత-ఆవురింత-హాఫిక.
ఆవులింపించుగాలి-దేవదత్తము.
ఆశెగాఁడు-హాస్యగాఁడు-గందోళిగాఁడు.
ఆషామాషీ-అశ్రద్ధ, ఉపేక్ష, అలవోక
ఆషూర్ఖానా-ధర్మశాల, సత్రము.
ఆస-ఆశా = కోరిక, దిక్కు.
ఆసకప్పెరగాడు-పాలపిట్ట.
ఆసగత్తె-వలపుగత్తె, అంటేగది.
ఆస(గొను)చేయు-కోరు, వలచు.
ఆసత్తి-ఆసక్తి = చేరిక, కోరిక.
ఆసపడు-కోరు, వలచు, ఇచ్ఛగించు.
ఆసపాటు-కోరుట, వలపు.
ఆసపెట్టు-కోరిక పుట్టించు.
ఆసమాలు-నిరాశపడు
ఆసము-దోసెవంటి తినుబండారము.
ఆసయిచ్చు-ఆశకల్పించు, ఆసపెట్టు.
ఆసరా-ఆశ్రయ = అండ, ఆనిక, ఊఁత.
ఆసరాయగు-అండయిచ్చు, తోడ్పడు.
ఆసరు-అలయు, బడలు. వేసరు.
ఆసవిఱుపు-ఆశాభంగము, నిరాశ.
ఆససేయు-కోరు, ఇచ్ఛగించు.

ఆసాది(వాఁడు)-మాదిగ,పూజారి, నటుఁడు. జాతరలలో బూతులు తిట్టువాఁడు
ఆసాదించు-సిద్ధపఱచు, పూన్చు
ఆసాదు-నాటకము లాడువాఁడు.
ఆసాను-అండ, ఆసరా, ఆనిక.
ఆసామి-మీ = పొలముకాఁపు,వ్యక్తి,ఏలిక.
ఆసామివారీ-పేర్లపరుసప్రకారము,
ఆసారి-ఆచారి, ఆచార్యుఁడు.
ఆసాప-అత్యాశ-పేరాస, దురాశ.
ఆసించు-ఆసపడు, కోరు, ఇచ్ఛగించు.
ఆసిక-కూర్చుండుట.
ఆసికింత-కొంచెము, కాసింత.
ఆసిగము-ఎగతాళి, హాస్యము
ఆసితి-ఆపద, జబ్బు
ఆసు(ఁగ్రోవి)-ఆసుమ్రాను చేపలుపట్టునది.
ఆసుపత్రి-దవాఖానా, వైద్యశాల.
ఆసుపుల్ల-ఆసుగ్రోవి, ఆసుమాను.
ఆసువో(వో)యు-నూలు ను ఆసునఁదోడు.
ఆసుమ్రాను-ఒక నేఁత పనిముట్టు.
ఆసెగాఁడు-హాస్యగాఁడు, గందోళిగాఁడు.
ఆసోది-చూ. ఆసాది.
ఆసోబా-తీఱిక, విశ్రాంతి, సేద.
ఆస్కారము-శక్తి, ఆసరా
ఆస్తి-సొత్తు, ఇష్టము. ఆసక్తి.
ఆస్తికాఁ(డు)పు-కలవాఁడు, అమ్చుకుప్ప.
ఆస్ప(త్రి)టాలు-వైద్యశాల, దవాఖానా.
ఆహకము-ఆయకము, కుదువ, తాకట్టు.
ఆ(హ)హా-ఔరా, అక్కటా-అ(హ)హా.
ఆహాకొట్టు-బాగను, సెబాసను.
ఆహి-అధి = కుదువ, తాకట్టు.
ఆహిపె(వె)ట్టు-కుదువ (తాకట్టు) పెట్టు.

# ఇ

ఇంక-ఈపైన,ఇఁకముందు, మఱియు.
ఇంకఁగొట్టు-ఇనుకఁజేయు, ఇంకించు.
ఇంకఁబాఱు-ఇంకు, ఇగురు
ఇంకట-విరహబాధ-ఇనుకట.
ఇంకను-ఇంక, మఱియు
ఇంకించు-ఇగిరించు, ఎండించు.
ఇంకు-ఈఁకు, ఇనుకు, ఇగురు
ఇంకుడు-ఇగురుడు, ఇనుకుడు
ఇంకువ-ఇక్కువ, ఈఁకువ, గుర్తు, చోటు.
ఇంగలంపెట్టు-కోపించు, నిప్పుపెట్టు
ఇంగ(గా)లము-అంగార = బొగ్గు, పిడక నిప్పు.
ఇంగడించు-నర్దు, ఏర్పఱచు, చేయు
ఇంగళింపు-ఒకానొక జెట్టిపట్టు
ఇఁగారా-ఇటురమ్ము, ఇలా రమ్మ.
ఇంగిలము-ఇంగలము, ఇంగాలము-నిప్పు
ఇంగిలాయ-దివటీ, ఒకజాతి చేఁప.
ఇంగిలాయి-ఒక దినుసుచేఁప
ఇంగిలించు-వాఁగుకొను, వేఱగు.
ఇంగిలి(లీ)కము - హింగుళ = ఎఱ్ఱని ఒక జాతి (ఖనిజము) చేఁప. కొండమచ్చు, ఒకచోట నిలువని యాఁడుది.
ఇంగిలికాయలు-చిన్న మంచినీటి చేఁపలు.
ఇంగిలీ(కి)ఈ-ఒకజాతి జంతువు.
ఇంగిలీజు-ఇంగ్లీషు-ఆంగ్లము.
ఇంగువ-హింగువు,రామఠము.
ఇంచి-మీఁదై, ఇంచు.
ఇంచించుక-కొంచెకొంచెము.
ఇంచిమంచి-ఉంచిమంచి, చిఱుతిండి.
ఇంచు-ఇంపగు, మించు, ఒప్పు, కోరు.
ఇంచు-ఇక్షువు = చెఱకు,వలఁపు,కొంచెము
ఇంచుఁబిఁతి-అంధ్రకత్తె, సుందరి.
ఇందుఁబో(ఁడి)ణి-చెఱకువలెఁ బ్రియమైన మేను కలది-స్త్రీ
ఇంచుక-కించిత్ = కొంచెము, కొద్ది.
ఇంచుకంత-ఇసుమంత, ఒకింత,
ఇంచుట-మీఱుట, ఎచ్చుట, మించుట.
ఇంచుటలుక-పొలయలుక-ప్రణయకోపము
ఇంచు(పాల)కడలి-చెఱకు సంద్రము.
ఇంచుమాను-చెఱకుగడ-తియ్యమాను.
ఇంచుమించు-ఎచ్చుతగ్గులు, రమారమి.
ఇంచుమించుచేయు-దాదాపుగా సరిచేయు.
ఇంచుమించులాడు-ఎచ్చుతగ్గులు పలుకు.
ఇంచుబ్రమాను-కన్నులబ్రమాను-చెఱకు.
ఇంచులాఁడి-చెలికత్తె, ప్రియురాలు.
ఇంచువింటిచెంచు-మన్మథుఁడు.
ఇంచువిలు-చెఱకువిల్లు-ఇక్షుధనువు.
ఇంచువిలుకా(ల్గా)ఁడు } చెఱకువిల్లుగాఁ గల
ఇంచువిలుతు(ల్తు)ఁడు } వాఁడు-మన్మథుఁడు
ఇంచువిలుదా(లుపు)ల్పు-మన్మథుఁడు.
ఇంచువిలుదాల్పుచెయ్వు-రతి, సంభోగము.
ఇంజినీయరు-ఇం. వాస్తుశాస్త్రవేత్త.
ఇంజేటి-ఈఁజేటి = తియ్యకంద +
ఇంజావు-ఇంటి అడ్డదూలము.
ఇంజు-చిక్కుతీయు, చీల్చు.
ఇంటరము - ఎక్కువ తక్కువ మాటలు. ఇఱుకు, ఇక్కట్టు.
ఇంటా(తఁడు)యన- మగఁడు,యజమాని.

ఇంటికప్పు-పైకప్పు. పరుపు.
ఇంటికాఁపు-ఇలుదొర = గేస్తు
ఇంటికిఁగాకపోవు } కడకేగు, ముట్టగు,
ఇంటికిదూరమగు } బహిష్ఠయగు
ఇంటిగరిత-ఇల్లాలు-గేస్తురాలు.
ఇంటిచూర్పు-పైకప్పు-పరుపు, పెణక.
ఇంటినడికొప్పు-వెన్ను, కొప్పు.
ఇంటిపట్టు-ఇంటిదాపు, నివేశనము.
ఇంటిపాప-దాసి, ఉంపుడుకత్తె.
ఇంటిపేరు-వంశనామము.
ఇంటిపైకప్పు-టొపారము, పెణక.
ఇంటిబిడ-దాసి, ఇంటిపాప.
ఇంటిమగఁడు } భర్త. ఇంటియజమాని,
ఇంటియతఁడు } ఇంటాయన.
ఇంటియ(యె)లపాది-ఇంటిల్లపాది
ఇంటియాలు-ఇల్లాలు, గేస్తురాలు. [విల్లు.
ఇంటిలి(దబ్బ) - ఉండేలు. ఉండలువేయు
ఇంటిల్ల(ల్లి)పాది-ఇంటనున్న వారెల్లరు.
ఇంటివాఁడు-గేస్తు, ఇంటి యజమాని.
ఇంటివిడ-దాసి, ఉంపుడుకత్తె.
ఇంటివేలుపు-ఇలువేల్పు, కులదైవము.
ఇంట్రపడు-ఇఱుకుపడు, ఇక్కట్టుపడు.
ఇంట్రము-రూ. ఇంటరము
ఇండి-ఇఁడి, నఞర్థకము, ఇందు.
ఇండు-ఈఁడు +, ఈఁత +
ఇండుగు-ఇందుగు, చిల్ల, కతకము +
ఇండుపగింజ-అంబుప్రసాద
ఇండె-పూలదండ,ఎముకకీలు,చీలిక,తొడ.
ఇండెగట్టు-మాలగ్రుచ్చు.
ఇండెగొట్టు-గొడ్డలితో గాడిపెట్టు.

ఇండెఁబా(వా)యు } సీలు, పగులు, ఇడియు.
ఇండెవాఱు }
ఇండెలుపెట్టు-చిన్నకుప్పలుపెట్టు.
ఇండ్రిక్కు - ఆఁబోతును పోరాటమునకు పురికొల్పు సంజ్ఞ
ఇంత-ఈకొలఁది. ఇదియంతయు.
ఇంతంత-ఇంత పరిమితికల.
ఇంతకుమున్ను-ఇంతకంటె ముందు.
ఇంతట-ఇంతలోపల, ఇచ్చట.
ఇంతటినుండి-ఇప్పటినుండి.
ఇంతటివాఁడు-ఈమాత్రపువాఁడు.
ఇంతకుమున్ను-ఇప్పటికిముందు,
ఇంత(దను)దాఁక-ఇంతవఱకు. ఇందాఁక.
ఇంతనాఁడు చిన్ననాఁడు. బాల్యము.
ఇంతలింతలు-ఇంతింతలేసి.
ఇంతలింతలుచేయు-చిన్నవిచేయు.
ఇంత(లు)లేని-ఇంతటి,ఇటువంటి,ఇంతేసి.
ఇంతవ(డి)ట్టు } ఇంతయు, ఇంత సేపు.
ఇంతవఱకు } ఇందాక, ఈమాత్రము.
ఇంతవాఁడు-ఈమాత్రపువాఁడు.
ఇంతి-స్త్రీ = పెండ్లాము చెలికత్తె, వధువు.
ఇంతింత-ఈ కొలఁదిది-ఏతన్మాత్రము.
ఇంతింతగు-చిన్నది వరుసగా పెద్దదగు.
ఇంతింతలు-చిన్నచిన్నవి. ఈమాత్రపువి.
ఇంతికొపుంజు - ఇంద్రుఁడు - అహల్యాజారుఁడు.
ఇం(తియ)తె(తే)-ఈకొలఁదియే, ఇంతటిదే.
ఇంతేసి-ఇంతచొప్పున, ఇంతలేసి.
ఇంతోటి-ఈపాటి, ఈమాత్రము.
ఇందండి-ఇదిగో తీసికొనండి.

ఇంద-ఇదిగో, ఇందము.
ఇందకో-ఇదిగో, అందుకొమ్ము.
ఇందడవు-ఇంతవఱకు, ఇందాఁక.
ఇంద(న)నుక-ఇంతదనుక, ఇందాఁక.
ఇందమను-ఇదిగోతీసికొమ్మను,ఇందయను
ఇందము-ఇంద, ఇదిగో కైకొమ్ము, రీతి.
ఇందఱు-ఇంతమంది, ఇందొఱు.
ఇందలమందల-క్రమమైన పనితెన్ను.
ఇందలి-ఇందున్న, ఇటనున్న.
ఇందాఁక-ఇంతదాఁక, ఇప్పటివఱకు.
ఇందాపనెల-ఆశ్వయుజమాసము.
ఇందు-ఇముడు,పీలుపడు,రుచించు,ఇచ్చట
ఇందు(గ)గు } చిల్లగింజ, ఇన్నుగ. రూ.
ఇందువు } ఇండు(గు)వు. [యుప్పు.
ఇందుప్పు - సింధు = చెందుప్పు, జాతి
ఇందుల-ఇందుఁగల, ఇందలి, ఇందున్న.
ఇందులకు-ఇక్కడకు, ఇందుచే.
ఇందువు-చిల్లగింజ-ఇందుగు, ఇండువు.
ఇందెపడు-రాపిడిచే అరలు కట్టు.
ఇంద్రికుడుములు-భక్ష్యవిశేషము.
ఇం(పగు)పారు-సొగసగు, అందగిల్లు.
ఇం(పి)పతము-ఇంపు, సొగసు,సువాసన.
ఇంపు-ఇంబు, ఇమ్ము, సొంపు,నెయ్యము.
ఇంపుసొంపారు-మిక్కిలి ఇంపగు.
ఇంపెక్కు-అందగిల్లు, ఇంపగు, ఇంపారు
ఇంపెసలారు-అందగిల్లు, శోభిలు.
ఇంపొ(ందు)లయు-ఒప్పు, సంతసించు,
ఇంబు-ఇంపు, ఇమ్ము, ఇచ్చు, ఇయ్యి.
ఇఁక-ఇంక, ఇఁగ, మఱల.
ఇఁకమీఁద-ఈపైని, ఇఁకముందు.
ఇఁగ-ఇందుమీఁద, ఇంతవఱకు.
ఇఁడి-లేని(ది)వాఁడు అను ప్రత్యయము.
ఇకిలించు-వెకలిగా నవ్వు. ఇగిలించు.
ఇకిలిం(త)పు = వెకలినవ్వు.
ఇక్క-ఇల్లు, అండ, ఇక్కువ, ఇమ్ము.
ఇక్కట్టు-ఇబ్బంది, ఒత్తుడు, ఇంట్రము.
ఇక్కట్లుపడు-అగచాట్లుపడు.
ఇక్కడ-ఈచోటు, ఈలోకము.
ఇక్కపట్టు-ఇల్లు, అండ, ఉనికిపట్టు.
ఇక్కపాటు-ఇఱుకుపాటు.
ఇక్కము-ఇక్కట్టు, ఇఱుకాటము.
ఇక్కలువడు-కదలు, ఉనికిచెడు.
ఇక్కిలి-మెత్తన, మార్దవము.
ఇక్కు-ఇఱుకు, నడునెత్తి, నడుము.
ఇక్కుపడు-ఇఱుకున పడు. ఇంట్రపడు.
ఇక్కుపాటు-ఇబ్బంది, ఇక్కట్టు
ఇక్కువ-ఇక్క ఈగడ, గుర్తు, చోటు.
ఇక్కుమట్టు-నడుముపట్టు, ఇబ్బందికల్గు.
ఇక్కువము-అంతులేనిది.
ఇక్కెన-చొప్పరాశి, కంకులకుప్ప.
ఇగటము-హాస్యము, ఎగతాళి.
ఇగము-హిమమ్ = మంచు, ఇవ(క)ము.
ఇగముదుల్పు-మాంద్యము వదల్చు.
ఇగమెక్కు-మంచెక్కు, చెమ్మగిలు.
ఇగరఁబెట్టు-ఇంకునట్లు చేయు.
ఇగిడించు-ఏయు, కూర్చు, నిగిడించు.
ఇగిరించు-ఇంకఁజేయు, చిగిరించు.
ఇగిరిక-కె = అత్తెసరు, హావిస్సు.
ఇగిర్పించు-చిగిరింపఁజేయు. ఇగురఁజేయు
ఇగిలించు-నోరుతెఱచు, నగు, గుజ్జము
కూయు-ఇవ(లుచు)ల్చు.

ఇగిలిం(త)పు-ఇగిలించుట.
ఇగురఁగట్టు-తిండిలేకుండా చేయు
ఇగురఁబెట్టు-అత్తెసరుచే ఇగుర్చు
ఇగురము-పనినేర్పు, పొదుపు, ఇవురము.
ఇగురాకు-ఇగురు, చిగురు.
ఇగురాకుఁబోఁడి-ణి = చిగురువంటి మెత్తదనము గలది.
ఇగురించు-ఇగుర్చు, చిగుర్చు, నానఁబెట్టు.
ఇగురు-ఇవురు, చిగురు, (వేపుడు) కూర. పంటిచుట్టునుగలకండ,ఇంకు,చిగుర్చు.
ఇగురుఁగైదువుజోదు-మన్మధుఁడు.
ఇగురుఁబోఁడి-(ణి)-చిగురుఁబోఁడి
ఇగురుకూర-ఉడికించి వార్చి పొగచినకూర
ఇగురుకొను, ఇగురుచు - చిగురించు, ఇగురఁజేయు, ఇగుర్కొను,
ఇగురుచూపు-చిగుర్చు, తలయెత్తు.
ఇగురుట-ఇంకుట, ఆవిరి యగుట,
ఇగిరులుకుట్టు-మర్మములు ఛేదించు.
ఇగురువిలుకా(ల్డా)ఁడు, ఇగురువిలుతు(ల్తు)ఁడు - మన్మధుఁడు - చిగురువిల్తుఁడు.
ఇగురువెట్టు, ఇగురొత్తు - చిగుర్చు,పొడచూపు,కలుగు, అనురక్తమగు.
ఇగుర్కొను-ఇగురుకొను, చిగురించు.
ఇగుర్చు-చిగిరించు,పుట్టు,ఇ(గురు,గ్రు)చు
ఇగులుచు-ల్చు = ఇగిలించు.
ఇగుళ్లు-చిగుళ్లు, పంటికండలు
ఇగో-ఇదిగో, ఇదికొమ్ము, ఇదె, ఈలాగే.
ఇగ్గామొగ్గా-సమృద్ధిగా ఉండుట.
ఇగ్గించు-ప్రోత్సహించు, ప్రేరించు.
ఇగ్గు-కదల్చు, సంతసించు, బడాయి.
ఇగ్గు(కొను)-లాగు, తన్ను, ఒలఁగు, పెనఁగు. [ప్రయాస, ఒలగుటలు.
ఇగ్గులాట - పెనఁగులాట, గుంజులాట.
ఇగ్గులాడు-లాగు, పెనఁగు, ఈగులాడు.
ఇగ్గుళ్లు-అప్పుల తగాయిదాలు.
ఇగ్రుచు-పుట్టు, ఇగుర్చు ఇవ్రుచు.
ఇగ్రువగు-ఇగుర్చు, చిగిరించు, పుట్టు.
ఇచట-ఈచోటున, ఇచ్చట, ఇందు.
ఇచ(వొ)టు-ఇచ్చటు, ఇచ్చట, ఇచ్చోటు.
ఇచ్ఛ-ఇచ్ఛా = కోరిక, ఇయ్య, ఇంపు
ఇచ్ఛకదారి = ఇచ్ఛగొండి, ఇచ్ఛకాలమారి
ఇచ్చకబుచ్చకములు-ఇచ్చకములు
ఇచ్చకమాడు-అచ్చికబుచ్చికలాడు.
ఇచ్చకములు-ముఖప్రీతికై పల్కెడుమాటలు.
ఇచ్చకాలమారి = ఇచ్చగొండి,
ఇచ్చకాలాడు-ముఖప్రీతిగా మాట్లాడు
ఇచ్చకుఁడు-ఇచ్చకాలమారి, ఇచ్చగొండి.
ఇచ్ఛగించు-కోరు, ఒడఁబడు,సంతసించు.
ఇచ్ఛగింత-కోరిక, ఒడఁబాటు
ఇచ్చగొండి-ముఖప్రీతికై మంచి పనులు చేయుఁవాడు, ఇచ్చకాలమారి.
ఇచ్ఛకొను-కోరు, ఇయ్యకొను.
ఇచ్చట-ఇచట, ఈచోటు, ఇందు,
ఇచ్చటు-ఈచోటు, ఇచటు, ఇచ్చోటు,
ఇచ్ఛపుట్టు-కోరికకలుగు, ఇంపుపుట్టు.
ఇచ్ఛమానికము-కోర్కెలిచ్చు మణి.
ఇచ్ఛారచ్ఛ-ఇష్టానుసారము-స్వేచ్ఛ.
ఇచ్చు-ఇడు, చేయు, సమ్మతించు.
ఇచ్చుకెంపు-చింతామణి, ఈగులకెంపు.
ఇచ్చుత-ఇచ్చుఁగాక, ఈవుత.

ఇచ్చొట-ఇచ్చోట, ఇచ్చో, ఈచోట.
ఇచ్చొటు-ఈచోటు, ఇచొటు, ఇచ్చోటు.
ఇచ్చో-ఈచోటున, ఈచో.
ఇచ్చోటు-ఈచోటు- ఇచ్చొ(చ్చ)ట.
ఇజాఫా-మిగత, హెచ్చు, పెంపు
ఇజా(రతి)రా-నేలను గుత్తకుఁగొనుట.
ఇజారాదారు-గుత్తకాఁడు, పాలెగాఁడు.
ఇజారాపాడు-గుత్తకుఁదీసికొను.
ఇజారు-పొడుగులాగు-చల్లడము, హిజారు
ఇజాలు-వట్టలు, వృషణములు.
ఇజు(కు)గు-అలయిక, ఇక్కట్టు
ఇజుకుసేయు-శ్రమపెట్టు, అలయించు.
ఇట-ఇక్కడ, ఈడ, ఇచట
ఇటఁబట్టి-ఇంతటి (ఇప్పటి) నుండి
ఇటక-ఇష్టకా = ఇటిక, ఇటుక.
ఇటకావము - (ఇష్టకావాప) - ఇటుకలు కాల్చుట కేర్పఱచిన సెగపట్టు.
ఇటకు-ఈడకు, ఇచ్చటకు.
ఇటమీఁద-ఇఁకముందు, ఈపైని.
ఇటయట పడు-చిందరవందరగు.
ఇటిక-ఇష్టకా = ఇట్టిక, ఇ(టు)ట్టుక.
ఇటికపగడము-మట్టిపగడము, తిక్కణిక.
ఇటికె-ఇష్టకా = ఇటిక, ఇటికె, ఇటక.
ఇటీవల-ఈనడుమ, ఈమధ్య.
ఇటు-ఈవైపు ఈరీతి, ఇట్టు.
ఇటుక-(ఇష్టకా) ఇటక, ఇటి(క)కె.
ఇటుఁగూడు-ఈరీతిగా జరుగు.
ఇటునటు-అన్నివైపుల, అంతట.
ఇటుపట్టు-ఈరీతిగా పట్టు.
ఇటులు-ఈలాగు. రూ. ఇట్టులు, ఇట్లు.
ఇటువంటి-ఇట్టి. ఈ రూపుకల.
ఇటువలె-ఇట్లు ఈరీతి.
ఇటువైపు-ఈవైపు-ఇచ్చట, ఇట్టు.
ఇట్టకలు-ఒకతెగ బాలక్రీడ.
ఇట్టట్టగు-తలక్రిందగు, తాఱుమాఱగు.
ఇట్టట్టాడు-ఊగియాడు, బెసకు.
ఇట్టట్టు-తాఱుమాఱు, ఆవలీవల.
ఇట్టట్టను-మార్చి మాట్లాడు, దూఱు.
ఇట్టట్టుచేయు-తాఱుమాఱుచేయు [పడు.
ఇట్టట్టుపడు - తడఁబడు, చిందరవందరగా
ఇట్టలమగు-ఎక్కువగు. (క ఇట్టళ్)
ఇట్టలము-ఎక్కువ.గొప్ప.గట్టి. నిట్టలము.
ఇట్టి-యష్టి = ఈటె, ఈలాటి (త.క.ఇట్టి)
ఇట్టిఁడు-ఇట్టివాఁడు, ఈలాటివాఁడు.
ఇట్టిక = ఇటిక (త. ఇట్టిగై)
ఇట్టికలాడు-ఒప్పులకుప్పాట లాడు.
ఇట్టికాఁడు-ఈఁటెకాఁడు, కౌంతికుఁడు
ఇట్టికావము = ఇటకావము
ఇట్టిది-ఇటువంటిది, ఈలాటిది, ఈలాటి
ఇట్టిపాటి-ఇట్టి, ఈపాటి
ఇట్టు = ఇటు. ఈవైపు, ఈరీతి.
ఇట్టుక-ఇష్టకా = ఇట్టిక, ఇ(టు, టి)క.
ఇట్టుపు-జుట్టుపు + -అజశృంగి +
ఇట్టులు-ఇట్లు, ఇటులు, ఈరీతి.
ఇట్టువోలె-ఇట్లు. ఈరీతిగా, ఇటువలె.
ఇట్టె-ట్టే = వెంటనే. క్షణములో.
ఇట్లు-ఇట్టులు, ఇటులు, ఈ విధముగా.
ఇడఁగను-ఇచ్చు వీలుకల్గు.
ఇడవలి-ఒక బిరుసుగడ్డి
ఇడికండ్లు-ధనము. ద్రవ్యము.

ఇడి(కుడక)-సేమియాలు, సేవి(క)య.
ఇడిపోవు-కాపు ఉడిగిపోవు-ఈటిపోవు.
ఇడిమాకులు - ఇడుపులు, ఇంటిముందరి ప్రాంగణము.
ఇడిముళ్లు-ఇబ్బందులు, పేచీలు, అడ్డు.
ఇడియఁగొట్టు-జారవిడుచు, పోఁగొట్టు.
ఇడియు-చినుఁగు, నలఁగు, విఱుగు, పోవు.
ఇడిసిపడు-ఇండెవాయు, చీలిపోవు.
ఇడు-ఇచ్చు, ఉంచు, కట్టు, నాటు.
ఇడుకొను-ఉంచుకొను, నిలుపు [ఈర్ష్య.
ఇడుగడ-అవమానము, వెత, ఈడుపు,
ఇడుగడ వడు-వగచు, ఈర్ష్యచెందు.
ఇడుగడసేయు-అసూయపడు.
ఇడుగు-తొలిసారి దున్నినదుక్కి, విచ్చుట.
ఇడుగుతొ(దొ-బ)డుగు-ఎచ్చుతక్కువలు.
ఇడుగో-ఇక్కడనే ఉన్నాఁడు.
ఇడుచు-ఉంచు, విడుచు, నాటఁజేయు.
ఇడుపు-వరిమడి, చీలిక, గోడ, ప్రక్క, పెక్కు
ఇడుపులు-దెబ్బలు, వేటులు.
ఇటుబాటు-తీరిక-విశ్రాంతి.
ఇడుమ-అడ్డు, అలసట. ఇక్కట్టు.
ఇడుమ పడు-ఇబ్బంది పడు, కష్టపడు.
ఇడుమపాటు-అలయిక, అలపు.
ఇడుము-చేర్చు; లేమి, ఇక్కట్టు.
ఇడుముకొను-ఇచ్చుకొను, క్రమ్ముకొను, వగచెందు, చేర్చుకొను.
ఇడుముడి-ఇబ్బంది, ఇడుమ, ఇక్కట్టు.
ఇడుములఁబడు-కడగండ్ల పాలగు.
ఇడుమ్రాను-ఇచ్చుచెట్టు-కల్పవృక్షము.
ఇడుపు-ఈరిక, ఇండె, తునక.
ఇడ్డలి-అడ్డరికా = ఇడ్డెన, ఇడ్లి.
ఇడ్డవాఁడు-ఇచ్చినవాఁడు, దాత.
ఇడ్డెన = ఇడ్డలి, ఇడ్లి, వాసెనకుడుము.
ఇతఁడు-ఈయన-ఈతఁడు, వీఁడు.
ఇతకరి-హితకారి = హితముచేయు (నది) వాఁడు
ఇతగాఁడు-ఇతఁడు, ఈత(గా)ఁడు.
ఇతము-హితమ్ = ఇతవు, ఇష్టము, ప్రీతి.
ఇతవరి = ఇతకరి.
ఇతవు = ఇతము,
ఇత్తడి-ళి = పిత్తళమ్ = పిత్తళి.
ఇత్తటి-ఈతటి, ఈవేళ, ఇప్పుడు,
ఇత్తిగ-పాచికలమీఁది మూఁడు బొట్లజత,
ఇరుతిగ-ఆఱు-రూ. ఇత్తిగ.
ఇత్తిగమోములబలియుఁడు - ఆఱు మొగములు గలవాఁడు-కుమారస్వామి.
ఇత్తు-విత్తు, వట్టు, ఆఁడుగుఱిలోని అంగము
ఇది-ఈయది, ఇయ్యది, ఇద్ది, ఈమె.
ఇదికదా-ఇదేకదా!
ఇదిగాక-మఱియు, ఇదికానిచో. [ఇప్పుడే.
ఇదిగొ-గో = ఇది తీసికో, ఇంద, ఇదియే,
ఇది(య-యె)ఇదె. ఇదే, ఇదియె.
ఇదియొ = ఇదిగో, ఇదే.
ఇదిరిచ్చు-విదిలించు, ఈసడించు, ఇచ్చు.
ఇదివఱకు-ఇంతవఱకు. ఈవఱకు.
ఇదె(దే)-ఇదియె, ఇప్పుడే. ఈ వస్తువే.
ఇద్దరి-ఈదరి, ఈవలిగట్టు, ఇవల.
ఇద్దఱు-ఇరుగు(వు)రు, ఇర్వురు.
ఇద్దఱు తల్లుల ముద్దు బిడ్డఁడు-గణపతి.

ఇద్ది-ఇది, ఈయది, ఇయ్యది, ఈమె.
ఇద్దుగ-పాచిక మీఁది రెండుబొట్ల జత.
ఇద్దుము-ఇరుదూము. రెండు తూములు.
ఇద్దురాట-మసలుట. జాగుచేయుట.
ఇద్దెస-ఈదెస, ఇక్కడ, ఈవైపు.
ఇద్దోట-కాపుడిగినతోఁట, (ఇడిపోయిన)
ఇనపపాళా = లోహశలాక.
ఇనాము-కానుక, దానభూమి- ఈనాము.
ఇనాముదారు-భూస్వామి-ఈనాందారు.
ఇని-ఈసమస్తము. రూ.ఇన్ని. [కొడుకు.
ఇనిమనమడు-మునిమనమని (మనమడు)
ఇను-రెండు-రెట్టి. రూ. ఇరు.
ఇనుక-ఊఁకవడ్లు, పొల్లుగల వడ్లు.
ఇనుకు-ఇగురు, ఇంకు, వట్టిపోవు.
ఇనుపకచ్ఛదము-ఇనుపగోచి.
ఇనుపగజ్జెలతల్లి-పెద్దమ్మ.
ఇనుపగోలె-ఇనుపపొయ్యి. హసంతిక.
ఇనుపగోలెము-కుంపటి, గంగాళము.
ఇనుపచిట్టెము-ఇనుము కాల్చగా వచ్చిన తుక్కు.
ఇనుపతేలు-నల్ల తేలు, ఎనుపతేలు.
ఇనుపతొడుగు-గట్టిమళూచి.
ఇనుపదారి-పొగబండి పోవుదారి.
ఇనుపదుడ్డు-గద, గుదియ, దుడ్డు.
ఇనుపయెడ్లు-ఆఁడుమేఁక(గొఱ్ఱె)లు, ఈను నట్టి మేఁక (గొఱ్ఱె) లు.
ఇనుమడి-రెట్టింపు-రూ. ఇన్మడి, ఇమ్మడి.
ఇనుమడించు-రెట్టించు, ఇబ్బడించు.
ఇనుమద్ది-నల్ల మద్ది +, ఏపొ +
ఇనుమనుమఁడు-మనుమని కొడుకు. ముని మనుమని కొడుకు.
ఇనుమనుమరాలు-మునిమనుమనికూఁతురు
ఇనుమాఱు-రెండుసార్లు. రూ. ఇన్మాఱు.
ఇనుమిక్కిలి-మిక్కిలి యెక్కువ, రెట్టి.
ఇనుము-కృష్ణలోహము, అయస్సు,ఇన్ము.
ఇన్నాళ్లు-ఇన్నిరోజు(నాళ్లు)లు.
ఇన్ని-ఇంత (ఎక్కువ) సంఖ్యకలవి.
ఇన్నుగ-చిల్ల గింజ-ఇందు(దు)గ.
ఇన్నూఱు-రెండునూర్లు, రెండువందలు.
ఇన్పగుండు-తుపాకిగుండు.
ఇన్పయెడ్లు-ఇనుపయెడ్లు.
ఇన్మడి = ఇమ్మడి-ఇనుమడి.
ఇన్మడించు-రెట్టించు, ఇబ్బడించు.
ఇన్మాఱు-ఇనుమాఱు, రెండుసార్లు.
ఇన్ము = ఇనుము-కాలాయసము
ఇపుడు-ద్దు = ఈప్రొద్దు, ఈతఱి,ఇప్పుడు.
ఇప్ప-మధూకము +
ఇప్పటికి-ఈపాటికి.
ఇప్పటిది-ఈ వేళది. ఈపాటిది.
ఇప్పతుప్ప-యష్టిమధుకము.
ఇప్పటివాఁడు-ఈ కాలపువాఁడు.
ఇప్పనూనె-ఇప్పపూల సారము.
ఇప్పపూదండ-ఇప్పపూల మాల.
ఇప్పపూరాజనాలు-ఒకదినుసు వడ్లు.
ఇప్పాట-ఈలాగు, ఇమ్మెయి.
ఇప్పించు-ఇచ్చునట్లు చేయు, ఈఁజేయు.
ఇప్పికోలు-ఇయ్యకోలు, ఈకోలు.
ఇప్పుడు-ఇపుడు, ఈప్రొద్దు.
ఇప్పెసారా = ఇప్పపూల సారాయి.
ఇబాచారి-ఉంకుటాలు, జారిణి.
ఇబ్బంద్రుడు-ఇద్దఱు (శాసన) [మొఱకు.
ఇబ్బంది-ఇక్కట్టు, మిక్కిలి కట్టుపాటు,

ఇబ్బందికాఁడు-అడవిపందికిని ఊరఁబంది కిని పుట్టిన పంది, బెబ్బులికిని చిఱుత పులికిని పుట్టిన పులి, ఎలుగుబంటి, మొఱకువాఁడు, సంకరుఁడు.
ఇబ్బందిగండు = సింహము.
ఇబ్బంఁడిగుఱ్ఱము-సంకరజాతిగుఱ్ఱము.
ఇబ్బంది పడు-ఆపదలో చిక్కుకొను.
ఇబ్బంది పెట్టు-ఇఱకటము పెట్టు.
ఇబ్బడించు-ఇమ్మడించు, రెట్టించు.
ఇబ్బడి-ఇనుమడి, ఇమ్మడి, ఒత్తిడి.
ఇబ్బడిక-ఇనుమడి, రెట్టింపు.
ఇబ్బళిగె-ధాన్యము కొలుచు పాత్ర.
ఇబ్బరు-(శాశన) ఇద్దఱు
ఇబ్బె(డ)ద-ఒకానొక అడవిచెట్టు.
ఇమకబడు-వానచే నేల చితచితలాడు.
ఇమిడించు-ఇముడ్చు.
ఇమి(మ)డిక-పొందిక, పిండివంట, సంగ్రహము.
ఇమిరిపోవు-నీరు ఆవిరియైపోవు
ఇముకలము-వ్రాసెడు కలము-పేనా.
ఇముకు-ఇంకు, ఇనుకు, ఇగురు.
ఇముకుట-ఇంకుట, ఇముకుడు.
ఇముడు-అడఁగు, నెఱవేఱు, చొచ్చు
ఇముడుకొను-దాఁగు, అడఁగు, ఇముడు.
ఇముడుచు-డ్చు = ఇముడునట్లు చేయు.
ఇమురు-ఇంకు, ఎండు, ఇగురు, చమురై పోవు.
ఇము(రుకొ-ర్కొ)ను-ఇంకు, ఇగురు.
ఇమ్మడించు-ఇన్మడించు = రెట్టించు.
ఇమ్మడి-ఇనుమడి, ఇన్మ(బ్బ)డి, ఇర్మడి.
ఇమ్ము-వీలు,సందు,చోటు,ప్రేమ, వెరవు, అండ, మోసము, సుఖము, ఒసఁగుము.
ఇమ్ముకొను-వసించు, కలుగు, ఉండు.
ఇమ్ముదప్పు-వీలుచెడు, ఇడుమ.
ఇమ్మెయి-ఈలాగున, ఈమేను.
ఇయ-అయ్య, పురుషనామాంతపదము.
ఇయ్య-సమ్మతి, ఇచ్చు, ఇంపు, ఈయ
ఇయ్యకొను-ఒప్పుకొను, ఈ(య)కొను.
ఇయ్యఁబడు-ఇచ్చివేయఁబడు.
ఇయ్యకొ(లుపు-ల్పు) = ఒప్పించే,ఈకొల్పు
ఇయ్యకోలు-ఒప్పుకోలు, ఈ(య)కోలు.
ఇయ్యది-ఈయది, ఇద్ది, ఇది
ఇయ్యన-ఈయన, ఈతఁడు.
ఇయ్యసేయు-ఇయ్యకొను, ఒప్పుకొను.
ఇయ్యెడ-ఇక్కడ, ఈయెడ, ఈడ.
ఇయ్యేఁడు-ఈయేఁడు, ఈయేఁడాది.
ఇరదాళ్లు-సన్నగా మొనతేలిన లావు మోకులను ఒంటిచుట్టు త్రిప్పి శబ్దమగునట్లు కొట్టుకొనునది.
ఇరవందు-ఇరవొందు, ఒప్పారు.
ఇరవగు-తిరపడు, నెలకొను, ఉండు.
ఇరవారు-నెలకొను, ఒప్పారు.
ఇరవు-ఇరువు, నెలవు, ఇమ్ము, ఇల్లు.
ఇరవుకొను-కలుగు, నెలకొను, క్రమ్ముకొను, కాఁపుర ముండు
ఇరవుకొలుపు-ల్పు = నిలుపు, కల్గించు.
ఇరవుపట్టు-ఇల్లు, ఇక్క, ఇమ్ము.
ఇరవుపడు-నెలకొను, అలముకొను, ఒప్పారు.
ఇరవుపఱుచు-నెలకొల్పు, పుట్టించు.
ఇరవేదు-తావులేకపోవు.
ఇరవొందు - కలుగు, నెలకొను, ఒప్పు, అలముకొను, ఇరవందు.

ఇరస-రెండు తూములు, 5 కుంచాలు.
ఇరసము-అర్ధతూము, 28 శేర్లు.
ఇరసాలు-ఇరుసాలు, హి. భూమిపన్ను.
ఇరసాలునామా-పన్నువివరాల పట్టీ.
ఇరాటము-కమీషను. రుసుము.
ఇరాఱు-ఈరాఱు, పంద్రెండు.
ఇరి-ఇఱ్ఱి, హరిణము.
ఇరికించు-ఇఱికించు.
ఇరిమిరిమిచూచు-మిక్కిలి బెదరిచూచు.
ఇరియించు-మట్టుకొను, బూదిచేయు.
ఇరియు-బిగియు, బిగువగు.
ఇరివిలి-చిల్లి, తొల, బొగర.
ఇరు-ఈరు, రెండు, జంట-దంట-ఇను.
ఇరుఁబుట్టువు-పక్షి, పల్లు, పాఱుఁడు.
ఇరుకాటము-ఇఱుకుచోటు, ఇంట్రము
ఇరుకు-పట్టి పట్టని చోటు-ఇఱుము.
ఇరుగడలు-రెండువైపులు.
ఇరుగన్ను-కన్నుగవ, రెండుకండ్లు.
ఇరుగాలిపస-రెండుకాళ్ల జంతువు-మొద్దు
ఇరుగిల్లు-ప్రక్కయిల్లు. ఇరుగు.
ఇరుగు-(ప్రక్క)యిల్లు. రూ. ఇరువు
ఇరుగుడు-ఇరువుడు. శింశుప +
ఇరుగురు-ఇద్దఱు, ఇరువురు.
ఇరుగెలఁకులు-రెండుప్రక్కలు.
ఇరుగేలు-ఇరుచేయి, కైజంట.
ఇరుగో-ఇక్కడనే ఉన్నారు.
ఇరుగ్రేవలు-రెండువైపులు.
ఇరుచెవి-రెండవ(చెవి)వాఁడు-ఇరుసెవి.
ఇరుచఁబడు-ఇరుకుపడు.
ఇరుచక్క-(యలు)-రెండుప్రక్కలు.

ఇరుచాలుదుక్కి-రెండుసార్లు దున్నినమడి.
ఇరుచౌవంచ-రెండు ఆయిదులు. పది.
ఇరుతట్టు-అవస్థ. చిక్కులు.
ఇరుతిగ-ఆఱు, ఇర్తిగ, ఇత్తిగ.
ఇరుదంతి-ఏనుఁగు, ద్విరదము.
ఇరుదలగ్రుడ్డుకాన్పు-గండభేరుండపక్షి.
ఇరుదలతేజి-బొట్టెలు, తగరు.
ఇరుదలదొర-అగ్ని. ద్విశీర్షుఁడు.
ఇరుదలదొరతేజి-పొట్టేలు, ఏడిక.
ఇరుదలపాము-నీటిపాము, పూడుఁబాము.
ఇరుదలపుల్గు-గండభేరుండపక్షి.
ఇరుదెసలు-ఇరుప్రక్కలు.
ఇరునాలుగు = ఎనిమిది-దచ్చి.
ఇరునూఱు-రెండునూర్లు-ఇన్నూఱు.
ఇరుపక్కియలు-రెండువైపులు.
ఇరుపర్వునేల-రెండుక్రోసులు, 4 మైళ్లు.
ఇరుపేద-మిక్కిలి పేద. నిరుపేద.
ఇరుప్రక్కలు-రెండువైపులు.
ఇరుమార్లు-రెండుసార్లు, ఇనుమాఱు.
ఇరుముకొను-మఱుగుపడు.
ఇరుమెయిలు-రెండుప్రక్క(మబ్బు)లు.
ఇరుమేను-రెండుమేనుల కూడిక.
ఇరుమేరలు-రెండువైపులు.
ఇరుల(కొంగ)దాయ } సూర్యుఁడు, చం
ఇరులసూడు } ద్రుఁడు, అగ్ని.
ఇరులు - (త - ఇరుళ్) చీఁకటి. మబ్బు. నలుపు. ఇర్లు.
ఇరులుకొను-చీఁకటిక్రమ్ము, నలుపెక్కు.
ఇరులుదాయ-సూర్యుడు, చంద్రుడు, అగ్ని.
ఇరుపంకలు-రెండుప్రక్కలు.

ఇరువంౘ్రడు-ఇరువదిమంది.
ఇరువది(యి)-రెండుపదులు, ఇర్వది.
ఇరువాఁగు-రెండువైపుల సేనలు
ఇరుఁవాడికైదువు-రెండుప్రక్కల పదను గల కత్తి.
ఇరువాయికట్టు-మలమూత్రములు బంధించు రోగము.
ఇరువాయిపక్షి-గండభేరుండపక్షి.
ఇరువాలుదుక్కి-ఇరుచాలుదుక్కి. [చోటు.
ఇరువు = ప్రక్కయిల్లు. సౌకర్యము,
ఇరువుకొను-ఇరవుకొను.
ఇరువుడు-ఇరుగుడు, శింశుప +
ఇరువుపడు-ఉండు, శోభిలు.
ఇరువురు-ఇరుగురు, ఇద్దఱు, ఇర్వురు.
ఇరువుస-రెండు కుంచముల కొలఁది.
ఇరువై-ఇరువయి, ఇరువది, ఇర్వది.
ఇరుస-ఇరువస, ఇరస, అరతూము.
ఇరుసత-రెండేడులు-పదునాల్గు.
ఇరుసు-బండికన్ను, బండిదూలము.
ఇరుసుకొను-గంతులువేయు, ఒల్లకుండు.
ఇరుసుమరుసు-చిందరవందర, తార్మాఱు,
ఇరుసెవి-రెండవ(చెవి)వాఁడు
ఇర్గడ-ఇరుగడ, రెండుప్రక్కలు.
ఇర్తిగ(ఇరుతిగ) ఆఱు, ఇత్తిగ
ఇర్పలము-రెండుపలములు.
ఇర్లగొంగ- ఇరులగొంగ, సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని. [అగ్ని.
ఇర్లవేఁటకాఁడు-సూర్యుఁడు, చంద్రుఁడు,
ఇర్లు-ఇరులు, చీఁకట్లు. [కొను
ఇర్లుగొను-చీఁకటిక్రమ్ము. దట్టముగా అల్లు
ఇర్వంకలు-ఇరువంకలు.
ఇర్వది-ఇరువది, ఇరువై.
ఇర్వదేను-ఇరువదియైదు, పాతిక.
ఇర్వురు-ఇరు(గు)వురు, ఇద్దఱు.
ఇర్సాలు-ఇరసాలు.
ఇఱక(కా)టము-ఇఱుకు, ఇఱుకాటము.
ఇఱి-ఇఱ్ఱి, హరిణము, ఇఱుకైన, సన్నని.
ఇఱించు-ఇఱియించు, నొక్కిపట్టు.
ఇఱికి-బాలక్రీడావిశేషము.
ఇఱికించు-ఇముడఁజేయు, ఇఱుకఁజేయు.
ఇఱికికొను-ఇముడుకొను.
ఇఱియఁబట్టు-బిగించిపట్టు.
ఇఱియించు-బిగించు, నొక్కు, చెఱచు.
ఇఱియు-బిగియు, నలఁగు, సన్నమగు, ఎక్కువగు, కదియించు, దగ్గఱు.
ఇఱియుఁగౌఁగిలి - దట్టమైన కౌఁగిలింత-బిగికౌఁగిలి.
ఇఱివిరి-సంకోచవ్యాకోచములను జెందుట, మినుకు మినుకు మనుట.
ఇఱుకఁజేయు-ఇఱికించు, ఇముడ్చు.
ఇఱుక(కా)టము-గొంది, మోసపుమాట.
ఇఱుకు-మాఱుమూల; మధ్యచిక్కుగొను.
ఇఱుకు(ట)డు-నలఁగుడు, త్రొక్కిడి.
ఇఱుకుమెడ-మిక్కిలి పొట్టిమెడ.
ఇఱుకుమ్రాను-సన్నపంగల గుంజ.
ఇఱుగుట-ఓటమి, విఱుగుడు, ఈఁగులు.
ఇఱుము-(త. ఇఱుంబు) మార్మూల, మఱుగు, అడ్డు.
ఇఱుముకొను-దాఁగు, మఱుగుపడు.
ఇఱుమూఁడు-రెండుమూళ్ల-ఆఱు,
ఇఱ్ఱి-జింక, మెకము, రూ. ఇఱి.

ఇఱ్ఱింకలు-మిడుతు మిడుతు చూచుట.
ఇఱ్ఱింకుఁజూపు-ఓర(కడకంటి) చూపు.
ఇఱ్ఱింకులింకు-ఎండు, చెడు, బెదరు.
ఇఱ్ఱింకులు-మిక్కిలి ఇంకుటలు.
ఇఱ్ఱింకులుచేయు-అణఁచు, పోఁగొట్టు.
ఇఱ్ఱిగోఱజము-కస్తురి-, జింకపొక్కిలి.
ఇఱ్ఱిదాల్పుబావ-చంద్రునిబావ-విష్ణువు.
ఇఱ్ఱిపోతు-మగజింక, హరిణము.
ఇఱ్ఱియ-ప్రక్క-, ఇరుగు, ఇడపు.
ఇఱ్ఱు-ఇకారము.
ఇల-భూమి, నేల. [బట్టు.
ఇలకటుచు-పండ్లు కొఱుకు. ఊఁపిరి బిగఁ
ఇలకోడి-ఈలపురుగు, చిమ్మెట, చోటు.
ఇలటము-ఇల్లటము, ఇల్లటీకము
ఇలపీఁట-కత్తిపీఁట-ఈళిక.
ఇలవరము-ఇలారము, గుడిసె.
ఇలవరస-ఇంటివంతు, వంశక్రమము.
ఇలా(గు) = ఇల్లాగు, ఇటువైపు. ఈరీతి.
ఇలాకా-తగులము. చుట్టరికము.
ఇలాతికాయ-వేరుశెనగకాయ, బుడ్డ.
ఇలా(య)యి-కాగడా, ఇంగిలాయ
ఇలాయిజులాయి-బాధ్యతలేనితిరుగుపోతు.
ఇలారము } ఇలారు - వేఱుచోటునకు మార్చుకొనఁదగిన పూరిగుడిసె. మాటుపై వేయఁదగిన గొల్లెన, ఇంటిపైకప్పు.
ఇలాలు- చూ. ఇలాయి.
ఇరావరి-సరిచూచుట, వివరము.
ఇలాసము-భేదికి వేసికొనుట.
ఇలి-ఎంగిలిమెతుకు, ఎలుక.
ఇలింద-ఇలివెంద-ఇంద్రవల్లి +

ఇలిక(ము)-ఎలుక-ఇలి. [బోను.
ఇలిపాషాణము-ఉల్లిపాషాణము, ఎలుకల
ఇలివి(వె)ంద-ఇంద్రవల్లి-ఇలి(ల్లి)ంద +
ఇలు-ఇల్లు, ఇక్క-, ఇరవు. ఇమ్ము.
ఇలుకరించు-తెఱచు, విప్పు, ఇగిలించు.
ఇలుకు-బెణకు, నరముపట్టు-ఇల్కు-.
ఇలుకూచి-ఇల్లు విడువని యాఁడుది.
ఇలుగు-చచ్చు, తెగు, ఈలుగు, నీల్గు.
ఇలుదొర-ఇంటికాఁపు, గేస్తు.
ఇలునింపట(డ)ము } ఇలునింపుట వధూవరుల నూతన గృహప్రవేశము.
ఇలుపట్టు-ఇల్లు కట్టఁదగిన చోటు.
ఇలుపాడు-గృహక్షేత్రము.
ఇలుపుట్టు-ఇలువరుసను వచ్చినది
ఇలుఱేఁడు-ఇంటి యజమాని, గేస్తు (త. ఇల్లఱన్)
ఇలువడి-మంచి కులమునఁ బుట్టుట, మంచి నడవడి, అభిమానము, పాతివ్రత్యము, మగఁటిమి, ఇల్వాడి.
ఇలువరము-చూ. ఇలారము.
ఇలువరుస-ఇంటి(వంతు) ఆచారము.
ఇలువారము = ఇలారము, పూరిగుడిసె.
ఇలువాసితిరుగు-సన్యాసి, జడదారి.
ఇలువిందు-అతిథి, ఆగంతుకుఁడు.
ఇలుపుట్టు-నీలుగు. [ల్పు.
ఇలువేలుపు-(ల్పు) = కులదైవము- ఇల్వే
ఇల్కుటుచు = ఇలకటుచు.
ఇల్గు = ఇలుగు, చచ్చు. ఈల్గు, నీల్గు.
ఇల్బిడ్డ-గులాము, తొత్తు, బానిస.
ఇల్ల-లేదు (త. ఇల్లై, క. ఇల్ల)

ఇలంట్రము-ఇల్లరికము, ఇల్లఁటము.
ఇల్లంద-ఇలింద, ఇల్లింద +
ఇల్లఁటము = ఇలఁటము, ఇల్లరికము.
ఇల్లఁటకాఁడు-ఇల్లరికముండెడి అల్లుఁడు
ఇల్లడ-తాకట్టు, కాఁపురము, అప్పగింత.
ఇల్లడ పడు-తాకట్టుపోవు.
ఇల్లడము-తెలుపి, అప్పగింత, ఇల్లరికము
ఇల్లడపెట్టు } - దాఁచియుంచు, తాకట్టు
ఇల్లడ యిడు } పెట్టు.
ఇల్లడసేయు-కుదువపెట్టు.
ఇల్లడసొమ్ము-తాకట్టు వస్తువు.
ఇల్లము-2 పలములు. 6 తులములు.
ఇల్లరి-ఇంటి(పన్ను) బాడిగ, పనిపాటల వాళ్లు.
ఇల్ల(ర)రి(రీ)కము = ఇల(ల్ల)ఁటము.
ఇల్లవ-బేడిసచేఁప-ఇల్లె(ము)స.
ఇల్లాకు-పెరడు, దొడ్డి.
ఇల్లాగు-ఇలాగు, ఈలాగు, ఈరీతి.
ఇల్లాఁటము-ఇలంట్రము, ఇల్లఁటము.
ఇల్లాపె-ఇల్లాలు, గేస్తురాలు, పెండ్లాము.
ఇల్లామల్లి-కొండెగీఁడు, చాడీగొట్టు.
ఇల్లామల్లి సుద్దులు-చాడీలు, కొండెములు.
ఇల్లారము-చూ. ఇలారము.
ఇల్లాలు-పెండ్లము, పతివ్రత (త ఇల్లాళ్)
ఇల్లి-లంకణము. నిట్టు, నిప్పస్తు
ఇల్లింట(ట్ర)ము-అత్తవారింట నుండుట.
ఇల్లింద-పెద్దపాఁపర, ఇల్లంద +
ఇల్లింపులు-మనుగుడుపులు.
ఇల్లిగ్గులు-తగ్గుదల, లొల్లి-అల్లరి
ఇల్లిటమువచ్చు-ఇల్లరికమునకువచ్చు.

ఇల్లిముక్కు-పగిలి నెత్తురుకారెడుముక్కు.
ఇల్లిరికము-చూ. ఇలటము.
ఇల్లిస-ఇల్లెస. ఆకుజెల్ల. బేడిస.
ఇల్లు-ఇరవు. ఉనికి, గడి, కుటుంబము,
ఇల్లుగుల్లచేయు-సొమ్మెల్ల వెచ్చించు.
ఇల్లుటాలు-ఇల్లాలు, పెండ్లాము.
ఇల్లునిండు-ఇంటికి వెలుగు నిచ్చు.
ఇల్లువట్టు-ముండమోయు.
ఇల్లువాసి తిరుగు-సన్యాసి, జడదారి.
ఇల్లెడ-ఇల్లడ. తాకట్టు, కుదువ,
ఇల్లె(ము)స-బేడిసచేఁప; రూ. ఇల్లిస
ఇల్లోనారాయణమ్మ-పిల్లికి బిచ్చము పెట్టనిది చేతితో కాకినిగూడ కొట్టనిది.
ఇల్వడి-ఇలువడి.
ఇల్వరుస-ఇలు(వరుస)వంతు,కులమర్యాద
ఇల్వాసితిరుగు-జడదారి.
ఇవ-హిమమ్ = చలి, చల్లఁదనము.
ఇవక-మిహికా = చలువ. చెమ్మ
ఇవకువ-తేమ, చెమ్మనేల, రూ. ఈకువ.
ఇవతల-ఈత(వ)ల, ఇవ(వ్వ)ల
ఇవత(తా)ళించు-చల్లనగు, గడ్డకట్టు.
ఇవతాళింపు-చలువ, చెమ్మ, ఇవక.
ఇవపుగుబ్బలి-మంచుకొండ-చలిమల.
ఇవపుగుబ్బలిబిడ్డ-పార్వతి.
ఇవపుగుబ్బలిబిడ్డసవతి-గంగాదేవి.
ఇవపుగుబ్బలిబిడ్డసవతితమ్ముఁడు-శూద్రుఁడు
ఇవము-హిమ = మంచు. చలి, ఇగము,
ఇవముకొ(గొ)ను-చలికొను, నాను,
ఇవ(ము) మేపరి } సూర్యుఁడు-చలిదాయ.
ఇవ(ము)సూడు }

ఇవల-ఈవలి(చోటు)కాలము. ఈవల.
ఇవాయి-వికారపుచేష్టలు.
ఇవి-ఇయ్యవి, ఈయవి, ఇవ్వి.
ఇవిరించు-ఎఱ్ఱనగు, ఇగిరించు, చిగుర్చు.
ఇవురఁబాఱు-ఇంకు, ఇగురు, ఎండు.
ఇవురము-నేర్పు, ఉపాయము.
ఇవురముచూపు-నేర్పుచూపు.
ఇవురముచెప్పు-ఉపాయము చెప్పు.
ఇవురముచేయు-పొదుపుచేయు.
ఇవురాకు-ఇగురాకు, చిగురాకు.
ఇవురు-ఇగురు, చిగురు, ఎండు.
ఇవురుఁబో(ఁడి)ణి-చిగురువలె మెత్తని శరీరము కల యాఁడుది.
ఇవురుచు-ర్చు = చిగుర్చు, ఇవిరించు.
ఇవురొత్తు-చిగురొత్తు, పొడసూపు.
ఇవుర్వంటకము-అత్తెసరు.
ఇవుల = ఇవల, ఈవల, ఇవతల,
ఇవులుచు-(ల్చు) = తెలుచు, ఎండు.
ఇవ్వత-ఈస్త్రీ, ఈమె, ఈపె.
ఇవ్వల-ఈవైపు, ఈవల, ఈప్రక్క.
ఇవ్వలను-ఈవైపున.
ఇవ్వి-ఇవి, ఈయవి, ఇయ్యవి.
ఇషారాచేయు-సైఁగచేయు
ఇసడిలు-(ల్లు) = విసుగు.బడలు, ఈసడిలు.
ఇసింత-ఈ కొంచెము
ఇసిడింతలువారు-అదరు, కదలు.
ఇసిరో-(రో) = ఇస్సిరో, ఇస్సీ, ఇసీ.
ఇసిఱించు-అంచగిల్లు, కదలు
ఇసిఱింతలు-అదరు, బెదరు.
ఇసిఱింతలువాఱు-కదలు, అదరు.

ఇసీ-ఇసి, ఇసిరో, ఇస్సీ,
ఇసీయను-రోఁతచే ఇసిరోయను.
ఇసు(క)-ఇసు(ము)లు, ఇసువు, ఉసుక.
ఇసుకతిన్నియ - న్నె = సైకతము, ఇసుకదిబ్బ, పులినము.
ఇసుకదండు-గోధుమవర్ణపు చేఁప.
ఇసుకదాసరి-ఒకఆకుకూర-సైకతశాకము.
ఇసుకదొ(ందు)రడు-ఒక చేఁప.
ఇసుకనేల-సికత.
ఇసుకపాఁతఱ-అంతులేనిది, హద్దులేనిది.
ఇసుకపులకండము-కండచక్కెర.
ఇసుకపుఱ్ఱి(ఱ్ఱె)-ఒక మంచినీటి చేఁప.
ఇసుకబేలు-ఒకానొక తీఁగ.
ఇసుకమ్రాను-ఉలిమిరి+, మొగలింగ+
ఇసుకరాజనాలు-ఒక దినుసు వడ్లు.
ఇసుకొను-ఎదుర్కొను, డీకొను.
ఇసుకొలుపు-ల్పు = కుక్కను డీకొల్పు.
ఇసుఁగు-పసిబిడ్డ, విసుఁగు, ఇసువు.
ఇసుమంత-ఇంచుకంత, కొద్దిగా
ఇసు(లు)ము = ఇసుక, పొడి, కొంచెము.
ఇసురు-ఎడము, విశాలము, పొడవు.
ఇసువు-ఇసుక, ఇసుము, ఇస్వు.
ఇసుళ్లు-తెక్కచెదలు, ఈసుళ్లు.
ఇసుక్కుడు-విసుగుట, నలుగుడు.
ఇస్కో-కుక్కను ఉసికొల్పు పదము
ఇస్తిరి - రీ = హి. నిప్పు పెట్టెతోబట్టలు సాపుచేయుట.
ఇస్తిహారు-హి. ప్రకటన
ఇస్తు(వ)వు = సొత్తు, ఆస్తి.
ఇస్త్రీ-ఇస్త్రి(రి)రీ.

ఇ(స్మ)స్లు-ఇసుక, ఇసు(ము)లు.

ఇస్సిరో } ఇసిరో, ఇసీ విందను,రోఁ
ఇస్సిస్సి(రో) } తను దెల్పు పదము.

ఇస్సిస్సియగు-అసహ్య మగు.

ఇస్సీ-చూ. ఇస్సిరీ.

ఇ(హి)హీ-నింద, రోఁత, ఎగతాళి.

ఇహిహీయను-గేలిచేయు, వెక్కిరించు.

# ఈ

ఈ-ఇయ్యది, ఇది, ఎదుట నున్న.

ఈంద్ర-కల్లుగీఁత వృత్తిగాఁగల జాతి.

ఈంద్రది-ఈడిగజాతి స్త్రీ.

ఈంద్రము-వంత, ఒత్తుడు, రాపిడి.

ఈంద్రముసేయు-నొప్పించు, పీడించు.

ఈంద్రవడు-వెన్నాడు, ఈడ్వఁబడు.

ఈంద్రవాఁడు-ఈడిగ(గె)వాఁడు.

ఈంద్రించు-పీడించు, నొప్పించు.

ఈఁక } -పక్షిఱెక్క, తేకు, ఈఁకె
ఈఁకియ } (త - ఇరగు)

ఈఁకు-ఇంకు, ఇనుకు, ఇన్కు.

ఈఁకువ-ఇంకువ.

ఈఁకె - పక్షిఱెక్క (లోని భాగము) రూ ఈఁక, ఈఁకియ.

ఈఁగ-ఈఁగె, ఈ(వ)వె = మక్షిక, తుపాకి చివరనుండు ఉక్కుపూస (త. ఈ)

ఈఁగపులి-ఈఁగలకు పులివంటిది-సాలీఁడు -విందుపురుగు, చెలఁది (త. ఈప్పులి)

ఈఁగయెంగిలికూర-పుదీనా +

ఈఁగలుగు-ఈయఁగలుగు [ఓడు,గెంటు.

ఈఁగు-(త.నీంగు) చొచ్చు, లాగు, తీర్చు.

ఈఁగె-ఈఁగ, ఈవె.

ఈఁచ-ఊఁచ-ఇక్షికము +

ఈఁచఁబోవు-కాలుసేతులు సన్నగిలు.

ఈఁజేటి-ఇంజేటి.

ఈఁజాలు-ఇచ్చుటకు చాలియుండు.

ఈఁ(టియ)టె-బల్లెము, గడ, చివ్వ.

ఈఁటెకాఁడు-ఈఁటెతోఁ బోరువాఁడు.

ఈఁత-ఈఁదుట, ఈనుట, ఒకచెట్టు.

ఈఁతకల్లు-సైంధి.

ఈఁతకాఁడు ఈఁదెడువాఁడు-తర్ర.

ఈఁతకాయ-సొరకాయ, ఈఁతచెట్టుకాయ.

ఈఁతకొట్టు-ఈఁదు, నీట తేలియాడు.

ఈఁద-(చలి)గాలి,ఈఁదగ,ఒక ఆయుధము.

ఈఁద(చూలి)పట్టి - భీముఁడు, హనుమంతుఁడు, గాలికొడుకు.

ఈఁదతూపు-వాయవ్యాస్త్రము.

ఈఁదర(గాలి)-చలిగాలి-ఈఁద.

ఈఁదాడన్నగోదాడను-మాఱుచెప్పు.

ఈఁదా(డి)డు-గిఱకతాడి, ఈఁదు +

ఈఁదు-ఈఁతకొట్టు,చల్లన, గాలి, ఈఁత, చిట్టీఁత +

ఈఁదుగాయ-ఈఁతకాయ, సొరకాయ.

ఈఁదుగొయ్య-ఈఁదుమ్రాను-తెప్ప.

ఈఁదుతెమ్మెర-చల్లగాలి, కరువలి.

ఈఁదులాట-ఈఁత, జలక్రీడ, నీరాట.

ఈఁదులాడు-ఈఁతకొట్టు, వ్రేలాడు.

ఈఁదులు-ఈఁతచెట్ల తోపులు.

ఈఁబడు-ఈయఁబడు.

ఈఁబూను-ఇచ్చుటకు పూనుకొను.

ఈక-ఈయుక, ఇయ్యక.

ఈకడ-ఇక్కడ, ఈడ.

ఈకిరి-చిక్కిన దేహస్థితి, సన్నని.
ఈకువ-ఈమిరి, చెమ్మ, తడి, లేదు.
ఈకెలదారము-ఒక పందెపు కోడిపుంజు.
ఈకె-ఈపె, ఈమె, ఈయమ.
ఈకొను-ఒప్పుకొను, ఈయకొను.
ఈకోలు-సమ్మతి-ఇయ్యకోలు.
ఈగడ-జాడ,ఆచూకీ, పోకడ.
ఈగి-ఇడుట, పుడుకు, ఈవి (త. ఈగై)
ఈగికాఁడు-ఇచ్చువాఁడు, ఈవరి.
ఈగిచేయి-దానమిచ్చు కుడిచేయి.
ఈగిౘ్రమా(ఁకు)ను-కల్పతరువు, ఇచ్చుచెట్టు
ఈగు-లాగు, తగ్గు, ఓడు, ఒఱగు, ఇగ్గు ఒదుగు, డయ్యు, పోగొట్టు.
ఈగులకెంపు-చింతామణి-పుడుకుఁగల్లు.
ఈగులాట-ఇగ్గులాట.
ఈగులాడు-ఇగ్గులాడు.
ఈగులమొదవు-కోరికలిచ్చు గోవు - కామధేనువు-పుడుకుఁదొడుకు.
ఈగులరతనము-చింతామణి.
ఈచ - (త. ఇంచు) ఎండిన, వంకరైన, సన్ననైన, సొట్టపోయిన; వంకర, ఏస, ఊచ, చేవలేమి.
ఈచప(వ)డు } ఎండిపోవు, సన్ననగు,
ఈచపో(వో)వు } వంకరగు, సొట్టపోవు.
ఈచు-అడుగంటు, వట్టిపోవు, ఎండు.
ఈచుకపోవు - చచ్చిన దూడను ఈను, గర్భస్రావ మగు.
ఈజవడు-ఈచవోవు, వమ్మగు.
ఈటారుచు-ర్చు = తడియాఱఁబెట్టు
ఈటాఱు-తడియారు, ఇగురు.

ఈటు-పొల్లు, వమ్ము, ఉళక్కి, పనికిమాలు
ఈటుపో(వో)వు-ఎండు, వమ్మగు, వీటిఁబోవు.
ఈటెసాని-గెడసాని, దొమ్మరిది.
ఈడ-కిత్తని, నారింజ, దబ్బ; ఇక్కడ.
ఈడఁబడు } జంకు, కొంకు, ప్రాఁతవడు;
ఈడఁబోవు } తొలఁగు.
ఈడగు-సాటివచ్చు, పోలు.
ఈడము-ఈళము = లంక,సింహళద్వీపము
ఈడవిడుచు-విడుచు,ఊరకుండు,తొలఁగు.
ఈడాడు-ఎదుర్చు, డీకొను, మార్కొను.
ఈడాము = ఈడము, సింహళద్వీపము.
ఈడిక-ఊచ, కంపతొడుగు, గడ్డిబండి.
ఈడిగ(వాఁడు) = ఈడిగె, ఈంద్ర - గొండ్లవాఁడు.
ఈడిగి(లఁబడు)లు-చదికిలఁబడు.
ఈడిగె-వాఁడు = ఈడిగ, ఈంద్ర.
ఈడిపించు-ఈడ్చునట్లుచేయు.
ఈడు - పిదుకు, జాఱు, జంకు, సాఁగు; తాకట్టు, ప్రాయము, సాటి.
ఈడుఁబోక-పోరఁదలఁచుట.
ఈడుఁబోవు-ఈడఁబోవు.
ఈడుకుదురు-వయస్సు తగు.
ఈడుచు-లాగు, ఈగుచు, ఈడ్చు.
ఈడుజోడాడు-సరితూగు, డీకొను.
ఈడుజోడు-సమవయస్కుల జంట-సాటి.
ఈడుట-జాఱుట, సడలుట, వీడుట.
ఈడుపడు-సాటివచ్చు, ఎన యగు.
ఈడుపఱచు-సాటితెచ్చు. [బొగడలదండ.
ఈడుపు-లాగుట, గోడదరి, జాగుసేఁత,

ఈడుపెట్టు-తాకట్టుపెట్టు.
ఈడుపోతలు-బాధలు, కడగండ్లు.
ఈడుపోవు-వయస్సుముదురు ముట్లుడుగు.
ఈడుబండాడు-కదలు, పరుగెత్తు
ఈడుమీఱు - పెంపొందు, రజస్వలయగు.
రూ. ఈడేఱు
ఈడుముంత-పాలుపితుకు పాత్రము.
ఈడువచ్చు-సాటివచ్చు, రజస్వలయగు
ఈడువడు-సరివచ్చు, సాటివచ్చు.
ఈడువాఁడు-సాటివాఁడు.సముఁడు [మేర.
ఈడువు-ఆకుతోఁటలోని సంగోరుభాగము,
ఈడుసేయు-పోల్చు, సాటితెచ్చు.
ఈడె-ఎఱ్ఱకిత్తలి + ఈడు.
ఈడెపండు-ఒక దినుసు కమలాఫలము.
ఈడెలవడు-ఈడిగిలఁబడు.
ఈడేరు-ఎచ్చిఱు, పెరుఁగు, బలియు,
ఈడేర్చు (ఱుచు) - నెఱవేర్చు, ప్రోచు, ధన్యునిజేయు,
ఈడేఱించు-నెఱవేరఁజేయు
ఈడేఱు-నెఱవేఱు, ముగియు, సాటివచ్చు, రజస్వల యగు.
ఈడ్గిలఁబడు-చూ. ఈడిగిలఁబడు
ఈడ్గిలు-చూ. ఈడిగిలు.
ఈడ్చిచెప్పు-సాగఁదీయు, సమకూర్చు.
ఈడ్చు-ఈడుచు, దువ్వి ఈర్పులుతీయు.
ఈడ్వఁబడు-లాగఁబడు
ఈడ్వడు-సరివచ్చు, ఈడ్పడు, ఈడువడు.
ఈత(గా)ఁడు-ఈతను, ఈయన, ఇతఁడు
ఈతల-ఈప్రక్క, ఈవల, ఇటీవల.
ఈతలాతల-ముందువెనుకలు.
ఈతలాతలగు-తాఱుమాఱగు, జాగగు,
ఈతవేయు-పశువుల గర్భముపోవు.
ఈద-ఒకానొక ఆయుధము.
ఈదరగొట్లు-చల్ల గాలి వీచు.
ఈదు-హి. ఒక తురకల పండుగ.
ఈనంగ-ఇటునుండి, ఇటువైపు.
ఈన-(పుడక) = చీపురుపుల్ల, పొరక.
ఈనము-హీనమ్ = తక్కువైనది.
ఈనరాసి-లెస్సగా పండని వడ్లరాసి,
ఈనాము-ఇనాము, దానభూమి కాన్క.
ఈనాముదారు-భూస్వామి, ఇనాముదారు.
ఈనిక-ఈఁత, పశువు ఈనుట
ఈనికొను-పుట్టు, కను, ప్రసవించు
ఈనిగాజులు-ఒకతెగ బాలక్రీడ.
ఈనినపులి-ఆఁకలిచే మ్రింగఁజూచునది
ఈనియ-ఈనె, ఈన, ఈప, ఆకులనరము.
ఈను-పశ్వాదులు ప్రసవించు, చేనుపండు, వెలువరించు, ఈయను
ఈనుపెడ్లు-ఆఁడుగొఱ్ఱె (మేఁక) లు.
ఈనె-ఈన, ఈనియ, ఈరిక, నరము.
ఈనెకట్టు-ముదురు, ఈనె యేర్పడు
ఈనెగాజులు-ఒకతెగ బాలికాక్రీడ.
ఈనెగుఱ్ఱము-ఒక దినుసు క్రీడ.
ఈనెలుతీయు-తప్పులు వెదకు.
ఈనోపు-ఇవ్వఁజాలియుండు. [గొఱ్ఱెలు.
ఈన్పయెడ్లు = ఈనుపెడ్లు, ఆఁడు(మేఁక)
ఈప-ఆకునార, ఈన, ఈనె.
ఈపి-అంటుపేను - ఈరు, ఈఁగగ్రుడ్డు, ఈఁగ మలము.
ఈపికట్టు-ఈళ్లపుట్ట, గ్రుడ్లప్రోగు.

ఈపె-ఈమె, ఈకె, ఈయమ, ఈపి.
ఈబరి-(గొట్టు) = అప్రయోజకుఁడు.
ఈబలు-తరకలు, లీబలు. [(డ)డె.
ఈబిడ (డె-డ్డ)-ఈయమ. ఈమె, ఈవి
ఈమిరి-హిమమ్ = తేమ-రూ. ఈవిరి.
ఈము(రు)-హిమమ్ = మంచు - ఇవము; రూ. ఈయము.
ఈమె-ఈపె. ఈకె, ఈపూజ్యురాలు.
ఈయ-కోరిక, ఇచ్ఛ. ఇంపు. ఇయ్య.
ఈయక = ఇయ్యక, ఇవ్వక, ఈక.
ఈయకొను-ఇయ్యకొను, ఈకొను.
ఈయకోలు-ఇయ్య(ఈ)కోలు, సమ్మతి.
ఈయత-ఈస్త్రీ, ఈయమ.
ఈయది-ఇయ్యది, ఇద్ది. ఇది.
ఈయన-ఇత(గా)ఁడు, ఈపూజ్యుఁడు.
ఈయనేర్చు-దానము చేయనేర్చు [ఈస్త్రీ.
ఈయ(ప)మ-మ్మ-ఈమె, ఈపె, ఈకె,
ఈయేఁడు-ఇయ్యేఁడు, ఈయేఁడాది.
ఈరంగమాడు-చిందులు త్రొక్కు.
ఈరతారలు-సరికాని, ఎచ్చుతగ్గులు.
ఈరమి-తీఁగలగుంపు, పొదరిల్లు, దట్టము.
ఈరము-చీఁకటిపొద, దట్టము-ఈఱము.
ఈరము(లు)పట్టు-పొదవాటున దాఁగు.
ఈరవాని-ఈళ్ళు ఊడ్చు దువ్వెన-ఈర్పెన.
ఈరవార-తాళుమాలు, కలఁత, అల్లరి.
ఈరస-ఈర్ష్యా = అసూయ, ఈసు.
ఈరస పడు-పగపట్టు, ఈర్ష్యపడు.
ఈరస మాడు-చుల్కన చేయు.
ఈరస(ము)-ఈర్ష్య = ఈసు, ఎరుసు.
ఈరసమెత్తు-పగపట్టు, అసూయపడు.
ఈరసించు-ఈసడించు. చూ. పై.
ఈరాలు-ఇరాలు, పంద్రెండు.
ఈరాలువెట్టు-రచ్చవెట్టు.
ఈరాలు-చీఁకటిపొద, జీబు, తఱచు.
ఈరి(కె)క-చీరిక, పేలిక, మొలక.
ఈరిక(లీను)లెత్తు-మొలకెత్తు, మొలచు.
ఈరిబాన-ఈర్పెన, ఈరిపెన, ఈరవాని.
ఈరు-ఈపి-పేనుగ్రుడ్డు; ఈర్పెన, రెండు-ఇరు, మీరు. తక్కువ, చిన్నది; క్రి. ఈయరు [పైచు-ఈర్చు.
ఈరుచు-ఈడ్చు, పేనుగ్రుడ్లను దువ్వి
ఈరుపన్నె-ఈళ్లూడ్చు దువ్వెన-ఈర్పెన.
ఈరుపె(పే)న - పేనుగ్రుడ్లను ఈర్చు. దువ్వెన.
ఈరుపేను-చిన్నపేను, ఈర్పేను, ఈపి.
ఈరుబానె-ఈరుపన్నె, ఈరిబాన, ఈర్పెన.
ఈరుబా(కా)లు-వేడుకగా తిరుగుట, స్వారి చేయుట, చెరలాట మాడుట.
ఈరులు-మాంసము, పొల.
ఈరువు-మాంసము. ఎఱచి, పొల(ను).
ఈరె-పంటెను జుట్టి తీసిన నూలు.
ఈరెండ-లేఁతయెండ, నీరెండ.
ఈరెలుఁగు-నీరసించిన కంఠస్వరము.
ఈరెలుఁగువడు-నీరసస్వరము పడు.
ఈరేడు-రెండేడులు-పదునాలుగు.
ఈరేను } - రెండైదులు-పది, దశ
ఈరైదు }
ఈరైదుకడలు-పదిదిక్కులు.
ఈర్చు-ఈళ్లు రాలునట్లు దువ్వు-ఈరు.
ఈర్పెన = ఈరుపెన, ఈర్వాళిణి.

ఈర్పేను = ఈరుపేను.
ఈర్వా(ణి)వి-ఈర్పెన, ఈరుపన్నె.
ఈఅతాఅ-ఊయలవలె ఊఁగుట, వంకర, ఏచ, కఠినము. [తుప్ప.
ఈఅ(మి)ము-దట్టము, గాటము. చిక్కన,
ఈల - కూఁత, కూయునట్టి పరరికరము, సిగ్గు, కత్తి. ఈలకూర +. నెపము.
ఈలకత్తి-ఈలపీఁట, కత్తిపీట.
ఈలకఅచు-ప్రాణము బిగఁబట్టు. ఈ(ఇ)ల్కాఅచు.
ఈలకూఁతలు-ఏలపాటలు, ఒక బాలక్రీడ.
ఈలకూర-ఒకజాతి కూరాకు.
ఈలకొట్టు-ఈలవేయు, ఈలవిడుచు.
ఈలకోడి-ఈలపురుగు-చిమ్మట
ఈలగ్రద్ద-ఒక జాతి డేగ, పిసినారి
ఈలగఅము-నోరు బిగబట్టి యుండుస్థితి.
ఈలపీఁట-ఈలిపీఁట = కత్తిపీఁట.
ఈలపురుగు-ఈలకోడి, చిమ్మట, కీచురాయి.
ఈలవిడుచు-ఈల(కొట్టు)వేయు.
ఈలవేయు-ఈల(కొట్టు)విడుచు.
ఈలాగు(న)-ఇట్లు, ఈరీతిగా.
ఈలిక-చీలిక గుడ్డపేలిక ఈరిక.
ఈలుగు-చచ్చు, నీలుగు, ఇలుగు.
ఈలువు-మంచి నడవడి, దిట్టతనము, పాతివ్రత్యము
ఈలువుగొను-మానముచెఅచు, రమించు.
ఈలువుటాలు-ఇల్లాలు, పతివ్రత.
ఈలోని-దీనికొఅకు.
ఈల్కాఅచు-ఈలకఅచు.
ఈల్గు-ఇలుగు-ఈలుగు, నీల్గు
ఈల్గువడు-నిస్సత్తువ పొందు.
ఈళ(ళా)ము-ఈడ(డా)ము, లంక.
ఈళి(క)-చూరకత్తి, కత్తిపీఁట.
ఈవ-ఈవె, ఈఁగ, ఈఁగె-మక్షిక.
ఈవరి-ఈవికాఁడు, తేగకాఁడు, దాత.
ఈవరితనము-దానశీలము, చాగము.
ఈవల-ఇవ్వల, ఇవలి, ఇవతల.
ఈవలవలసేయు-తాఱుమాఱుచేయు.
ఈవలావలగు-తలక్రిందగు.
ఈవలావలపడు-తొట్రుపడు, చిక్కుపడు.
ఈవి-ఈగి, కానుక, విడుపు, దానము.
ఈవికాఁడు-ఈగికాఁడు, ఈవరి, దాత.
ఈవిడ-ఈబిడ.
ఈవిమ్రాను-ఇచ్చుచెట్టు-కల్పవృక్షము.
ఈవిరి-ఈమిరి, చెమ్మ, తేమ, ఊలు.
ఈవు-నీవు, ఈయవు, ఇయ్యవు.
ఈవుతన్-ఇచ్చుత, ఒసఁగుఁగాత.
ఈవులకెంపు-చింతామణి.
ఈవులమొదవు-కామధేనువు
ఈవులమ్రాను-ఈవిమ్రాను, కల్పతరువు.
ఈవులరతనము-కోర్కెలుతీర్చు మణి.
ఈవె-ఈఁగె, ఈవ, ఈఁగ, మక్షిక
ఈవేళ-ఈ సమయమున, ఈరోజు.
ఈవైపు-ఇటువైపు, ఇచ్చట.
ఈస-చూ, ఈల.
ఈసడము-దూఱు, ఈసడింపు.
ఈసడించు - ఎగ్గాడు, ఏకు, నిరసించు, రోయు, పగగొను, దూఱు.
ఈసడింపు-ఏవ, రోఁత, ఓకరింత.
ఈసపిట్ట-ముండ్లచేఁప.

ఈనరపోవు-పనికిరాకపోవు.
ఈనరబానర-నోరికి వచ్చినట్లు
ఈనలు-పుట్టయీఁగలు, ఈసుళ్లు, ఉసుళ్లు
ఈసు-ఈర్ష్య = ఈరస, అసూయ,ఎరుసు.
ఈసుకాఁడు-ఈర్ష్యాలువు = ఉడుకుపోతు.
ఈసు(రో)మను-నీరసము కలిగించు.
ఈసురు-మిక్కిలి నీరసించియుండు.
ఈసులు-బండి కాఁడికిఁగట్టు కఱ్ఱలు.
ఈసువడు-వెందపడు, అసూయపడు.
ఈసువాఁడు-ఈసుకాఁడు, ఉడుకుపోతు.
ఈసుళ్లు-తెక్కపురుగులు, పుట్టయీఁగలు.
ఈసెక్కు-అసూయపడు, కినియు.
ఈహీ-ఇహీ, ఇసిరో, ఎగతాళి.

---

## ఉ

ఉంకించు-ఊఁకించు, ఊఁచు, పూను
ఉంకింపు- ఊఁకువ, పూనిక, దాఁటుట.
ఉంకు-ఎగురు బెదరు; సమ్మతి, లోటు.
ఉంకుచెండు-నేలపై తూలెడు బంతి
ఉంకు(డు)వ-కన్యాశుల్కము - ఓలి, నిలు కడ, ఉనికిపట్టు, బహుమతి.
ఉంకువపెట్టు-పందుముపేయు.
ఉంకువము-కానుక, కట్నము
ఉంకువసేయు-కానుకయిచ్చు.
ఉంకువు = చూ. రూ ఉంకువ.
ఉంకెక్కు-జంకు కొంకు, వెనుదీయు.
ఉంగ-ఉగ్గు,బిడ్డలయేడ్పు-ఉంగుంగ,ఉంగే.
ఉంగడి-నాము, గొడ్ల గొంతుజబ్బు,ఉంగడి
ఉంగరపుప్రేలు-దబ్బప్రేలు, అనామిక
ఉంగ(ట)రము-చేతివ్రేలినగ-బటువు.
ఉంగిడి-చూ, ఉంగడి
ఉంగుటము-అంగుష్ఠ-బొటనవ్రేలు
ఉం(గుంగ)గే-చూ. ఉంగ.
ఉంగ్రము-ఉంగరము, బటువు.
ఉంచు-నెలకొల్పు, తాల్చు. పెట్టు, ఉనుచు.
ఉంచుకొను-వశమున పెట్టుకొను.
ఉంట-ఉండ, గుండు, ఉండుట, గుండ్రము
ఉంటగాలము-సీసపుగుండు కట్టినగాలము, చేఁపలుపట్టు సాధనము.
ఉండ-గుళిక; చక్రము. గుండ్రనిది.
ఉండకట్టు-గుండ్రనగు.
ఉండక్రోవి-పట్టుకొనుచోట గుండ్రముగా నుండు చేతికఱ్ఱ-లాతము.
ఉండగట్టు-ఉండలుఁడలుగానగు. [ఉండేలు
ఉండవి(లు) ల్లు - ఉండలువేయు విల్లు-
ఉండసురియ-గుండ్రని చేపట్టుగల కత్తి.
ఉండించు-ఉండఁజేయు, గుళికచేయు.
ఉండిగ-ముడుపులపాత్ర-గుండిగ,హుండి
ఉండినన్-ఉండినను. ఉండినా, ఉన్నా.
ఉండియుండి-అప్పుడప్పుడు.
ఉండు(కొను)-నడచుకొను, నిలుచు, జీవించు, మిగులు, ఊరకుండు. తొలఁగు
ఉండువాఁడు-ఉండెడు శీలము కలవాఁడు
ఉండె-గజ్జ, తొడసందు, ఊరుమూల.
ఉండెము-చిన్న బురుజు.
ఉండేలు-ఉండలువేయు విల్లు-ఇంటిలి.
ఉండ్ర } ఉండేరక = ఉండ్రము,
ఉండ్ర(క)ము } గుండ్రము. వెలిచంద్ర +
ఉండ్రస-వెలిచంద్ర-ఉండ్రెన +

ఉంగ్రా(ఖ)ళ్లు-కుడుములు, మోదకములు.
ఉంగ్రడూళ్లు-తెలికిచేవృత్తు జాతిభేదము.
ఉంగ్రెన-దుర్గంధచంద్ర-ఉంగ్ర +
ఉంపడము-ఒకస్త్రీని ఉంచుకొనుట.
ఉంపుడు(కత్తె) = ముండ, భోగస్త్రీ.
ఉంబ-అంభా = అంబే, పసుల అఱపు.
ఉంబళి(క) = మొకాసా - పన్ను లేని (యీనాము) నేల.
ఉంబరము-ఉక్క, ఉమ్మదము.
ఉక-స్వార్థమునవచ్చు తద్ధిత ప్రత్యయము.
ఉక్క-ఉల్క = ఉబ్బ, ఉమ్మ, ఉడుకు.
ఉక్కఁబట్టు-ఊపిరాడకుండ మూయు.
ఉక్కట-ఉత్కటము = గర్వము,
ఉక్కడ(గిం)చు-గర్వమడఁచు, చంపు.
ఉక్కడఁగు-పొగరడఁగు, గీటడఁగు.
ఉక్కడఁచు-గర్వమడఁచు, చంపు [మంచి.
ఉక్కడము - ఉత్కట = పెద్ద, గొప్ప.
ఉక్కడీఁడు-బంటు, జెట్టి, ఉక్కరి.
ఉక్కణఁగు = ఉక్కడఁగు.
ఉక్కణఁచు-ఉక్కడఁచు.
ఉక్కణఁగించు = ఉక్కడఁగించు.
ఉక్కణము-ఉత్కట = సేనలకై యుంపఁబడిన కావలి. [ఉక్కపోయు.
ఉక్క(దీయు)పెట్టు - ఒడలు వేఁడెక్కు.
ఉక్కపోయు-ఉక్కపెట్టు, వేఁడెక్కు.
ఉక్కబట్టు-ఊపిరాడకుండ మూయు.
ఉక్కరి-దిట్టరి, పోటరి, ఉక్కడీఁడు.
ఉక్కఱు-బలముచెడు, జడియు. [వాఁడు.
ఉక్కలుఁడు-ఉత్కల = భయముగొల్పు
ఉక్కళము = ఉక్క(డ)ణము.

ఉక్కళించు-గిన్నెలోనుంచి వేచు.
ఉక్కళుఁడు = ఉక్కలుఁడు.
ఉక్కస(ము)-దగ్గు, వగర్పు, ఉబ్బసము.
ఉక్కసిలు-ల్లు = పగులు, చీలు.
ఉక్కాడు-పగగొను, బలముచూపు
ఉక్కించు-తొక్కు, అణఁచు.
ఉక్కిదము-ఎగతాళి, గేలి.
ఉక్కిపోవు-చెమటవలన బాధపడు.
ఉక్కిరి-కూరలోని ఊట-ఉరుపు.
ఉక్కిరిబిక్కిరియగు-ఊపిరాడకుండు.
ఉక్కిఱి-ఊపిరి వెలికిఁబుచ్చుట.
ఉక్కిఱు-ఊపిరి విడుచు.
ఉక్కిలి-శొంఠికొమ్ము పచ్చిబియ్యము కలిపి నీళ్ళతో నూరి బెల్లము నేయి చేర్చి వండిన పదార్థము-ఉక్కెడు, ఉక్కెఱ.
ఉక్కివము-గేలి, కిటుకు, కీలు, దాబు
ఉక్కివుఁడు-మొఱకు, తుంటరి, ఉక్కీఁడు.
ఉక్కిస-ఉక్కస, పొడిదగ్గు, ఉబ్బసము.
ఉక్కీఁడు = ఉక్కివుఁడు, ఉలిపిగొట్టు.
ఉక్కు-చచ్చు, నలఁగు, ఊపిరాడకుండు; నిక్కు, పొగరు, వడి, సత్తువ, బిగువు, గారవము, తీక్ష్ణలోహము
ఉక్కుచెడు- బలముతగ్గు, ఉక్కఱు.
ఉక్కుతీఁగ-ఉక్కుతంతి.
ఉక్కుతునియ
ఉక్కుతు(నుక)న్క } గట్టిదెందమువాఁడు-ఉక్కడీఁడు, జెట్టి.
ఉక్కుపిండము-చాల గట్టివాఁడు. [డగు.
ఉక్కుమడఁగు-చచ్చు, జడియు, పొగర
ఉక్కుమడఁచు = ఉక్కణఁచు.

ఉక్కు(మిగులు)మీఱు } చెలరేఁగు, ప్రబలు.
ఉక్కుమెఱయు } పెంపొందు. దిట్టత
నము చూపు.
ఉక్కురోసపడ్డు-ఎక్కువ రోసపడు.
ఉక్కురోసము-ఉత్క్రోశ = పొలయలుక.
ఉక్కువడు-ఉక్కుచెడు, టక్కటిల్లు.
ఉక్కెక్కు-గట్టిపడు. దిట్టపడు
ఉక్కె(డ)ఱ-చక్కెరతో పొరిటిన పిండి-
ఉక్కిలి, హల్వా, మెత్తన
ఉక్కోలుకొను-క్రమ్మకొను. కప్పు.
ఉగము-ఆయువు, ఊపిరి, ఏఁడాది.
ఉగాది-యుగాది = సంవత్సరాది, ఏఁడాది
ఉగాయించు ఊహించు.
ఉగి-ఉక్క,ఉబ్బ, ఉమ్మ.
ఉగియు-ఉదియు, కాఱు, స్రవించు.
ఉగీబిగీ-మంచి చెడ్డా.
ఉగ్గఁగట్టు-బిగించు, గట్టిగా కట్టు.
ఉగ్గఁబట్టు-ఉక్కఁబట్టు
ఉగ్గడ-ఉగ్గుడు, కట్టడ, మేర, హద్దు.
ఉగ్గడ-ఉద్ఘాటన = చాటింపు.
ఉగ్గడి-ఉగ్గుడు, ఉగ్గడ = హద్దు, మేర.
ఉగ్గడించు - ఉద్ఘాట్ = చెప్పు. పొగడు,
మ్రోఁగు, వెల్లడించు.
ఉగ్గడింపు-పల్కుట, మెప్పు, పొగడ్త.
ఉగ్గడుపు-ఉత్కట = గొప్పది, ఎక్కువది.
ఉగ్గడువు-వడి, వెస, ఉద్దవిడి.
ఉగ్గము - ఉద్గ్రాహ = తఱిమెన చక్రము,
ఉరి, బందము. [స్నిగ్ధమైయుండు.
ఉగ్గఱు-వదులుగా నుండు, ముడుతలు లేక
ఉగ్గలి(ళి)ంచు-గొప్పచేయు, కౌఁగిలించు.
ఉగ్గలి(ళి)ంపు = ఉగ్గడింపు, మెప్పు.
ఉగ్గాడు-చంపు, పీఁచమడఁచు.
ఉగ్గించు-పడుగుపేకల పోగులను జేర్చు.
ఉగ్గు-ఉంగ, నొక్కు. వంపు, బట్టముడుత.
ఉగ్గుడు = ఉగ్గడి, ఉగ్గడ. [రించి పెట్టు.
ఉగ్గుపెట్టు-ఆముదముతో చనుబాలు రంగ
ఉగ్గులు = ముడుతలు, నొక్కులు.
ఉగ్గులు(పడు)వాఱు. నూలుపోఁగు మెలిక
పడు, అల్లిబిల్లిగొను.
ఉగ్గువడు-అణఁగు, నలుగుడుపడు.
ఉగ్మలి-ఆఁడుది, చెలికత్తె, ఓఱికిది.
ఉగ్రాణగాఁడు-కొట్టు పెత్తనదారు [ము.
ఉగ్రాణము-పంటసాల, కొట్టు, బొక్కస
ఉచిఁత-ఉస్తె = ఉచ్చిఁత +, ఉచ్చెఁత +
ఉచ్చి-ఉచ్చైః = నడితల,మాడపట్టు. చోడు
ఉచ్చి(ం)త-ఉచిఁత + -ఉస్తెచెట్టు,
ఉచ్చి(పోవు)పాఱు } భేదించుకొని పోవు.
ఉచ్చివెడలు } దూసికొనిపోవు.
ఉచ్చెఁత = ఉచ్చిఁత, ఉస్తెచెట్టు.
ఉచుకరించు-అనాదరముచే ఉచుక్కుమను-
ఉచుకరింపు-ఉచుకరించుట.
ఉచుక్కుమను = ఉచుకరించు.
ఉచ్చ-ఉత్స = కాలుమడి,నీరుడి(క ఉచ్చె).
ఉచ్చగిత్త-గోవుల ఉచ్చను వాసన చూచుచు
వెన్నాడు గిత్త
ఉచ్చపోయు-మూత్రము విడుచు.
ఉచ్చబుడ్డ-మూత్రాశయము, మావి,
ఉచ్చమల్లి-దెసమొలది, ఎబ్బెరాసి,
ఉచ్చవదేవళ్లు-ఉత్సవ విగ్రహములు
ఉచ్చాలు-గుత్తులు, దఫదఫాలుగా,

ఉచ్చి-మెదడు పైభాగము-మాడు.
ఉచ్చు-ఉరి(త్రాడు), ఒడిత్రాడు. నాటివెదలు, మొలకెత్తు, చీలు, దూరు.
ఉచ్చుచ్చిరే-కుక్కను పిలుచు మాట.
ఉచ్చుమల్లి-నగ్నస్త్రీ-బరిబత్తల.
ఉచ్చులు పన్ను-వేఁటయందు వలలుపన్ను.
ఉచ్చులువేయు-వలలుపన్ను, పడఁద్రోయఁ జూచు, ముడివేయు.
ఉజాడువాఁడు-సిగ్గువిడిచినవాఁడు.
ఉజ్జ-ఊహ, తలఁపు, లక్ష్యము, సరి, సాటి.
ఉజ్జగము-ఉజ్ఝన = విడుపు, చాగము.
ఉజ్జగించు-విడుచు, ముగించు, నిరసించు.
ఉజ్జగింపించు-విడువఁజేయు, ఆపివేయు.
ఉజ్జగింపు-విడుపు, ముగింపు
ఉజ్జగిలు-ల్లు = తొలఁగు, ముగియు, చెడు.
ఉజ్జగొను-ఉజ్జాయించు, తలఁచు.
ఉజ్జన-ఉజ్ఝన = విడుపు, చాగము.
ఉజ్జనకల్లు-అగ్నిపర్వతశిల.
ఉజ్జనచేయు-విడుచు, ముగించు.
ఉజ్జనము = ఉజ్జన, విడుపు, ఈవి.
ఉజ్జనసేయు-దానమిచ్చు, విడుచు.
ఉజ్జని-ఉజ్జయని, అవంతి, ఉజ్జేని.
ఉజ్జాడించు-పలుగువేసి కదల్చు
ఉజ్జాయించు-అంచించు, ఊహించు
ఉజ్జాయింపు-నిదానింపు, అంచింపు.
ఉజ్జి-(జ్జీ) = జత, జట్టు, సాటి, పోటి, కుక్క నుసికొల్పుట, ఒక బాలక్రీడ.
ఉజ్జువకల్లు-అగ్నిపర్వతశిల.
ఉటంకము-టూకీ, ఎత్తిపొడుపు, సారము.
ఉటంకి-గట్టివాఁడు, చొరవరి, తుంటరి.
ఉటంకించు-టూకీగా చెప్పు, ఎత్తిపొడుచు.
ఉటంకు _ ఉటంకి.
ఉటా(ను)-ఎత్తు. ఉరాణి.
ఉట్టాడు-నడయాడు, తొలఁగు, వడఁకు.
ఉట్టి-చిక్కము-శిక్యము.
ఉట్టికెక్కు-భద్రముగానుండు
ఉట్టిచీల-ఇరువైపుల తలగల చీల.
ఉట్టిపడు-పిగిపచ్చు, ఊడిపడు, కాఱు.
ఉట్టు-కలుఁగు, కాఱు, ఊరు, ఉప్పువాము.
ఉట్ర(ట్రు)వడియము - చిట్టి, వడియము పిండి.
ఉట్లబొద్ది-ఒకదినుసుచెట్టు.
ఉరాఉరీ-వేగము, ఒక్కపెట్టున.
ఉరాణి-పొడుగు, ఎత్తు, గొప్ప.
ఉడకఁబెట్టు-ఉడికించు
ఉడకా(డి)యించు-ఉడుకుకొనునట్లుచేయు
ఉడానుకొట్టు-బుకాయించు.
ఉడాయించు-పాఱిపోవు, హరించు.
ఉడాయింపు-పరుగు ఒక జెట్టి పెనకువ.
ఉడి-పనికిమాలు, మఱుగుమాట వమ్ము.
ఉడికించు-ఉడుకఁబెట్టు, ఎత్తిపొడుచు.
ఉడికిలు-ల్లు = క్రాఁగు, నొచ్చుకొను.
ఉడిగపుగత్తె-దాసి, పనికత్తె.
ఉడిగము-చాకిరి, అడఁకువ-ఊడిగము.
ఉడిగించు-మాన్పించు, ఆపు, రూపుమాపు.
ఉడిగిపోవు-ఆగు, తొలఁగు, వమ్మగు.
ఉడిగిమడుగు-అణఁగు, గోడుపడు.
ఉడిపుచ్చుకొను-పోఁగొట్టుకొను.
ఉడిపోవు-తొలఁగు, అఁగు, వమ్మగు.
ఉడివించు-ఉడిగించు.

ఉడిపుచ్చు-మాన్పించు. చెఱచు, పోఁగొట్టు.
ఉడివోని పల్కులు-వేదములు.
ఉడివోవు-గొడ్డువోవు, వమ్మగు, తొలఁగు
ఉడుఁగోఁత-కాపు ఉడుగునప్పటికోఁత.
ఉడుఁదేనెలు-తేనెఉడిగినపూలు.
ఉడుఁబోతు-ఉడుకుఁబోతు [వేఁడిమి
ఉడుక - హుడుక్క, ఉడుక్క, ఉక్క,
ఉడుకఁబెట్టు-ఉడికించు. వేఁడిచేయు,
ఉడుకాటము ఉడుకుట, వెత.
ఉడుకాడు-ఉడుకు. కాఁగు, కినియు,
ఉడుకు-కాఁగు, నొచ్చుకొను, వేఁడిమి-ఉబ్బ
ఉడుకుఁబోతు - గేలిచేయుటచే కోప తాప ములు పొందువాఁడు
ఉడుకుజుట్టు-వెచ్చని ద్రవమును త్రాగు,
ఉడుకులెత్తు-ఉడుకెత్తు
ఉడుకువ-ఊఱట, తెఱపి. నిలుకడ.
ఉడుకెత్తు-వేఁడెక్కు, కాఁగు.
ఉడుక్క = ఉడుక, డుబుడుక్క, డుక్క.
ఉడుగక-ఎల్లప్పుడు, విడువక. నిచ్చలు.
ఉడుగర-కానుక, పన్ను, ఎడమైన గుడ్డ.
ఉడుగు-విడుచు, ఆఁగు, బడలు, ఇంకు
ఉడుగువాఁడు-ఉడుకుఁబోతు, ఏవకాఁడు.
ఉడుచు-ఆఁపు, దాఁచు, మరలించు, చెఱచు. ఇంకఁజేయు, ముగించు
ఉడుత-వీఁపున మూఁడు చారలు గల జంతువు-రూ. ఉఱుత
ఉడుపుకుక్క-ఉడుములను వేఁటాడు కుక్క.
ఉడుపనేయి-ఉడుపక్రొవ్వులోని చమురు.
ఉడుపు-అణఁచు, విడుచు, ఆఁపు, కట్టు, పోఁగొట్టు, దుస్తు-ఉడ్పు.
ఉడుబోతుపిండె-కాపు ఉడుగునపుడు వేసిన బలహీనమైన పిండె.
ఉడుము-బల్లియాకారముకల పెద్ద మైతాల్పు-తేళ్లమేఁతరి. రూ. ఉఱుము.
ఉడువు-విడుచు, మాను. రూ. ఉడుగు
ఉడుసర-కాఁచి, కామంచి, బుడుసర +
ఉడ్కు = ఉడుకు. [ఉడ్డా, అడ్డ.
ఉడ్గ-కుప్ప. నాల్గు. నాల్గు ప్రోగులుగల రాశి,
ఉడ్డకేలుగలాఁడు } - నాల్గు చేతులు కల
ఉడ్డకేలువేలుపు } దేవుఁడు-విష్ణువు.
ఉడ్డకేల్దొరబిడ్డ-బ్రహ్మదేవుఁడు.
ఉడ్డబుడగలు-చంపసరములు.
ఉడ్డమోమువేలుపు-బ్రహ్మ, నలువ.
ఉడ్డా-ఉడ్డ, అడ్డ, తీవంచ.
ఉడ్డాచేయు-గుంపుగూడు. ప్రోగుచేయు.
ఉడ్డాడించు-త్రిప్పు, కలఁచు, కస్తిపెట్టు.
ఉడ్డాడు-కలఁగు, తిరుగు. చికాకుపడు
ఉడ్డాముగ్గురు-ఏడుగురు, కొంతమంది.
ఉడ్డు-కలఁత. పీడ, ఉక్కిరిబిక్కిరి
ఉడ్డుగుడుచు-కలఁగు. గాబరాపడు.
ఉడ్డోలము ఆశ్చర్యము, విడ్డూరము.
ఉడ్పు = రూ. ఉడుపు.
ఉడ్లపల్లంచి-ఒక బాలికాక్రీడ.
ఉణుజు-ఉడుజు, ఒక దినుసు చేఁప
ఉతక-తోలుమ్రాను, ఉత్తరాసి తిరిగెడు గొడిసె రూ ఉదక.
ఉతకలెత్తు-దొంగతనము చేయు.
ఉతకాలాడు-కను, నీళ్లాడు.
ఉతాయింపు-రమారమి, సుమారు.
ఉతారు-ఊహ, ఉద్దేశ్యము.

ఉతికించు-బట్ట లుప్పళింపఁజేయు.

ఉతుకు-ఉప్పళించు, బట్టలుగుంజు, కొట్టు.

ఉతుకులు-ఉతికిన దుస్తులు.

ఉత్త-వట్టిది, ఒంటరి, రుత్త.

ఉత్తం(డము)డాలు-స్త్రీల మెడనగ

ఉత్తది-ఉత్త. వట్టిది, ఒంటరి.

ఉత్తప్పుడు-తీరుబడివేళ.

ఉత్తరదొక్కరము-ఉత్తరదోఃకర = ఒకొనొక జెట్టి పెనకువ

ఉత్తరము-జాబు, కమ్మ చీటీ.

ఉత్తరాసులు-కుసులు, ఉతకలు.

ఉత్తరించు-చింపు, నఱకు, విరసించు.

ఉత్తరి(గ)గె - పైబట్ట, సరము.

ఉత్తరువిచ్చు-ఆనతిచ్చు, విధించు.

ఉత్తరువు-ఉత్తర = ఆన, సెలవు

ఉత్తరే(ణి-ణు)ను-వేరుమొక్క- చంద్ర +

ఉత్తలపడు-కలఁగు, ఉవ్విళ్ళూరు, తొందరపడు, తాఱుమాఱగు, ఉలికిపడు.

ఉత్తలపాటు-ఉత్తలపడుట

ఉత్తలపెట్టు-కలఁచు, తాఱుమాఱుచేయు.

ఉత్తలబిత్తల-వట్టిచేతులతో.

ఉత్తలము-ఉలుకు, కలఁత, చీఁదఱ, వంత.

ఉత్తలమందు-కలఁత(తొట్రు) పడు,జంకు.

ఉత్తి-వెల్లి, ఈడు, ప్రతినిధి. యుక్తి.

ఉత్తుఁడు-యుక్తః = తగినవాఁడు.

ఉత్తుత్తి-మిక్కిలి వట్టిది, రిక్తము

ఉదక-మా. రూ ఉతక

ఉదకాలాడు-బిడ్డను కను, నీళ్లాడు.

ఉదరాయించు - పరుగెత్తించు, మాటాడకుండఁజేయు, అదరగొట్టు.

ఉదరిపడు-అదరిపడు, ఉలికిపడు.

ఉదరిపాటు-ఉదరిపడుట, త్రుళ్లిపాటు.

ఉదరు-అదరు, కదలు, చలించు.

ఉదలు-వదలు, విడుచు, వీడు.

ఉదలుచు-ల్చు = విదలించు, విడిపించు.

ఉదస్తు-వెడలఁగొట్టఁబడుట, క్రిందుచేయఁబడుట.

ఉదియ-ఉద్యమ = పూనికి. రూ. ఉద్దియ.

ఉదియకొ(గొ)ను } పూను, ఉంకించు -
ఉదియసేయు } ఉద్యమించు.

ఉదిరి-మేలిమి, బంగారము, గట్టి, దిట్టము, కాఁకఁజెందినది-ఉఱిది.

ఉదిరిగొను-క్రాఁగు, వగచు, ఆరటపడు.

ఉదిరిపడు-అదిరి, ఉలికిపడు.

ఉదిరిపఱచు-ఆరటపెట్టు, గాబరాపెట్టు.

ఉదిరిపాటు-అదరిపాటు, తొట్రుపాటు.

ఉదిరిమల-బంగరుకొండ-మేరువు.

ఉదిల-ఉత్తల = ఉలుకు, పెంపు, కదలిక, దిగులు, తొట్రు.

ఉదిలకొను-బెదరు, కదలు, చుట్టుకొను, కాఁకఁజెందు, సంతసించు.

ఉద్దిలపడు } కలఁగు,వగచు, బెదరు, కదలు,
ఉదిలు } వణఁకు

ఉదుక-జోలుమ్రాను, ఉతక, ఉదక.

ఉదుకు-ఉతుకు, ఉప్పళించు

ఉదుట-అడుగుట.

ఉదుటారు-ఉలికిపడు, మిట్టిపడు.

ఉదుటు-అదటు, అందము, ఏపు, నీటు.

ఉదుటుకత్తె-అందకత్తె, నీటుకత్తె.

ఉదుటుకాఁడు-అందగాఁడు, సొగసరి.

ఉదుటుచేయు / ఉదుటెక్కు — చెలరేఁగు, ముమ్మరించు.
ఉదురు-అదురు, బెదరు, ఉలుకు, నిక్కు.
ఉదురుముడుకు-పొగరుబోతు;
ఉద్ద-మిక్కిలి, ఎక్కువ,
ఉద్దడ-ఒకజెట్టి పెనకువ, పదునాల్గు కత్తి విసరులలో నొకటి
ఉద్దనవు-ఉద్దరువు, ఉద్దర = తాకట్టు.
ఉద్దము-కీళ్లుచెప్పు, ఎత్తు, పొడవు.
ఉద్దర-ఉద్ధార = అప్పుగా ఇచ్చుట, తాకట్టు.
ఉద్దరి-కత్తెరయొద్దు, పల్లపునేల, మిక్కిలి లోఁతు, వట్టిది.
ఉద్దరిజె-ఆచమించెడు గరిఁటె.
ఉద్దరువు-ర్వు = ఉద్దర, వడ్డిలేనియప్పు
ఉద్దవడి / ఉద్దవిడి — మిక్కిలి. ఎక్కువ, వరుసగా, వడిగా-ఉరువడి
ఉద్దాలు-చెప్పులు, ఊడ్పులు, నంబాళిగలు
ఉద్ది-ఉజ్జి, సాటి, చెలిమి, అనకట్ట, ఒక పైరు, ఒక బాలక్రీడ
ఉద్దించు(కొను)-పోటీచేయు, పోలు.
ఉద్దికాఁడు-జతకాఁడు, నేర్పుకాఁడు,
ఉద్దికొను-సాటిగొను, జతకూడు
ఉద్దిచేయు-చెలిమిచేయు, సాటితెచ్చు.
ఉద్దియ-ఉద్యమ = ఉద్ది, పూన్కి.
ఉద్దియచేయు-పూను, ఒడికట్టు.
ఉద్దివైచుకొను-సాటివచ్చు, సమమగు.
ఉద్దీఁడు-ఉద్దికాఁడు, చెలికాఁడు.
ఉద్దు-మినుము, ఒక బాలక్రీడ.
ఉద్దులు-ఒక దినుసువడ్లు.
ఉద్దెర-తాకట్లు. రూ. ఉద్దర, ఉద్దరువు.

ఉద్దె(ద్దే)పించు-తలఁచు, అనుకొను.
ఉనికి-ఉండుట, చోటు, అండ, మనికి.
ఉనికిపట్టు-ఇల్లు, ఇక్క, ఉనికి, ఇరవు.
ఉను-ఐనను, సముచ్చయము.
ఉనుక-వరిపొట్టు, ఊక, ఉముక.
ఉనుకు-తెలియు
ఉనుకువ-ఉనికి, ఉంకువ, కాఁపురము.
ఉనుకువగొను-నివసించు, ఉండు.
ఉనుచు-ఉండునట్లుచేయు, ఉన్చు, ఉంచు.
ఉనుపరి-ఒకరిప్రేరణ లేనివాఁడు.
ఉనుపు-బట్టను రంగులోపుంచు.
ఉనుపులవాఁడు-అద్దకపు పనివాఁడు.
ఉన్కి-ఉనికి, మనికి, ఉండుట.
ఉన్కిపట్టు-ఉనికిపట్టు
ఉన్చు-ఉనుచు, ఉంచు, ఉండజేయు.
ఉన్నరగా-నేర్పుగా, పనరుగా,
ఉన్నరూపు-ఉన్నదున్నట్లు, కలరూపు.
ఉన్నవాఁడు-పేటొకఁడు, ఉన్నట్టివాఁడు.
ఉన్ని-ఊర్ణ = గొఱ్ఱెబొచ్చు, త్రుప్పుడు.
ఉన్నిగాఁడు-ఒకదినుసుపిట్ట.
ఉన్నిగొఱ్ఱె-బొచ్చుగొఱ్ఱె, కురుపగొఱ్ఱె.
ఉన్నె-న్నే = ఉండనె(నే) [తెలివి.
ఉపతాయి-ఒకజెట్టి పెనకువ, పెనకువకాని
ఉపమ-వెరవు, ఉపాయము, పన్నుగడ.
ఉపమరి-ఉపాయశాలి, నేర్పరి.
ఉపవడ(ర)మగు-మేలుకొను.
ఉపవడము-మేలుకోలు, కనువిప్పు.
ఉపాది-ఇబ్బంది.
ఉపారము-ఉపహార = కానుక, కప్పము, నైవేద్యము, ఒక జెట్టి పెనకువ.

ఉపాసము-ఉపవాస = పస్తు-నిట్రు.
ఉప్ప-ఉప్పని, ఉప్పనిది.
ఉప్పఁదనము-ఉప్పన. లావణ్యము
ఉప్పచప్పన-రుచి(ఉత్సాహము)లేమి
ఉప్పట-ఉప్పత, అట్టు, అవ్వ. రద్ది.
ఉప్పటిలు-ల్లు = ఉప్పతిలు(ల్లు)
ఉప్పట్టి-ట్టు = ఒక బాలక్రీడ.
ఉప్పడించు-బట్టఉతుకు, ఉప్పళించు.
ఉప్పత-ఉప్పట.
ఉప్పతి-ఉత్పత్తి = పుట్టుక. పుట్టు(గు)వు.
ఉప్పతించు - నిందవేయు, కొనియాడు.
ఉప్పతిలు-(ల్లు) = పుట్టు, నిండు, ఉబుకు.
ఉత్పత్తి-దృష్టిదోషము.
ఉప్పన = ఉప్పఁదనము. క్షారరుచి.
ఉప్పన బట్టెల-వెన్నెలయందలి బాలక్రీడ
ఉప్పనపరిగె-ఉప్పచేఁప-కరవాడ.
ఉప్పని-ఉప్పనయిన
ఉప్పపడు-ఉప్పనగు, ఉప్పవడు.
ఉప్పయనము - ఉత్ప్రయాణ = పయన మాపుట, బసచేయుట, గుమిగూడుట.
ఉప్పయనముచేయు - పయనమాపు, గుమి కూడు, మకాముచేయు.
ఉప్పర-నేలత్రవ్వుజాతి. [ఉప్పరకుడి
ఉప్పరగుడి - ఎత్తున నిల్పిన జెండా (క.
ఉప్పరము-ఉపరి = ఆకసము. మీఁదివైపు.
ఉప్పరముదాఁటు } మిన్నుముట్టు. పెంపెక్కు.
ఉప్పరమెగయు } వ్యాపించు
ఉప్పరమెత్తు-మీఁదికెత్తు. మింటికెత్తు
ఉప్పరమ్మ-ఉప్పరజాతిస్త్రీ.
ఉప్పరవట్టము-ఎత్తు(గుడి)జెండా.
ఉప్పరవీది-ఉపరివీధి = ఆకసము.
ఉప్పరి - ఉప్పరవఁడు-ఉప్పరీఁడు. విణ-కాలినది. [రిసు)
ఉప్పరించు-పైకెత్తు. ఉప్పళించు. (క.ఉప్ప
ఉప్పరింత-పైకెత్తుట. ఒకానొకజెట్టి పెన కువ, మానేరు +
ఉప్పరి(గ)గె ఉపకారిక = మిద్దెమీఁది కట్ట డము-మేడ. మేలిల్లు. మాలె. మాళిగ.
ఉప్పరీఁడు ఉప్పరవాఁడు-ఖనకుఁడు.
ఉప్పలము ఉప్పు తయారుచేయు చోటు. ఉప్పుగని. మొండిచేయి
ఉప్పలవాయి-బొటనవ్రేలికి చూపుడువ్రేలికి నడుమ నుండుచోటు
ఉప్పలాయి-పోగాలము. కీడు. ప్రళయము.
ఉప్పలి-పుట్టగొడుగు, ఆపద-ఉప్పళి.
ఉప్పళము = చూ. ఉప్పలము, ఉప్పిలము.
ఉప్పళించు-బట్టఉదుకు, గుంజు, పైకెత్తు.
ఉప్పళింత-గుంజుట. పైకెత్తుట.
ఉప్పళి-చూ. రూ. ఉప్పలి.
ఉప్పవడమగు-మేల్కొను.
ఉప్పవడము-ఉపవడము, మేల్కొలు.
ఉప్పాడు-ఉప్పరియు.
ఉప్పారము-(ఉపహార.)దేవతలకిచ్చుబలి.
ఉప్పి-ఒకముండ్లజాతి గడ్డిమొక్క.
ఉప్పిఁడి-ఉప్పులేని తిండి-పస్తు.
ఉప్పిడి-ఉప్పుడు బియ్యము.
ఉప్పిరింత-మానేరుతీఁగ, జ్యోతిష్మతి.
ఉప్పిలము-ఉప్పుఁబట్ట, ఉప్పల(ళ)ము.
ఉప్పిళ్లు-ఉప్పిడు బియ్యము.

ఉప్పు-చవుటినేల,లవణము,కాల్పు,సొమ్ము, ఊఁదునప్పటి మ్రోఁత; ఉకుకఁబెట్టు.
ఉప్పుఁగండ - ఉప్పురాచి యెండబెట్టిన మాంసపు తునుక.
ఉప్పుఁగడలి-ఉప్పునీటి సంద్రము.
ఉప్పుఁగల్లు-ఉప్పుఱాయి
ఉప్పుఁగాయ-ఊరుగాయ
ఉప్పుఁగుందము-పిల్లల ఒక ఆట.
ఉప్పుఁగొటారు-ఉప్పుగని, ఉప్పలము.
ఉప్పుకజేఁప-ఉప్పులో నూరఁబెట్టిన చేఁప,
ఉప్పుఁబట్టెలు-పిల్లల ఒక యాట.
ఉప్పుఁబట్టి-ఉప్పువాము, చౌటినేల.
ఉప్పుఁబిండి-ఉప్పుడుపిండి, ఉప్మా.
ఉప్పుఁబొలము-ఉప్పుఁబట్టి, ఉప్పలము.
ఉప్పుకట్టు-గడ్డకట్టిన యుప్పు
ఉప్పుకళ(సి)ము-ఉప్పు ఎక్కువైన కూర.
ఉప్పుకూర-ఉప్పని యాలకూర +
ఉప్పుగడ్డి-కాను +. కారె +
ఉప్పుచలుచు-ఉప్పనగు
ఉప్పుచేఁప-ఉప్పురాసి ఎండఁబెట్టిన చేఁప.
ఉప్పుటుండలు-ఒక పిండివంట
ఉప్పుటేరు-ఉప్పునీళ్లకయ్య, సముద్రశాఖ.
ఉప్పుడు-ఉప్పుతో నుడకఁబెట్టినది.
ఉప్పుతిను-సొమ్ముతిను ప్రాపుపొందు.
ఉప్పునేల-చవుటినేల-ఊషరక్షేత్రము.
ఉప్పు-పత్రి-అద్దుపద్దు, మాటామంతి.
ఉప్పుపితికి - ఉప్పువలె నీరగునట్టివాఁడు.
ఉప్పుమడి-ఉప్పుఁబట్టి-ఉప్పలము.
ఉప్పుఱాయి-ఉప్పుఁగల్లు.
ఉప్పురి(యు)ల్లు-ఉప్పుపట్టు, చివికిపోవు.

ఉప్పువాము = ఉప్పలము, ఉప్పుగని.
ఉప్పుసంద్రము-చౌటిమున్నీరు,లవణోదధి
ఉప్పెన-సముద్రపు పోటు,గాలివాన,కైపు.
ఉప్పెనబోవు-కొట్టుకొనిపోవు.
ఉప్పెల్లు-చౌడుఁబాఱు, సవరెక్కు
ఉప్పొంగు-ఉబుకు, ఉబ్బు, రెచ్చు.
ఉబద్ర-ఇబ్బంది, బాధ, ఉపద్రవము.
ఉబల-ఊయలపు, ఊబ
ఉబలాటపడు-జాలిపడు, వేడ్కపడు.
ఉబలాటము-ఉత్సాహత, వేడుక. జాలి.
ఉబిరి-హెచ్చు, లావు, ఘనత.
ఉబుకు-ఉప్పొంగు పైకిలేచు, ఉబ్బు.
ఉబుకువాఁడు-పెంపెక్కువాఁడు.
ఉబుసు-పనిలేనితటి, వార్త, ఊసు.
ఉబుసుపుచ్చు-ప్రొద్దుగడపు, జాగుసేయు,
ఉబుసుపోక-ప్రొద్దుగడుపుట, ఊరొప్పిక.
ఉబుసుపోవు-ప్రొద్దుగడచు.
ఉబ్బ-ఊష్మ = ఉక్క, ఉమ్మ, ఉడుకు.
ఉబ్బకము-ఉబ్బుట, ఉబుకుట,
ఉబ్బగట్టు-ఆనకట్టవేయు, [ స్రుక్కు.
ఉబ్బ(ఱ)డఁగు - గర్వముతగ్గు, సడలు, గుంటలు.
ఉబ్బడాలు-పచ్చి(గింజెపట్టని) వడ్లు, బురద
ఉబ్బతిలు-ల్లు = ఉబ్బు, ఉబుకు, ఉప్పతిల్లు.
ఉబ్బనీరు-ప్రసవజలము, ఉమ్మనీరు,
ఉబ్బనేల-కాళ్లు దిగఁబడెడు చౌటినేల.
ఉబ్బరము-ఉల్బణ = కడుపుబ్బు, పెంపు, అచ్చెరువు, పొగరు, ఉక్క.
ఉబ్బరించు-ఉబ్బు,మారముపెట్టు,మిక్కిలు.
ఉబ్బరి(ంపు)క-ఉబ్బణ-ఉబ్బరింత, ఉబ్బుట, ఉబుకుట.

ఉబ్బల-ఉబ్బులమారి, పొగడ్తలకు పొంగెడి వ్యక్తి.

ఉబ్బలి-ఊబి; తుమ్మ +. రూ. ఉమ్మలి.

ఉబ్బలఁబడు | -పొదరసపు పొగ పాటింపఁబడు.
ఉబ్బవేయఁబడు |

ఉబ్బసపుచ్చు-ఆయాసపెట్టు.

ఉబ్బసము-ఉచ్ఛ్వాస = ఉక్కిస, వగర్పు

ఉబ్బి-బురదగుంట-ఊబి, ఉబ్బలి.

ఉబ్బించు-సంతోషపెట్టు, ఉబికించు

ఉబ్బు-ఉబుకు, గర్వించు, ఉలుకు, వెల్లివిరియు, పొటమరించు, ఇంపు, సొంపు, పొంగు లావగు, పెంపు, వేఁడిమి, అసూయ, పూనిక

ఉబ్బుఁగుడుము-వాసెనకుడుము, ఇడ్డెన.

ఉబ్బుసంకటము-ఒడలు వాఁచునట్టి జబ్బు.

ఉబ్బె-పిఱుఁదులు బలియుట

ఉబ్బెత్తు-ఉబుకు, పైకిలేచు, లావగు.

ఉమక-ఉముక, ఊఁక, నూఁకపొట్టు.

ఉమాదము-ఉన్మాద = పిచ్చి, వెఱ్ఱి.

ఉమి-ఊర్మి = ఉమ్మి, నిష్ఠీవము.

ఉమియు-ఉమ్మివేయు, తూపొడుచు.

ఉముక-వడ్లమీఁది పొట్టు. ఊఁక, ఉమక.

ఉమెత = ఉమ్మెత్త +

ఉమేజు(దు)వారీ-కట్టుపెత్తనము

ఉమ్మ-ఉబ్బ, ఉక్క. వేఁడిమి, ఆవి ఉమ్మి

ఉమ్మగిలు-ఉక్కపెట్టు, ఉమ్మదించు.

ఉమ్మగిలు(ల్లు)-ఆవిరిచే నుడుకు.

ఉమ్మకాపు-పునాసకాపు.

ఉమ్మడి - పన్నులేని భూమి, పెరుమాళ్ల నిత్యాచారము; విభాగము పొందనిది; ఒక పెట్టున.

ఉమ్మదము-ఊష్మద = ఉక్క, వేఁడిమి.

ఉమ్మదించు-ఉక్కపోయు, వేఁడెక్కు.

ఉమ్మనము-పొగరు.

ఉమ్మనీరు-ఉబ్బనీరు, ప్రసవజలము.

ఉమ్మ(రము)రిక-ఉబ్బ, ఉక్క, ముమ్మరము.

ఉమ్మలక-వేఁడిమి, ఆవి, ఉమ్మలిక.

ఉమ్మలము-చిఁత, వగపు, అడలు.

ఉమ్మలి-బురద ఉబ్బలి. ఉంబలి, ఊబి

ఉమ్మలించు-అంగలార్చు, అరికట్టు, వగచు.

ఉమ్మ(లింపు)లిక-వేఁడిమి, వంత, అలజడి.

ఉమ్మలికపడు-వగచు, ఆయాసపడు.

ఉమ్మలికము-ఉమ్మలిక, ఉత్తలపాటు.

ఉమ్మలికాఁడు-స్వామి, అధికారి.

ఉమ్మలికించు-అంగలార్చు, అరికట్టు

ఉమ్మవేయు-గుబులుపెట్టు, ఉక్కపోయు.

ఉమ్మసలారు - ఉక్కపెట్టు, ఉమ్మపోయు.

ఉమ్మాదము-ఉన్మాద = పిచ్చి, వెఱ్ఱి.

ఉమ్మాయజగ్గాయలు-కొంటెపిల్లలు.

ఉమ్మాయము త్తెము-చేఁత(నకిలీ)ము త్తెము

ఉమ్మారావులు-హి. రాజకీయోద్యోగులు

ఉమ్మి-ఊర్మి = ఉమిసెడియెంగిలినీరు-ఉమి.

ఉమ్మిరి-హెచ్చు, ఎక్కువ, ముమ్మరము.

ఉమ్ము-ఉమియు, ఉమ్మివేయు, కుమ్ము.

ఉమ్మెత-త్త = ఉన్మత్త = ఉమెత +

ఉమ్రావులు-ఉమ్మారావులు.

ఉయ(యా)ల | బిడ్డలను పరుండఁబెట్టి ఊఁచెడు డోల.
ఉయ్యె(య్యా)ల |

ఉయ్యలచేరుపిట్ట | బెగ్గురుపిట్ట-సారసపక్షి.
ఉయ్యాలపులుఁగు |

ఉయ్యాలమంచము-డోలామంచము.

ఉయ్యాల-ఉ(య)యాల-డోల.
ఉయ్యాలచేఱుఁబులుగు-బెగ్గురుపిట్ట.
ఉయ్యాలతొట్టి-ఉయ్యాల-తొట్ల.
ఉయ్యాలపులుఁగు-బెగ్గురుపిట్ట-పెగ్గురు.
ఉయ్యాలమంచము-డోలామంచము.
ఉయ్యేల-ఉయ(యా-యే)ల-డోల.
ఉయ్యేల(చేఱు)పిట్ట } బెగ్గురుపిట్ట-సారసము
ఉయ్యేలపులుఁగు }
ఉయ్యేల-ఉయ్యెల. ఉయ్యేల. ఊయల.
ఉరక-మిన్నక పలుకక. ఊరక
ఉరకలు-తొందరపనులు, పరుగులు
ఉరడి(ణి)ంచు-చెలరేఁగు. తొరపడు.
ఉరకొబరకా-ముమ్మరముగా.
ఉరడా-రాగులతోచేయు పాకపుముద్దలు.
ఉరప-తొమ్ము-అక్కు, ఉరము
ఉరమరిక-దాదాపు, రమారమి
ఉరలఁగొట్టు-పడఁగొట్టు.
ఉరలఁద్రోచు-మీఱు, దొర్లించు పోఁగొట్టు.
ఉరలఁబడు-దొర్లు, పొర్లు, కూలు
ఉరలఁబాఱు - కదలు, బెదరు, ఉప్పుడుర్లు, అలమటించు.
ఉరలగడ్డ-ఆలుగడ్డ, బంగాళాదుంప.
ఉరలు - ఊడు, ఉరులు, ఉర్లు = కాలు, కూలు, రాలు, దొర్లు, జాఱు, పీడు, చెడు.
ఉరలుకొను-కోల్పోవు, ఊడు, పీడు, ప్రీలు.
ఉరలుట-ఊడుట, పీడుట, జాఱుట.
ఉరళించు-వెలుఁగు, అలరారు.
ఉరవడి(ణి)-వడి, టంటుతనము, ముమ్మరింపు. రూ. ఉరువణి, ఉఱవడి.
ఉరవడి(ణి)ంచు } చెలరేఁగు, త్వరపడు,
ఉరవపించు } వెలుఁగొందు.

ఉరవలి-చప్పుడు, అలికిడి, ఉలివు
ఉరవు-తొమ్ము, గొప్ప, లావు, పీలు.
ఉరాటము వేయు-ఉరిత్రాడు తగుల్చు.
ఉరామరిక-దాదాపు, సుమారు.
ఉరి-ఉచ్చు, కంఠపాశము త ఉర్లు
ఉరిగోల-ఉరి అమర్చి కట్టిన కోల.
ఉరిజమీను-శాలమత్స్యము-ఉరుజ.
ఉరి(తి)డ-కుమ్మరపురుగు-యమకీటము.
ఉరిత్రాడు-ఉచ్చు, శస్త్రవిద్యాభేదము.
ఉరిది-బిగ్గఱగా, గట్టిగా, నిక్కచ్చిగా
ఉరిదీ(పో)యు-త్రాడుమెడకుబిగించిచంపు.
ఉరియ-పడుమది.
ఉరియాలు - తొట్రుపాటు, ఊఁగులాట. జంకు, [కదలు. కలఁతనొందు
ఉరియాడు-ఊఁగులాడు. చెదరు. విడివడు.
ఉరియు-కదలు. తెల్లపడు. క్రాఁగు, పండు, ఉడుకు, వగచు-ఎరియు.
ఉరివాకిలి-గ్రామకంఠము-ఊరివాకిలి.
ఉరివిడి ఉరుముడు ⊥
ఉరివోయు-ఉరిదీయు, చంపు
ఉరివోవు-ఉరితీయఁబడు, చంపఁబడు.
ఉరిసిపోవు-ఉరియు, ఎరియు
ఉరు మేలగు, ఒప్పగు, తగు, అమరు.
ఉరుంగులు ముగ్గులు, రంగవల్లి.
ఉరుఁద్రాడు-బందము, ఉఱుద్రాడు
ఉరుకు-గంతు, పరుగెత్తు, ఒక చేఁప.
ఉరుకుడుబొద్దు-పైకుబికిన బొద్దు
ఉరుగణించు-రూ ఉరువణించు.
ఉరుజ-వ్యాప్తి, ఉరిజమీను.
ఉరుజగొను-అలముకొను, విస్తరిల్లు.

ఉరుటము-వాఁడిమి; చులుకైనది.
ఉరుటు-ఉంగరము, దగ్గుత్తిక, పిల్లదూలములకు వేయు కొయ్య.
ఉరుది-బిగ్గర.
ఉరుదు-హిందూస్థాని-ఉర్దుభాష.
ఉరుధోడ-ఒకానొక జెట్టిపెనకువ.
ఉరుపు-కూరలోని ఊట, రసము.
ఉరుబోతునుడి-ఒకానొక ఎద్దునుడి.
ఉరుమ-ఒక చర్మవాద్యము-ఖంజరి.
ఉరుముడు-ఉరివిడి అను చెట్టు.
ఉరులఁద్రోచు-దొర్లించు, మీఱు.
ఉరులు-ఉరలు. ఉర్లు.
ఉరులుకొను-పీడు, కోల్పోవు.
ఉరులుకొ(గొ)ల్పు-వలలో వైచుకొను.
ఉరులొడ్డు-అపాయము చేయఁబూను.
ఉరువడి-మిక్కిలి వేగము-ఉరవడి.
ఉరువడించు-ఉరువడుచు.
ఉరువడిగొను-వేగము చూపు.
ఉరువదు-నెఱవేరు, వలపన్ను.
ఉరువడుచు / ఉరువణించు -త్వరపడు. చెలరేఁగు, నెఱవేరు. జయించు.
ఉరువిడి-దినుసుల కూడిక. వెరవరి.
ఉరువు-విడుచు. ఉడుగు; రీతి; రూపు. గొప్పది, గట్టిది, పెద్దది.
ఉరువులు-దేవునికై ంకర్యమునకై వినియోగించు వస్తుసామగ్రి.
ఉరువులూదు-రూపములు కల్పించు.
ఉర్మ-మబ్బుచప్పుడు, హుంకారము.
ఉర్లఁబడు-కూలు. దొర్లు. పొర్లాడు
ఉర్లకోడి-ఇసనాఱుకోడి-తుంగకోడి,
ఉర్లగడ్డ-బంగాళాదుంప, ఆలుగడ్డ.
ఉర్లిపడు-గోడమెత్తులు విఱిగిపడు.
ఉర్లు-ఉరలు, ఉర్లఁబడు.
ఉర్లుపెంజెర-కొండచిలువ-గోనసము.
ఉర్వడి-ఉరువడి, మిక్కిలి వేగము.
ఉఱక-ఉవ్వెత్తుగా. రూ. ఉరక.
ఉఱకలు-పరుగులు, వేడుకలు.
ఉఱడు-సరకుసేయఁడు
ఉఱవగు-ఎక్కువగు. లావగు.
ఉఱవడి-వడి, బంటుతనము.
ఉఱవు ఉరవు. లావు. తొమ్మ.
ఉఱిది-వడి, గట్టి. చేవ, బిగి, నిల్కడ.
ఉఱిమిచూచు-కండ్లెఱ్ఱఁజేసి చూచు.
ఉఱియ-బంటు, దిట్టరి, అంబేద.
ఉఱియు కురియు, నీళ్లుపడు, రేఁగు.
ఉఱు-ఒప్పు. కలగు, పైకివచ్చు. జంకు. ఉడుగు. లెక్కచేయు. ఇష్టమగు; కోఁతి చప్పుడు, పాము ఉఱుకుడు.
ఉఱుఁద్రాడు-ఉఱ్ఱుఁద్రాడు, బందము.
ఉఱుకు-దాఁటు. దూఁకు, ఉరుకు.
ఉఱుకుడు-దాఁటుట-దూఁకుట.
ఉఱుకుడుఁగప్ప-ఒక జాతికప్ప.
ఉఱుకు(డు)బొడ్డు-ఊఁదబొడ్డు-తుంది.
ఉఱుకులాట-పరుగెత్తుట.
ఉఱుకులాడు-దుముకులాడు, తొరపడు.
ఉఱుకొ(చొ)ట్టు-కోఁతి ఉఱ్ఱు పను.
ఉఱుచు-చెఱచు, పోఁగొట్టు, వానసీరు కారు
ఉఱుట-జంకుట గుఱి మాచుట.
ఉఱుత = ఉపేత, చిత్రోడము.
ఉఱుపు-నీళ్లుకాఱుట, విడుచుట.

ఉఱుపునేల-ఊఱుప్పు నేల.
ఉఱుమకించు-గర్జించు, చప్పుడుచేయు.
ఉఱుము-గర్జించు, సింగపుటఱపు, మబ్బుల చప్పుడు, జెట్టిబొబ్బ, ఉడుము.
ఉఱుముకొను-గర్జించు, గదుము.
ఉఱుముతిండి = ఉడుపకుక్క.
ఉఱువు-కోఁతి ఉఱ్ఱుమని చేయు ధ్వని.
ఉఱ్ఱ-ఉఱ్ఱూత, ఉబలాటము.
ఉఱ్ఱ(ఱ్ఱూ)టలూఁగు-వేడుకపడు, ఊఁగులాడు
ఉఱ్ఱటలూఁచు-మిక్కిలి ఊఁచు.
ఉఱ్ఱట్లూఁచు-మిక్కిలి ఊఁచు.
ఉఱ్ఱాడు-కోఁతి చెట్టుపై నూఁగు.
ఉఱ్ఱు-కోఁతి చప్పుడు, ఊఁగునప్పటి ధ్వని, పాలు పితుకునప్పటి ధ్వని, బంధము,
ఉఱ్ఱుఁద్రాడు-బందము, ఉఱుఁత్రాడు.
ఉఱ్ఱుకట్టు-ఆవు కాళ్లకు బందమువేయు.
ఉఱ్ఱూఁతలూఁగు = ఉఱ్ఱటలూఁగు.
ఉఱ్ఱూఁత = ఉబలాటము, ఉఱ్ఱ.
ఉల-గుల, జిల, దురద, ఉలారము.
ఉలంకు-తలవాకిట నుండు లోఁగిలి.
ఉలక-చులక, తెలిక. చూచాయ.
ఉలకఁబారు-వెలికిఁబ్రసరించు.
ఉలకన-చుల్కన, తేలికతనము.
ఉలుకాలు-అంటుజాడ్యము.
ఉలగరము-దుక్కిపదను, వాంతిసూచన.
ఉలచమీను-చిన్నచేఁప, ఉలూపి.
ఉలవ-ఒక సస్యము, కుళుత్థము-ఉలువ.
ఉలవరము = చూ. రూ. ఉలగరము,
ఉలవరించు-తడిచే నేల(యు బుఱ)పదనగు
ఉలవాయి-బండి ఇరుసుకు బిగించు రింగు,
ఉలస-అంటిసగడ్డి, ఉలుచచేఁప, బాడవ.
ఉలసకమ్మలు-కన్నడదేశ బ్రాహ్మణులు.
ఉలారము = ఉల, గుల, దూల, ఆత్రము.
ఉలి-ఒక చెక్కడు పనిముట్టు, ఉలిమి, ఉక్కు, ఇనుము, అలికిడి, చిన్నది-నులి
ఉలింద-ఒక దినుసు చెట్టు.
ఉలికిపడు-వణఁకు, బెదరు, ఉలుకు.
ఉలికిపాటు-త్రుళ్లిపాటు, అదరిపాటు.
ఉలిపచ్చి-నులిపచ్చి. కొలఁదిపచ్చి.
ఉలిపి-తుంటరి, తులువ, టెక్కుకొఁడు,
ఉలిపి(కట్టె)గొట్టు-దుండగీఁడు, సోమరి.
ఉలిపిరికాయ-దుడుకుపిల్లవాఁడు.
ఉలిపితెగులు-గజ్జి, చిడుము, తామర,
ఉలిమి-కఱ్ఱ చెక్కు పనిముట్టు-ఉలి.
ఉలిమిడి(రి)-ఇసుకమ్రాను- మొగలింగ+
ఉలిమ్రాను-చంద్ర+-ఉత్తరేను+
ఉలియాడు-గంట్లువేయు, తిరిగి ఊడ్చు.
ఉలియిక = ఉలివు చప్పుడు, అదరిక.
ఉలియు-మ్రోయు, కదలు, పోవు, వెల్లడియగు, చేష్ట లుడుగు-ఉరియు.
ఉలివాడు-కదలు, వాడిపోవు
ఉలివు(డు) = అలుకుడు, ఉలుకుడు, కదలిక.
ఉలివులాఁగ-చెవి. పీను, లాఁగరి.
ఉలుకఁబాఱు = వెలికిఁబ్రసరించు.
ఉలుకు-దిగులుచెందు, అసూయపడు, పొర్లిపోవు, మెఱయు, బెదరు, కోరిక, వగ.
ఉలుకు(ట)డు-ఉలివు, అలికిడి,
ఉలుకూడు-ఒక వరిపైరు తెగులు.
ఉలుక్కు-గుఱ్ఱము మెల్లగా నడచుట-లుక.
ఉలుచు(మీను)-ఉలూపి = మిక్కిలి చపలత కల చేఁప-ఉలచ, ఉలస.

ఉలుచు-పెల్లగించు, ఈతచ్చు ఊడఁదీయు ఉల్చు, ఉలుపు.

ఉలుప-కాన్క, ఊరుపిండి పులుప.

ఉలుపఁడు-వాఁపు జబ్బు కలవాఁడు, శోఫ రోగి. [గ్రహించు

ఉలుప(చేయు) పట్టు - కానుక (యిచ్చు)

ఉలుపా = పుల్లని యూరుఁబిండి, కానుక.

ఉలుపాలించు-కానుక యిచ్చు.

ఉలుపాలుపట్టు-కానుకయిచ్చు, (గ్రహించు)

ఉలుపి-ఉలుపఁడు శోఫరోగి,

ఉలుపు = ఉలుచు, శోఫ, కుష్ఠు.

ఉలుమఁడు-కుష్ఠరోగి-పులుమఁడు.

ఉలుము-నులుము, పులుము, పెద్దజబ్బు.

ఉలువ-ఉలవ-కుళుత్థము.

ఉల్కు-బెదరు, జడియు, ఉలుకు,

ఉల్చు-ఊడఁదీయు-ఉఁచు ఉలుపు

ఉల్టా-తలక్రిందు, తాఱుమాఱు

ఉల్టాతిరుగు-తిరుగఁబడు

ఉల్టాసీదాలుకొట్టు-లాభనష్టములు పొందు

ఉల్పఁడు-ఉలుపఁడు, ఉలిపి, ఉల్మఁడు.

ఉల్పా-చూ. ఉలుపా

ఉల్బడ-ఉబ్బురోగము, ఊఁచ, ఊఁదు.

ఉల్మఁడు-శోఫరోగి, వాఁపుజబ్బువాఁడు,

ఉల్మిడి ఉలిమిడి, ఇనుకమ్రాను.

ఉల్ల-మిక్కిలి దూరము దగ్గఱకాని చోటు.

ఉల్లంకి-చేఁపలను పురుగులను దిను ఒక జాతి పిట్ట, ఉల్లింక.

ఉల్లంకులు-తగాదాలు-తంటాలు

ఉల్లంగి-ఒక దినుసు (చెట్టు) పిట్ట.

ఉల్లకుటు-ఎత్తిపొడుపు, గేలి.

ఉల్లకుట్టుమాటలు - ఉల్లమును కట్టునట్టి మాటలు.

ఉల్ల(ట)కి-దారపుటుయ్యాల.

ఉల్లకి-ఉత్తుత్తి, ఉశక్కి, శూన్యము.

ఉల్లడ(ము)-ఉల్లాభి = మేలుకట్టు, చాందిని, ఉల్లభము, ఉల్లెడ, ఎల్లెడ

ఉల్లడి కలఁత, పీడ.

ఉల్లబము = ఉల్లడ [ఉలల.

ఉల్లము - గుండె, మేలుకట్టు, కోర్కె.

ఉల్లఅపుబిరుదు-పైరింపరాని పరాక్రమము కలవాఁడు-

ఉల్లఅము-డెందమున కోర్వరానిది.

ఉల్లల-ఉడుకునప్పటి మ్రోఁత, ఉల్లము,

ఉల్లలనుడుక-ఉల్లలయనుధ్వనితో నుడుకు.

ఉల్లసమాట-ఉల్లము నొచ్చునట్లు దెప్పుట.

ఉల్లసమాడు-గేలిచేయు, వెక్కిరించు.

ఉల్లసము-ఎత్తిపొడుపు, ఎగతాళి, దూఱు, పీడ, ఎడఁబాటు.

ఉల్లసి(ంచు)లు-సంతసించు, ఎత్తిపొడుచు.

ఉల్లాకు-చీటి, కిల్లాకు, బంగారపుపరీక్ష.

ఉల్లాకుఁజేఁప-ఒక దినుసుచేఁప. [గుంట.

ఉల్లాము-చెమ్మ నేలపై తిరిగెడు పిట్ట, చిన్న

ఉల్లారు-గుఱ్ఱపు జీనిమీఁది పఱుపు, గవ్వలు గ్రుచ్చిన కుచ్చుత్రాడు, అరుట జాలరు.

ఉల్లిక-నలికండ్లపాము-నల్లిక

ఉల్లికుచ్చడము-ఒకదినుసుచేఁప.

ఉల్లికుట్టు-మర్మభేదనము.

ఉల్లిగడ్డ-నీరుల్లి, ఎఱ్ఱగడ్డ.

ఉల్లిడి చాందినీ-ఉల్లడ, ఉల్లెడ.

ఉల్లిపాము-ఒక దినుసు పొడలపాము.

ఉల్లిపాయ-ఉల్లిగడ్డ, ఎఱ్ఱగడ్డ, నీరుల్లి.
ఉల్లిపాషాణము-సౌవీరము, నీలాంజనము.
ఉల్లిపొర-ఉల్లిగడ్డ మీఁది పొర.
ఉల్లుశ్లెక్క-వట్టిది, ఉత్తది, ఉళక్కి.
ఉల్లెడ-ఉల్లడ, ఎల్లెడ, చాందినీ
ఉల్లెడగట్టు-ఇంటికి బూజుపట్టు.
ఉల్వొడ-వాఁపుజబ్బు, బొల్లి, సోబ.
ఉర్వ(రము)రి-దుక్కి-పదును నేల
ఉల్సర-బెదరు, కలఁత.
ఉళ(శి)క్కి-లేనిది, ఉత్త పట్టి, హుళ(శి)క్కి
ఉశి-ఇనుము, అయస్సు
ఉశ్లెక్కదొడ్డము-పచ్చిఅబద్ధము
ఉవిద-యువతి = ఆఁడుది, పెండ్లాము.
ఉవెత్తు-అకస్మాత్తుగా, అప్పుడే.
ఉవ్వ-ఒక దినుసు పూలచెట్టు
ఉవ్వకాయ-ఒక దినుసుకాయ.
ఉవ్వన-తటాలున, ఉవ్వెత్తుగా
ఉవ్వపిట్ట-ఆఁడు(కాటుకపిట్ట) మందపిచ్చుక
ఉవ్వలపోటి-ఒకదినుసు పిల్లల ఆట.
ఉవ్వాయి-సంతసము, నవ్వు, గెలుపు.
ఉవ్విళులు-తహతహ, వేడుక-ఉవిళ్లు.
ఉవ్విళులూరు-వేడ్కపడు, ఉబలాటపడు.
ఉవ్విళులూరుచు-ర్చు = కోర్కెపుట్టించు
ఉవ్విళ్లు-ఉవ్విళులు.
ఉవ్విళ్లుగొను-చూ. ఉవ్విళులూరు.
ఉవ్విళ్లూరు-ఉవ్విళులూరు, తహతహపడు.
ఉవ్వు-త్వరయొక్క మ్రోఁత, పూనిక.
ఉవ్వున-రివ్వున, తటాలున-ఉవ్వన.
ఉవ్వెత్తు-యుగపత్ = ఒక్కపెట్టున.
ఉవ్వెత్తుగొను-పూర్తిగా చెలఁగు, అడఁచు.
ఉసక-చూ. ఇసుక.
ఉసల-తృణవిశేషము.
ఉసలాయించు-పూనికతో సమకూర్చు.
ఉసి-కుక్కను పురికొల్పుట, ఎడము,తీరిక, పొడి, వీలు, నుసి
ఉసికొను-ప్రోత్సాహముపొందు, కవియు.
ఉసికొలుపు-ల్పు = ప్రేరేఁచు, పురికొల్పు.
ఉసితీసికొన-అవకాశము తీసికొను.
ఉసిపాట-సహాయ(పల్లవి)గానము.
ఉసిమొన - జెట్ల 12 పెనకువలలో నొకటి, పుణ్యమొన, సరిదాళింపు మొన.
ఉసిరి(క)-ఆమలకి +, నెల్లి +
ఉసిరి(లి)వోవు-గుటితప్పిపోవు, వమ్మగు.
ఉసిళ్లు-ఉసుళ్లు, ఇసిళ్లు, ఱెక్కపురుగులు.
ఉసుఁగు-తొలఁగు, నలఁగు, నొచ్చు
ఉసుక-ఇసుక, ఇసుమ, కణకుదుమ్ము.
ఉసుము-పులుము, తోము,ఉదుకు,తుడుచు, తడిమొత్తు, ఆప్పళించు
ఉసురను-విసుగుకొను, దిగులుపడు.
ఉసురసురు-నిట్టూర్పుయొక్క మ్రోఁత.
ఉసురు-ప్రాణము, పాపఫలము; శిశ్నము.
ఉసురుకొను-పెరుఁగు, ప్రాణముతీయు.
ఉసురుగాలము-పేఁపఱుపట్టు సాధనము.
ఉసురుతగులు-పాపఫలము తగులు.
ఉసురుపోవు-ప్రాణముపోవు.
ఉసురుమను-దుఃఖించు, నిట్టూర్చు.
ఉసురుసురు-ఉసురసురు.
ఉసులు - అసువు = ప్రాణము, ఆయువు, మనసునకు నొప్పి కల్గించుటవలనఁగలుగు పాపము.

ఉసుఱుగాలి-ప్రాణవాయువు
ఉసుఱుగీఁత-ఆయుర్దాయరేఖ.
ఉసుఱుచదువు- వైద్యము-మన్కి-మిన్కు-
ఉసుఱుతొలుచదువులు-ఆయుర్వేదము
ఉసుఱుపోసికొను-మిక్కిలి బాధించు
ఉసుఱుమిన్కు-ఆయుర్వేదము మన్కి-మిన్కు
ఉసుఱుమేర-ఆయువు. జీవితపరిమితి.
ఉసులు-వీలు. తెలుపి, ఇమ్ము, సొంపు
ఉసులు - కారము తగ్గుటకై నోటితో గాలి పీల్చు.
ఉసుళ్లు-ఱెక్క-పురుగులు-ఇసుళ్లు, [ మోఁత.
ఉసూరు - ఉసురు, ఉస్సురు. నిట్టూర్పు
ఉసూరుమను-ఉసురను.
ఉసె-సే = నీచస్త్రీ సంబోధనము-ఒసె-సే-
ఉస్తి(స్తె)-తోడు, సాయము. ఉస్తె(కాయ) చెట్టు(వరుగు)మొ॥
ఉస్సను-ఉసురను, ఉసూరుమను.
ఉస్సు-ఉసురు, ఉస్సురు.
ఉస్సురను - బడలుటచే విసుగుఁజెందు, దుఃఖాదులచే నిట్టూర్పువిడుచు.
ఉస్సురస్సురు-ఉసురసురు.
ఉస్సురు-ఉసురు. ఉసూరు, తాపబాధ.
ఉహుం(హు)హూ - చలిచే వణఁకు నప్పటి మ్రోఁత.
ఉహ్హూ - నిప్పును ( దుమ్మును ) ఊఁదుట, ఊర్పువుచ్చుటయందగు మ్రోఁత.

---

# ఊ

ఊఁ-హుమ్ = ఊఁకొట్టుట, ఒప్పుకొనుట, కోపించుట, అడుగుట, అనుమానించుట
ఊఁక-ఉముక-పొట్టు; ఊఁగులాట
ఊఁకదంపు-ఊఁకపోవునట్లు వడ్లుదంచుట.
ఊఁకదంపు (పా) మాట - సారములేనిమా(పా)ట, పొల్లుమాట
ఊఁకబంతి-సన్నరేకుల బంతిపూలమొక్క-
ఊఁకర-ఊఁకొట్టుట, బిడ్డలతొక్కు-పల్కు-.
ఊఁకర(లు)కొట్టు } - బిడ్డల తొక్కు-పలుకులు, ఊఁకొట్టు.
ఊఁకర లిచ్చు }
ఊఁకరలుపెట్టు-ఊఁకొట్టు, ఆనంద భయాదులచే అఱచు
ఊఁకించు-ఉంకించు, పూను, కదల్చు
ఊఁగింపు-ఉంకింపు, ఊఁకువ
ఊఁకు-పూను, పూనిక, అండ, ఉనికి,
ఊఁకువ-అండ, పూనిక, తడవ, ఉనికి,
ఊఁకువగు-పూను, కదఁగు, ఉంకువగు.
ఊఁకువలుగొను-నెలకొను. ఉండు.
ఊఁకువేయు-వేచియుండు.
ఊఁకొ(ట్టు)ను-ఊఁ ఊఁ యను, ఆలించు.
ఊఁగడువేగడు-ఉలుకఁడు పలుకఁడు.
ఊఁగాడు-వ్రేలాడు, ఊఁగు, కదలిపోవు.
ఊఁగించు-కదలించు, ఊఁచు, కలఁచు.
ఊఁగియాడు-ఊఁగాడు.
ఊఁగిసలాడు-ఊఁగులాడు.
ఊఁగు-ఇటునటు కదలు, ఊఁగాడు, తూఁగు
ఊఁగులాట-కలఁత, ఉరియాట.
ఊఁగులాడు-కలఁతపడు, ఊఁగాడు.
ఊఁచ-లేఁతజొన్నకాడ, అరఁటి (దూఁట) బొంద, వెదురుకోల, ముండ్లదుబ్బు.
ఊఁచకండె-నూలుచుట్టిన జొన్నకాడ.
ఊఁచకఱ్ఱ-జొన్నకాడ.

ఊఁచకాళ్లు-ఊఁచవంటి సన్నని కాళ్లు.
ఊఁచకోఁత-ఘోరముగా బాధించుట
ఊఁచప(ట్టు)డు-సన్ననగు, ఊఁచకలదగు
ఊఁచిపోవు-సన్నగిల్లు ఈమకపోవు
ఊఁచిబియ్యము-లేతజొన్నలు-పిసికిళ్ళు.
ఊఁచముట్టు-దూఁట తగులువఱకు, మొదలంట, మూలమట్టుగా.
ఊఁచముట్టుగొను-పెల్లగించు చంపివైచు
ఊఁచు-ఊఁగించు, ఆడించు, కొంకు.
ఊఁటాడించు-మాఱు మోఁగించు, ఓడించు, కదల్చు. ఊఁచు, తొలఁగించు, త్రిప్పు
ఊఁటాడు-ఊఁగు, తడఁబడు, వడఁకు, కదలు, తిరుగు, తొలఁగు, వెనుదీయు, ఎక్కువగు సొమ్మసిల్లు, అలయు.
ఊఁటు-ఊఁడు, దూఁటు, నాఁటు, పోటు, తడఁబాటు, గ్రుచ్చు.
ఊఁడు-గ్రుచ్చు, నాఁటు, ఊఁటు
ఊఁడుకొను-నాఁటుకొను, గ్రుచ్చుకొను
ఊఁడుచు-డ్చు=నాఱునాటు ఇల్లుతుడుచు.
ఊఁడుపు(డ్పు) = నాఱునాటుట, ఇల్లు తుడుచుట [నాటుట,
ఊఁడుపు-(డ్పు) = పొలమున వరినాఱు
ఊఁత-అండ - ఆసరా, ఊనిక, చేఁపలు పట్టు వల, మోపిక.
ఊఁతకఱ్ఱ, ఊఁతకోల - అనుడుకఱ్ఱ, ఊనుకోల, అండ, కాఁపుదల
ఊఁత(కొ)గొను-ఆసరా చేసికొను.
ఊఁత-పాటి-లెక్కపత్రము.
ఊఁతమిచ్చు-ఆసరాపడు, ఊతయిచ్చు
ఊఁతము-ఆసరా, బరువు, పట్టు, ఊఁతు.
ఊఁతముచేయు-గట్టివేయు, నిశ్చయించు.
ఊఁతయిచ్చు-సాయపడు, అండయగు.
ఊఁతాళి-బిగియఁగొట్టిన చీల.
ఊఁద-ఆహూయ, పగ, ఒక పంటగడ్డి.
ఊఁదకడుపు-పెద్దకడుపు-పెనుబొజ్జ.
ఊఁదబొడ్డు-ఉబికిన బొడ్డు.
ఊఁదర - పచ్చికాయలను పండించుటకు వేయు పొగ.
ఊఁదరగొట్టు(లిడు)-పచ్చికాయలను పొగపెట్టి పండిఁచు, తొఁదరపెట్టు
ఊదరలు-ఉదారః = ఒక దినుసువడ్లు.
ఊదరపెట్టు = ఊఁదరగొట్టు
ఊఁదవేయు-పనిని చుల్కనగా ముగించు.
ఊఁదు-నోటినుండి గాలి వెలువఱచు, కరఁగించి మాలిన్యమును పోఁగొట్టు, ఎగురఁగొట్టు, ఆను, నొక్కు నాఁటు, పూను. ఒత్తిడిచేయు, బలపఱచు, మోయు, వాఁపు. ఒక దినుసువల
ఊఁదుఁగ్రోవి-నిప్పూదెడు గొట్టము, పిల్లనగ్రోవి, పిల్లల ఒక ఆట.
ఊఁదుగుటికలు-ఒక దినుసు వడ్లు.
ఊఁదుబ(వ)త్తి-ఊఁదొత్తి, అగరువత్తి
ఊఁదువాద్దెము-పిల్లనగ్రోవి, మురళి.
ఊఁదుమెకము-పంది, ఊటమెకము.
ఊఁదువెండి - ఓప్పున పరిశుద్ధి పొందిన చాపివెండి (త ఊదువెల్లి)
ఊఁదొత్తి-ఊఁదువత్తి, అగరువత్తి
ఊఁపర-పొల్లుమాట. రూ. తూఁపర.
ఊఁపరలాఁడు-పొల్లుమాటలాడువాఁడు.
ఊఁపాడు-కదలు, ఊఁగాడు

ఊఁపు-ఊఁచు ఊఁగఁజేయు, ఊఁచుట.
ఊఁపురము-ఎద్దుమూఁపురము-కకుదము.
ఊకనబొద్దు-జ్వరము తగ్గించు మందాకు +
ఊకు-త్రోయు, తొలఁగించు
ఊకుండు-ఏమియు ననకుండు,ఊరకుండు.
ఊకొను ఊరకుండు, ఊరుకొను.
ఊచిపలుకు-గట్టిగా నొక్కి-మాట్లాడు
ఊచు-తలవెంట్రుక లూడు, రాలు.
ఊ(జ)జా-మరచెంబు.
ఊజి-గూళి. ఊత, కోళ్లగూడు.
ఊట-ఉబ్బనీరు, సారము, చేవ, తేమ.
ఊటకల్లు-ఒక దినుసువడ్లు-అరికలు
ఊటబుడ్డిచెక్క-ఇండ్లకు వాడఁదగినమ్రాను
ఊటమెకము-పంది-ఊఁదుమెకము
ఊటాడించు-మాఱుమ్రోగించు. వడకించు, ఊఁగించు, ఓడించు
ఊటాడు-ఊఁటాడు.
ఊటారు-ఉవ్విళులూరు, తహతహపడు.
ఊటి - ఒక జాతిమొక్క ఒక పట్టణము
ఊటించు-మోసగించు, బెల్లించు
ఊటు-తేమ, ఊటనీరు, ఊటకాలువ.
ఊటుగారు-సత్తువజారిపోవు, ఎక్కువ వానలచే భూగర్భమున నీరు పాఱు
ఊటెక్కు-క్రిందపడు, పైకుబుకు.
ఊడ-వ్రేలాడు చెట్టువేరు, పడుగొమ్మ.
ఊడఁగొట్టు-పడఁగొట్టు.
ఊడఁదన్ను(కొను) = తొలఁగించు(కొను) ఊడుసట్లు తన్ను.
ఊడఁబీ(బెరు)కు-పెల్లగించు,ఊడఁదీయు.
ఊతదాసలు-వా. సోమరితనము.

ఊడనిఁబాడు-తొలఁగు, పాఱిపోవు.
ఊడలు(దిగు)వాఱు - దిట్టపడు, శక్తితగ్గి లేవలేకుండు
ఊడాడు-చూ ఊఁటాడు
ఊడి-ఒక దినుసు కూరాకు.
ఊడిగంపుఁజేడియ-తొత్తు, బానిస.
ఊడిగము-చాకిరి, సేవ, ఉడిగము
ఊడిగీఁడు బంటు, బానిస, అడియరి.
ఊడిగెము-ఊడిగ(య)ము.
ఊడిత-దేవాంగులునూలుపడుగుచేయుటకై కట్టులతో నేర్పఱచుకొన్న కత్తెరకాలు.
ఊడిపడు-ఉట్టిపడు, గర్భము స్రవించు.
ఊడిపోవు-ఊసిపోవు, విడిపోవు.
ఊడియము-ఊడి(ళి)గము, చాకిరి.
ఊడు - ఉరలు, కాఱు, జాఱు, విఱుగు వీడు, చెడు, పాఱు, వెళ్లు [జబ్బు
ఊడుఁదెగులు - గొడ్లకు రోమములూడు
ఊడుకొను-గ్రుచ్చుకొను, నాటుకొను.
ఊడు(గ)గు-అంకోలము-కుందురువు.
ఊడుచు చెత్త తొలఁగించు,చిమ్ము.నలుకు, పీకు, పిండిచేయు, గర్భము స్రవించు, దొంగిలించు,నాటునాటు, విడుచు-ఊడ్చు
ఊడుట-సడలుట, వీడుట, జాఱుట.
ఊడుదొక-విడిచిన ఆఁడువి-ఊడ్దొక
ఊడుపు - ఒక రకము పాదుక, విడుదల, ఊపిరి. రూ ఊడ్పు, ఊరుపు.
ఊడుపుఁగత్తె పనికత్తె, బానిస.
ఊడుపుమడి-నారు(నాటు)నాటినమడి- చెలక.
ఊడుపొట్టు-ఒకానొక గొడ్లజబ్బు.
ఊడెము-చాకిరి, గొప్పదుర్గము.

ఊక్చినట్లగు-సర్వనాశనమగు
ఊచ్చు-ఊడుచు
ఊచ్చుకొనిపోవు-పూర్తిగా వెట్టమగు.
ఊడ్పు-పైరునారునాటుట,శ్వాసము-ఊర్పు
ఊడ్పులు-చెప్పులు-పైజారులు, ముచ్చెలు.
ఊప్పుఁగత్తె-పలికత్తె, బాసిన
ఊడ్పుమడి-వరిమడి-చెలక.
ఊడ్పునేల ఊడుపునేల
ఊతప్పము-పులిబొంగరమను పిండివంట
ఊతాడు-చేఁపలను వేఁటాడు, ఈఁతాడు
ఊతాని-నడువలేనివాఁడు
ఊదగాలి-తూర్పుగాలి-పై(ఱ)రుగాలి
ఊదర-ఉదార-ఒక దినుసుగడ్డి
ఊదరగొట్టు-అదేపనిగా వాగు, గాలికొట్టు, రెచ్చగొట్టు, విసిగించు, మ్రుగ్గఁజేయు
ఊద(ర)లు-గంపెలు, సజ్జలు మొ॥
ఊదా-ఎఱుపునలుపు కలిసిన రంగు
ఊదాడు-తడఁబడు, కదలు, వణఁకు
ఊదార్చు-ఊరార్చు, బుజ్జగించు,
ఊదిపండు విబూదిపండు
ఊను - రహస్యమున చెప్పి పురికొల్పు, సాంబ్రాణిధూపము, చేఁపలుపట్టు
ఊనికొను-అలముకొను క్రమ్ముకొను
ఊనబలుపు-బూఁబలుపు-ఉబల,
ఊమరు-కలుపుమొక్క మొ॥
ఊరువత్తి-అగరువత్తి, ఊదొత్తి.
ఊనిక-ఆనిక, ఓపిక, పూనిక,
ఊన(క)కి-బలహీనమైన,
ఊనాపి-దుర్బలుఁడు, కుమాపి.
ఊను-పూను, అను, ఉంచు, తాల్చు, తోలు మొత్తపలుచు,
ఊనుచు న్చు=అన్చు పూన్చు,పొందించు
ఊనుట-ఊనిక, ఆనిక, పూనిక.
ఊప-చిన్నచెట్లగుంపు, ఊబ, పేఁడి.
ఊపిరి-ఊరుపు, ఆవి-శ్వాస, వగర్పు.
ఊపిరికట్టు-శ్వాసరోగము, వగర్పుజబ్బు
ఊపిరిపోవు-ప్రాణముపోవు
ఊపిరియాడు-గాలిపీల్చుటకు వీలగు
ఊపు-భయపెట్టు, బెదరించు.
ఊబ-పాఁతర, పేఁడి, గుల్లగా పెరిగినది
ఊబదేలు-పుంస్త్వము పోఁగొట్టుకొను
ఊబవాఁడు-కొజ్జా, పేఁడి, పంద.
ఊబి-అడుసు, రొంపి, ఉబ్బలి, ఉమ్మలి
ఊయ(యా)ల-త్రాళ్లతోఁ గట్టఁబడి ఊఁగుటకు వీలైన తొట్టి-ఉయ్యె(య్యే)ల.
ఊయు-ఊఁదు, ఈలవేయు, ఉమియు
ఊయె(యే)ల-ఊయ(యా)ల, ఉయ్యాల.
ఊరఁగంద ఊరియందు పైరువేయుకంద.
ఊరఁగుక్క-గ్రామసింహము
ఊరఁబంది-ఊరియందు తిరుగు పంది
ఊరఁబిచ్చి(చ్చు)క - ఊరియందు తిరిగెడు పిచ్చుక-చటకము,
ఊరఁబిల్లి-గ్రామమార్జాలము.
ఊరఁబోవు-సన్నగిల్లు, తరుగు. [ఉ ర
ఊరక-వ్యర్థముగా, పిదుపక, సద్దుచేయక,
ఊరకపోవు-వండుగయగు, వమ్మగు
ఊరకాఁడు-బాపమరపి, వియ్యంకుఁడు
ఊరకుండు-సద్దుచేయకుండు
ఊరకొను-మాటాడకుండు, ఉపేక్షించు
ఊరగము-కప్పురము, ఘనసారము
ఊరగాయ-చూ ఊరుఁగాయ.

ఎండతేఁడు-సూర్యుఁడు. ఎండదొర.
ఎండవ-ఎండఁబెట్టుట-ఎండుగు
ఎండవడు-ఎండలో తిరిగి బడలు
ఎండవాలారు-చల్లఁబడు.
ఎండాకు-చొక్కాకు, చొరుగు
ఎండించు-ఎండునట్లు చేయు.
ఎండు-ఆఱు (క్రాఁగు. అడుగంటు బక్క-చిక్కు.
ఎండుగులు ఎండువులు. ఎండినవడ్లు
ఎండుతెగు(వు)లు-ఒడలుచిక్కునట్టిజబ్బు.
ఎండుపుఁదట్ట-పదార్థములు ఎండఁబెట్టెడు తట్ట-దాఁగర.
ఎండువులు = ఎండినవడ్లు
ఎండ్రి-గ్రుడ్డికామంచి +. ఛత్ర +
ఎండ్రకాయ, ఎండ్రి(క) - పీఁత గుడిజెల్ల ఏండ్ర. ఏండ్రి-క. నండ్రకాయ.
ఎండ్రింత-ఒకదినుసు గడి.
ఎండ్రిమెక్కు-మెకము, ఎండ్రిమేఁతరి - పీఁతలను దినెడు నక్క-పిక్కు మెకము
ఎండ్రు-కాయధాన్యము
ఎంత-యావత్ = ఏ పాటిది ? ఎట్టి స్థితి ?
ఎంతకుఁదెప్పు-అనర్థము కలిగించు.
ఎంతదను(దాఁ)క-ఎంత వఱకు. ఎందాఁక.
ఎంతయు-మిక్కిలి. చాల, ఎక్కువగా.
ఎంతలు-ఎంతెంతేసి. మిక్కిలి గొప్పవి.
ఎంత(టి)వాఁడు-ఏ మాత్రపు వాఁడు ?
ఎంతేని, ఎంతో - మిక్కిలి ఎక్కువైన, మిక్కిలి తద్దయు, పెద్దయు.
ఎంతోటు-ఎంతేని, ఎంతో.
ఎందనుక-ఎంతదనుక, ఎందాఁక
ఎందఱు-పలువురు, ఎంత (మంది) వారు.
ఎందతేని, ఎందతో - పెక్కండ్రు, పలువురు, అనేకులు
ఎందలి-ఎందున్న, ఎటనున్న
ఎందాఁక = ఎంతదాఁక, ఎంతవఱకు
ఎందు-ఎచ్చోట, దేనియందు.
ఎందుకు-ఎందులకు ? దేనికి ?
ఎందుచేత-ఏ కారణముచేత ?
ఎందును-అంతట, అన్నిట.
ఎందునేని-ఎచ్చటికైనను, ఎందేనియు.
ఎందుము = 5 తూములు. రూ. ఏఁదుము.
ఎందుల-దేనియందు? ఎందలి? ఎటనున్న?
ఎందులకు-ఎచ్చోటికి ? ఎందుకు ?
ఎందేనినుండి-ఎచ్చటినుండియో ?
ఎందేనియు-ఎచ్చటికో, ఎందునేని.
ఎంపనగ్గు-ఎముకల పొడి.
ఎంపసుద్దుడు-ఎముకలు నలుగఁ గొట్టుట.
ఎంపలి-పెంపలి + బాణపుంఖలి +
ఎంపిక-ఎన్నిక-గణన, లెక్క
ఎంబ-చికాకు కష్టస్థితి
ఎంబన్న-చేతకానివాఁడు. దద్దన్న. అంబేద
ఎంబె-తెలివి తక్కువ, రోఁత
ఎంబెన్న = ఎంబన్న, అంబేద, అసమర్థుఁడు
ఎంబెరుమా(నారు)ళ్లు-రామానుజాచార్యులు.
ఎంబెటికము, ఎంబెటికి - చేతకాని తనము, రోఁత, ఎబ్బెటికము
ఎఁడు-కొలఁతను దెల్పు ప్రత్యయము.
ఎక-ఏక-ఒకటి, ఎక్కటి
ఎకఁదొట్టు-హెచ్చు, పెంపొందు.
ఎకకంటిగాము-ఒంటికంటిగాము, చుక్క.
ఎకటాయించు-ఎదిరించు, త్రోసిపుచ్చు.

ఎకతాళి-ఎక్కిరింత ; ఏకతాళము.

ఎకదొట్టు-ఏచు, ఏపారు, ఎసఁగు

ఎకరంగి-ఒకరంగుగల మొకమూలు

ఎకరము-4840 చ॥గ॥వై శాల్యము గల నేల

ఎకరా-ఒక యాకరము. ఏన్గును గట్టుసాల, మొగసాల,

ఎకరారు-ఒప్పుకోలు, సమ్మతి.

ఎకసంకులవారు-సంకూడువారు.

ఎకసక్కమాడు-వేళాకోళము చేయు

ఎకసకియ(కె)ము } ఎగతాళి, మోసము
ఎకసక్కియ(క్కె)ము } అనమానము

ఎకసర-మల్లవిద్యయందలి నేర్పు

ఎకసికము } నవ్వించు మాట,
ఎకసెక్కియ(క్కె)ము } గేలి

ఎకాడమి-పండితసభ-పరిషత్తు [సూటిగా

ఎకాయ(యి-యొ)కి - ఒక్క మాఱుగా,

ఎకిమీఁడు-ఏలిక, దొర, తేఁడు, సామి

ఎకిరింత-గుఱ్ఱము, జక్కి. తేజి బాబా

ఎకిలి-అవివేకి, వెకిలి, సత్తువ

ఎకుబాలు-అదృష్టము

ఎక్కఁదీయు-వెలికిఁదీయు ఉద్ధరించు.

ఎక్కఁదోచు-పురికొల్పు. ప్రేరేఁచు.

ఎక్కఁద్రోయు-ఎగఁద్రోయు.

ఎక్కటియతి-లరమఱవ అను నక్షరములు పాదాదిని యతిస్థానమున అత్వముతోఁ గూడి యుండుట.

ఎక్కటి - ఏక = ఒక్కటి, ఒక్కఁడు, ఒంటు, ఒకముని, ద్వంద్వము.

ఎక్కటికము-దయ, జాలి, అక్కటికము.

ఎక్కటికయ్యము } ఒంటిపోట్లాట, ద్వంద్వ
ఎక్కటిబవరము } యుద్ధము.

ఎక్కటీఁడు-అసహాయశూరుఁడు, ఎక్కటి.

ఎక్కడ-ఏచోటు, ఎగ్గడ, ఏడ.

ఎక్కడి-(శాసన) ఎక్కటి

ఎక్కపొడుచు-పురియెక్కించు, పగరేపు.

ఎక్కము-ఏకః = ఒకటి, గుణకారపద్ధతి; మడుల నడిమిగట్టు, చెఱువుగట్టు.

ఎక్కలమ్మ-ఒకానొక గ్రామదేవత.

ఎక్కలాగు-త్రుంచివేయు [గ్రామదేవత.

ఎక్కలి - ప్రవాహపు టిసుక ఒకానొక

ఎక్కవేయు ఎగసనద్రోయు, నీరుఎక్కించు.

ఎక్కసకియ(కె)ము } గేలి, ఎగతాళి.
ఎక్కసక్కియ(క్కె)ము }

ఎక్కసమగు-తిండియెక్కువగు.

ఎక్కసెకియ(కె)ము } ఎగతాళి, వెక్కి
ఎక్కసెక్కియ(క్కె)ము } రింత,

ఎక్కా-దీపపుబుడ్డి, ఒక వత్తిగల దీపము.

ఎక్కాచిక్కము-అర్థముకాని యవస్థ.

ఎక్కాడు స్వారిచేయు-ఎక్కియాడు; పుది కొలుపు, అడఁగఁద్రొక్కు, ఎక్కువగా మాటలాడు

ఎక్కాసమగు-భుక్తాయాసము కల్గు.

ఎక్కించు-ఎక్కఁజేయు,ఎక్కుపెట్టు,ఎత్తు, చెల్లించు, దూర్చు, పురికొల్పు

ఎక్కించుకొను-ఎక్కునట్లు చేయించుకొను.

ఎక్కికొను ఎక్కు, అధిష్ఠించు,

ఎక్కిడి పనియందలి శ్రద్ధ, ఆదుర్దా.

ఎక్కిడు-వింటికి నారిని(బాణమును)కూర్చు, మోపిడు.

ఎక్క(క్క)త(తొ)క్క-మిక్కిలి సమృద్ధి.
ఎక్కిరించు-వెక్కిరించు, ఆక్షేపించు
ఎక్కిరింత-గుబ్బము. ఎకిరింత, వెక్కిరింత
ఎక్కిరింత మెకము-కోతి.
ఎక్కిలి-హిక్క = దప్పిచేఁ గలుగు ఎక్కిళ్లు.
ఎక్కలమ్మ యను గ్రామదేవత.
ఎక్కు-పైకి వెడలు. కలుగు, నచ్చు. క్రమ్ము కొను, ఎమర్కొను నెఱవేరు. తేటపడు, అందగొను, అల్లె(త్రాడు.
ఎక్కుకొను-ఎక్కు, పైకి వెడలు
ఎక్కుట-పైకి పోవుట-ఆరోహించుట
ఎక్కుడించు - హెచ్చించు, వింటినారిని దొలఁగించు.
ఎక్కుడు - ఎక్కుఁదగినది, ఎక్కువైనది, ఎక్కుట, గుబ్బము, పెంపు
ఎక్కుడుఁదీఁగ-మానేరు, మెఱపుఁదీఁగ
ఎక్కుడుగాఁడు-రౌతు-సాది
ఎక్కు(డు)పెట్టు-ఎక్కిడు, ఎక్కుదీయు.
ఎక్కుడుమెకము - ఎక్కఁదగిన (గొప్ప) జంతువు-ఏనుఁగు.
ఎక్కుడు మొగుల్లల ప్రోడ-మబ్బులు వాహనములుగాఁ గలవాఁడు-ఇంద్రుఁడు
ఎక్కుతక్కులు-హెచ్చుతగ్గులు
ఎక్కుదీయు(దోయు)-ఎక్కువెట్టు, ఎక్కిడు
ఎక్కుపెట్టు-ఎక్కిడు, నారిపూన్చు
ఎక్కుబావి - లోనికిదిగి ఎక్కుటకు వీలుగా మెట్లుకట్టిన బావి-దిగుడుబావి.
ఎక్కుమటి - ఎగుమతి, పరదేశములకు సరకులంపుట
ఎక్కులు-పురికొల్పుట.
ఎక్కులుపెట్టు-పురికొల్పు, ప్రేరించు.
ఎక్కువ-ఎచ్చు, పెచ్చు. హెచ్చైన
ఎక్కువగా-పెచ్చుగా, దండిగా.
ఎక్కువాఁడు-రౌతు, ఆరోహకుఁడు.
ఎక్కువు-ఎక్కుడు, ఎక్కువ, హెచ్చు.
ఎక్కువెట్టు-ఎక్కుపెట్టు, ఎక్కిడు.
ఎక్కెడ ఎక్కడ, ఎగ్గడ, ఏడ.
ఎక్కొను-అతిశయించు, పెంపెక్కు
ఎక్కోటి-ఏడుకోట్లు
ఎగ-మీఁదు, ఎగు శబ్దమునకు వృత్తియందు ఆదేశముగా వచ్చు రూపము.
ఎగఁగట్టు-పైకి ఎత్తికట్టు
ఎగఁగొట్టు-(అప్పు) ఎగురఁగొట్టు
ఎగఁగొలుపు-ల్పు = పురికొల్పు, ప్రేరించు.
ఎగఁగ్రోలు-పీల్చు, జుర్రు, త్రాగు.
ఎగఁచిపట్టు-విజృంభించి పట్టుకొను.
ఎగఁజిమ్ము ఎగఁజల్లు పైకిఁజల్లు. [బట్టు.
ఎగఁజేపు-జంతువులు పాలు పైకిలాగి బిగఁ
ఎగఁజల్లు-ఎగఁజిమ్ము. పైకిఁజల్లు, పీల్చు.
ఎగఁజేపు-పైకిఁద్రోలు, విడుచు
ఎగఁదట్టు-ఎగఁదాఁకు, పైకివచ్చు.
ఎగఁదన్ను-ఎగఁజిమ్ము, ఎగఁజేపు.
ఎగఁదీయు-పైకెత్తు, ఎత్తిపట్టు.
ఎగఁదొట్టు-పైకివచ్చు పెంపెక్కు.
ఎగఁదోకు-ఎక్కివచ్చు
ఎగఁద్రో(వు)యు-పైకిఁద్రోయు, పురికొల్పు.
ఎగఁద్రోలు-పురికొలుపు, ప్రేరించు.
ఎగఁబట్టు-ఎత్తిపట్టు, పైకెత్తు
ఎగఁబడు-వేడుకపడు, ఆశతో మీఁదపడు.
ఎగఁబాఱు-ఎగువకుఁ బరుగెత్తు

ఎగఁబీల్చు-ఎగువకుఁబీల్చు.
ఎగఁబెట్టు ఎగవేయు. బాకీ ఎగఁగొట్టు.
ఎగఁబోఁత-ఎగఁబోయుట.
ఎగఁబోయు-ఎక్కువగాఁ ద్రాగు, ప్రేరించు, ముమ్మరించు.
ఎగఁబ్రాకు-మీఁదికి ప్రాఁకు. ఎక్కు
ఎగచు - తఱుము. అలముకొనఁజేయు. ఎగయు.
ఎగతాళి-గేలి. నవ్వులాట. రూ ఎకతాళి.
ఎగదిగ-పైకి క్రిందికి, ముందు వెనుక.
ఎగదువ్వు-మీఁదికి దువ్వు
ఎగద్రొబ్బు-ఎగఁద్రోయు, ఎగవేయు.
ఎగనామము పెట్టు బాకీ ఎగఁబెట్టు.
ఎగనూఁదు-పైకిలేపు. సాయపడు
ఎగనెత్తు-ఎగఁబట్టు, ఎత్తిపట్టు
ఎగపు-పెక్కు, క్రొవ్వు, ఏపు.
ఎగమీటు-మీఁదికి చిమ్ము
ఎగమ్రింగు-పూర్తిగా మ్రింగు
ఎగయించు-ఎగురఁజేయు, ఎగచు.
ఎగయూపిరి-గాలి పీల్చుట, ప్రాణము
ఎగయు-ఎగురు, వెడలు, కలుగు, పుట్టు, లేచు ఊడిపచ్చు, అలముకొను.
ఎగయుదెంచు-పైకివచ్చు.
ఎగయువాఁడు-ఎగురువాఁడు
ఎగర-కోడి, కుక్కుటము.
ఎగరవేయు-తూర్పారఁబట్టు, విసరికొట్టు.
ఎగరొప్పు-వగర్చు, రొజు, ఎగశ్వాస.
ఎగరోజు-వగర్చు, నిట్టూర్చు.
ఎగవిడుచు-తప్పించుకొను, వీడు.
ఎగవు-ఎగురుట, గెంతుట. రూ. నెగవు.
ఎగవట్టు-ఉనికిల్పు, పురికొల్పు.
ఎగ(వేయు)వైచు - దొంగిలించు. అప్పు లెగఁగొట్టు
ఎగసన-ఎగుసగా, పైకి పోవునట్లు.
ఎగసనఁద్రోచు - పురికొలుపు, పైకినెట్టు, రగులు కొలుపు
ఎగసాన-చూ. రూ. ఎగసన.
ఎగసిపడు-ఎగురు, ఎగయు, లేచు.
ఎగసిపాటు-మిట్టిపాటు, ఎగిరిపాటు.
ఎగసిపోఁత-పొగరు, గర్వము.
ఎగసిలు-ల్లు ఎగురు, ఎగయు, లేచు.
ఎగాదిగ - ఎగదిగ, పైకి క్రిందికి.
ఎగాదిగఁజూచు-తేరిపాఱఁజూచు.
ఎగియు-నొక్కు ఎగురు
ఎగిరించు-ఎగురఁజేయు.
ఎగిరి గంతువేయు-ఎక్కువ సంతసించు.
ఎగిరిపడు-గర్వించు, మిట్టిపడు
ఎగిసి కాలాడు-ఎగతాళి చేయు.
ఎగిసిపడు-ఎగురు, ఎగియు, లేచు
ఎగు-ఎగురు, ముగియు, ఎత్తగు, ఎత్తైన.
ఎగుచు-తఱుము. త్రోయు, లేవఁగొట్టు.
ఎగుడు-ఎత్తుగానున్న; మిట్ట, ఎగువ.
ఎగుడు దిగుడు-మిట్టపల్లములు గల.
ఎగుదల-పైవోటు, పెంపు, కుదువ, ఎగువ
ఎగుచు-పరుగిడు, దొరకు, సాయపడు
ఎగుపు-ఎగురుట, ఒక పక్షిగతి.
ఎగుపొగరు-ఊరకే మిట్టిపడుట
ఎగుబుజము-ఎత్తయిన బుజము.
ఎగుబుస-ఎగఊపిరి, ఎగశ్వాస.
ఎగుబోద-క్రొత్తగా ఎగిరెడు పక్షిపిల్ల.

ఎగుమతి-పరదేశములకు సరకులుపంపుట.
ఎగుర(ఁగొట్టు)వేయు- పైకిఁజిమ్ము, విసరు
ఎగురు-ఎగయు, పైకిలేచు, పొగరు.
ఎగురుట-పక్షి మీఁదికిపోవుట.
ఎగురులాడు-దూఁకులాడు, ఎగురు.
ఎగువ-ఎత్తు, ఎగుడు, ఎగుదల.
ఎగువు-త్రోలు, ఎగచు
ఎగూపగూ-హెచ్చు తక్కువలు.
ఎగ్గడ-ఎక్కడ, ఎగ్గెడ, ఎయ్యెడ, ఏడ.
ఎగ్గడము-దట్టము, తఱచు.
ఎగ్గడి-పేఁడి,కంచుకి,కొజ్జా, రూ. హెగ్గడి.
ఎగ్గడికత్తె-అంతిపురపు కావలికత్తె
ఎగ్గడికాఁడు ఎగ్గడీఁడు } కొజ్జా, కంచుకి, రూ. హెగ్గడికాఁడు.
ఎగ్గతమగు-ఏకాంతముగ నుండు.
ఎగ్గతము-ఏకాంత = రహస్యస్థలము.
ఎగ్గలితనము-వెంగలితనము.
ఎగ్గా మగ్గా-ఇచ్చ వచ్చినట్లు
ఎగ్గాడు ఎగ్గించు } ఎగ్గులాడు, ఆడిపోసికొను, ఏకు. తప్పులు పట్టు
ఎగ్గు-తప్పు, కీడు, ఈసడింపు, చెడుమాట చెడ్డశకునము, భంగము
ఎగ్గుగొను-తప్పుగాఁ దలఁచు.
ఎగ్గుచేయు-కీడు(హాని)చేయు
ఎగ్గుతలఁచు-కీడు తలపెట్టు.
ఎగ్గు(ర్తు)ఱుతు-పీరిక,తొలిపల్లు, మున్నుడి.
ఎగ్గులాడు-తప్పులుపట్టు. దూఱు ఏకు.
ఎగ్గులు-ఆడిక, తెగడిక, ఏవగింపు.
ఎగ్గులుపట్టు-ఎగ్గాడు, తప్పులు పట్టు.
ఎగ్గులు పలుకు-ఎగ్గులాడు, నిందలు పల్కు.
ఎగ్గులువడు నిందపడు
ఎగ్గుసేయు-కీడుచేయు, తప్పుచేయు.
ఎచ్చ(రిలు-ర్లు)ల్లు-జాగరూకుఁడగు.
ఎగ్గూపగ్గూ-ఎచ్చుతెక్కువలు, తేడా
ఎగ్గోలు-8 కాళ్ల విషకీటకము
ఎచ్చిఱు-సేదదేఱు, తేఱుకొను, బాగుపడు, ఎదుగు, ఏచు
ఎచ్చిలు-ల్లు = పెంపొందు, హెచ్చు.
ఎచ(ట)టు ఎచోటు, ఎక్కడ, ఏడ.
ఎచరము ఎచ్చరము, హెచ్చరిక.
ఎచరించు-పురికొల్పు, చెప్పు, ఎచ్చరించు
ఎచా(ట)టు ఎచోటు } ఎచ్చొటు, ఎచ్చోటు,ఏచోటు.
ఎచ్చ(ట)టు-ఏచోటున, ఎచ్చో
ఎచ్చము-కూరల మసాల, రూ వెచ్చము.
ఎచ్చరము-బరాబరిక హెచ్చరిక [రించు.
ఎచ్చరించు - తెలుపు, పురికొల్పు - హెచ్చ
ఎచ్చరిం(త)పు ఎచ్చరిక } జాగ్రత్త, సూచన. రూ. హెచ్చరిక.
ఎచ్చరికించు-ప్రేరేపించు రూ.ఎచ్చరించు.
ఎచ్చరిలు(ల్లు)-పెరుగు, జాగ్రతపూను
ఎచ్చరు-హెచ్చరికతో నుండు.
ఎచ్చలకారిపిందె-డాంబికుఁడు.
ఎచ్చీపచ్చీ-సరిగా పక్వదశకు రాని.
ఎచ్చు-చెలరేఁగు, ఎక్కువగు, గొప్ప, మించిన ఎక్కువైన.
ఎచ్చులు-డంబములు, డాబులు.
ఎచ్చులుపడు-ఒడాయికొట్టు.
ఎచ్చులు పలుకు-గొప్పలు చెప్పుకొను
ఎచ్చొ(ట)టు-ఏచోటు, ఎక్కడ, ఏడ.

ఎచ్చో(ట)-ఏచోటున, ఎచ్చట.
ఎచ్చోటు-ఎచ్చోటు, ఏచోటు. [సూచిక.
ఎజెండ - సభలోఁ జర్చింపఁదగిన విషయ
ఎజ్జ అవను, తఱి, పదను
ఎట-ఎచ్చట ?, ఎక్కడ ?, ఏడ ?.
ఎటకాయించు-అటకాయించు, అడ్డుపెట్టు
ఎటకు-ఎక్కడకు ?. ఏడకు ?.
ఎటమటము-తాఱుమాఱు, ఎడము.
ఎటవారె-అందుగు +. సల్లకి +
ఎటామొటీ-సమ్మతిలేని మాటతీరు.
ఎటికొట్నము-వెట్టిపనులు.
ఎటు-ఎట్టు, ఏవైపు. ఏరీతి, ఎటులు
ఎటు(ల)లు-ఏరీతి ?, ఎట్టులు ?, ఎట్లు ?
ఎటువంటి-ఎట్టి ?, ఏలాటి?
ఎటువలె-ఎట్టువోలె, ఎట్టు, ఎట్లు ?
ఎట్టకునే(కే)సి-తుట్టతుదకు, ఎట్లో
ఎట్టకేలకు-చిట్టచివరకు.
ఎట్ట(ట)న-ఎట్లయినను. ఎట్లేని. తప్పక
ఎట్టపోగు-దండు, గుంపు, మూఁక.
ఎట్టముగొట్టు-ఈడ్చుకొనిపోవు.
ఎట్టయెదురు-మిక్కిలియెదురు,మున్ముందు.
ఎట్టా-ఎట్టు, ఎట్లా, ఎట్లు. ఎటులు.
ఎట్టామొట్టి-చూ. ఎటామొటీ.
ఎట్టి-ఏటి, ఎటువంటి, ఏలాటి?
ఎట్టి(ట్టీ)ఁడు-ఎట్టివాఁడు ?, కీదృశుఁడు
ఎట్టు-ఏవైపు, ఏరీతి, మూస
ఎట్టుకూలి-వెట్టిచాకిరి.
ఎట్టువోలె-ఎటువలె ? ఎట్లు ?
ఎట్టూ
ఎట్టె(ట్టా)ట్టూ } ఏప్రకారము ?, ఏవైపు ?, ఎట్లా ?

ఎ(ట్లా)ట్లు-ఏలాగు, ఎట్టా, ఎట్టు.
ఎడ-చోటు. జాగు, సందు, తేడా, గడువు, అడ్డంకి. ద్రవ్యము. నైవేద్యము. రాయబారము అవమానము, ఇమ్ము,తెలివి, మినహాయింపు. హృదయము; తక్కువైనది. ఎడమది, కొలఁదిది, వమ్మైనది; అందు.
ఎడఁజెందు-సొమ్మసిల్లు, మూర్ఛిలు.
ఎడఁజేయు తొలఁగించు పోఁగొట్టు.
ఎడఁద-హృత్ = గుండె. రూ ఎడంద. ఎడ్ద, ఎడ్డ ఎఙ, ఎద.
ఎడఁబాటు-ఎడఁబాయుట. విరహము.
ఎడఁబాపు-వేఱుచేయు, తొలఁగించు.
ఎడఁబాయు-తొలఁగు, దూరమగు,ఎడయు
ఎడకట్టు-చేరు, పుండు చీము పట్టు.
ఎడకెడ-లాతి, పెర. పరాయి, వేఱు.
ఎడకడవాఁడు-ఎడవాఁడు. పెరవాఁడు
ఎడకత్తియ-త్తె = తార్పుకత్తె, తాపికత్తె.
ఎడకాఁడు-తార్పుకాఁడు, కొల్లగాఁడు
ఎడకారు-మాఘమాసము మొదలు జ్యేష్ఠమాసము లోపల పండు పంట,
ఎడగడ్డ-ఒడ్డు, గట్టు, తీరము.
ఎడగని-అలయిక. బడలిక,
ఎడగరిపడు-అలయు, బడలు
ఎడగా చను దూరముగా పోవు.
ఎడగిలు-ల్లు = వైతొలఁగు, ఎడమగు
ఎడగొను-సందుచేసికొను, ప్రక్కచేరు.
ఎడతప్పించు-వరుస తప్పించు.
ఎడతాఁకు-రాకపోకలు సల్పు, డీకొను
ఎడతీయు-ఎడతెగు, వేఱగు.
ఎడతెంపి-విడిపోవుట, తెఱపి.

ఎడతెగు-వేఱగు, చెడు, పూర్తియగు.
ఎడతె(ఱపి)ర్పి-ఎడము, తీఱిక, అడ్డంకి.
ఎడతొట్టుకొను-మధ్యలో ఆక్రమించు
ఎడత్రె(మ్చు)వ్వు-వేఱగు, విడిపోవు, చెడిపోవు, ఆగిపోవు.
ఎడత్రోవకాపరి-దారిదొంగ, ఏనాది,
ఎడదవచ్చు-బుద్ధిపుటు.
ఎడదవ్వు-మిక్కిలి దూరము-దవిష్ఠము.
ఎడదూడ-తఱపిదూడ,
ఎడఁదొలఁగు దూరముగఁ దొలఁగు.
ఎడనాడు-దూఱు, తిటు, నొవ్వనాడు
ఎడనీటి టెంకాయ-లేఁత టెంకాయ.
ఎడనీరు-లేఁతకొబ్బరినీరు-ఎలనీరు
ఎడనెడ, ఎడపఁదడప } అక్కడక్కడ, అప్పుడప్పుడు. అడపదడప,
ఎడపక-ఎడతెగక, ఎడము కాక, ఉడుగక, తప్పక, ఎల్లప్పుడు.
ఎడపడు-లోటగు, ఎడమగు, అడ్డగు, చెడు, పూచీపడు, ఎడవడు.
ఎడపరి-ఎడఁబాపునది.
,,పిల్ల-చంటిబిడ్డకు వెనుకటి బిడ్డ
ఎడపు-తొలఁగించు, విడుచు, వేఱుచేయు.
ఎడపుచ్చు-కుంటెన నడపు-తార్చు.
ఎడపెడ-రెండువైపుల, అటు నిటు,
ఎడపెట్టు-అడ్డుపెట్టు, విడుచు.
ఎడపోవు-ఎడపుచ్చు, దౌత్యముచేయు.
ఎడప్రొద్దు-సంజవేళ-మునిమాపు.
ఎడబిడ్డ-ఎడపిల్ల, తఱపి బిడ్డ
ఎడబెట్టు-ఒక బంగరు నాణెము.
ఎడమ-డా, డాపల, రూ. ఎడ్మ.

ఎడమకేలు-వామహస్తము-డాకేలు.
ఎడమగు-ఎడఁబాయు, ఏరుపడు.
ఎడమడుగు-(వు) = అడ్డంకి, జాగు, తేడా, కుచ్చితము, ఈసడింపు, తాఱుమాఱు
ఎడమడుగు(వు)పరుపడి-ఒకజెట్టి పెనకువ
ఎడమది-డాపలిది, వామము, సవ్యము,
ఎడమపెన-ఎడమవైపు పురి, వ్యతిరేకము.
ఎడమిచ్చు-చోటిచ్చు
ఎడము-సందు, వీలు, గడువు, ఎడ.
ఎడముకొను-దూరమగు, పైకొను.
ఎడయగు-దూరమగు, చెడు, జాగగు.
ఎడయాడు-నడయాడు, తిరుగాడు.
ఎడయించు-సందుచేయు, నఱకు
ఎడయిక-ఎడఁబాటు-వియోగము.
ఎడయు-తొలఁగు, దవ్వగు, చెడు, విడుచు.
ఎడయెఱుగు-లోకజ్ఞానము తెలియు.
ఎడరు-పెఱుగు, చెడు, కీడు అదను, అలమట, జడుపు, ఎడారి.
ఎడఱు-నిరోధించు, అడ్డుకొను
ఎడల-పక్షమున, విషయమున.
ఎడలించు-సడలించు, నఱకు.
ఎడలు-తొలఁగు, పగులు, చెడు, పడు, చచ్చు, దవ్వగు, వెల్లడియగు.
ఎడలుచు-ల్చు = ఊడఁదీయు, తొలఁగించు, త్రోయు, నఱకు, సడలించు
ఎడలు(వాపు) సేయు-ఎడఁబాపు, వేఱుచేయు
ఎడవంక-ఎడమవైపు, డాపల.
ఎడవడపడక-విరామము లేక.
ఎడవడు-చూ ఎడపడు
ఎడవడక-విరామములేక.

ఎడవల-ఒకదినుసు చేఁపల వల.
ఎడవాఁడు-పెఱవాఁడు, కడవాఁడు.
ఎడవాయు-ఎడఁబాయు, వీడు.
ఎడవిడివడు-అడ్డు తప్పించుకొను.
ఎడవు-ఎడారి, బయలు. దవ్వు.
ఎడవెట్టు-మినహాయించు, విడుచు.
ఎడవోవు-దౌత్యము నడపు. ఎడపుచ్చు.
ఎడసంది-నడిమి సందు.
ఎడసను-పైతొలఁగు, దూరమగు.
ఎడసాల-ప్రత్యేకమైన యిల్లు
ఎడసిపోవు-తొలఁగిపోవు-అపసరిల్లు.
ఎడసేయు-ఎడఁబాపు, విడఁదీయు
ఎడసొచ్చు-పైఁబడు, అడ్డగు, చొచ్చు
ఎడాటము-విషయము,పొలయలుక మార్పు
ఆట, వెంట, పట్టు.
ఎడా(రి)రు-బయలు, పట్టునేల, కాన కొన.
ఎడారె-చెప్పులు కుట్టు సూది-ఆరె
ఎడివ-మొరటువాఁడు, మొఱకు, ఎడ్డె.
ఎడుకసెప్పు-సోచెచెప్పు.
ఎడుపువేయు-క్రుళ్ళినచోట నారునాటు
ఎడ్డ-హృత్-తొమ్మ. రూ. ఎడఁద, ఎడ్ద
ఎడ్డమి-ఇడుమ, ఇక్కట్టు. ఎడరు.
ఎడ్డము-అడ్డము, ఇబ్బంది, ఎడరు
ఎడ్డి(మడ్డి)-చెడ్డ ముటికి, మోటు.
ఎడ్డియ-డ్డె = మోటు(ది)వాఁడు, మొఱకు.
ఎడ్డెఁడు-ఎడ్డెవాఁడు.మొండికట్టె.
ఎడ్డెగిజ్జడి-కల్లుత్రాగు బొళ్ళపాయ.
ఎడ్డెతనము-తెల్విలేమి, మూర్ఖత.
ఎడ్డెన-కూటిగిన్నెలుంచెడు ఎత్తుపీఁట.
ఎడ్డెమడ్డె-మొరటు, మోటు, మడ్డి.
ఎడ్డెవాఁడు-ఎడ్డెఁడు.
ఎడ్డ-ఎడఁద. హృత్ = తొమ్మ-ఎ(డ)ద.
ఎడ్మ-చూ. రూ. ఎడమ.
ఎడ్లు-ఆవులు. గొడ్డెలు.
ఎత(ఁడు)ను-ఏయాతఁడు,ఎవఁడు. ఏతఁడు
ఎతపడు-మనోవేదన పడు.
ఎతలు-వెతలు, ఎత్తులు
ఎతామతము-(యతిమత)పెట్టివాలకము.
ఎతిమతము = చూ. ఎటమటము.
ఎతుబరికాఁడు-దొంగ, ముచ్చు. ఎల్లాపి.
ఎత్తగొట్టు-పాఱఁద్రోలు, చెఱచు.
ఎత్తడి-ఎత్తైన, చేలకు తోలిన మన్ను.
ఎత్తనగోల-ఊఁతకోల, కావడిబద్ద.
ఎత్తనగోలు-పూనిక, మొదలు, ముంగల.
ఎత్తరంపుఁజెవుల తత్తడి-ఉచ్చైఃశ్శ్రవము.
ఎత్తరంపుఁజెవులతత్తడివజ్రీఁడు-ఇంద్రుఁడు
ఎత్తరతత్తరలు-తునకలు, చెడినవి.
ఎత్తర(ము)వు-ఎ(గు-వు)డు. ఎత్తు, ఎత్తైనది
ఎత్తిలి-వెల్లువవలన ఏర్పడిన ఇసుకదిబ్బ.
ఎత్తళి-పని(కొఱ)ముట్టు-పడచ్చు.
ఎత్తి- గట్టిగా, బిగ్గఱగా.
ఎత్తికొను-పూను, పట్టుకొను, తీసికొను.
మోయు. దొంగిలించు, చంకఁబెట్టుకొను.
కలుగు. కాపాడు. బిచ్చమెత్తుకొను.
ఎత్తికోలు-కోరిక, పూనిక. రూ.ఎత్తుకోలు.
ఎత్తిడి-ఒక దినుసు చేపఁలవల
ఎత్తిపలుకు } తప్పు లెన్నుచు మనస్సు
ఎత్తిపొడుచు } నొవ్వఁబలుకు-దెప్పు.
ఎత్తిపొడుపు-ఉపాలంభము, దెప్పు.
ఎత్తిపోతల-జలపాతముయొక్క దార్లు

ఎత్తిపోవు-పూర్తిగాపోవు, చెడిపోవు
ఎత్తిలి-బిగ్గరగా, హాయిగా, చేఁపలవల.
ఎత్తివచ్చు-కలనికైవచ్చు, గుటిలేకుండు,
ఎత్తి(వేయు)వైచు - ఎత్తిపడవేయు, బాకీ తీర్చివేయు, త్రోసివేయు, అపుచేయు.
ఎత్తు-పూను, కలుఁగు, లేవఁదీయు, వాడి చేయు,బిచ్చమడుగు, ఇచ్చు, హెచ్చించు, తలఁచు, దొంగిలించు, పొందు, వెల్ల డించు, తాల్చు, పెల్లగించు, తోఁడ, ప్రదికించు, నిలుపు, తీసికొను, రీతి, యుక్తి సాటి, ఉన్నతి, తూనిక, పన్ను గడ, గౌరవము, రెండు వీసెల బరువు, బూతము, (క. ఎత్తు)
ఎత్తుకట్టు-నిలుపుకొను
ఎత్తుకపోవు-ఎత్తుకొనిపోవు.
ఎత్తుకవచ్చు-దొంగిలించు.
ఎత్తుకొను-చంకఁబెట్టుకొను, గ్రహించు, దొంగిలించు, కాపాడు.
ఎత్తుకొనిపోవు-చంకఁబెట్టుకొని పోవు
ఎత్తుకొయ్య-కావడి, కావటి
ఎత్తుకోలు-ఎత్తికోలు, కోరిక, పూనిక.
ఎత్తుగడ-పూనిక, పన్నుగడ.
ఎత్తుగడచేయు-పూను, ఉంకించు
ఎత్తుగడ్డలు-ప్రొయ్యిగడ్డలు, పొక్కిలి.
ఎత్తుగల్లు-మెట్టుగా నేర్పఱచిన రాయి
ఎత్తుగా-గొప్పగా, గట్టిగా, పెద్దగా.
ఎత్తుగాలి-పెద్ద(హోరు)గాలి, పోరుగాలి.
ఎత్తుగీ (తము) తియ - సీసపద్యమునకుఁ బిమ్మటవచ్చు గీతపద్యము.
ఎత్తుగున్న-ఏనుఁగుపిల్ల-కలభము.
ఎత్తుట-అందుకొనుట, కైకొనుట.
ఎత్తుదెంచు-దాడివచ్చు, భగ్నమగు.
ఎత్తుపడు-లేపలేకపోవు, బెండువడు.
ఎత్తుపెట్టు-పురికొల్పు, పెట్టుబడిపెట్టు
ఎత్తుబడి - యాచన, సొమ్ము వసూలు, బక్కదేరుట, శవమును శ్మశానమునకు కదలించుట
ఎత్తుబరికాఁడు-చూ రూ. ఎతుబరికాఁడు.
ఎత్తుబారము-పెత్తనదారుని బత్తెము, అనక తవకతనము, బూడిద, శవవాహనము
ఎత్తుమానము-ఎత్తుగడ, యత్నము.
ఎత్తులకెకిమీఁడు } శివుఁడు-బూచులఱేఁడు.
ఎత్తులవేలుపు }
ఎత్తులమారి-జిత్తులమారి, నేర్పరి.
ఎత్తులిడు ప్రేరించు, పురికొల్పు.
ఎత్తులు-పూలదండలు, సరములు
ఎత్తులు మప్పు-చాడీలు చెప్పు,జిత్తులు నేర్పు.
ఎత్తులువెట్టు-పురికొల్పు, మోసగించు.
ఎత్తువచ్చు-సాటివచ్చు, ఎనయగు.
ఎత్తువడు-నీరసించు, చెడిపోవు, అడఁగు.
ఎత్తువారిచేతిబిడ్డ-ఒకరి నాశ్రయించి నడచు కొనువాఁడు
ఎత్తువెట్టు-పురికొల్పు, కుయుక్తి పన్ను.
ఎత్తువేయు-తూచు, కుయుక్తిపన్ను.
ఎత్తువోవు-పడిపోవు, తగ్గు, చెడు.
ఎత్తుసేయు-కికురించు, మోసగించు
ఎత్తెరము-నిక్కు, ఎత్తుకలది.
ఎత్తెల-చేఁపలవల, గాలము, ఎత్తిలి
ఎత్తెలగొను - గాలమువైచి పట్టుకొను, తేలికగా జయించు.

ఎత్తెలుఁగు-తెలివి తక్కువగు.
ఎత్తేఁపు-పఱపు. వ్యాపింపఁజేయు.
ఎత్వా(త్మా)న్నము | యత్నము. ఎత్తుగడ.
ఎత్వారము | ఎత్తుమానము.
ఎద-హృత్ = ఱొమ్ము-ఎడఁద. వెఱపు.
ఎద-ఇచ్చ, తలఁపు, పశువుల కామేచ్ఛ.
ఎదఁగందు - ఱొమ్మున మచ్చకలవాఁడు-చంద్రుఁడు
ఎదగు-పశువులు ఋతుధర్మమునొందు
ఎదగొడ్డు - ఎదపోయిన గొడ్డు, ఎదలేక పైరయినవి.
ఎదచూలి-గాలి, చన్ను-వక్షోజము.
ఎదనెగ్గురను-మనస్సు నొవ్వుకొను
ఎదపగులు-గుండె మిక్కిలి కొట్టుకొను.
ఎదపడు-దీనతనొందు. బెదరు
ఎదపదిలము-హెచ్చరిక, బరాబరిక
ఎదపుట్టువులు-చన్నులు. పాలిండ్లు.
ఎదపోవు-పశువులు పొర్లఁడగుఈడువచ్చు.
ఎదబెట్టు-ఒకే పైరు పెట్టు.
ఎదమచ్చగలసామి-ఱొమ్మున శ్రీవత్సమను పుట్టుమచ్చగలవాఁడు-విష్ణువు-పెదుమాళ్లు.
ఎదివడు-బెదరు, దీనతనొందు.
ఎదవడుట-అడలుట, ఓడుట ఉలుకుట.
ఎదానఁబడు-ఒకనిపై ఆధారపడు.
ఎదాయెదలు-చెదరినవి, చిమ్మఁబడినవి.
ఎదావు-ఋతుకాలమునకు వచ్చిన ఆవు.
ఎదాళము-ఎదుట-సమక్షము.
ఎది-ఎద్ది, ఏది, ఏయది, ఎయ్యది.
ఎదిరి-ప్రతివాది, పరుఁడు-పగతుఁడు.
ఎదిరించు-ఢీకొను, ఎదురాడు. ఎదుర్చు
ఎదిరికొను-ఎదురుచెప్పు-ఎదుర్కొను.
ఎదిరికోలు-ఎదురుగాపోవుట, ఎదుర్కొనుట.
ఎదుగు-పెరుఁగు, దగ్గఱించు, ఈడువచ్చు; ఏచు. పెంపు
ఎదుగుట-ఎచ్చరిలుట, పెరుగుట
ఎదుగుడు-పెరుఁగుట, పెంపుదల, ఏపు.
ఎదుగు పొదుగులు-పెరుఁగు విఱుగులు.
ఎదుట(ను)-ముందట, ముంగల, మ్రోల.
ఎదటిది-ఎదుట నున్నది
ఎదుటివాఁడు-ముందట నున్నవాఁడు.
ఎదురగు-ఎదురువచ్చు. అభిముఖమగు.
ఎదురాడు-ఎదిరించు, మాఱాడు.
ఎదురీఁత-ఎదురుగా నీఁదుట, తెగుదారితనము
ఎదురీఁదు-చొరవచేయు, తెగించు
ఎదురు-ముందు, సాటియైన, ఎదుటనున్న, సాటిగా,మాఱుగా,ఎదిరించు, ఒండొకఁడు
ఎదురుండు-ఎదుర్చు, పగబూను.
ఎదురుక(ట్టుల)ట్ల = ముందఱ, మ్రోల,
ఎదురుకుత్తుక-ఆంకిళ్ళు నొక్కెడు జబ్బు.
ఎదురుకొను-ఢీకొను, మాఱ్కొను.
ఎదురు కొలుపు-ఎదుర్కొనఁజేయు.
ఎదురుకోలు-ఎదురుగా పోవుట
ఎదురుకో(వలు)ళ్లు-వరుఁడు రాఁగా, మేళ తాళములతో నెదురుగఁ బోయి ఆహ్వానించుట. [బడిక (పత్రము)
ఎదురుగడ-బదులుగా వ్రాసికొన్న ఒడం
ఎదురుగా-ముందుగా, సాటిగా.
ఎదురుగాలి-ఎదురుగా వీచెడు గాలి.
ఎదురుచు = ఎదిరించు, ఎదుర్చు, ఎద్రుచు.
ఎదురుచుక్క-ప్రయాణ కాలమున శుక్ర నక్షత్ర మెదరగుట (హానికరము).

ఎదురుచూచు-వేచియుండు, మించు, ఓడించు
ఎదురుతాఁకగు-ఎదురగు, తారసిల్లు
ఎదురుతాఁకు-ఎదుర్కోలు, పిలుపు, సాటి.
ఎదురు తిరుగు-ఎదుర్కొను, తిరుగఁబెట్టు
ఎదురుదొట్టు-ఎదుర్కొను, ఢీకొను
ఎదురు నడచు-ఎదురేగు, ఎదురుగా పోవు.
ఎదురువచ్చు-ఎదురగు, ఎదుర్కొను.
ఎదురుపాటు-ఎదుర్కోలు, ఎదురుగాపోవుట.
ఎదురు(బడి)మోల-ఎదురగుట, తారసిల్లుట.
ఎదురుమ్రోయు-మాఱు(చెలఁగు)మ్రోయు
ఎదురుఱొమ్ము = ఱొమ్ము నడిమిచోటు
ఎదురులెక్కు-ఎదురేగు, బాధించు
ఎదురుపెలఁగు = ఎదురుమ్రోయు
ఎదురెక్కు-ఎదురేగు, ఢీకొను.
ఎదురేగు-ఎదురుగాపోవు, పిలుచు.
ఎదురొడ్డు - మాఱుపందెము వేయు, ఎదుర్కొను, పేఱొకయుక్తి పన్ను.
ఎదురొత్తు-తిరిగినొక్కు, మాఱొత్తు
ఎదుర్కొను-ఎదురుకొను
ఎదుర్కొలుపు-ఎదురు కొలుపు
ఎదుర్కోలు = ఎదురుకోలు.
ఎదుర్చు-ఎదురుచు, ఎద్రుచు, ఎదిరించు.
ఎదుఱు = చూ. ఎదురు
ఎదుఱొమ్ము-ఱొమ్ము నడిమి చోటు
ఎద్దడి-ఇబ్బంది, కఱవు, లేమిడి, ఉఱక్కి.
ఎద్దడినేల-పట్టినేల, మరుభూమి, పుంజ.
ఎద్దము-పట్టె తీరిన యంచు.
ఎద్ది-ఎది, ఏది, ఏయది, ఎయ్యది.
ఎద్దు-గిత్త, గిబ్బ, ఆఁబోతు.
ఎద్దుకట్లలవంకెలు-ఒకదినుసు వడ్లు.
ఎద్దు కలువ = ఎద్దునాలుక +, బెండ +
ఎద్దుకొట్టు-ఎద్దు పట్టలు కొట్టు-పిడికొట్టు.
ఎద్దుతత్తడిజోదు(రౌతు) - శివుఁడు, నంది వాహనముగాఁ గలవాఁడు
ఎద్దునాలి(లు)క = బెండ +, గౌజుబాన్.
ఎద్దుపట్టు-చూ. ఎద్దుకొట్టు.
ఎద్దుముక్కుపాము-వానపాము.
ఎద్దుముట్టె-ఒకదుంప, ఎద్దుమూతి.
ఎద్దుమొద్దు(వాఁడు) = మోటు. మొఱకు
ఎద్దురాసి-వృషభరాశి. [డుట.
ఎద్దువేఁట-ఎద్దును మాటు చేసికొని వేఁటా
ఎద్దెస-ఏవైపు, ఎక్కడ, ఏదెస?
ఎద్దేవ-ఎగతాళి, పరియాచకము.
ఎద్రుచు = ఎదిరించు, ఎదుర్చు, ఎదురుచు.
ఎన-ఈడు, ఉద్ది, పోలిక, సాటి, అన్న. పురుషనామాంత్యపదము- ఉదా:-మాధెన.
ఎనఁబోలు-సాటియగు, ఉద్దియగు.
ఎనకరి-ఒకతెగకోయవాఁడు, ఏఁకరి, వేఁకరి.
ఎనఁగొను-పొందు, కలయు.
ఎనచు-ఎనుచు, కలియఁబెట్టు.
ఎనప-ఎనుముది [దించు
ఎనపు-ఎనుపు, కలిగించు, పోల్చు, పొం
ఎనఁ(బడి)బై-ఎనుబది, ఎన్మిదిపదులు.
ఎనమండుగురు | -ఎనిమిదిమంది, ఏడు
ఎనమండ్రు(రు) | నొకటిమంది.
ఎనమందుము - ఎనిమిది తూములకొలఁది, ఎన్మందుము.
ఎనమనూరు-ఱు = | ఎన్మిదినూర్లు, ఎనిమిది
ఎనమన్నూరు-ఱు | వందలు.
ఎనమలుపట్టు-తప్పులుపట్టు.

ఎనయగు-సాటివచ్చు, పోలు. [అతుకు.
ఎనయించు-కలుపు, కలిగించు, కాపించు,
ఎనయిక-పోలిక, ఒద్దిక, ఒమ్మిక.
ఎనయు - అగు, అత్తు, కలియు, కాయు, జరుగు, తాఁకు, పొందు.
ఎనలు-మెడలోతాల్చు బంగరుపూసలు.
ఎనవచ్చు-సరివచ్చు, పోలు.
ఎనవాయు-జోడువిడుచు, విడివడు.
ఎనవోలు-ఎనవచ్చు, సరిపోలు.
ఎనసేయు-సాటిచేయు, పోల్చు.
ఎని-ఎన్ని, ఎంతసంఖ్య గలవి ?
ఎనిక(కె)-లెక్క, 4 పోఁగుల దారము.
ఎనిపేటి-బఱ్ఱె, గేదె.
ఎనిమిదడుగుల మెకము } శరభమృగము,
ఎనిమిదికాళ్ల మెకము } అష్టపాత్తు.
ఎనిమిది = ఇరునాల్గు-దచ్చి,ఎన్మిది(త ఎట్టు)
ఎనిమిదికాళ్లరిక్క - పూర్వాభాద్ర ఉత్తరా భాద్రలకుఁగల ఎనిమిది పాదముల నక్షత్రము-భాద్రపద, ప్రోష్ఠపద*
ఎనిమిదికాళ్లరిక్కనెల-భాద్రపదమాసము.
ఎనియు-కలిసికొను, ముద్దయగు
ఎనుచు - కలియుఁబెట్టు, మెత్తగాఁజేయు, ఎనచు, ఎనుపు.
ఎనుపకదుపు-గేదెలమంద
ఎనుపతేలు-నల్లతేలు, ఇనుపతేలు
ఎనపమోఁకాలు-ఒక దినుసుచెట్టు.
ఎనుపసరము-బఱ్ఱె, ఎనుపెంటి.
ఎనుపు-గరిటెతో నొక్కికలుపు-ఎనపు.
ఎనుపుడు-ఎనుపట, కలుపుట
ఎనుపెంటి-ఎనుము, గేదె, బఱ్ఱె, మహిషి.

ఎనుపోతు-కారుపోతు, దుంత, దున్న.
ఎనుబండ్రు-ఎనుబదిమంది-అశీతి.
ఏనుబది-ఎన్మిదిపదులు-అశీతి. రూ. ఎన్పది.
ఎనుబదిమంది-ఎనుబండ్రు.
ఎనుమలు-బఱ్ఱెలు, గేదెలు.
ఎనుము-ఎన్ము ఎనుపెంటి,గేదె,బఱ్ఱె,మహిషి
ఎనెమ్మ-చూ. ఎన్నెమ్మ.
ఎన్నఁడు-ఏనాఁడు?, ఎప్పుడు?, ఎల్లప్పుడు.
ఎన్నవలుపెట్టు-మాటలతోవాపోయియేడ్చు.
ఎన్నాళ్లు-ఎన్నినాళ్లు, ఎన్నిదినములు.
ఎన్ని-ఎంత సంఖ్య కలవి ?, అన్ని, ఎని.
ఎన్నించు-ఎనుపు, మర్దించు.
ఎన్నిక-లెక్క, గడన. రూ. ఎనిక.
ఎన్నికకెక్కు-ప్రసిద్ధిచెందు.
ఎన్నికచేయు } ఎంచు, ఎన్నుకొను, లెక్కించు, ఊహించు.
ఎన్నికపెట్టు }
ఎన్నికమానిసి-పేరెక్కిన(ది)వాఁడు.
ఎన్నికమీఱు-పేరెక్కు, ప్రసిద్ధిచెందు.
ఎన్నికయిడు-ఎన్నికచేయు, ఎంచు, ఎన్ను.
ఎన్ను-ఎంచు, ఏఱుకొను, కొనియాడు, తలఁచు, తీసికొను, లెక్కపెట్టు, వెక్కిరించు, పన్నుగడ, పంటకదురు - కంకి, మగగుఱి, పొగరు.
ఎన్నుకొను-ఏఱుకొను, ఎంచు, కోరు.
ఎన్నువ-చనిపోయినవారినిగూర్చి ఏడ్చుచు పాటవలె పాడెడు చరిత్రము.
ఎన్నెమ-మ్మ = పురిటిలో పురుగు రూపమున వచ్చి పిల్లలను పీడించు భూతము.
ఎన్నెనిమార్లు-ఎం(పెక్కు)మార్లు, పేమాఱు.
ఎన్ను(ట)డు-ఎనుపుడు, కలియఁబెట్టుట.

ఎన్పోతు-ఎనుబోతు, దుంత, దున్న.
ఎన్మంద్రు-రు = ఎనమండుగురు
ఎపుడు(డు)-ఎ(ల్ల)ప్పుడు, ఎన్నఁడు.
ఎప్పగిది-ఏలాగున, ఏరీతి, ఏపగిది.
ఎప్పటి-ఎప్పటివలె, అప్పటి, మరల.
ఎప్పటికప్పుడు-వెంటవెంట నే,ఎల్లప్పుడును
ఎప్పటికి-ఏవేళకు, ఎల్లప్పుడు, ఎన్నఁడు.
ఎప్పాటన్-ఏపగిది, ఏలాగున.
ఎప్పుడు-ఎపుడు, ఏప్రొద్దు, ఎల్లప్పుడు.
ఎప్పు డెప్పుడను-ఉబలాటపడు.
ఎప్పవేయు / ఎప్పేయు -చేమిరివేయు, తోడుపెటు.
ఎబ్బె-రోఁత, ఏమియు లేదనుట
ఎబ్బెట్టు-మిక్కిలిరోఁత, ఎబ్బెటికము.
ఎబ్బెర-ఒకానొక పులుఁగు [వాఁడు.
ఎబ్బెరాసి-ఏభ్యరాశి = రోఁతపుట్టించు(నది)
ఎబ్బెరి(టి)కము-రోఁత, ఏవ, సిగ్గు
ఎబ్రాసి-రోఁతకలవాఁడు, ఎబ్బెరాసి.
ఎమకు-నెమకు, వెదకు, వెతకు.
ఎమికె = ఎముక, ఎమ్ముక, బొమిక.
ఎమిడిక - నలిపురుగు, వానపాము-ఎఱ్ఱ.
ఎముక = ఎమికె, ఎమ్మ, ఎమ్ముక.
ఎముక ఒలియు-ఎముక గట్టిపడు.
ఎముకయ్యాట-ఎమ్మ్యాట, నెనడు.
ఎముకల(పోగు)వట్టు - అస్థిరాశి, బక్క-చిక్కిన(ది)వాఁడు.
ఎముకలేఱు-చంపు, చక్కాడు.
ఎమ్మలు-ఎనుమలు, బఱ్ఱెలు, గేదెలు.
ఎమ్మిక-చెలిమి, ఒమ్మిక, ఒండొరుమిక.
ఎమ్ము(క)-ఎముక, ఎమికె ; టెంక.

ఎమ్మ్యాట = ఎముకయాట-మూలగ.
ఎమ్మె-హొయలు, గర్వము, ప్రీతి.
ఎమ్మెకాఁడు-అందగాఁడు, ఒయారికాఁడు.
ఎమ్మెలాఁడి-టక్కులాఁడి, ఒయ్యారి.
ఎమ్మెలు పచరించు-వగలు పోవు
ఎమ్మెలుసెప్పు-నిరాడంబరముగాఁజెప్పు
ఎయిదించు-ఎఱిఁగించు, తెలుపు
ఎయిదు-వెన్నాడు, ఒప్పు, లగు, సాగు, చేరు, పొందు, వీలుపడు, వెడలు-ఎద్దు
ఎయుదు(య్దు)-పోవు, వచ్చు, ఎగురు
ఎయ్య(య్యె)ది-ఏయది, ఏది, ఎద్ది, ఎవి ?
ఎయ్యవి-ఏయవి, ఏవి, ఎవ్వి, ఎవి,
ఎయ్యెడన్ ఏయెడ ఎక్కడ, ఏడ, ఏచోటు
ఎర-తిండి; కుడుపు, ఆఁకలి, చెడ్డఅలవాటు
ఎరఁగు-ఎఱఁగు, ఒగి, దూఁకు, మ్రొక్కు
ఎరఁగుడు-ఎఱఁగుడు, మ్రొక్కు, నతి
ఎరగద్యాణము-ఒక దినుసు నాణెము
ఎరగలి(చిచ్చు)-కార్చిచ్చు, దావాగ్ని, నిప్పు
ఎరగలిపడు-కాల్చివేయు.
ఎరగొను-ఆఁకలికొను, మత్తిలు, మ్రింగు
ఎరచిల్ల-ఒక చిన్న సీటిపుర్వు
ఎరమరికము-అరమరలేకుండుట.
ఎరయు కాలు, మండు, ఏడ్చు.
ఎరలు-వేఁడెక్కు, తపించు.
ఎరవలి-ఎరవు(అరుపు)సొమ్ము - ఎరగలి.
ఎరవలి(చిచ్చు)-దావాగ్ని, కార్చిచ్చు.
ఎరవఱలువోను-కార్చిచ్చుచే తగులఁబడు.
ఎర(విచ్చు)సీ ఎ-అప్పు ఇచ్చు
ఎరవు-వెలమలు, తేడా, పరాయి,అస్థిరము, తగులాటము లేనివాఁడు.

ఎరవుతీయు-అప్పుచేయు, అప్పుపొందుము.
ఎరవుపడు-వేఱుపడు, జగడమాడు.
ఎరవుసేయు-వేఱుగాఁదలఁచు, ఊరకుండు
ఎరవెట్టు-మోహపెట్టు, బలియిచ్చు
ఎరవేయు-లంచమిచ్చు, బలియిచ్చు.
ఎరసేయు-బలియిచ్చు, ఆహుతిచేయు,
ఎరియఁబెట్టు-కాల్చు, చెఱచు, పండించు.
ఎరియించు-కాల్చు, చంపు, దాహించు.
ఎరియు-మండు, చెడు, కాఁగు-ఉరియు.
ఎరిపు-బాధ, గొంతెపెంట, ఎండినఆవుపేఁడ,
ఎరువు-గత్తము
ఎరివు-బాధ, తాపము, ఎరివి, ఎరువు
ఎరుహారము-తియ్యని బియ్యపు అట్టు
ఎరువంటి-పంజె_, గంటు దారంగి +
ఎరువాటు-ఎరువు వేయుట, పెంట
ఎరువు-ఎరివి, పశువులు త్రొక్కిన(పేఁడ)
పెంట, బాధ, నలుగుపిండి.
ఎరువులు-ఇతరులు, పరాయివాండ్రు
ఎరుస-ఒక బంగరు నాణెము-దీనారము.
ఎఱుసు-ఈర్ష్య = అసూయ, ఎండఁబెట్టు.
గుణకారిపులెక్కలు రూ ఈసు,
ఎర్వోక _ ఏరువాక.
ఎఱ (అరుణ)వానపాము, ధర్మము, తింతి.
ఎఱుపు, ఎఱ్ఱనిది-రూ ఎఱ్ఱ.
ఎఱఁగిపోనుండు-ఎక్కిపోనుండు.
ఎఱఁగివచ్చు-దిగివచ్చు. [ద్రావు, వ్రాలు,
ఎఱఁగు-మ్రొక్కు, ఉఱుకు, దిగు, డిగఁ
ఎఱఁగుడు-ఎరఁగుడు-మ్రొక్కుడు.
ఎఱక-ఈఁక, ఱెక్క, జేకు, ఎముక, జబ్బ.
ఎఱగందు-నెత్తురుకందు, పసిపాప.

ఎఱగడ్డ-నీరుల్లిపాయ-యవనేష్ట.
ఎఱగన్ను-ఎఱ్ఱనికన్ను, నిప్పుకన్ను.
ఎఱగొను-పాము బరిపైనుండు, కోపించు.
ఎఱ్ఱవాలు.
ఎఱగొయ్యి-పనికిరాని గడ్డి
ఎఱచి-మాంసము, పొలసు-పొల్లు [రక్కసి.
ఎఱచితిండి-మాంసము తినువాఁడు, బోయ,
ఎఱచిపిడిక-కట్లతీఁగ, కిట్లీయ + .
ఎఱచిపేపరి-బోయ, టిక్క(సి)సుఁడు.
ఎఱదాలు-ఒకజాతిపక్షి
ఎఱపు-భంగమొనర్చు, నాశనముచేయు.
ఎఱబఱుపు-రోఁత, తేడా, అసహ్యము.
ఎఱబఱికము-రోఁత-అసహరిక, రూ. ఎంబె
టికము, ఎబ్బెటికము.
ఎఱమంట-నిండుమంట, దీప్తజ్వాల.
ఎఱమట్టి-ఎఱ్ఱమన్ను, జేగురు.
ఎఱయు-వేఁడెక్కు, వెట్టమగు
ఎఱయుట-సేన అంతట వ్యాపించుట.
ఎఱపట్టము-శ్రేష్ఠత, గొప్పతనము.
ఎఱసంజ-సంధ్య = సాయం సంధ్య.
ఎఱసీమము-నల్లరేగడినేల.
ఎఱసేయు-ఎఱవేయు, ఉపేక్షించు.
ఎఱాయు-పోరొనర్చు, చచ్చు
ఎఱికెత-ఎఱుకత, బోయత.
ఎఱిఁగించు-చెప్పు, తెలుపు, నేర్పు.
ఎఱుఁగమి-తెలియమి, తెల్పిలేమి.
ఎఱుఁగు-తెలియు, నేర్చు, అనుభవించు.
ఎఱుక-(క. అఱికె) ఆనవాలు, ఎఱుఁగుట.
జ్ఞోస్యము, తెలివి, పరిచయము, సోడె,
చెలిమి, మెలఁకువ, ఒకతెగకోయ-ఎఱికె.

ఎఱుకచేయు-గుర్తుకుతెచ్చు. తెలుపు.
ఎఱుకత-సోదె చెప్పునది, ఎఱుకవాని పెండ్లాము-ఎఱుకలసాని. రూ. ఎ(ఱి)ఱుకెత.
ఎఱుకపడు-తెలియు, వెల్లడియగు.
ఎఱుకపఱచు-తెలుపు, వెల్లడించు.
ఎఱుక(ల)సాని-ఎఱుకత, దైవజ్ఞ.
ఎఱుక(ల)వాఁడు-బోయ. కోయ, చెంచు.
ఎఱుకవట్టు-గుర్తెఱుఁగు, తెలియు.
ఎఱుకవెట్టు-గుర్తుకుతెచ్చు, ఎక్కువగాతెల్పు.
ఎఱుకవ్రాలు-సాక్షియొక్క సంతకము.
ఎఱుకు-బోయ. కోయ, కిరాతుఁడు.
ఎఱుకులవాఁడు-బోయ, కోయ, చెంచు.
ఎఱుకువ-తెలివి, కూరిమి, ఎఱుక.
ఎఱుకువదప్పు-తెలివితప్పు, సొమ్మసిలు.
ఎఱుకెత-బోయత, కోయత, చెంచసి.
ఎఱుపు-(అరుణః) = ఎఱ్ఱన, నెత్తురు.
ఎఱుపులు-నిప్పులు, కండ్లకలకలు
ఎఱుమటము-ప్రధానమైన మరము
ఎఱెము-బిచ్చము, తిరిపె(ప)ము.
ఎ(ఱ)ఱ్ఱ-ఎఱుపు, నెత్తురు, వానపాము.
ఎఱ్ఱఅత్తపత్తి-విశ్వగ్రంధి +, హంసపాది.
ఎఱ్ఱఅనుములు-రక్తనిష్పావము.
ఎఱ్ఱఉత్తరేను-దుగ్ధినిక, ఆఖుభుక్కు.
ఎఱ్ఱఉలవ-కాకవృంత-అనిలాపహ.
ఎఱ్ఱఁదనము-ఎఱుపు, రక్తిమ.
ఎఱ్ఱకంబళి-ఏన్గుమీఁది ఆస్తర(ణ)ము.
ఎఱ్ఱక(లువ)ల్వ-చెంగల్వ, చెందొగ.
ఎఱ్ఱకాంచనము-అల్పకేసరము +
ఎఱ్ఱకాలువ(ల్వ)-ముళికికాలువ
ఎఱ్ఱకా(చ)సర-కాకశింబి + కాశాదని +.

ఎఱ్ఱకిత్తలి-ఈ(డ)డె + -చిన్ననారింజ.
ఎఱ్ఱగందము-రక్త(కు)చందనము.
ఎఱ్ఱగడ్డ-నీరుల్లి, పలాండువు-ఎఱగడ్డ.
ఎఱ్ఱగన్నేరు-రక్తకరవీరము*, చండకము,
ఎఱ్ఱగరువు-జేగురు(ఎఱ్ఱమట్టి) నేల-తువరిక
ఎఱ్ఱగలిజేరు-రక్తపునర్నవ +.
ఎఱ్ఱగలువ-రక్తోత్పలము, చెంగల్వ.
ఎఱ్ఱగిసె-అవిసి +, అతసి +, లాలసి +.
ఎఱ్ఱగురి(జ)వెంద-గుంజ-రక్తిక +
ఎఱ్ఱగొల్ల-ఎఱ్ఱగానుండు ఒకజాతి గొల్ల.
ఎఱ్ఱగోరఁట-రక్తకురివకము +
ఎఱ్ఱచంద్ర-క్షతక్షమము +
ఎఱ్ఱచిత్రమూలము-ద్వయాగ్ని +.
ఎఱ్ఱచీమ-కొఱవిచీమ, రక్తపిలీలిక.
ఎఱ్ఱచెఱకు-రక్తేక్షువు +
ఎఱ్ఱచేమంతి-రక్తసేవంతిక +
ఎఱ్ఱజిగిదన్ను-ఎఱ్ఱవాఱు, కోపించు.
ఎఱ్ఱజెఱ్ఱి-కాళ్ళజెఱ్ఱి-ఆధారిక.
ఎఱ్ఱజొన్న-రక్తజూర్ణము +.
ఎఱ్ఱతంటెము-తువరీశింబము +
ఎఱ్ఱతామర-కెందమ్మి, చెందమ్మి +
ఎఱ్ఱతుమ్మ-రక్తారిమేదము +
ఎఱ్ఱతుమ్మి-రక్తతుంబి + -ఎఱ్ఱనితుమ్మికూర.
ఎఱ్ఱతుమ్మెద-కంచుఁరేఁగ-గంధోలి.
ఎఱ్ఱతెగడ-రక్తత్రివృత +, కాకిదొండ +
ఎఱ్ఱతొలపి-అస్రార్జుకము +
ఎఱ్ఱతోఁటకూర-రక్తమారిషము +
ఎఱ్ఱదామర-కెందమ్మి, చెందమ్మి.
ఎఱ్ఱదాసనము-ఎఱ్ఱమందార +.
ఎఱ్ఱది-ఎఱ్ఱనిది, ఎఱ్ఱ.

ఎఱ్ఱదుంప-చిరుగడదుంప, పిండాలువు.
ఎఱ్ఱన(అరుణః)=ఎఱుపు, ఎఱ్ఱ(నిది).
ఎఱ్ఱనగు-ఎఱ్ఱవాఱు, కోపించు.
ఎఱ్ఱనిది-రక్తవర్ణముకలది, ఎఱ్ఱది.
ఎఱ్ఱనివేల్పు-అగ్ని,సూర్యుఁడు,అరుణుఁడు.
ఎఱ్ఱనీరుల్లి-రక్తపలాండువు,రాజేష్టము.
ఎఱ్ఱపగడ-కట్టుతాడి+, దావరడంగి+
ఎఱ్ఱపల్లేరు- రక్తగోక్షురము+
ఎఱ్ఱపులుము-రక్తకుష్ఠము, పెద్దరోగము.
ఎఱ్ఱపెంజెర-ఒక జాతిపాము.
ఎఱ్ఱపెండలము-రక్తపిండాలువు+
ఎఱ్ఱపోతమ్మ-ఒక గ్రామదేవత.
ఎఱ్ఱపోల్కి-ఒక దినుసు చెట్టు.
ఎఱ్ఱప్రత్తి-రక్తకార్పాసము+
ఎఱ్ఱబచ్చలి-రాచబచ్చలి, రక్తకలంబి+
ఎఱ్ఱబుడమలు-కలమ అను వడ్లు.
ఎఱ్ఱమ(ట్టి)న్ను-జేగుఱు-తువరిక.
ఎఱ్ఱమల్లె-రక్తమల్లిక+, ముమండ+
ఎఱ్ఱమిర్చి-కుమరిచము, ఉజ్జ్వల+
ఎఱ్ఱమీను-ఎఱ్ఱచేఁప, రోహితము.
ఎఱ్ఱము-కంప తొడుగు, ఊఁచ, ఈడిక.
ఎఱ్ఱమున(ను)గ-తీమునగ-రక్తశిగ్రువు.
ఎఱ్ఱముల్లంగి-గాజరగడ్డ, గృంజనము.
ఎఱ్ఱయుల్లి-ఎఱ్ఱగడ్డ, ఎఱ్ఱనీరుల్లి.
ఎఱ్ఱరాజనాలు-ఒక దినుసు వడ్లు
ఎఱ్ఱలాజవంతి-అలసేలుక+
ఎఱ్ఱలొద్దుగ-గు=పట్టికాలోధ్రము.
ఎఱ్ఱవంకాయ-సీమవంకాయ, టొమాటో.
ఎఱ్ఱవస-రక్తవచ+, దోషఘ్న+
ఎఱ్ఱవాఱు-ఎఱ్ఱనగు, కోపించు.
ఎఱ్ఱవిష్ణుక్రాంత-అపరాజిత+
ఎఱ్ఱవెల్లుల్లి-స్థూలకందము+
ఎఱ్ఱవేయు-ఎరవేయు, బలియిచ్చు.
ఎఱ్ఱాముదపుచెట్టు-రక్తోరుబుకము, హస్తిపర్ణి
ఎఱ్ఱింత-తుంగ+, ముస్తె+
ఎఱ్ఱిచెఱకు-వెఱ్ఱిచెఱకు+, ఒకజాతి తెల్లు.
ఎఱ్ఱిపుచ్చకాయ-వెఱ్ఱిపుచ్చ-పాపటకాయ.
ఎఱ్ఱిబాగులు-అమాయికుఁడు, వెఱ్ఱిబాగులు.
ఎఱ్ఱిసందు-బాలగ్రహసంధి. [విరళి.
ఎలంబరము - విశాలము, విరివి, వెడల్పు,
ఎల-చిన్నది, లేఁతది, క్రొత్తది, ఎడమది, సాక్షియైనది, కొలఁదిగా, ఆకు.
ఎలగోల చూపు-మొదటి చూపు.
ఎలగోలు-మొదటి(పని)సేన,మొదటిపోరు, కోలాహలము, ఘోరము, ముందఱిది.
ఎలగోలు జల్లు-మొదటి వానజల్లు.
ఎలచిపండు-రేఁ(గు)పండు-బదరీఫలము.
ఎలజవ్వని-లేజవ్వని, ఎలనాఁగ.
ఎలదాయరక్కసుఁడు - వైరులపట్ల రక్కసునివలె భీతి గొల్పువాఁడు.
ఎలదాయసింగఁడు - వైరులపట్ల సింగము వంటివాఁడు, ఒక బిరుదము.
ఎలదోఁట-పూలతోఁట, ఆరామము.
ఎలనవ్వు-చిఱునవ్వు, లేఁతనవ్వు.
ఎలనాఁగ-సింగారి, లేజవ్వని.
ఎల(ళ)నీరు-లేఁతకొబ్బరినీరు.
ఎలపము-ఎలమి, చెలిమి, కూరిమి.
ఎలపాది-అందఱు, అంతా, ఎల్లవారు.
ఎలపొర-చిగురు-లేఁతయాకు-అంకురము.
ఎలమావి-తియ్యమామిడి+,సహకారము.

ఓయి-హో = పిలుపు. ఓరి, ఓ, ఒయి.

ఓయిరము-ఆహార = కూడు, ఓగి(వి)రము

ఓయీ = ఒయీ, ఓయి. ఓరి. ఓరీ.

ఓయు = చూ. రూ పోయు.

ఓర-అంచు. మేర. హద్దు. ప్రక్క, ఇరుగు, క్రిందిచూపు. గట్టు; (హోరా = అహో రాత్రము). ఎల్లప్పుడు, అడ్డుగా నున్నది. పెడ యైనది. తొలఁగినది. కొంచెము మూయఁబడినది. అడ్డుగా.

ఓరంతప్రొద్దు-రేయుంబగళ్ళు, చాలకాలము

ఓరక(గ)న్ను-కడకంటిచూపు. కడకన్ను.

ఓరకుండు-కడకేగు. ముట్టగు.

ఓరకొప్పు-ఓరసిగ. వంకకొప్పు

ఓరగచ్చ-ప్రక్కకుత్రోసి బిగించిన గోచి.

ఓరగట్టు-ఎదిరి, పోటివాఁడు

ఓరగించు-ఒకవైపునకు వంచు, త్రిప్పు, నిరసించు, విడుచు-ఓఱగించు.

ఓరగి(లు)ల్లు = తొలఁగు, వ్రాలు. ఓరసిల్లు

ఓరచూపు-ఓరకన్ను. ప్రక్కచూపు

ఒరచ్చులు } గుదికాలుఉంచుచోట అట్టలు
ఓరట్టచెప్పులు } వేసికుట్టిన చెప్పులు-ఒంటి యట్ట చెప్పులు.

ఓరడి-పగ. పట్టుదల. తేడా. వార

ఓరణము-ఒకజాతిడేగ-ఓశడము

ఓరతలపాగ-ఒఱఁగుపాఁగ. వఁకపాఁగ.

ఒరపడు-ప్రక్కకొరగు, వంగు

ఓరపాక-గోడపైనుండి ఓరగా వేసిన పాక-దోరిపాక, మోరపాక.

ఓరిపా(బా)టు-ఒరిగుట. తేడా. [పాట్లు.

ఓరివారి(లు)ము-హెచ్చు తగ్గులు. లోటు

ఓరపుచ్చు-ప్రక్కకుఁద్రిప్పు.

ఓరమోము-పెడమొగము, విముఖత.

ఓరలవచ్చు-అంచుల నంటివచ్చు.

ఓరల్దిద్దు-వంకలు (తప్పులు) పట్టు.

ఓరవలి-కరకంచుచీర. వన్నెలచీర.

ఓరవాకిలి-సగము తెఱచిన గుమ్మము.

ఓరపుచ్చు-ప్రక్కకుఁద్రిప్పు

ఓరవోవు-ఒఱగు, తొలఁగు, వంగు

ఓరసించు-(అపసర)తొలఁగు, తప్పుకొను

ఓరసింపు-ఓరపాటు. పెడత్రిప్పు

ఓరపి(ఱ)ల్లు-ఒరగు, తొలఁగు, ముగించు.

ఓరసేయు-ప్రక్కకువంచు, అంచుకట్టు.

ఓరి(రీ)-హేరే = ఒరే(య్), ఓయి.

ఓరిమి-ఓర్చుట ఓర్పు. ఓర్మి. తాల్మి.

ఓరు-ఉరుః = గాలివప్పుడు. ఇంటిగోడలకు అనుగులకు తీర్చిదిద్దెడు జేగురుమట్టి పట్టె, పెద్దవప్పుడు, పెద్దది

ఓరుఁగల్లు-వరంగల్లు. ఒంటిమెట్ట

ఓరుగాలి-తుపాను(హోరు)గాలి, పోరుగాలి

ఓరుచు-ఓపు. ఓడించు. పూను. తాళు.

ఓరుచుట-ఓర్చుట, సైఁచుట. తాళుట.

ఓరుతీయు-జేగురుమట్టి పట్టెలుగాతీర్చు

ఓరుపరి-ఓర్చువాఁడు, ఓర్పరి

ఓరుపు-ఓర్చుట. ఓర్పు. ఓరిమి, తాళిక.

ఓరువమి-ఒల్లమి, అసూయ, రూ, ఓర్వమి

ఓరెడ్డెము-ఎగతాళి. ఎకసెక్కెము. [రము

ఓరెము-ఆహారః = కూడు. ఓగి (యి-వి)

ఓర్కు-నీళ్లపాఱుటవలన నేర్పడిన గండి. రూ ఓ[illegible] ఓకిక ఓకికె.

ఓర్త-ర్తి } ఏక = ఒకతె, వేఱొక
ఓర్తు-క(త్తె) } యాఁడుది, ఒకరియాఁడుది.

ఓర్పరి-ఓరుపరి, ఓరిమికాఁడు.
ఓర్పు = ఓరుపు, గెఱపు ఓర్మి. సైరణ.
ఓర్మి = ఓరిమి, తాలిమి, తాళిక.
ఓర్వమి = చూ ఓరువమి.
ఓర్వనివాఁడు-అసహనుఁడు-ఈర్ష్యాళువు.
ఓఱగిలు-ల్లు-ఒఱగు, వంగు, వ్రాలు.
ఓఱు-చప్పుడు, అలికిడి-రూ. హోరు
ఓల (ఓలమ్)జలక్రీడయందు ఉత్సాహము నకై (ఓల ఓల యని) పలుకు పదము-సీరాట, ఓటమి, నెపము
ఓలంబుగొను-మరుగు చేసికొను.
ఓలగందము-పూఁత (చాయ) పసుపు
ఓలగమగు-ఓలగముండు, కొల్వుతీర్చు
ఓలగము-కొల్వుకూటము, కొలువు.
ఓలగముంచు-కొలుచు, సేవించు.
ఓలగముండు-కొలువు తీర్చియుండు.
ఓలగించు-కొలుచు, గుట్టును జేరు.
ఓలచెంగనాలు = ఓల, ఓటమి
ఓలపాటి సన్నములు-జీలకఱసన్నములు.
ఓలపెట్టు-కేకవేయు, కేరించు
ఓలమానగొను-దాఁగు, జంకు, పాఱు
ఓల(మి)ము-మేను, చాటు. తేడా కొంకు, దాఁపఱికము, మద్దత్తు, మొదటిసొమ్ము. లోఁతైన, చాటైన జంకిన, అసలు
ఓలముకొను-జంకు, కొంకు. చాటగు.
ఓలము చొచ్చు-దాఁగు. వెనుదీయు.
ఓలలనాడు-ఈఁదు, ఓల ఓల యనుచు. జలక్రీడలాడు, రూ, ఓలాడు. ఓలలాడు,
ఓలలాట-జలక్రీడ, ఈఁత, ఓలాట.
ఓలలాడు = ఈఁదు, జలక్రీడలాడు.
ఓలలా(రుచు)ర్చు-జలక్రీడ లాడించు.
ఓలాకు-బదలిక, చికాకు.
ఓలాకుపడు-కలఁగు. కదలు. అలయు.
ఓలాట-ఓలలాట. ఈఁత, జలక్రీడ.
ఓలాడు = ఓలలాడు, జలక్రీడలాడు.
ఓలి-ఉంకువ కన్యాశుల్కము (ఆళిః)వరుస
ఓలించు-పాలించు ఓము, కాపాడు.
ఓలిపుట్టలు-పుట్టల వరుస
ఓలిపాట కుప్ప నూర్చిడియందు పాడెడు ఏలపాట, వొలిపాట
ఓలిమి-చాటు, ఎడఁబాటు, అడ్డపాటు.
ఓలిగొను-కన్నెకు వెల తీసికొను.
ఓళిగ-హోలికా = ఒబ్బట్లు, బొబ్బట్లు.
ఓవమ-మా, ఓదము
ఓవరి-పడకటిల్లు-శయనాగారము, అఱ.
ఓవరి-(అపవరికః) లోపలిగది. ఉంతిపురి,
ఓవసాంబ-ఒకతెగ సన్నవడ్లు [బుడ్డ.
ఓవిరము = (ఆహోరిః) ఓ (గి) యిరము
ఓవు-తగు. సరిపడు. రూ. ఒవ్వు కోసిన వరిపన-ఓదె
ఓసట-ఓసరింత, ఓసరింపు
ఓసడిలు-ల్లు = తగ్గు తొలఁగు, తూలు, చేరు.
ఓసరించు-జరగు, వంగు, తొలఁగు.
ఓసరిం(త)పు-అపసర = తొలగుట,
ఓసరి(లు)ల్లు | (అపసృ) తొలఁగు, తగ్గు,
ఓసరు | వంగు, చేరు, ఒఱగు.
ఓసి(సీ)-ఒసి-సీ, ఒసే(య్)
ఓసినోటివాఁడు-వట్టిమాట లాడువాఁడు.
ఓహటము-జంకు, కొంకు, ఓటమి.
ఓహటించు } ఓడు, జంకు, కొంకు. బడలు,
ఓహటిలు-ల్లు } కలసిపోవు.

ఓహరి-నేనుగొప్ప నేనుముందనుఆవేశము.
ఓహరిసాహరి-ఉయ్యాల చేరువలె ముందు వెనుకలుగా పెనఁగుట, గుంపులుగుంపులుగా, అహంకారముతో-అహమహమిక.
ఓహరిసాహరియగు-ఎడములేక యుండు
ఓహో (హో)-అహో ! సంబోధనము.
ఓహోరె(రే)-అహోరే = బళి !, సెబాసు.
ఓహో(హో)హో-అహో ! బళి !
ఓళిగలు-పోళీలు, ఒబ్బట్లు, బొబ్బట్లు.

## ఔ

ఔ-ఒక అక్షరము. అగు, అవు. అట్లే.
ఔఁగదే-ఔరా! అహహ, అవుఁగదే!ఆహా!
ఔఁగా-అవుఁగా, సమ్మతి
ఔఁగా(క)త-అట్లే కానిమ్ము. అగుఁగాక.
ఔఁగాదను-అవును కాదని విమర్శించు
ఔఁగాములు-అగుటయు కాకుండుటయు.
ఔఁగు-ఒకానొక భక్ష్యము-రూ అవుఁగు.
ఔఁబొమ్మ-సమ్మతి, నిశ్చయము, సరే
ఔకాఁపు అద్దెహాఁపురము-రూ అవుకాఁపు
ఔకు-అవుకు, జంకు లోటు. గట్టితనము లేనిది, స్థిరముకానిది
ఔఘళము-పెంపు-అవఘళము
ఔఘళించు-ఓడించు, చలించు
ఔకు-కాలువ,ఋరద,దిగుడుబావి,పనివాఁడు
ఔటము-ఏనుగులు పుట్టుతావు.
ఔట-అగుట, అవుట
ఔటు-ఒక ప్రేలుడు దినుసు
ఔటుగుంటు-చిన్నఫిరంగి గుండు
ఔడు-ఓష్ఠ - పెదవి, పంతము. రూ.అవుడు
ఔడుకొను-పంటకు పాలుగ్గైకొను.
ఔడు(కొట్టు)గఱచు-పెదవికొఱుకు.
ఔడుమాయు-పెదవిదాటు, నీరుజాఱు.
ఔతారము-లేనిపోని చేష్టలు.
ఔదఖానా-స్నానపు(గది)తొట్టి
ఔఁదరి-కాలువ, ఔఁదు, ఔఁజు
ఔఁదల-నడితల, ముందల, అవుఁదల.
ఔఁదలఁదన్ను-తలఁదన్ను, మించు
ఔఁదలఁదాల్చు-తలఁదాల్చు
ఔఁదు-దిగుడుబావి, కాలువ, రూ ఔఁజు
ఔదెంచు-అగుదెంచు. అగు
ఔనటే-అవునటే, ఏమే, అగునా ?
ఔనను-మెచ్చుకొను, సమ్మతించు [వవట.
ఔనప్ప-అన్నిటికి ఔనని ఊకొట్టువాఁడు,
ఔను-అవును, సమ్మతి ఒప్పుకోలు.
ఔ(న)నే-ఏమే, ఔనటే, ఔనా ? అవునే
ఔనొఁగదే-అగునుగదా ! ఔఁగదే
ఔ(నౌ)నే-అవునే ! భార్యా సంబోధనము.
ఔనౌను-అవులే, ఔలెమ్మ.
ఔబలము-ఒకానొక మల్లక్రియ
ఔర(రా)-అవుర-రా, అగుర-రా, ఆహా !
ఔరు-అవురుగడ్డి-వీరణము +, అగురు
ఔరుసవు(సౌ)రు-నలిగినది. డస్సినది.
ఔరుసొ(సు)రుపడు-తగ్గు, కృశించు.
ఔరౌర-రా = ఆహా అవురా !
ఔల-అక్కడ. పిదప రూ.ఆవ(వు)ల.
ఔఁగౌఁ-కౌఁగించు. విస్మించు.
ఔలు-ఉండు, రాలు. రూ అవులు, అగులు.
ఔలెమ్మ-అవులెమ్మ, ఔనౌను.

ఔలే-అవులే, అవులెమ్మ. ఔనులే.
ఔసలి-అగసాలి-కంసాలి, రూ. అవుసలి.
ఔసు-(వయస్)= ఒయారము సోయగము రూ. అవుసు, హవుసు, హౌసు.
ఔసుకత్తియ-త్తె= సొగసుకత్తె-ఒయారి.
ఔసుకాఁడు-వయస్వి= అందగాఁడు, సీటుకాఁడు. రూ.హౌసుకాఁడు,అవుసుకాఁడు.

# క

కంక - గడ్డిదుబ్బులు సఱకెడు పనిముట్టు. వెసరు.
కంకటి-ఖట్వా= మంచము, కత్తి.కంగటి,
కంకటిలు-ల్లు =ఎక్కిళ్లు వచ్చునట్లేడ్చు బెదరు.
కంక(అము)డాయి-ఒకనీటిపిట్ట, రాబందు.
కంకిణముగట్టు-దీక్షవహించు
కంకర-కర్కర= మొఱపడాయి. కఱకు, డాసున్నము. రూ కంకరి
కంకరగాడిద-గుఱ్ఱమునకు గాడిదకుఁ గల్గిన సంతతి-కంచరగాడిద, అశ్వతరము
కంకరతల మొద్దుబుఱ్ఱ, అజ్ఞాని.
కంకర నేల-మొఱపడాతి నేల.
కంకరము-నీళ్లుకలిసిన మజ్జిగ.కుచ్చితము.
కంకరి-సున్నము, డాసున్నము
కంకి-వరివెన్ను, జొన్నవెన్ను-కంకెర
కంకిగాడ-జొన్నదంటు-నీయంచ
కంకిగుండు-గింజలురాల్చు డాతిగుండు
కంకిజల్ల-కంకులుపోసెడు పొణక.
కంకిదఱె-కంకులు నెరపెడు పనిముట్టు.
కంకినోరు-వికారమగు మొగము.
కంకిపడుకు-కంకులు నెరపిన కళ్లము
కంకిపుత్తడి-ఒక దినుసు ఓషధి.
కంకిపురుగు-జొన్నచేఁకు పట్టెడు పురు.
కంకిపొ(ణ)నక-మా. కంకిజల్ల.
కంకిబొడ్డె-చిన్నకంకి, చిన్నవెన్ను.
కంకిమండె-కంకుల కుప్ప.
కంకు-కసరు, గద్దించు, తిట్టు.
కంకుడు-గద్దింపు, ఎగురవేఁత, తిట్టు.
కంకుడుకాయ-పిల్లల ఆటవస్తువు.
కంకులుపెట్టు-గద్దించు, చివాట్లుపెట్టు.
కంకెన(ర)జొన్న-(వరి)కంకి. సజ్జవెన్ను.
కంకెడు-కమికెడు
కంకెపేయు-పైరు పంటకారుకు వచ్చు.
కంకేళ్లు-కంకులు, గగ్గులు.
కంకోట్టము-కొఱుకరాని కొయ్య
కంఖాణము-ఆఫ్గన్ స్థానపు గుఱ్ఱము.
కంగటి-ఖట్వా మంచము, రూ కంకటి.
కంగటివాళ్లు దొడ్డికాళ్లు పంగటికాళ్లు
కంగరు-ఒక తెగ పిచ్చెన, నిశ్శ్రేణి
కంగలు-వేపిన శనగలు.
కంగవ-చోటు. నెలవు. కందువు, ఇక్క.
కంగాణము-కళ్లమందలి కావలి.
కంగాబంగా-సలిఁగి నలఁగనట్లు.
కంగారి(రు)-ఒకజంతువు, కలఁత, పోరు.
కంగారుపడు-గాబరాపడు, కలఁగు.
కంగాలు-చెడినది, నీచము
కంగాళము-పెద్దవాన, పెద్దనీళ్లకొప్పెర.
కంగాళి-తడఁబాటు. కల్తి, అల్లరి.
కంగాళివేయు-కంగారుపెట్టు, లోతుపాతులు తెలిసికొను.

కంగించు-గుట్టు బైటికి లాగయత్నించు.
కంగిస-కయ్యము, కలను, కలహము.
కంగు-కగ్గు,కాల్పుచే మెఱుగెక్కు,జరీకన్ను.
ఉగ్గు, ఒక మ్రోఁతకు అనుకరణము.
కంగుకంగు-కంచు మొ॥వాని మ్రోఁత.
కంగులు-కొఱ్ఱలు, పీత తండులములు.
కంగొనబాఱు-అలముకొను, విస్తరిల్లు
కంగోరు-విడుపుకాసె, లంగోటీ.
కంగోరుపావడ-పెద్దకుచ్చులగాగర, పరికిణీ
కంచి-కాంచీ = మోక్షపురి పెద్దకంచె
కంచిగరుడసేవ-మిక్కిలి కష్టమైన సేవ.
కంచిమేఁక-పెద్ద పొదుగుగల పొట్టిమేఁక.
కంచియ - చె = పొలముచుట్టు ఏర్పఱచిన ముండ్లకంప, వెదుఁగు, బీటినేల.
కంచెకోట-కోటచుట్టు ఏర్పఱచిన ఆవరణము-కాట్రగడ, కో॥డి
కంచెగడ్డి-చేనునందలి కలుపుమొక్క.
కంచెగోడ-కంపగోడ, కంచెకోట, కో. డి.
కంచెల-కంచులీ = తైక, బీటినేల
కంచము - కంసమ్ = కంచుగిన్నె, కంచు పళ్లెరము, భోజన పాత్రము.
కంచర-కంచుపనిచే జీవించుజాతి
కంచరగాడిద-చూ. కంకరగాడిద
కంచరము-చంకురః = ఒక తక్కువజాతి బండి, కంచరగాడిద, కంచరిపని.
కంచరవాఁడు | కాంస్యకారః = కంచుపనిచే
కంచరి | జీవించువాఁడు-కారంధమి
కంచల-కంచుకి = అవిక, కంచెల,
కంచు-కంసమ్ = ఒకానొక లోహము.
కంచు అడ్డెన-కంచుతో చేసిన అడ్డెన.
కంచుఁబుత్తడిదివియ-ఆఁడుబొమ్మ రూపుగల దీపస్తంభము.
కంచుకంటు-బూరెల మూఁకుడు, పెనము.
కంచుకంబము-కంచుతో చేసినదీపస్తంభము
కంచుకాగడా-కంచుకోలగల దివ్వె
కంచుకొమ్ము-కొమ్మువాద్యము,బాకా. [కోడి.
కంచుడమారము - ఉడుపకుక్క, పంచెపు
కంచుడి-కంచుకంచము.
కంచుడు-మట్టిగిన్నె, మూఁకుడు.
కంచుతల్య-కాంస్యస్థాళీ = కంచుకంచము
కంచుదివ్యదండు - కంచుతోఁ చేసిన దీపదండము.
కంచుపదను-మిక్కిలి వాఁడిగల పదను.
కంచుమించగు-చెల్లాచెదరగు,మాయమగు
కంచుమించు-వడిగా, ఈల్పగద్ద, అఱుజు.
కంచుఱాయి-కంచువలెమ్రోగెడునల్లఱాయి.
కంజాయించు-ఏర్పాటుచేయు.
కంజాయింపు-పనుల పురమాయింపు.
కంజీల-బండికంటిచీల, సాయిమేకు.
కంజె-కపింజలః = కౌఁజుపిట్ట, కంచెగోడ.
కంట-చూచుట, కనుట, నాట్యభేదము.
కంటఁబడు-కనఁబడు, అగపడు
కంటకమగు-సరిపడకుండు, బాధపడు.
కంటకమాడు-పరుషములాడు.
కంటకసెల-ఘంటశాల, మాటీ.
కంటగించు-కోపించు,నొప్పించు, రోయు.
కంటగింపు-పగ, రోఁత, నొప్పి.
కంటగిలు-ల్లు = నొచ్చు, పగబట్టు.
కంటడము-చెఱుపు, ఆటంకము.
కంటతడిపెట్టు-జాలిపడు, వగచు.

కంటదుమ్ముకొట్టు-మోసపుచ్చు.
కంటలము - తొమ్మిది మణుగుల బరువు. దూదిమూట, ఎడ్లపై వేయు సంచులజత.
కంటవడు-పగగొను. విరోధించు.
కంటవత్తిడుకొను-శ్రద్ధగా చూచు.
కంటసపడు-వెతనొందు. చిరాకుపడు.
కంటసము-అపార్థపుమాట, కంటకము
కంటసరము } కంఠసరః = మెడలోఁదాల్చు
కంటసరి } గొలుసు, కంటె
కంటాణి-పుస్తకములు కుట్టు పెద్దసూది
కంటాల(ళ)యు-చూ. కంటలము.
కంటికలక-పుసులుకట్టు కంటితెగులు
కంటికిఱెప్ప-వెన్నంటి కాపాడునది
కంటికెక్కు-నచ్చు, కంటికివచ్చు
కంటిపాప-కంటిలోని నల్లగ్రుడ్డు-కనీనిక
కంటిపులి-గొడ్ల కంటిమచ్చ-కనుపులి
కంటిపువ్వు-కంటఁబుట్టినకాయ-శుక్లము.
కంటిపుసి-దూషిక
కంటిపొర-కనుగ్రుడ్డుపైఁ గప్పినపొర.
కంటియ-చూ చూ. కంటె
కంటిరోవి నలుసు-మిక్కిలి బాధించునది.
కంటివాలు-బండిచక్రమువలె గుండ్రనైన ఆయుధము-చక్రాయుధము
కంటివినికి-వ్కి } కంటితో వినుశక్తికలది-
కంటివిన్కరి } పాము, చక్షుశ్శ్రవము.
కంటీలు-చెవిపోఁగులు, చెవ్వాకు, ఒంట్లు.
కంటు-కంటః = పగ. ఈర్ష్య. ఏతపుమ్రాని అతుకు. పగవాఁడు.
కంటువడు-పగగొను, మచ్చరించు.
కంటువెట్టు-పంతముపట్టు.

కంటె - కంఠికా = కంఠమువేయు చోటు. మంగళసూత్రము, పంచమీ విభక్తి ప్ర॥
కంటెదూలము-బావిమీఁది అడ్డపట్టె, అడ్డుగమ్మ, కంటెబారు. [పైరు, కండసజ్జ
కంటెపుసజ్జ-పొడుగు కంకెలువేయు సజ్జ
కంటెబారు-కంటె (దూలము) మ్రాను.
కంటెబొట్టు-తాళిబొట్టు. పుస్తె.
కంటెబొట్టువేయు-తాళికట్టు.
కంటెమ్రాను-కంటెదూలము
కంట్ల(ట్లా)ము = కంటలము. 64 వీశెలు.
కంట్లముకట్టు-మూతికి ఉగ్గముపలె కట్టు.
కంట్లముపడు-ఉరిపడు. బాధకల్గు
కండ-ఖండః = మాంసము,గుంజు. కండచక్కెర, సత్తువ, శిశువు.
కండకన్నులు-దుర్మాంసముపెరిగినకన్నులు
కండకావరము } ఖండగర్వః = పొగరు,
కండక్రొవ్వు } మదము.
కండచీము-గండుచీము-ఉలంకలము.
కండచక్కెర-ఖండశర్కరా. పటికబెల్లము
కండచక్కెరతిండి-చిలుక,
కండచుక్క-కాలఖండః = నల్లగుండె.
కండతుండ(డె)ములు-ముక్క ముక్కలు.
కండప(పె)ట్టు-బలియు. క్రొవ్వెక్కు.
కండమక్క-కాలేయము, కారిజము.
కండపడము-కాండపటః = తెరచీరె.
కండసక్కెరి-కలకండ. ఖండశర్కర.
కండిక-ఖండికా వేదభాగము. చిన్నభాగము, లంకపొలము, మాన్యపుపొలము-చూ కండ్రిక.
కండియ-నూలుచుట్టినఊచ, పేనిన దారపుచుట్ట,కొన్న(న్ని)వెన్ను,మాంసఖండము

కండు-అలజడి, ఇడుమ, కస్తి.
కండు(వ)వా-పైబట్ట, వల్లె, అడ్డదూలము.
కండువాదూలము - ఇంటిచిప్ప పెణకను వేయు అడ్డదూలము (బ్రౌ)
కండె-బంగరుజరీ మా. కండియ
కండెగొల-చాల్గుహస్తముల కొలబద్ద.
కండెచుట్టు-పుల్లకు దారము చుట్టు.
కండెము-ఖండః = కండపలె గట్టి పడిన భుజాదుల మాంసఖండము.
కండెపట్టు-కొప్పికలుగు, లాగు.
కండెసజ్జ-కంకెపుసజ్జ.
కండ్ర-కసరు, కరుడు
కండ్రావి-రోఁతపుట్టించు దృశ్యము.
కండ్రిక = కండిక, ఖండిక
కండ్లరావి-అశ్వసన్నిభ +, పిప్పలీక +
కండ్లుకుట్టు-కండ్లకలక.
కండ్లునెత్తికెక్కు-పొగరెక్కు. నిక్కు.
కండ్లుమండు-అసూయపడు
కంత-గర్తః = చిల్లి, త్రోవ, రచ్చ, కస్తి, వరబంధువులు వధువునకుఁ గొనిపోవు ప్రధానద్రవ్యము, సందు, కణత.
కంతలుగట్టు-మఱుగు పఱచు.
కంతి-గ్రంధిః = గడ్డ, కుఱుపు, కణఁతి
కంతిరి-సంకరుఁడు, మిశ్రజాతివాఁడు
కంతిరీఁగ-తేనెటీఁగ, కండిరీఁగ.
కంతు-గడువు, హద్దు, వాయిదా.
కంత్రీ-సంకరము,కంతిరి,నకలు, మోసము
కంద-ఒక కూరదుంప, చిలగడదుంప
కందఁబాఱు-నల్లఁబడు, కందు వన్నెచెడు
కందకము-అగడ్త, నేలలో కట్టిన ధాన్యపు కొట్టు-రూ. కందనము.
కందగడ్డ-కందదుంప-అర్శోఘ్నము.
కందనకా(గా)య-గుండెకాయ-ఎద
కందన(న)ము-మల్లుర ముప్పది రెండు విన్నాణములలో నొకటి. గుండెకాయ. సొరంగపుకొట్టు [పద్దెము.
కందము-స్కంధః = మూఁపు. కంద
కందరిక(ము)-గంతక్రింది బొంత. అస్తరిణముగా వేసికొను బొంత-కందళము.
కందళము-ఎద్దు వెన్నుపై నమర్చు గంత.
కందళించు-మొలకెత్తు, సంతసించు.
కందా రాజులకు రాజసేవకులకు వేఱుగా నేర్పఱచిన బల్ల, తేరతిండి.
కందాచారము-సేనకుసంబంధించినలెక్కలు వ్రాయుట. రక్షకదళము
కందాడిక-గొంగళి, కంబడి. కమ్మడి.
కందాయము-జ్యేష్ఠము మొదలు నాలుగేసి నెలల కాలము-కప్పము, శిస్తు.
కందారము-తామరతీఁగ ఊడ
కందాలరాజు-తేరతిండి మరగి తిరిగెడు పెద్ద యింటి సోమరి.
కంది-ఒకానొక పప్పు దినుసు-తువరి +
కందించు-ఎఱ్ఱఁబఱచు, కందఁజేయు.
కందికేర-ఒకజాతి కలుపుమొక్క
కందిచెక్క-ఒక పప్పుదినుసు మొక్కలు గల మడి.
కందిపొట్టు-శింబ
కందిము-పందిటిగుంజ, బాజా
కందియన - బండికంటికిఁబెట్టు చమురు. బండి యిరుసునకుఁ బూయుమసి,కందెన.
కంది(లి)లు-లాంతరు.

కంబళి-రూ. కంబలి, కంబడి.
కంబళిపురుగు-గొంగడిపురుగు
కంబారి-పనివాఁడు, కమతగాఁడు.
కంబాలకూర-తోఁటకూర. మారిషము.
కంబాలాట-ఒక దినుసు బాలికాక్రీడ.
కంబి-కమ్మి, తెడ్డు, తక్కువ.
కంబులు-సజ్జలు, గంటెలు.
కంబెచ్చు-చూ. కమ్మచ్చు.
కంబోచ-కాంభోజదేశము.
కంబోరు కమ్మవారు.
కంసాల-కమసాలజాతి.
కంసాలవాఁడు } బంగారు పనివాఁడు - అగసాలె, సొన్నారి.
కంసాలి
కకపాల - కక్షపాల = బైరాగుల బిచ్చపు సంచి, మంగలిపొది, రూ. కక్కపాల.
కకపికలు-పటాపంచలు, కకవికలు
కకపిక(ప)వడు-చెదరు, మిట్టిపడు
కకవిక-గజిబిజి; రూ కకావిక.
కకవికచేయు-కలఁచు, గాబరాపెట్టు.
కకవికపడు-మిక్కిలి చెదరు. కలఁగు,
కకావి(వి)కలు-వక(కా)వకలు.
కక్క - పినతండ్రి, తండ్రి. పాయసము, పాదె, సంకటి.
కక్కపాల-చూ. కకపాల. [జాతి కొంగ
కక్కర-కర్కరేటువు = కక్కెరపక్షి, పెద్ద
కక్కరము-కఱ్ఱచేయి, కఱకైనది.
కక్కరాలు-గోధుమపిండి వంట.
కక్కరించు-మొఱఁగు, అఱచు
కక్కసపడు-బాధపడు, మోటుగా ప్రవర్తించు
కక్కసపె(వె)ట్టు-నొప్పించు, పీడించు,
కక్కసము-కర్కశ = కఱకుఁదనము. కడగండ్లు; తప్పనిసరి, వాఁడి, ఇఱుకైన. మోటైన.
కక్కసాలాడు-వాదప్రతివాదములు చేయు.
కక్కసించు-నొప్పించు, తొందరచేయు.
కక్కసిలు-ల్లు = విండు, క్రిక్కిఱియు
కక్కసు-పాయిఖానా, పాకీదొడ్డి, కక్కోజీ.
కక్కాయి-పినతండ్రి-కక్క.
కక్కి-పినతల్లి, మల్లవిజ్ఞాన విశేషము.
కక్కించు-డోఁకించు, వెడలించు.
కక్కిత-మల్లవిజ్ఞాన విశేషము.
కక్కిర-పొడకోడి, మచ్చలకోడి
కక్కిరిబిక్కిరి-తాఱుమాఱు, వ్యత్యస్తము.
కక్కు-డోఁకు. వెలిపుచ్చు; వాంతి, బంపపు పల్లు, ఱాతిగంట్లు
కక్కుఁడెవులు-వాంతిరోగము.
కక్కుకొట్టు-గంట్లువేయు. ముల్లాడించు.
కక్కు(ట)డు-డోఁకుట. వెడలించుట.
కక్కుపాల-వెఱ్ఱిపాల +, కురింజ +
కక్కుపెట్టు-బంపము మొ॥వానికి పదనుపెట్టు.
కక్కుర్తి-పిసినితనము, కక్కుఱితి.
కక్కుర్తికాఁడు-పేరాస కలవాఁడు.
కక్కుర్తిపడు-పేరాసపడు
కక్కుడాయి-కఱకుడాయి.
కక్కుఱితి-పేరాస, పాలుమాలిక,
కక్కులకళ్లెము-గుఱ్ఱపు కళ్లెము.
కక్కువెట్టు-బంపమునకు పదునుపెట్టు.
కక్కువా[illegible] దగ్గు
కక్కూత-కక్కుఱితి.
కక్కూర్తికాఁడు-లోభి, పిసినిగొట్టు

కక్కూటితి-ర్తి = లోభము. పిసినితనము.
కక్కూటితికాఁడు-పిసినారి. పిసిని.
కక్కూటితిపడు-ఆశపడు, అశ్రద్ధతాల్చు.
కక్కూటితిపఱచు-ఆసగొల్పు. లోభపెట్టు.
కక్కెర-క్రకరః = పెద్దజాతికొంగ-గువ్వ
కక్కోజీ-మఱుగుదొడ్డి, పాయఖానా.
కత్తి-జెల్ల(32 తెగలలో)ఒకానొకపెనకువ.
కగ్గ(ము)-ఖడ్గః = కటారి, కత్తి.
కగ్గించు-కందఁజేయు, జంకించు
కగ్గు-కందు.రంగు తగ్గు,మాయు, ఘాసినః నల్లఁబడిన, కందిన.
కగ్గులు-అగ్నికణాలు. మిణుఁగుఱులు
కగ్గువాఱు-రంగుమాయు,కందు,నల్లఁబడు.
కచరించు-కచ్చపోసి బట్టకట్టు.
కచర-పేడపిడక కాల్చిన బూడిబిళ్ల
కచిక్కు-పొడుపునందగు్రమోఁత-ఇచిక్కు
కచేరి(రీ)-కొల్వుకూటము, గానసభ.
కచ్చా-పచ్చిది, తక్కువది. నీచము
కచ్చాపచ్చా-తెగతెంపులు.
కచ్చి - నేఁతగాఁడు పుల్లలను పడుగునఁ జొప్పించునందు.కొచ్చినుదేశపుగుజ్జము.
కచ్చించు-సారెలను గళ్లలో నడపు. ఇంటి గోడ మున్నగువాని కొలఁత లేర్పఱచు, కచ్చబిగించుకొను, నిక్కు. తయారగు, కినియు.
కచ్చించుకొను-గర్వించు
కచ్చింపు-నిక్కచ్చి, బొటాబొటి.
కచ్చితము - ఖచితమ్ = హెచ్చుతగ్గులు లేకుండునట్లు చేయఁబడినది - నిక్కచ్చి, బొటాబొటి.
కచ్చిపోతు-కుళ్లుబోతు, వైరి. [మడత
కచ్చియ - కచ్ఛః = కయ్యము, కక్ష. బట్ట
కచ్చిలములు-వస్త్రవిశేషము [బిగించు.
కచ్చిపెట్టు-పగవట్టు, సరిపెట్టు, సీల్గు, కచ్చ
కచ్చె-కక్ష = పగ, కచియ
కచ్చెపోతు-జగడగొండి, కయ్యాలక్రచ్చ
కచ్చెపోవు-ఆశ్చర్యపడిపోవు
కచ్చే తమలపాకులకట్ట, పడి.
కచ్చేరి(రి) కచేరి(రీ).
కచ-కచ్చ, గోఁచి, దట్టి, అఁడుగుబి.
కచరించు-గోఁచిపోసి బట్టకట్టు.
కచ్చ-కచ్ఛ = వెనుక దోపుకొనెడు దోవతి కొంగు, గోఁచి,కాసెకోక,పగ, మొరటు, అఁడుగుటి
కచ్చకాఁడు-సన్యాసి, గోణముదారి.
కచ్చగట్టు-కాసెబిగించు, పగపట్టు.
కచ్చడము-కచ్ఛటికా = గోఁచి,కచ్చ. సొగటాలు నడపుట, దూదిబండి.
కచ్చడి-ఒక దినుసు నారింజ+
కచ్చపోతు-కుళ్లుబోతు. ఈర్ష్యాళువు.
కచ్చపోయు-గోచిఁపెట్టు.
కచ్చబిగించు-పోరుకై పంచ ఎగఁగట్టు.
కచ్చరము-చూ రూ. కచ్చడము.
కచ్చు - గవ్వలాట, జూదము, పూగుత్తి కుచ్చె. తురాయి. సిగబంతి, పెద్దవాసము, పేలిక. దళము. టెక్కు, పొగరు. కోరిక, కచ్చించు.
కచ్చుఁదనము-పొగరు, కావరము.
కచ్చుకట్టు-నియమముగా నుండు.
కచ్చుకొను-ఒ ంచు, పటుపట్టు.

కచ్చురము-కచోరమ్ = గంధకచోరము.
కచ్చువదలు - నీమము (ఆస) వదలఁగొను, గర్వముపీడు, శోషితగ్గు.
కచ్చువిచ్చగు-పనిచెడు, ఆఱుమూఁడగు.
కచ్చువెట్టు-ఎదిరించు, డీకొను.
కచ్చూరము-గంట్లకచోరము. [యము.
కజాయము - ఖాద్యమ్ = కజ్జెకాయ, కజ్జ
కజూరము-కజ్జూరము.
కజ్జ-ఖాద్యమ్ = కజ్జెకాయ. [కజ్జెకాయ
కజ్జము-కార్యమ్ = పని, కర్జము; ఖాద్యమ్ =
కజ్జా-పోరు, పేచీ, పోట్లాట.
కజ్జాకోరు-పేచీకోరు, జగడగొంటె.
కజ్జాయాలు-విప్పట్లు, అరిసెలు
కజ్జియము-ఖాద్యమ్ = కజ్జికాయ
కజ్జె(ము)కాయ-కజ్జికాయ అను పిండివంట
కజ్జూ(జ్జా)రము-ఖర్జూరః = పెద్దయీఁత + రూ. గజ్జూరము
కట-కష్టమ్ _ సంతాపార్థకము, కటా.
కటకట - కష్టము, తహతహ, కోపము, పండ్లు కొఱుకుట మున్నగువానిమ్రోఁత.
కటకట(పడు)లాడు-కలవరపడు, కోపించు, బాధపడు
కటకటపెట్టు-బాధపెట్టు
కటకటా-ఎంత కష్టము ! అకటా !
కటకటాకిమ్మలు-మదగజములు.
కటకటాలు-ఇనుపయూచలతో నిర్మించిన పెసారాగదిని అనుకొనునవి.
కటకము-గద్దియ, పాదె
కటకిపము-గంధర్వః-కఱఁతిమెకము.
కటకపరుఁటు-ఒక దినుసు పళ్లు.
కటకారుఁడు-మేదరి, వెదురుపనివాఁడు.
కటపుట-చెలరేఁగుట, వికాసము,
కటపెట-వర్షబిందువులుపడుట, దంతములు కొఱుకుటయందగుమ్రోఁతయనుకరణము
కటమర-చెక్కిలిమీఁదిచోటు-హనువు.
కటా = కట, కష్టా, అకటా, కటకటా.
కటాకటి కిచ్చితముగా, అతికష్టముగా.
కటామణి-సూర్పిడి, కుప్పసూర్చుట
కటాయించు = అప్పులెగవేయు, నిక్కచ్చి చేయు.
కటా(రి)రము-కరారః = బాకు, కత్తి.
కటారికత్తియ(త్తె) - అందకత్తె, కటారి చేపట్టిన స్త్రీ
కటారికాఁడు-కత్తికలాఁడు-ఖడ్గి.
కటారు-బాకు, కత్తి, కటారి.
కటారుకత్తియ(త్తె) చూ. కటారికత్తె.
కటారువాఁడు = కటారికాఁడు.
కటిక-ఖట్టికః = కసాయి, బెత్తము పట్టిన వాఁడు, కఱకైన, దిటవైన, వెట్టియొక్క ఒక పనిముట్టు-కట్టిక
కటికతనము-కట్టిడి తనము.
కటికది-వేత్రహస్తురాలు.
కటికన-జెట్లు ఒకానొక పనిముట్టు
కటికమెనము-మొగమున కత్తివంటికొమ్ము కల జంతువు-ఖడ్గమృగము
కటికవాఁడు - ఖట్టికః = వేత్రహస్తుఁడు. కట్టుక, క[illegible] [టమైన
కటికి-[illegible] [illegible]మైన, దట్టమైన, మిక్కు
కటికినీఁడటి-చిమ్మచీఁకటి, గాఢాంధకారము
కటికినవ్వు-విషపు నవ్వు.

కటిక్కన-గట్టిగా, నిర్మొగమాటముగా.
కటుకరోహిణి-కటుంభరా-కటుక.
కటుకు-కఠినము. రూ. కటికి
కటు(కు)క్కు-కొఱుకుడు చప్పుడు, కఠిన
= కఱకువాఁడు
కటుక్కన-కటుక్కుమనువట్లు.
కటుగు-చూ. కటువు
కటుగొడగి-పన్నులేని యీనాము.
కటుమరలు(ర్లు)-బిండ్లకు మిగువను చెక్కిళ్లకు ఎగువను ఉండుచోట్లు
కటువు-ఖాటికా = పాడె, శవయానము.
కటేకారుఁడు-హాస్యగాఁడు
కట్ట-మోపు, గుంపు, గట్టు, అరుగు, అకటా
కట్టకము = కట్టడము.
కట్టకడ-చిట్టచివర, తుట్టతుద.
కట్టకొమ్మ-అనకట్ట, కట్టుకొమ్మ.
కట్టగట్టు-అందఱు ఏకమగు, మూగు
కట్టవేఁప-ఒక సముద్రపు చేఁప [అన,
కట్టడ-కట్టుపాటు, తీరు, మేర, అందము.
కట్టడచేయు-ఏర్పఱచు ఇచ్చు.
కట్టడము-ఇల్లు, రూర్పు కట్టడి, కోక,
కట్టడి = కట్టవ, కట్టుపాటు, విశ్వాసము సేవకులకు నియమముగా ప్రసాదమిచ్చుట
కట్టనము-బల్లకట్టు, కూర్పు, కట్నము, కాన్క.
కటపుట్టచెండ్లు-అందలములు, ఒక క్రీడ.
కట్టఁబెట్టు-తాల్పఁజేయు, అంటఁగట్టు
కట్టనుఁగు-మిక్కిలి యిష్టుఁడు
కట్టపోయు-అడ్డుకట్టు, గట్టువేయు.
కట్టమర-చూ ంటమర.
కట్టమేరలు-గ్రామసేవకుల చెల్లింపులు
కట్టరము-నాట్యబంధభేదము-కంట.
కట్టరాయి-మందకణిక. కుప్పికట్టు. [తప్పు
కట్టలుతెగు-గండిపడు, పొర్లి పచ్చు, వశము
కట్టవ-మొక్కలతో ఏర్పాటుచేసిన ఆవరణ.
కట్టవేయు-అడ్డుకట్టు, గట్టుకట్టు.
కట్టా-రిహా, అకటా, కటకటా, అక్కటా.
కట్టాణి మిక్కిలి గుండ్రనిదగు మేలుజాతి ముత్యము ఆణిముత్తెము.
కట్టాణిగుండ్లు-ముత్యాలహారము మొ॥
కట్టాయము - బలాత్కారము-కడ్డాయము.
దేవుని ప్రసాదము [చేయు.
కట్టాయము సేయు-నిర్బంధించు, సిద్ధము
కట్టాయితపడు-సిద్ధపడు, పూను.
కట్టాయితము-సిద్ధము, సన్నాహము, సేన.
కట్టారము = కట్టరము.
కట్టావి-మిక్కిలి వేఁడిమి
కట్టావులు తేరు-పొగలు క్రమ్ము.
కట్టించు-కట్టఁజేయు.
కట్టిఁడి-దయలేనిది, కఠినమైనది, ఉపయోగము లేనిది, క్రూరుఁడు, గడుసరి
కట్టి పొట్టు-ఊఁక.
కట్టిక = కటికవాఁడు.
కట్టికవాఁడు-కటికవాఁడు. కిరాయిబెత్తము పట్టుకొని రాజసభలో బరాబరులు చేయువాఁడు [జేయు.
కట్టికుడుపు-బలాత్కారముగా అనుభవింపఁ
కట్టిడి-కిట్టడి, ఏర్పాటు, భాగ్యము.
కట్టిపెట్టు-భావించు, అంటఁగట్టు, ఇల్లుకట్టు.
కట్టియ-కాష్ఠము కట్టె, బాణము
కట్టి(ఎ)ల్లు-సమకీనము, రాచిల్లు.

కట్టివేయు-ఆపుచేయు, నిర్మించు, బంధించు.

కట్టు-అంటఁగట్టు, బట్టతాల్చు, కూర్చు. కలిగించు, చెల్లించు, అడ్డగించు, నిర్మించు, మూయు, త్రవ్వించు, ఏర్పఱచు, మూట కట్టు, తాల్చు. కట్టుట, కట్టుత్రాడు తొట్టి కట్టు, బట్టకట్టు, మితి, కట్లసాము మీఁది గీఁత, అర, అదను, కట్టుపాటు, వోటు, ఉడికిన పప్పుమీఁది నీరు.

కట్టుంబొదలు-పొదలతోఁ గూడిన కంచె.

కట్టుఁగంబము-కట్టుఁగొయ్యి-కట్రాడు.

కట్టుఁగొంగు-కొకచెఱఁగు-చెంగు.

కట్టుఁగొమ్మ-ఆనకట్ట, అడ్డకట్ట

కట్టుఁగొ(య్య)య్యి-కట్టుఁగంబము-కట్రాడు

కట్టుఁగోక-అంతరీయము-దోవతి.

కట్టుఁబోతు-పొగరుబోతు, దయ్యాలు పట్టించువాడు. [కట్టుకొని.

కట్టుక-జంతువుల గర్భస్రావము-కట్టుగ.

కట్టుకట్టు - సమ్మెచేయు, మంత్రముచే బంధించు. [కాల్వ, వరవకాలువ.

కట్టుకాల్వ-చెఱువునకు ఏటి నీరు మళ్ళించు

కట్టుకతి-కల్పితగాథ కట్టుకథ

కట్టుకరపాని-చిడుము-కిరపాణి. [కొంగు

కట్టుకొంగు = నడుమునకుఁ గట్టిన చీర

కట్టుకొను-తాల్చు, పెండ్లామును తెచ్చుకొను

కట్టుకొమ్మ-అగ్త్రపైఁ గట్టిన ఆనకట్ట-రూ. కట్టకొమ్మ.

కట్టుగ-కట్టుక, పశుగర్భస్రావము.

కట్టుగడ-కూడఁబెట్టినది-సంచితము

కట్టుగడచేయు-కూడఁబెట్టు, నిల్వ చేయు.

కట్టుగుంజ = కట్టుకంబము, శివకము,

కట్టుగుండు-తూనికరాయి.

కట్టుగుఱ్ఱము-దొడ్డిఁబెట్టిన గుఱ్ఱము.

కట్టుగొఱ్ఱె-బలికై రాటఁగట్టిన గొఱ్ఱె.

కట్టుగ్రము-మిక్కిలి బెడిదము

కట్టుచేయు-అనతిచ్చి ఆఁపు.

కట్టుట-పశువులు గర్భము తాల్చుట.

కట్టుతప్పు-హద్దుమీఱు. నీతితప్పు

కట్టుతాడి-డావరడంగి + -దేవతాడి +.

కట్టుతాల్చు-త్రాడుపేను

కట్టుదిట్టము-కట్టుపాటు, ఏర్పాటు

కట్టుదొన-కోనేఱు, కొలను

కట్టుపకా(సి)సు-పోటుకాఁడు, బంటుకాఁడు

కట్టుపట్టు-ఆటపట్టు, ఉనికిపట్టు [యగు.

కట్టుపడు-కట్టివేయఁబడు, ఆగు, తక్కువ

కట్టుపఱచు-అరికట్టు, కట్టుపడఁజేయు.

కట్టుపాటు-ఏర్పాటు, కూర్పు, వ్యవస్థ.

కట్టుపాటుచేయు-ఏర్పఱచు, నియమించు.

కట్టుపోతు-కట్టుమోతు, కట్టుఁబోతు.

కట్టుబండి-సర్వపరికరములుగల బండి.

కట్టుబట్ట-దోవతి, పంచ

కట్టుబడి-వృత్తిమాన్యము, ఏర్పాటు, మహా ధాన్యము, కట్టుట, తలారి

కట్టుబడివాఁడు-తలారి, సుంకరి.

కట్టుమట్టు-కట్టుబాటు, ఒడంబడిక, పసుల సాల, చోటు, నిక్కము, ఉనికి.

కట్టుమామిడి-బుట్టలుకట్టిన అంటుమామిడి.

కట్టుమీఱు-హద్దుమీఱు, కట్టడతప్పు.

కట్టుముడి-నిబంధన.

కట్టుమోతు = కట్టుపోతు, మంత్రాలమారి.

కట్టుమ్రాను-తెప్ప, నావ.

కట్టువ-కంచె, ఉచ్చు, చిన్నగుట్ట, గట్టు.
కట్టువడు = కట్టుపడు.
కట్టువర్గము-కట్టుకొనుటకు కాన్కగానిచ్చు [క్రొత్తబట్టలు
కట్టువలుచు-అరికట్టు, కట్టుపడఁజేయు.
కట్టువిడుపు-మైలగుడ్డ, మాపు.
కట్టె-కట్టియ, కఱ్ఱ, వంటచెఱకు
కట్టెగుఱ్ఱము-కఱ్ఱతోఁజేసిన గుఱ్ఱపుబొమ్మ
అందలములు-ఒక దినుసు బాలక్రీడ.
కట్టుపీమ-గంఁడుపీమ, పెద్దపీమ,
కట్టెడ-ఎడనెడకట్లుగల సర్పవిశేషము - కట్ల(పాము) పురుగు. [పండు
కట్టెపండు-కట్టె(బెరడు)తోఁగూడినచింత
కట్టెపాఁపర-ఒకదినుసు చెట్టు
కట్టెపిట్ట-బక్కచిక్కిన మనిషి.
కట్టెపొంగలి - బియ్యము పెసరపప్పుతో వండిన పులగము
కట్టెర-పుఱ్ఱె, పునుక, కప్పెర
కట్టెవిఱుపుమాట-పుల్లవిఱుపుమాట.
కట్నంగానికలు-రాజునకు దేవునకు సమర్పించుకొను వస్తువులు
కట్నము-కానుక, కూర్పు, మెట్టు
కట్రాడు-కట్టుకొయ్య, గుంజ
కట్ల-ఖట్వ = కట్లమంచము, మంచపుడోలి
కట్లంక-వరుసడ్డలపై నుంచెడు బట్ట.
కట్లగుడియ-ఇనుపకట్లలాటికఱ్ఱ-ముసుంఠి
కట్లజెట్టి-పెద్దచారల(కట్లుగల) జెట్టి-అధారిక
కట్లదండ-నల్లపూసలుగ్రుచ్చి బంగారుకట్లు కట్టిన దండ, కట్లసరి.
కట్ల(పాము)పురుగు-చూ కట్టెడ.
కట్లబల్ల-కత్తెరకాళ్ల మడుపుబల్ల.
కట్లమంచము-మంచపుడోలి, పాలకి,కట్లె.
కట్లమారి కట్లుపొందు స్వభావము కలది.
కట్లరి-కత్తులు గరిటెలు మొ॥వంటసామగ్రి.
కట్లసరి-కట్లదండ, నల్లపూసలపేరు.
కట్లా వివాదము, పేచీ
కట్లి(య)ట్లె-ఖట్వ - కట్లమంచము, కట్ల తీఁగ, బంగారు చూనికగుండు
కట్లు-బండివచక్రపు పట్టాలు.
కట్లెల } బంగారము తూమకొనెడు
కట్లెసంచి } తూకపువాళ్ల సంచి
క(రిల్లు)రీలు-తుపాకి ప్రేలుడు.
కడ-కాష్ఠా - దిక్కు దూరము, చివర, చావు, చోటు ప్రక్క, దాఁపు, ప్రాపు, మేర, ఒడ్డు, వేళ, కడమ.
కడంక } కడఁగుట-పూనిక, పెంపు తెగువ,
కడఁక } స్థిరత,పొగరు,దిట్టతనము, పోలిక, సంతసము, చుఱుకుఁదనము, కణఁక
కడంతరకాలము-జీవితాంతము
కడఁకు-నిప్పు, అగ్గి రూ కఁకు
కడఁగు-కైకొను, పూను, పెంపొందు
కడఁగించు-ప్రేరించు, పురికొల్పు.
కడఁజము-గంజః = గాదె పొణక,పాఁతఱ, గాఁబు రూ గంగాళము, కణఁజము.
కడఁజు-ఒక జాతి మప్పి-గోకర్ణమ్మగము-రూ, కడంజు, కణఁజు, కణుఁజు
కడఁత-కనుచెవుల నడిమిపట్టు, కణఁత.
కడఁతి-గంధర్వమృగము,గ్రంధిః = బొప్పి
కడఁబడు-తగ్గు, దవ్వగు,చివరిదగు, కుంటు పడు, కుఱుచపడు, పోవు
కడకంతలు దూరపుచోటు.

కడక-కణఁత, కంటిప్రక్కచోటు. [విధి.
కడకట్టు-ఏర్పఱుచు,నిశ్చయించు; ఏర్పాటు.
కడకడ-కడపటిదిక్కు. ఈశాన్యము.
కడకడలి-పడమటి సముద్రము
కడకన్ను-క్రేగన్ను, కడకంటిచూపు
కడకాలు-పాదము, పాదము విసిరి. ప్రనాది గోయి.
కడకాళ్లఁద్రోచు-తన్ను. గెంటు.
కడకుఁబోవు } ముట్టగు. మూరమెగు.
కడకేగు
కడకువేయు-కూడఁబెట్టు. మిగుల్చు.
కడకొంగు-కొంగుచివర
కడకొత్తు-త్రోయు, కడకుగెంటు
కడకొలఁకి-కాలగా మిగిలిన కట్టె
కడగ-ముట్టగుట, అవతల
కడగండ్లమారి-కష్టశీలుఁడు.
కడగండ్లు-ఇడుములు, ఇక్కట్లు.
దగట్టు-ఏర్పఱుచు, నిశ్చయించు లోకా లోకపర్వతము, చక్రవాళపర్వతము.
కడగను-కడముట్టు, కడతేఱు
కడగన్ను-క్రేగన్ను. కడకంటి చూపు.
దగ్గిట్టు-చేరు, దగ్గఱు
కడగొట్టు-చచ్చు. చెడు. చివరవి
దగొట్టువాఁడు-తమ్ముఁడు, కనిష్ఠుఁడు
కడగోరు-కొనగోరు, గోటిచివర.
కడచను-కడచు, చచ్చు, ముగియు మించు, కొనసాగు,ఎక్కువగు,దాటు,నాఁటలప్పు.
కడచిల్లి-కడచీల. కడదంపెల్లి.
కడచు - దాఁటు, తప్పించుకొను, మించు, నడచు,తొలఁగు, మీఱు, హెచ్చు,జరుగు, కడతేఱు, కోల్పోవు.
కడచుక్క-రేవతి +, మీనురూపుచుక్క.
కడచెడు-దిక్కుమాలు, గతిలేకుండు.
కడచేయు-దూరముచేయు, వదలు.
కడచేరుప(ర్చు) = దరిచేర్చు,ఒడ్డుచేర్చు.
కడతల-తుదిచోటు, వల్లకాడు.
కడతాఁకు-తుదిముట్టు, అంతమగు.
కడతెంచు-దాఁటు, మించు, కడచు.
కడతెగు-కడవెళ్లు, కడముట్టు,
కడతేఱు-చచ్చు, ముగియు, నెఱవేఱు.
కడతేఱుచు-ర్చు = కడతేలఁజేయు.
కడదనరుచుక్క-రేవతి +. కడచుక్క.
కడదాఁటు-తుదిముట్టు. కడతేఱు.
కడదెస-తుదిదిస-ఈశాన్యమూల.
కడదెసగాఁపరి-తుదిదిక్కును పాలించువాఁడు
కడద్రొక్కు-తుదిచూచు.
కడనుంచు-దూరముననుంచు. గెంటు.
కడనుండు-వెలిగానుండు ముట్టగు [ఇల్లు.
కడప-(కదంబ)కడచి పోఁబడునది-గడప-
కడపట-అంతము, చివర, చివరది,
కడపటి(కొండ)మల-లోకాలోకగిరి.
కడపట్టు-చనిపోవు. సొమ్మసిలు.
కడపదండాలు-వాకిలిముంచు మ్రొక్కుట.
కడపని-అంత్యక్రియ, ఉత్తరక్రియ,మృతు నకుఁజేయు దేహసంస్కారాది.
కడపల-తుద, చివరది, కడపటిది.
కడపలచేరు-ముగియు, తుదముట్టు.
కడపబండలు-నాపరాళ్లు. [పుచ్చు.
కడపిపుచ్చు-కాలము వెళ్ళఁబుచ్చు, కప్పి
కడపు-ఎంపు, జరుపు తఱుము, తొలఁ గించు, ఈయక పొమ్మను, పోఁగొట్టు.

కడపుఁజేయి-నావచుక్కాను, కర్ణము.
కడబంతి-పంక్తియొక్క చివర
కడబట్టు-సొమ్మసిలు, చచ్చు.
కడమ-కొఱఁత, మిగత, చివర, కడ,
కడమపడు-లోటగు, మిగులు, కీడ్పడు.
కడమపఱచు } మిగుల్చు, లోటుచేయు, కప్పి
కడమపెట్టు } పుచ్చు
కడమవడు-మిగులు, లోటగు.
కడమాకు-తొలఁగఁద్రోయు.
కడమీఱు-నియమము దాఁటు.
కడముంత-కడవముంత, నోరు వెడల్పు గల చిన్న మట్టిపాత్ర-డాక,
కడముట్టఁబడు-ముగియు, దరిచేరు
కడముట్టు-దరిచేరు, ముగియు, చేకూఱు,
కడములకోట-కడిమిచెట్ల(కంచె)కోట.
కడయింటిపొడువ-సంసారము నతిక్రమించిన మానిసి
కడయిల్లు-స్వర్గము, వినుప్రోలు.
కడయేనుఁగు-దిగ్గజము, ఐరావతము.
కడయేలిక-దిక్పాలకుఁడు.
కడరాలు-చండాలస్త్రీ, అంత్యజ.
కడరాసి-మీనరాశి
కడతెప్ప-కంటితెప్పకొన.
కడలకడల-దూరదూరముగ.
కడలి-కడ(అల)లు కలది-సంద్రము
కడలికడ-నేల.
కడలికానుపు-కల్పవృక్షము, ఇచ్చుచెట్టు.
కడలికాలువ-సముద్రపుపాయ.
కడలికూఁతురు-లక్ష్మి, మున్నీటిమాలి
కడలిబత్త(డి)లికదునేదారి - సంద్రము అమ్ములపొదిగాఁగలవిలుకాఁడు-శివుఁడు.

కడలిమీఁగడముద్ద-చంద్రుఁడు.
కడలిమొలనూలుచేడియ-భూదేవి.
కడలిమొలనూలుచేడియకన్నవడఁతి-సీత.
కడలియల్లుఁడు-వెన్నుఁడు, పెరుమాళ్లు
కడలియెకిమీఁడు } వరుణదేవుఁడు, పాల
కడలి(రాయ)ఱేఁడు } సంద్రము-క్షీరాబ్ధి.
కడలివెన్న - పాలకడలియందుఁ బుట్టిన వెన్నవంటివాఁడు-చంద్రుఁడు.
కడలివెలఁ(ది)దుక-సముద్రుని భార్య.
కడలు-అల, కరడు, పశుదంతములు.
కడలుకొను-అలముకొను, పొంగు, కలఁగు, పెంపెక్కు, తొణఁకు, పాఱు.
కడలుకొలుపు-ల్పు = కడలుకొనఁజేయు.
కడలుద్రొక్కు-చీఁకటితప్పు చేయు.
కడలుపడు-గుంపుకట్టు
కడలె(లొ)త్తు } పొంగు, అలలు కలదగు.
కడలొ్కొను } చుట్టుకొను, క్రమ్ము.
కడలొ్కొలుపు-కడలుకొనఁజేయు.
కడవ-ఘటః = కుండ, బిందె, బాన
కడవఁడు-మగగుఱ్ఱము, కత్తళఁడు, అశ్వము.
కడవఁద్రోలు-నిర్వర్తించు, జరిగించు.
కడవఁబడు-మిగులు, దాఁటిపోవు, కడచు.
కడవఁబెట్టు-తొలఁగించు, దాఁటించు
కడవడము-కలఁత, కళవళము.
కడవడించు-కలఁగు తడఁబడు, కడవళించు.
కడవతీటు-తుడుమను వాద్యము, తుటుము, గుమ్మెట, మద్దువు.
[ట్లాడు
కడవనాడు - మీఱిపలుకు, హద్దుతప్పి మా
కడవనూకు-తొలఁగఁద్రోయు, గెంటు.
కడవన్నె-పసనాఱవవన్నె బంగారము.

కడ్డివత్తి-ఖటికావర్తి = అగరువత్తి.
క(డ్డి)డ్డీ-ఖటిక = వాసము, కణిక, పలక పుల్ల, ఊఁదువత్తి.
కడ్డీబాఱు-గట్టిపడు.
కడ్డు-మొరటు, పట్టుదల, [చోటు.
కడ్లాము-ఖలః = కళ్లాము, ధాన్యమునూర్చు
కఢాకు-కత్తిసామునందలి నేర్పు.
కణఁక = కడఁక.
కణఁకు = కడఁకు.
కణఁగు = కడఁగు
కణఁజము = కడఁజము.
కణఁజూ = కడఁజూ.
కణఁత-కడఁత.
కణఁతి = కడఁతి.
కణకణ-నిప్పుయొక్క కాంతి,
కణకణలాడు-ఎఱ్ఱఁబడు, మెఱయు.
కణగు-చచ్చు, పోవు, ముగియు, మీఱు.
కణప-మొక్కపుచెట్టు-ముష్కకము.
కణయి-నూనె కాచుకొనుపాత్ర, కళాయి.
కణయము-గాలి యుండుమేర.
కణస(సె)రము-ఒకజాతి దేగ,-ఈలగ్రద్ధ
కణాతిగోడ-దళసరి బట్టతో ఏర్పరచినగోడ
కణి-బండి, నిలువెత్తుగల బండరాయి
కణిఁతి-కడఁతి, బొప్పి, బుడిపి.
కణిక-కరినిక = బలపము, సుద్దకడ్డీ
కణి(ణీ)చి-బండి, గాడీ, శకటము.
కణిజము-ధాన్యపుకొట్టు, గాదె.
కణిసించు-గమనించు, గుర్తించు [పురుగు.
కణుఁజు-కడుఁజు, డేగ, కుక్కలకు పట్టు
కణుఁదు(రు)రీఁగ - గండోలి = కంద్రీఁగ, ఎఱ్ఱతుమ్మెద, కంద(రు)రీఁగ, కడుఁదురు.
కణుగురు-ఒక దినుసు చెట్టు.
కణుపు-వెదురు లేక చెఱకు కనుపు.
కణుము-రవికగుడ్డ-కనుగు +
కణెయించు-కదలక కూర్చుండు.
కణేర-బలవంతముగా ఆపుట
కణ్చుగార్లు-(శా।క।కో) = కంచరులు.
కణ్ఠియ-శా।క।కో. కంఠికా-మెడనగ.
కత-కథా = చరితము, సంగతి, జోలి, పామెత, చెడుపని, సమాచారము,
కతకారి-కతలు చెప్పువాడు, నేర్పరి. గడుసరి-కతలకారి. [కు = కతుకు
కతకారి తనము-కతలు చెప్పునేర్పు; కత
కతన-కారణము, కతము.
కతమిచ్చు-జాడగా సూచించు.
కతము-కారణము, హేతువు, గుర్తు.
కతలకా(ణా)చి-కతలు చెప్పుటలో నేర్పు కలది-కథానిధి. [లకారి = కతకారి.
కతల కామరాజు-కతలు చెప్పువాఁడు, కత
కతలవడు-వన్నెలుమావు,
కతలుగట్టు-ఉన్నవి లేనివి కల్పించు.
కతిరాగోదు-బాదంచెట్టు జిగురు.
కదుకు-తిను, నాలుకతో నాకి పీల్చు, ఎంగిలి తిను, గాయపుగుర్తు.
కతుక్కు-కటుక్కు, ఒక ధ్వన్యనుకరణము.
కత్తరము-కత్తళమ్ = కవచము.
కత్తరి-కంత్రి, ఒక నీటిపురుగు.
కత్తరించు-ఆడించు, తొలఁగించు, కదలించు
కత్తరిగలయు-కలియు, సంకరమగు.
కత్తరిలు-ల్లు = కదలు, క్రాలు.

కత్తలము ⎫ కర్తలాణః = కవచము
కత్తలాణ-ము ⎪ తొడిగిన గుఱ్ఱము, ఖట్లాన
కత్తలాన-ము ⎪ దేశపుగుఱ్ఱము, తెల్లగొరిజ
కత్తలాని ⎭ తోఁక వెండ్రుకలు గల
నల్లగుఱ్ఱము-కత్తళ(ఁడు)ము.

కత్తవ-మట్ట పెల్లగించు పనిముట్టు, ఎక్కా-ము, కొయ్యగసిక, చేనిగట్టు, చెఱువుగట్టు, కొండచోటు.

కత్తవము-చిన్న ముల్కికాలువ.

కత్తళఁడు-కత్తలాని.

కత్తళము ⎫ కవచము, ఒక ఆయుధము.
కత్తళా ⎭ కవచము తొడిగిన గుఱ్ఱము.

కత్తళీఁడు-కవచధారి, వర్మితుఁడు.

కత్తాయి-కరబంద, కలబంద.

కత్తి-కర్త్రీ = చాకు, కత్తియ, పరిమితమైన పొలము, ఒక జెట్టిపెనకువ, నలుబది యెకరముల (వదునాల్గు కుంటల) నేల.

కత్తికట్టు-కయ్యమునకు కాలుదువ్వు.

కత్తికాసు-వడ్రంగి గీఁతలు గీయుట కుప యోగించు పనిముట్టు-గీఁతకట్టె.

కత్తిగంటము-ఒకవైపున (తాటాకు చీల్చు టకు) కత్తిగాను వేఱొకవైపున (వ్రాసి కొనుటకు) కలముగాను ఉపయోగించు పనిముట్టు-గంటము.

కత్తిగొంటు-కత్తివలె చుఱుకైనస్వభావము కలది-క్రూరురాలు [కొడవలి.

కత్తిదోటి - పొడుగాటి గడకొనకు కట్టిన

కత్తినూఱు-కయ్యమునకు కాలుదువ్వు.

కత్తిపిట్ట-విరహుల పాలిట కత్తికోఁతవలె కూసెడుపిట్ట-కోయిల

కత్తిపిడి-త్సరువు, నెమ్మిలిపరుజు +

కత్తిపిడిక-కల్లుగీఁతగాని కత్తులపొది

కత్తిపీఁట-కర్త్రీపీఠః-కత్తియమర్చిన పీఁట.

కత్తిపేరిమెకము-ఖడ్గమృగము-ఖడ్గి.

కత్తిమందు - కుఱుపుమందు, పిడిలోకత్తి నమర్చుటకై ఉపయోగించు జిగురు, కత్తి యొరకు పూయు రంగు, స్నుహీక్షీరము.

కత్తిమీఁదిసాము - అపాయకర మగుటచే మిక్కిలి జాగ్రతతోఁ జేయఁదగినపని, మిక్కిలి కష్టమైన నియమముగల పని-అసిధారావ్రతము.

కత్తియ(త్తె)-ఒకస్త్రీ ప్రత్యయము-కత్తె.

కత్తియ(త్తె)ము-అంకెల అడ్డదంతి, వరుస-

కత్తిరించు-కత్తరించు, కత్రించు.

కత్తిరిగాపు-కట్టుబాటు.

కత్తిరిలు-ల్లు = తెగు, చినుఁగు, ఎడఁబాయు

కత్తిరివావిలి-ఆకులు కత్తిరించినట్లుండు ఒక వావిలి +

కత్తివాటు-కత్తిదెబ్బ. [బాణము.

కత్తివాతితూపు-కత్తివంటి మొగము గల

కత్తివాతియమ్ము-చూ, పై. [చేయు.

కత్తిసాముచేయు. - అపాయకరమైన పని

కత్తు-ఉత్తరము, తీరు, ప్రాయము, కత్తిగీత,

కత్తుఁబోను-కత్తు లమర్చిన బోను-అతిక్లేశ కరమైన చోటు

కత్తులునూఱు-పగగొను, పంతగించు.

కత్తువ-మన్ను పెల్లగించు గసిక, చేనిగట్టు.

కత్తె = కత్తియ, ఒకస్త్రీ ప్రత్యయము

కత్తెర-కర్తరీ = కత్తరించెడుఒకపనిముట్టు -కత్తిరి, కృత్తికా నక్షత్రము, భరణి

మూఁడు నాల్గు పాదములందును-కృత్తిక యందును రోహిణిమొదటిపాదమందును సూర్యుఁడుండు కాలము, కృత్తికకార్తె, ఒకానొక జెట్టిపెనకువ.
కత్తెరకాఁడు-కత్తెరదొంగ, మోసకాఁడు, కత్తెర చౌర్యసాధనముగాఁ గలవాఁడు.
కత్తెరకాలు-పోటిగాఅమర్చెడుమార్పుకాలు
కత్తెరకోల-కత్తెర, కర్తరి.
కత్తెరగడ్డము-చివరలు మాత్రము కత్తెర వేసిన గడ్డము.
కత్తెరగాయము-కత్తెరరూపు కిటికీ.
కత్తెరచుక్క-కార్తె, షట్తారక, కృత్తిక*
కత్తెరదొంగ - కత్తెరతో జేబు కత్తిరించు
* దొంగ-కత్తెరకాఁడు, కొల్లగాఁడు.
కత్తెరనెల-కృత్తికా నక్షత్రముతోఁగూడిన పున్నమగలనెల-కార్తికము.
కత్తెరబావిలీలు-స్త్రీలు చెవులకు తాల్చెడు కుంచెన కుచ్చులు, కర్తారిక.
కత్తెరరిక్క-కృత్తికా నక్షత్రము.
కత్తెరరిక్కనెల = కత్తెరనెల.
కత్తెరవంగ-కర్తారికా = పెద్దవంగ.
కత్తెరవానము-కత్తెరవలె కూర్చినవానము.
కత్త్రి-జక్కిణి అనునొక నాట్యాంగము.
కత్త్రించు-వస్త్రాదులను ఛేదించు-కత్తిరించు, కత్తరించు. క కత్తరిసు
కద-ప్రశ్నము ప్రసిద్ధి నిశ్చయ సంతాప ప్రశంసాదులను దెల్పుపదము-కదా,కదే, కాదే మొ॥ - కథా = కత, చరితము
కదంబ(క)ము-కదంబః = మిశ్రము,యక్ష కర్దమము, దప్పళము,
కదంబకావులు-మిశ్రమైన కావిరంగుబట్టలు
కదంబించు - తగుల్కొను, కూడుకొను, అంటించు, కలియు, కలుపు
కదడుకొను-పూను, నెలవు చేసికొను,
కదను = చూ. కదము
కదన్న- ప్రశ్నము-ప్రసిద్ధి- ప్రార్థనము-నిశ్చయము-సంతాపము మున్నగుభావములను సూచించు మహత్సంబోధనము.
కదపా-ఈనాందారునకురైతు వ్రాసియిచ్చెడు ఒడంబడిక. [రూ. కదను,
కదము-స్కంధః = సమమైన గుఱ్ఱపుపరుగు
కదమ్మ-ప్రశ్నప్రసిద్ధిప్రార్థన నిశ్చయసంతాపములనుసూచించుమహతీసంబోధనము.
కద(య్య)య్యా = కదన్న.
కదరన్న-కదన్న.
కదరమ్మ-కదమ్మ.
కద(రయ్య)రె-(రే) - కదయ్య, కదన్న.
కదలఁబారు-చలించు, కదలఁజొచ్చు.
కదలడము-కదలిక, కదలుడు.
కద్దలాడు-కదలు, నడయాడు.
కదలారతి - వధూవరులు మున్నగువారు కదలివచ్చినపుడుగాని కదలిపోవునపుడు గాని ఇచ్చెడు మంగళారతి.
కదలారతి పళ్లెరము-శుభవేళలందు హారతిచ్చు పళ్లెము.
కదలించు-కదలునట్లుచేయు కదలుచు.
కదలిక-పూనిక, పయనము, పరుగు, కదలుట, కదలుడు, కదలడము.
కదలిపోక-పయనము, కదలిక.

కదలు-వడచు. పూను. పయనమగు, దండెత్తు, పోవు. చెడు, పరుగెత్తు. కదలిక, పూనిక. పయనము.
కదలుచు-కదలించు, కదల్చు.
కదలు(ట)డు-కదలిక, పయనము.

కదలుతులుము, కదలుపరువడి, కదలుమొన - ఒకానొక జెట్టిపెనకువ, ముప్పదిరెండు మల్లవిన్నాణములలో నొకటి.

కదల్చు-కదలించు, కదలుచు, కదపు.

కదవమ్మ-మ్మా, కదవయ్య-య్యా, కదవె-వే, కదా - ప్రశ్న. ప్రసిద్ధి, ప్రశంస, ప్రార్థనము అను నర్థములు సూచింపఁబడును

కదించు-కదియఁజేయు, గట్టిచేయు, దగ్గఱగాఁజేయు, బిగియఁజేయు, తాల్చు, కట్టు, లాగు, పొదుగు, అతుకు, చేరు. కదియించు.
కదియఁబడు-కలియఁబడు, కలఁగు, పెనఁగు.
కదియించు-చూ. కదించు.
కదియిక-కదియుట.
కదియు-చేరు. పొందు, ఎదిరించు, అంటు, కలుగు, సమానమగు.
కదిరించు-చేయు. కదురాడు.
కదిరిణి-జడ-వేణి, అల్లినజుట్టు
కదుకొను-కదుకొను, మించు, ఉప్పొంగు.
కదుపు-కదంబమ్ - గొఱ్ఱెలమంద, గోగణము, గుంపు, దండు, మంద కొల్చలము-పడుపు. కదలించు.
కదుపుకట్టు-గుమికూడు
కదుపులుగొను-మందలుపెట్టు [గదుము.
కదుము-పైఁబడు, కష్టపెట్టు; బొప్పి, వాఁపు.
కదుముకట్టు-బొప్పికట్టు, వాఁచు.
కదురాడు-రాటము తిరుగు, నూలుతీయు.
కదురు-కలుగు, హెచ్చు, క్రమ్ము, మఱిడు; నూలువడకు వనిముట్టు. ఒక దినుసుగడ్డి.
కదురుకొను-మించు, ఎదుర్కొను.
కదురులాడు-మాటలాడు.
కదులు-కదురు.
కదె-దే = కదా, కాదా, కాదె, కాదే.
కద్ది-వలపువంత-విరహబాధ.
కద్దు-ఉన్నది, కలదు, సబబు. సరి.
కద్దుమ-దట్టము, తఱచు
కన(క)-కనుక, కాఁబట్టి, కాన, కావున.
కనకతప్పెట-భేరి, ఢక్కా, తప్పెట.
కనకదండెలు-ఒక దినుసుబట్ట.
కనకన-కోపించుట మండుట ప్రకాశించుట రాలుట మున్నగువానియందగు అను కరణము. [తెల్లని చామరము.
కనకదండవెంజామర - బంగరు కామగల
కనకననవ్వు-హేళనచేయు, [ప్రకాశించు.
కనకన(మను)లాడు-మిక్కిలిగా మండు,
కనకపిళ్లె-కరణము, పట్వారి.
కనపపులు-బెల్లు, శరము.
కనమ-గాయము మానినమచ్చ [పమి
కనమి-కానమి, చూడకపోవుట, ప్రసవింకనరిపీసాలు-ఒకతెగ నాణెములు.
కనరు-కోపించు, వెగటు చూపు, కనలు, కనారిలు, ఒగరు, వెగటు, కినుక, దురద, కందగడ్డ, వెగటైనది,
కనరువోవు, కనరెక్కు - కాటువోవు, వెగటుతోఁచు.

కనలించు-కోపింపఁజేయు, అలుగఁజేయు.

కనలిక-కోపించుట-అలుక, చూ. కనరు.

కనస-ఒక దినుసుచేఁప.

కనాతి(గోడ)బట్ట-దళసరిబట్టతో నిర్మించిన గోడ-సరాతి.

కనారిలు-కనరు. కనలు, (త. కనఱల్.)

కనాలు-వెలిగాడి పుల్లలు.

కనికట్టు = కనుమాయ, గారడి-కనుకట్టు.

కనికనిచీకఁటి-మనక(కను)చీఁకటి.

కనిక(కా)రము-జాలి, దయ, వగపు,

కనికరించు-జాలిచూపు, వగచు.

కనికెడు-కమికెడు, కంకెడు.

కనికొను | చూచు, కనుఁగొను, కనిపెట్టు,
కనిపట్టు | క్రొత్తగా తెలిసికొను.

కనిపించు-కనఁబడు, కనఁజేయు, కలిగించు

కనిపెట్టు-ఎదురుచూచు, వేఁచు, గ్రహించు, వెదకిపట్టు. రూ. కనిపట్టు.

కనిపెట్టుకొను-ఎదురుచూచు. [గనియ,

కనియ-ఖండః = ముక్క, గండ్రిక. రూ.

కనియు-మాగు, మగ్గు, ముగ్గు, కమియు, మెత్తఁబడు, చూచు.

కనివాడు-భట్రాజు, బట్టువాఁడు.

కనిపెరము-డేగ, కణస(సె)రము.

కనీసము-కనీయస్ = అధమము, హీనము.

కను-చూచు, ప్రసవించు,పొందు, ఎఱుఁగు, ఆసరాకోరు, కలుగు, చూపు, గనుపు, క్రిందిగుంట, కన్ను, చిన్నది.

కనుంబొమ-కనుబొ(మ్మ)మ-భ్రూవు, కంటి పైనుండు వెండ్రుకల చాలు.

కనుఁగడ-కంటికొన, అపాంగము.

కనుఁగవ-కన్నులజంట, కందోయి రూ. కనుంగవ, కన్నుగవ, కన్గవ.

కనుఁగాపు-బంటు, నౌకరు, కనుసైఁగ గ్రహించి పనిచేయుటకై ఎదురుచూచు సేవకుఁడు.

కనుఁగొట్టు-కనుగీఁటు, కనుసైఁగచేయు.

కనుఁగొను-కాంచు, కనిపెట్టు, కనికొను. రూ. కనుంగొను, కన్గొను.

కనుఁగొలుపు-కనుఁగొనఁజేయు.

కనుఁగోలు-కనుఁగొనుట, కనిపెట్టుట.

కనుఁజాటు-కీలు, కిటుకు, దాఁచినది.

కనుఁజాటువేయు - కనుమఱుగుగా (తప్పుకొని) తిరుగు.

కనుఁదురు-కఱు(డు)ఁదురు, కందురీఁగ.

కనుఁబాటు - కన్నుపడుట - చూపు, దృష్టి దోషము-దిష్టి.

కనుఁబెంటి-కాఁబోవు ప్రయోజనములను సూచించెడు నొకపిట్ట-జీలుగుపిట్ట-శకున పక్షి-సకినాలపిట్ట-కన్పెంటి, కన్పెంటి.

కనుఁబ్రాము-కనుపులుము, కనుమూయు, కనుమొఱఁగు, కికురించు, కన్నుఁబ్రాము, కన్ప్రాము.

కనుక-కాఁబట్టి, కావున, కాన, కన్క,అయినను, సుమా, ఒక ఊఁతపదము.

కనుకట్టు-గంత, గారడి, కనికట్టు.

కనుకని-వెఱపు, కలఁత, పట్టుదల, జాగరూకత-కన్కని. [నేత్రము.

కనుకను-జాగ్రత్త కలుగు-కన్గను, ప్రతి

కనుకలి-చూపు, దృష్టి-కన్కలి, చూచుట వలని మోహము.

కనుకుట్టు - బాధించువాఁడు, పగవాఁడు, అసూయపడువాఁడు. [అసూయ.
కనుకుట్టుఁదనము-చూపోపమి, కిట్టనితనము
కనుకూ(రుకు) - ర్కు = కనుమూయు, నిద్రించు-కన్నుకురుకు [కూలి.
కనుకూలి - దినబత్తెము, ధాన్యరూపమైన
కనుకొరుకు-నిద్రకై కనుమూయు.
కనుకొలికి-నేత్రాంతము-కడకన్ను.
కనుగట్టు-మోసగించు, మాయచేయు.
కనుగడ-కడకన్ను, కనుకొలికి, దగ్గఱ.
కనుగప్పరగాడు-గబ్బిలము.
కనుగప్పు-కనుఁబ్రాము, కికురించు. [గిట్టు.
కనుగలుగు - జాగరూకత వహించు, కను
కనుగిట్టు-కనుసైఁగచేయు, కనుగీఁటు.
కనుగిఱుచు-కనుసైఁగచేయు.
కనుగిఱు(లు)పు-కన్నుగీఁటు, కనుసైఁగ.
కనుగీఁటు-కనుగిట్టు, కనుసన్న.
కనుఁగు-ఒక దినుసుచేఁప
కనుఁగు-రవికెగుడ్డ-కణము.
కనుఁగొను - కన్నుకలవాఁడగు, చూచు, ఎఱుఁగు, పొందు.
కనుగూరుకు-ర్కు = కన్మూయు, నిద్రించు
కనుగొలుపు కనుగిలుపు, కనుగొట్టు.
కనుగ్రుడ్డు-కంటిగ్రుడ్డు, నేత్రగోళము.
కనుచాటు-మఱుఁగు, కనుమాటు, మర్మము, రహస్యము.
కనుచీఁకటి-లేఁజీఁకటి, చీఁజీఁకటి, మసక చీఁకటి-సంధ్యాకాలపు చీఁకటి.
కనుచూపు-కంటికి కనఁబడునంతదూరము, కనుపట్టు, కనఁబడు.

కనుచెదరు - చెల్లాచెదరగు, కకావికలగు.
కనుచోటు-ఆఁడుగుఱి, మఱుఁగుచోటు.
కనుఁదురు-కణుఁదురీఁగ, కంద్రీఁగ.
కనుదోయి-కన్నులజంట-కన్దోయి
కనునీరు-కంటినీరు, కన్నునీరు, కన్నీరు.
కనుపండువ(వు)-చూచువేడుక, కనువిందు
కనుపట్టు | చూపట్టు, కనఁబడు } కానవచ్చు,
కనుపడు | కన్ప(ట్టు)డు.
కనుపపులు-తెల్లుగడ్డి, కాశము.
కనుపఱచు-చూపించు, కన్పఱచు.
కనుపాప-కంటిలో గనఁబడు (నల్లగ్రుడ్డు) ప్రతిబింబము - కంటిపాప, కనుపూప - రూ. కన్పాప.
కనుపాలవిత్తులు-కుళుత్థాంజనము.
కనుపిరికి-మాడఁగనే బెదరుట.
కనుపు - చెఱకు వెదురు మున్నగువాని గనుపు, గంటు, కన్ను-గర్వము రూ. కన్పు, కణుపు
కనుపుకొ(గొ)ట్టు-చంపు, ముక్కలుచేయు, కలఁచు, పోఁగొట్టు, పడవైచు, చెల్లా చెదరు చేయు-కన్పుకొ(గొ)ట్టు
కనుపులగుండ్లు - మణికంకణము, మురుగులు-గాజులు, తోడాలు.
కనుపులవిలుకా(ల్కా)ఁడు - చెఱకుగడ విల్లుగాఁ గలవాఁడు - చెఱకువిల్తుఁడు.
కనుపులవిలుతు(ల్తు)ఁడు-మన్మథుఁడు
కనుపులి-పశువులకు కంటిమీఁద నుండెడి తెల్లమచ్చ-కంటిపులి, కన్పులి. (యజమానికి కీడు తెచ్చును)
కనుపులుము-కనుమూయు, కికురించు.

కనుపెట్టు-ఆలోచించు, కాపాడు, ఎదురు చూచు,కనుగొను. రూ కనిపెట్టు,కన్పెట్టు.
కనుపొట్ట-కంటిరెప్ప-పక్ష్మలము,
కనుబంటి-జీలుగుపట్ట-సకునాలపిట్ట
కనుబడి-రాఁబడి, పుట్టుక, అంచనా.
కనుబేటము-చూపులవలనఁ గలుగు ప్రేమ-కంటివలపు
కనుబొమ-మ్మ = కనుంబొమ.
కనుమ - కొండలోయ, సందు, కన్నము, గండి. పండుగ మఱునాఁడు, కన్మ.
కనుమబ్బు-కొంచెము చీఁకటి-చీఁజీఁకటి, సంధ్యాకాలపుఁ జీఁకటి.
కనుమరి - కర్మారః = ఇనుపపనివాఁడు - రూ. కమ్మరి, కరుమలి-కన్మరి.
కనుమఱి-చాటు, మఱుగు, మర్మము.
కనుమఱుఁగు(వు)-కంటికడ్డముగాఁ గట్టెడు గంత, చాటు, కప్పు, అడ్డు
కనుమఱుపడు-కంటికి చాటగు
కనుమసక-కొంచెము మసక చీకటి.
కనుమఱువుసేయు-మఱుగుచేయు
కనుమాటు - కంటి కగపడకుండఁ జేయు, కనుకప్పు, కనుమూయు, కనుమొఱఁగు, మోసగించు రూ. కన్మాటు.
కనుమాపు-మాయముచేయు, చాటు, కొంచెము మాయుట.
కనుమాపు చేయు - కంటి కగపడకుండఁ జేయు, కొంచెము మాయునట్లు చేయు.
కనుమాయ-కనుకట్టు, పసరుకట్టు, గారడీ-ఇంద్రజాలము.
కనుమాయు-కొంచెముమాయు.
కనుమారి-కనుమపైనుండు సమతల ప్రదేశము, కొండచఱియ-సానువు.
కనుము-సంక్రాంతి పండుగకు మఱుసటి దినము, జెల్లు, కన్నము, రవికెగుడ్డ
కనుమూరిఁబడు - కొండపైనుండిపడు.
కనుమూయు-కికురించు, నిద్రించు, చచ్చు
కనుమూసిగంత - జంతువుల కంటికిఁ గట్టెడు తోలుబిళ్ళ, దాఁగిలిమూఁతలు.
కనుమొగుచు-కనుమూయు, మోసగించు.
కనుమొ(ర)ఱఁగు-దాఁగియుండు, మోసగించు, కనుకప్పు-రూ. కన్మొఱఁగు.
కనుమోడుచు-(డ్చు) = కన్నుమూయు, నిద్రించు, కన్నుమోడ్చు. కన్మోడ్చు
కనుమోసము-చూపుతప్పు, చూచుచుండఁ గనే జరిగిన మోసము
కనురెప్ప-కంటిరెప్ప-కనుపొట్ట
కనువిందు-కన్నుల పండువు,
కనువిచ్చు-కన్నుతెఱచి చూచు.
కనువినికి } కన్నువీనుగాఁగలది-పాము-
కనువినుకలి } కంటివిన్కరి-చక్షుశ్శ్రవము.
కనువినుకలినెలవు - పాములకు నెలవయినది-పాముపుట్ట, పాతాళము, నాగలోకము
కనువినుకలినెలవుపుట్టు-పుట్టయందుబుట్టిన వాఁడు - వాల్మీకి - బొఱియ చూలి-
కనువిప్పు-మెలఁకువగా నుండుట.
కనువిప్పు కలుగు-తెలిసివచ్చు.
కనువెచ్చ-కంటివేఁడిమి, నులివెచ్చ-తనువెచ్చ-కదుష్ణము,
కనువెలుఁగు-కంటికి వెలుఁగు వంటి(ది) వాఁడు, దారి చూపువాఁడు.

కనువేఁదుఱు-చూచినంతనే కలిగెడు ప్రేమ -వెఱ్ఱివలపు, కంటిపిచ్చి. కనుబేటము.
కనువేగు-తెలతెలవాఱు, కన్వేగు
కను(వేయు)వైచు-ఆశించు. కోరు.చూచు
కనుసన్న-కంటిసంజ్ఞ, కనుగీఁటు. [కొను
కనుసన్న మెలఁగు-ఆజ్ఞకు లోఁబడి నడచు
కనుసైఁగ = కనుసన్న, కనుగిట్టు.
కనుసోగ-కంటివైశాల్యము, కంటిపొడవు.
కనోజా-కన్యాకుబ్జదేశపు భాష
కన్కసరు-కోపపుచూపు. అసూయ.
కన్గంట-కంటి కెదురుగా.
కన్గడ-కడకంటిచూపు-కనుగడ.
కన్గలుగు-మెలకువగా నుండు. అప్రమత్తుఁడగు-రూ కనుగలుగు
కన్గవ-కన్నులజంట-కనుఁగవ, కందోయి.
కన్దెలు-కంటికి తెలుపౌటిడి-కంటితెప్ప.
కన్దెఱచు-కనువిప్పు. కన్నుతెఱచు
కన్దోయి-కన్నులజంట, కనుదోయి
కన్న-కంఠెన్, చూచిన
కన్నకొడుకు-ఔరసపుత్త్రుఁడు.
కన్నగాఁడు-కన్నపుదొంగ, గడిదొంగ.
కన్నఁడు-కృష్ణః = కృష్ణుఁడు, కన్నవాఁడు
కన్నడ-అనాదరము, ఉపేక్ష, ఈసడింపు,
కన్నశవ, ఒక స్త్రీరాగము.
కన్నడఁడు-కన్నగాఁడు, కన్నపుదొంగ.
కన్నడిగించు-ఉపేక్షించు. త్రోసిపుచ్చు
కన్నడగౌళ-ఒకానొక రాగము [బాస.
కన్నడము-కర్ణాటః = కర్ణాటదేశము,కన్నడ
కన్నడవు-ఉపేక్ష, అశ్రద్ధ. తిరస్కారము-కనడ్చు, కన్నశవు.కన్నశువు, కన్నడుగు.
కన్నడసేయు-ఉపేక్షించు, త్రోసిపుచ్చు.
కన్నడి-కర్ణాటదేశపువాఁడు, తిరస్కరించువాఁడు, విల్వుటద్దము.
కన్నడించు-ఉపేక్షించు, కర్ణాట భాషలోనికి తర్జుమాచేయు.
కన్నడీఁడు - తిరస్కరించువాఁడు, కర్ణాటదేశీయుఁడు-కన్నడి, కన్నపుదొంగ.
కన్నడుగు-చూ కన్నడవు [తల్లి.కన్నెపి.
కన్నది - చూచినది, ప్రసవించినది, కన్న
కన్నదేగాతి-చూచినదే తిండి.
కన్నన = క్రిన్నన, శీఘ్రముగా
కన్ననాకొడుకు-దొంగ, ముచ్చు.
కన్నపుఁగత్తి-కన్నముచేయు కత్తి
కన్నపుదొంగ-కన్నగాఁడు తెక్కలికాఁడు
కన్నపెట్టు - కన్నముపెట్టు, కన్నవెట్టు. కన్నమువేసి దొంగిలించు.
కన్నము-ఖననమ్ = దొంగలుచేయు రంధ్రము-బొక్క, బొరికె, బొరియ.
కన్నముపెట్టు-కన్నముచేసిలోనఁజొరఁబడు దొంగిలించు, కన్నపె(వె)ట్టు
కన్నమువేయు-దొంగతనము వేయు.
కన్నయ్య-కృష్ణః = కిచ్చయ్య,కన్నతండ్రి.
కన్నర-అు = దుఃఖము, వెత.
కన్నరి-టి = దుఃఖితుఁడు
కన్నశవు = కన్నడవు [విటుఁడు.
కన్నవాఁడు = కన్నతండ్రి, చూచినవాఁడు.
కన్నవిటి-గ్రుడ్డివాఁడు-చీకు
కన్నవెట్టు = కన్న(ము)పెట్టు.
కన్నశువు = కన్నడవు.
కన్నా-ఎక్కువ, మిక్కిలి.

కన్నాఁగు-కన్నుమూఁతపడు, మోసగించు.
కన్నాఁడు-చూచినవాఁడు, కన్నయ్య.
కన్నాకగు - సేనాపతియగు, శ్రేష్ఠమగు, ఇంపగు
కన్నాకు-మోడలో కంటికింపైన ముందటి తమలపాకు, కోటాకు, ముందటాకు, శ్రేష్ఠుఁడు, కాపాడువాఁడు.
కన్నాత-32 తెగలలో ఒకానొక జెట్టి పెన కువ, ఒకానొక రతిబంధము
కన్నారఁజూచు-తృప్తిగాఁ జూచు.
కన్నాస-కంటికి ఆశగొల్పునది. కన్నిచ్చ.
కన్నానయగు-కంటివాపిరి యగు.
కన్నింగలము-కంటినిప్పు, అసూయ.
కన్నికలు-చెఱువు కట్టపై నిర్మించిన ఏడు మట్టిగుజ్జములు-సప్తకన్యలు. వీనికి పొం గళ్లు పెట్టగనే వర్షమువచ్చి చెఱువునిండు నని పూర్వుల విశ్వాసము.
కన్నిచ్చ-కన్నాస, కనుపండువు.
కన్నిడియుంట-జాగ్రత్తగాఁ జూచుట.
కన్నిడు-కన్నువేయు, కోరు, వలచు
కన్నియ-కన్య = పెండ్లికాని పడుచు. కూఁతురు, ఆఁడుది, కర్ణి = పలుపుత్రాడు, చిన్నది, లేఁతది, మొదటిది, కన్నె.
కన్నియలేడి-కారండవ = కన్నెలేడి.
కన్నిరి(రీ)కము-కన్నె(ర)రికము - రజస్వ లానంతరము వెలయాలికి విటునితోడి ప్రథమ సంపర్కము.
కన్నీరు-కన్నునీరు-అశ్రువు.
కన్ను-(కనునది) నేత్రము, చూపు, జాడ, తన్నము, నెమలిపురికన్ను, బండిచక్రము, గనుపు, వంతెనదారి, చిల్లు, మద్దెలమీఁది నీలమండలము, మోసము.
కన్నుంచు-కనిపెట్టు, మనసుంచు
కన్నుఁగవ-కన్నులజంట-కనుగ(గ్గ)వ
కన్నుఁబ్రాము-మోసగించు. కనుపులును.
కన్నుకట్టు - దాఁగుడు మూఁత, గారడి మోసము-కనుకట్టు [పోవు.
కన్నుకుట్టు - అసూయపడు, చూపోపలేక
కన్నుకురుకు-నిద్రకై కనుమూయు.
కన్నుకొట్టు = కన్నుగీటు. కనుసైగచేయు.
కన్నుగప్పు-మోసగించు-కన్నుమూయు.
కన్నుగానకపోవు } -పొగరెక్కు. క్రిందు
కన్నుగానకుండు } మీఁదు గానకుండు.
కన్నుగీటు-కనుసైఁగచేయు కన్నుకొట్టు.
కన్నుచెదు-సొగసుచూచి వలచు.
కన్నుతిరుగు-పైత్యభ్రమ కలుగు. [కొను
కన్నుదెఱచు - తెలివినొందు తప్పు తెలిసి
కన్నుదూఱు-నచ్చు, అందమని తోఁచు.
కన్నుదోయి-కన్నులజంట, కందోయి.
కన్నునీరు-కంటినీరు, కన్నీరు, అశ్రువు.
కన్నునీలాలు-నీలమణులు.
కన్నుపడు-కన్నిడు, కన్నువేయు, కోరు.
కన్నుపొడుచు-మోసగించు, పీడించు
కన్నుబొమ(మ్మ) = కంటిపై బొమ్మవలె నుండు వెంట్రుకల చాలు-కనుబొమ.
కన్నుమప్పు-కన్నుగప్పు, మోసగించు.
కన్నుమిక్కిలివేలుపు-ఒకకన్ను మిక్కిలి గాఁగల వేలుపు-శివుఁడు-ముక్కంటి.
కన్నుమిన్ను గానకుండు-పొగరెక్కు.
కన్నుమునగ-సమృద్ధిగ.

కన్నుమూయు - నిదురించు, మోసగించు, చనిపోవు. రూ కన్మూయు,కనుమూయు.
కన్నుమూసిగంత-దాఁగుడుమూఁత, కన్నులు కప్పుటకై కట్టెడి తోలుబిళ్ళ.
కన్నుమొగుచు-నిద్రించు, ముకుళించు.
కన్నుమొఱఁగు-మోసగించు, కనుగప్పు.
కన్నుమోడ్చు-నిద్రించు, కన్మొగుచు.
కన్నుమోడ్పు-నిద్ర-కనుమో(న్మో)డ్పు.
కన్నులఁగట్టినట్లు-ప్రత్యక్షముగా.
కన్నులఁగట్టు-మోసగించు, కన్బ్రిమ్ము
కన్నులఁగప్పుకొను - ఆదరించు, కన్నుల కద్దుకొను, దయచూపు.
కన్నులఁబడు-కంటఁబడు, కానవచ్చు.
కన్నులకచ్చి-కనుకట్టు, దాగుడుమూఁత.
కన్నుల కద్దుకొను-పూజించు, గౌరవించు.
కన్నులకఱవు-చూచునదృష్టములేకపోవుట
కన్నులక(లికి)ల్కి = అందమైన కన్నులు గల యాఁడుది. [వడు
కన్నులవిప్పులురాలు-కోపమున కన్నులెఱ్ఱ
కన్నులపండువు - చూడవేడుక-నేత్రోత్సవము. [పిట్ట, నెమలి
కన్నులపక్కి-కన్నులతోఁగూడిన పురికల
కన్నులప్పగించు-నిస్సహాయుఁడగు
కన్నులమండ(మ్రాను)-చెఱకు + -తియ్య మ్రాను.
కన్నులమ్రాన్విలు (కా-తు) ఁడు / కన్నులవింటి (జోదు) వాఁడు } చెఱకు విల్లు గల వాఁడు - మన్మధుఁడు [పాము,
కన్నులవినుక(న్క-)లి-కన్నులచేవినునది-

కన్నులవిలుకా(ల్కా-)ఁడు / కన్నులవిలుతు(ల్తు)ఁడు } - కన్నులుగల చెఱకువిల్లు కల వాఁడు-మన్మధుఁడు.
కన్నులార్చు-కనుసైగచేయు, ఱెప్పవేయు.
కన్నులు చల్లనగు-తృప్తిపడు, హర్షించు.
కన్నులు తలకెక్కు - గర్వమున కంటితో కక్రిందు చూడకుండు. [వచ్చు.
న్నులు తిరుగు-పొగరెక్కు-, వికారము
కన్నులువాచు-కనుపొట్ట లుబ్బునట్లు రాక కెదురుచూచు.
కన్నువడు-ఆశించు, కోరు, నిద్రపట్టు.
కన్నువినక(న్క-)లి-కన్నులచే వినునది - పాము. [ఆసపడు, కోరు.
కన్ను(వేయు)వైచు-కన్నిడు. చూపాన్చు.
కన్నువొందు-కన్నుమూయు, నిద్రించు.
కన్నె-చూ. కన్నియ.
కన్నెక-కన్యకా = కన్నె, ఆఁడుది.
కన్నెకయ్యము - పోరుమొదలు, కన్నెల కయ్యము.
కన్నెకలుపు-తొలి(రతి)కలయిక.
కన్నెకూరిమి-ర్మి = తొలివలపు.
కన్నెకొమర-రి / కన్నెకోమలి } ఒకానొక మందుమొక్క-.
కన్నెగోరుకోఁత-కన్నెకు ఈడు వచ్చెనను సూచనగా గోళ్లు తీయునట్టి కొన్ని కుల ములవారి సంస్కారము.
కన్నెచెఱ వదల్చు-పెండ్లిచేయు.
కన్నెతనము-కన్నెఱికము.
కన్నెది-కన్నె(పిల్ల), కన్నియ.
కన్నెదుగు-జాడతీయు.

కన్నెపిట్ట-కారండవము, కన్నెలేడి [యి.
కన్నెబావి-నీరులేనిబావి. చిన్నబావి, పిల్లనూ
కన్నెము-కోడిగుండెకాయ
కన్నెరకము
కన్నెఱిక(ర్కౕ)ము } వెలయాలి తొలిరతి,
కన్నెఱుఁగు-చూచు, గ్రహించు.
కన్నె(అ)ఱ్ఱ - కన్ను ఎఱ్ఱనగునట్టిది-కినుక,
చూచువారికి కంట్రటగింపుగా నుండుట
కన్నెఱ్ఱయగు-అసూయపడు, చూపోపలేక
పోవు.
కన్నెఱ్ఱఁజేయు-కోపవికారము చూపు.
కన్నెలే(డి)డు-కన్నియలేడి. కల్నెటుపక్షి,
కారండవము-మహాపక్షము
కన్నెసరులు-ఒక దినుసువడ్లు
కన్నేయు-కన్నువేయు, కోరు, ఆశించు.
కన్నో(జ-జా-జి) = కన్యాకుబ్జదేశభాష
కన్నోట-టు - జంకు, కొంకు. దిగులు
కన్నోదు-చూడవెఱచు. వలచిచూచు
కన్పట్టు-కనుపట్టు. కనఁబడు
కన్పాప-కంటిపా(పు)ప.కనుపాప. [ము.
కన్పు-చెఱకు మున్నగువాని గ్రంథి-పర్వ
కన్పుగొట్టు-కనుపుగొట్టు.
కన్పులగుండ్లు-కనుపుల గుండ్లు.
కన్పులవిలుకా(ల్కా)ఁడు
కన్పులవిలుతు(ల్తు)ఁడు } మన్మథుఁడు.
కన్పులి-జంతువుల కంటిమీఁది పుట్టుమచ్చ.
కన్పెంటి-జీలుగుపిట్ట-శకునపక్షి.
కన్పెట్టు - కాచు, కనుగొను, ఆలోచించు,
తెలిసికొను. రూ కనుపెట్టు.
కన్పొట్ట-కనుఱెప్ప. కనుపొట్ట.
కన్బ్రాము-మోసగించు, కికురించు.
కన్బొమ్మ = కన్నుబొమ్మ.
కన్మరి-ఇనుప పనివాఁడు-కమ్మరి.
కన్మూయు-కన్నుమూయు.
కన్మూసిగంత-కన్నుమూసిగంత.
కన్మొగుచు = కన్నుమొగుచు.
కన్మొఱఁగు = కన్నుమొఱఁగు
కన్మోడ్చు = కన్నుమోడ్చు
కన్మోడ్పు = కన్నుమోడ్పు
కన్య-కన్యా = పెండ్లికాని పడుచు-కన్నె,
లేఁతది, చిన్నది. మొదటిది.
కన్రెప్ప-కను(కంటి)ఱెప్ప, కంటితెర.
కన్వెలుఁగు-కంటికి వెలుఁగు వంటివాఁడు-
మార్గదర్శి. రూ. కనువెలుగు
కన్వేగు-తెలతెలవాఱు-కనువేగు.
కన్సోగ-కంటిపొడవు, సోగకన్ను.
కపచెట్టు-ఒక దినుసు చెట్టు.
కపా(డి)ది-గొడ్లపై వేయుబరువు, [వాఁడు
కపా(డి)దివాఁడు-కపాది అమ్మి జీవించు
కపాలు-ఒకానొక జెట్టి పెనకువ-కన్నాత
కపితాను-ఆం. కెప్టెను = నావి(య)కుఁడు.
కపిలబావి-కపిలెనూయి,మోటగల నూయి
కపి(లి)లె-నీరుతోడుమోట, రూ. కపిల,
తూకపుఱాయి.
కపురపుటనఁటి - ఏడాకులనఁటి +
కపురము-కర్పూరః = కప్పు(ప్పూ) రము.
కపురసిల-కప్పురమువంటి శిల
కపురు-సొగసు, సొబగు, సోబ..
కపోదా-గొప్ప(పెద్ద)విల్లు, శిథిలమగువిల్లు.

కప్ప-నీటి(మట్టి)చేఁ గప్పఁబడియుండునది -భేకము. తాళపుకప్ప [బొరల కుఱుపు.
కప్ప(కుఱుపు)గుల్ల-అఱకాలియందు లేచిన
కప్పగంతులు-కప్పగంతులు వేయునట్లెగు రుచు కాలెడు ఒక విధమైన బాణసంచు
కప్పచిప్ప-కప్పయొక్క చిప్ప, ఆలిచిప్ప
కప్పటము-కప్పు(డు), మూఁత.
కప్పడము-కర్పటః = సన్యాసులకాటె, చినిఁ గినబట్ట, అంపె, చింపి, వాణి, వల్లె.
కప్పడికంబళి-గొంగడి. కంబడి
కప్పడీఁడు-కప్పడము తాల్చువాఁడు-దాసరి
కప్పతాళము-కప్పయొప్పుగల తాళము-ముద్ద బీగము-తాళపుకప్ప.
కప్పతిలఁబడు-వెలికిలఁబడు.
కప్పతీఁగ-తీఁగముషిణి + -లతా విషముష్టి
కప్పతేలు-మంట్రగబ్బ-లావుపాటితేలు.
కప్పదాట్లు-అచ్చటచ్చట గెంతుచు ప్రక్క లకు దూకెడు కప్పవలె ముందుకుఁబోవుట
కప్పనాగు(వు)రు-చిఱుకప్పకాటుచేగొడ్లకుఁ గల్గు పొరుడుజబ్బు. [జబ్బు
కప్పనాగులు - మరణకారణమగు గొంతు
కప్పపొక్కు = కప్పకుఱుపు
కప్పము-పన్ను, శిస్తు కానుక
కప్పయెలుఁగుపాము-నోటనున్నకప్ప యఱ చుటచే భ్రమ కలుగఁజేయు పాము-కప్ప గొంతుతో అఱచునట్టి పాము.
కప్పరచీఁకటి-వేఁగుచీఁకటి.
కప్పరపడు-తడఁబడు, తొట్రుపడు.
కప్పరపఱచు-కలవరపెట్టు
కప్పరపాటు-కలఁత, తడఁబాటు.
కప్పరము-కంప్రమ్ = తొట్రుపాటు, చిత్ర వర్ణము.
కప్పలి-కర్పరః = నావ.
కప్పా-చొక్కా, రవికె.
కప్పాడు-నలుపెక్కు. నలుపు
కప్పాసు-కార్పాసః = ప్రత్తి, దూది.
కప్పి(ప్పీ)-బరువులెత్తు యంత్రము,గిలక
కప్పికోల-ఒకజాతి బాణము
కప్పిడు-దాఁచు, కప్పిపుచ్చు.
కప్పిపుచ్చు-దాఁచియుంచు.
కప్పిరి-నలుపు, మసక చీఁకటి.
కప్పు - దాఁచు, మూయు, క్రమ్ము, కట్టు, చుట్టుకొను, నలుపు, చీఁకటి, ఇంటికప్పు, మూఁత, మఱుఁగు, పండ్లకు పూయు మందుపొడి,కప్పునది,నల్లనది.
కప్పుఁగుత్తుకపులుగు-నెమలి, నీలకంఠము.
కప్పుఁగుత్తుకవాఁడు-నల్లనిమెడ కలవాఁడు-శివుఁడు-నీలకంఠుఁడు.
కప్పుఁదెరువరి } పొగరూపుననల్లని
కప్పుఁదెరువుజా(డ) ఱ } దారి కలవాఁడు -
కప్పుఁదెరువు దారి } అగ్ని - కృష్ణ
కప్పుఁద్రోవ(రి)దొర } వర్త్మ.
కప్పుకొను-దాఁచుకొను, మూఁతపెట్టు.
కప్పుటిల్లాలు-నల్లనైదువ, కాళి
కప్పుతెరువుదారి-అగ్ని-కృష్ణవర్త్మ.
కప్పుటేటిగొంగ-యమునానదిని అదుపులో బెట్టినవాఁడు-బలరాముఁడు.
కప్పుటేఱు-కృష్ణానది, యమునానది.
కప్పుటైదువ-కాళి, గౌరి, నల్లనైదువ.
కప్పుటైదువపె(విమి)న్మిటి-శివుఁడు.

కాయపెండలము-తీఁగె పెండెలము.
కాయపొట్టు-కాయధాన్యముల పొట్టు.
కాయము-బాలెంతలమందు, గుజ్జుపుమందు
కాయలరాసి-తప్పవడ్ల ప్రోగు.
కాయిద-ఏఁటేట వేలముపేయుభూమి మొ॥
కాయిదా-చట్టము, కట్టుదిట్టము.
కాయిలా-రోగము-దీర్ఘవ్యాధి.
కాయు-కాస్ = కలుగు, ఎండప్రసరించు, కాపాడు, కాయలుపుట్టు.
కాయువు(య్వు)-చెలిమి, వలఁపు,ఎఱుపు.
కారంచుట్లు-చక్కిలాలు, జంతికలు
కార(కపివెంద)-కపింద-కాసమర్దము.
కారగ్గి-కార్చిచ్చు-ఎరగలి-దావాగ్ని.
కారచేఁప-ఒక దినుసు చేఁప.
కారటుదుంప-గాఁజరగడ్డ-ఎఱ్ఱముల్లంగి.
కారడుగు-రెండవకాు-చిఱువడ్లు.
కారనక-కారణికః = రాజపుత్రుల గురువు.
కారపాకులు-కారముగల తమలపాకులు.
కారపుఁజుక్క-దాల్చినచెక్క-గుడత్వక్కు
కారపుఁబడుగు-గంజిపట్టిన నులిపడుగు
కారపుఁబూంది ⎫ కారముగనుండెడు పూస
కారపుఁబూస ⎭ ఆకృతిగల పిండివంట.
కారపుమన్ను-క్షారమృత్తు = చవిటిమన్ను.
కారము-క్షారము = ఒఱ్ఱ-గాటు, కటువు. చౌడు, బిడ్డలమందు, కప్పము.
కారముచల్లు-మోసగించు-కికురించు.
కారమెత్తు-తాటిదోనెతో నీళ్లుతోడు, మిర్చి కారము తగులు.
కారయిల్లు-చెఱసాల-బందిఖాన-కార.
కారవెట్టు-చెఱఁబెట్టు,బంధిగొను,పట్టుకొను
కారాకు-పండుటాకు,చొక్కాకు, సౌరుగాకు
కారాకూరము-కలఁత, బలిమి, కలఁచునది, కదలిక కలవి. [రించు.
కారాకూరముచేయు-తత్తఱపెట్టు-బలాత్కా
కారాట-క్రమ్ముకొనుట, విస్తరించుట.
కారాడించు-తిరుగఁజేయు-త్రిప్పు.
కారాడు-నడపు, తోలు.
కారామణులు-నల్లబొబ్బర్లు.
కారామ(ము)ళ్లు-తెల్లఅలచందలు.
కారాలుమిరియాలునూరు - కసరు, తిట్టు, కేకలువేయు, రుసరుసలాడు.
కారాలు-మురుకులను భక్ష్యవిశేషము.
కారావు-అడవియావు-వనధేనుపు.
కారింగువ - గాటైన వాసనగల ఇంగువ - జంతుక. [చిన్నపుచ్చు.
కారించు - బాధించు - కాఱించు, చంపు,
కారికము - చలువచేయని క్రొత్తబట్ట-అనాహతము.
కారిజము - కాలేయము = కడుపులో నీటి తిత్తికి దిగువ నుండెడు మాంసఖండము-
కారియ-నలుపురంగు,హింస-రూ.కాఱియ.
కారియము-కార్య = పని, కర్జము
కారిసము-కార్శ్యము = పీరసము, బాధ
కారు - నలుపు, అడవి, ముదిమి, చౌడు, నేల, ఉప్పన, తాంబూలపుగార, జ్యేష్ఠము మొదలు నాల్గేసి నెలల కాలము, రెండవ కారు పైరు.
కారుకంద-అడవికంద + -వనకుండలి +
కారుకుక్క-తోఁడేలు-అడవికుక్క.
కారుకూఁతలు-ఎదికోడిపుంజు కూయుకూఁత, పొగరుకూఁత, వదరుటలు, దబ్బరలు.

కారుకూనలు-గుమాస్తా, సుంకరి.
కారుకొను - క్రమ్ముకొను, నలుపెక్కు, కూడఁబడు, వేరునాటుకొను, మించు, ఒగరెక్కు, రూ. కార్కొను.
కారుకొమ్ము మెకము-దుప్పి-రామము.
కారుకొట్టి } అడవియులవ - కలిగొట్టు -
కారుకొల్లి } కార్కొట్టి-కార్కొల్లి.
కారుకోడి-అడవికోడి-కానపుంజు.
కారుక్రమ్ము-నల్లనగు, దట్టమగు
కారుఖానా-కర్మాగారము-కార్ఖానా.
కారుగచ్చ-అడవిగచ్చ-బావంచాలు.
కారుగెనసు-అడవిగెనసు.
కారుగురివెంద-స్థాలిపర్ణి +
కారుగొఱ్ఱె-అడవిగొఱ్ఱె-వానరాక్షసము.
కారుగోఁగు-కొండగోఁగు-అడవిగోఁగు.
కారుచిక్కుడు-కోలశింబి, కంబళిచిక్కుడు
కారుచిచ్చు-కారగ్గి-దావాగ్ని-కార్చిచ్చు.
కారుచెఱకు-అడవిచెఱకు, వెఱ్ఱిచెఱకు
కారుచు-నాటఁజేయు-కారించు.
కారుజనుము-గిలక ... -శణపుష్పి +
కారుజల్లు-రెండవమాఱు పైరుజల్లు.
కారుజొన్న-ఎండకాలమున చల్లెడుజొన్న.
కారుతుంగ-అడవితుంగ +
కారుతొగరి-తొగరితీఁగ-తువరిక. [లువు
కారుతొలసి-అడవితొలసి-విషఘ్ని, నిద్రా
కారుదున్న-అడవిదున్న-కాసరము
కారునిమ్మ-అడవినిమ్మ-వనజంబీరము.
కారునీళ్ళు-ఉప్పునీరు.
కారుసువ్వు } అడవిసూవు - జర్తిలము +
కారుసూవు }

కారునెల్లి-అడవినెల్లి-వనాగ్నిమంథము.
కారుపంది-అడవిపంది-వనకరి
కారుపట్టు-మత్తెక్కు, పొగరెక్కు.
కారుపసుపు-అడవిపసుపు.
కారుపిప్పలి-అడవిపిప్పలి.
కారుపిల్లి-అడవిపిల్లి-బావురుపిల్లి
కారుపుంజు-కానపుంజు-పొడకోడి.
కారుపున్నమ-జ్యేష్ఠపూర్ణిమ.
కారుపెసర-అడవిపెసర-కాకముద్గ +
కారుపోఁక-అడవిపోఁక-పల(శైల)పూగము
కారుపోతు-అడవిదున్న-ఎనుపోతు.
కారుప్రత్తి-అడవిప్రత్తి-వనకార్పాసి.
కారుబచ్చలి-అడవిబచ్చలి-వనకలంబి.
కారుబారి-కార్యకర్త, తీర్పరి.
కారుబారు-వ్యవహారము. [ఈర్ష్యచూపు.
కారుబారు(లు)చేయు - ద్రోహముచేయు,
కారుబీర-అడవిబీర, పెద్దబీర.
కారుబుడమ-అడవిబుడమ-తీవ్రగంధము.
కారుబ్బు-జంతువుల కడుపుబ్బు వ్యాధి
కారుమ(ల్లియ)ల్లె-అడవిమల్లె- వనచంద్రిక
కారుమామిడి-పెద్దమామిడి-ప్రియాలము.
కారుమినుము-అడవిమినుము-ఆర్ద్రమాష.
కారుమునగ - అడవిమునగ - మురంగి -
కారుముల్లంగి-అడవిముల్లంగి +
కారుమెఱుఁగు-వర్షాకాలపు మెఱపుతీఁగ.
కారుమేఁక-అడవిమేఁక-ఇడిక్కము.
కారుమొగులు-వర్షాకాలపు మబ్బు.
కారువరి-ఎండకాలమునఁ జల్లెడు వరి.
కారుమొసలి-నక్రవిశేషము-కుంభీరము.
కారుకు-తిట్లు-పరుషవాక్యములు.

కారుల్లి-ఒక జాతి ఉల్లి.
కారువావిలి-మరుత్పత్రి +
కారుసంపెఁగలు-ఒక దినుసువడ్లు.
కారూరు-అడవిపల్లె-శబరాలయము.
కారె-క్షార = ఉప్పుగడ్డి-కాను.
కారెకంది-నల్లకంది.
కారెనుపోతు
కారెనుము } అడవిదున్న-కారుపోతు
కారెబాతులు-ఒక దినుసువడ్లు.
కారెము-నీరె త్తెడు తాటిదోనె-చేఁద.
కారెమెత్తు-కారెముతో నీళ్లుతోడు.
కారేఁగు-కానరేఁగు-కాన్రేఁగు-కాంద్రేఁగు.
కారేలకి-అడవియేలకి-బృహదేల +
కారొద్దెము-అధిక్షేపము, హేళన.
కార్చిచ్చు-కారుచిచ్చు-ఒకజాతి పందెపుకోడి
కార్చు-కారుచు, కారించు.
కార్తి - క్రాంతి = కృత్తిక - మంగలకత్తి రూపురిక్క--సూర్యుఁడుండు నక్షత్రము.
కార్తికములు-ఒక దినుసువడ్లు.
కార్తె-కృత్తిక = మంకలకత్తి రూపురిక్క
కార్తెమూల - కృత్తికా నక్షత్రపుదిక్కు - ఈశాన్యము.
కార్పసరము-అడవి (జంతువు) గేదె.
కాఱడవి-అట్టమైన అడవి.
కాఱడి-దూఱు, తిట్టు, అట్టు, ఆఱడి.
కాఱించు-బాధపెట్టు-కారించు,
కాఱియ-కారిక = కడగండ్లు, కస్తి, వెత, కక్కసము. [ఎడు.
కాఱియప(వ)డు-యాతనపడు, ఇడుములు
కాఱియపె(వె)ట్టు - పీడించు, కష్టపెట్టు.

కాఱు-క్షర్ = రాలు, కుప్పరిలు, ఒలుకు; దే-పట్టుకాఱు, కామవికారము, తెలివిలేమి, వర్షర్తువు, దట్టమైనది-తఱచు.
కాఱుకంద-కారుకంద.
కాఱుకొను-కారుకొను [శృంగమృగము.
కాఱుకొమ్ములమెకము - దుప్పి - సాంద్ర
కాఱుకోడి-పొంచి వేటాడు ఒక పక్షి.
కాఱుచిచ్చు-కార్చిచ్చు
కాఱుచు-కార్చు, కాఱఁజేయు.
కాఱుదున్న-అడవిదున్న.
కాఱుదూఱుపడు-మిక్కిలి నిందపడు.
కాఱునిమ్మ-అడవినిమ్మ.
కాఱునూవు-అడవినువ్వు.
కాఱునెల్లి-అడవినెల్లి
కాఱుపంది-అడవిపంది.
కాఱుపసుపు-అడవిపసుపు.
కాఱుపిప్పలి-అడవిపిప్పలి.
కాఱుపుంజు-అడవిపుంజు.
కాఱుపోఁక-అడవిపోఁక.
కాఱుపోతు-అడవిపోతు.
కాఱుప్రత్తి-అడవిప్రత్తి
కాఱుబచ్చలి - కాఱుబీఱ, కాఱుబుడమ, కాఱుమల్లె, కాఱుమామిడి, కాఱుమినుము, కాఱుమునగ, కాఱుముల్లంగి, కాఱుమేఁక, కాఱుమొగులు, కాఱుమొసలి, కాఱుసంపెఁగలు మున్నగువానికి లఘురేఫరూపములు చూచుకొననగును.
కాఱొట్టికాఁడు - పరుషముగా మాట్లాడు వాఁడు - గర్వితుఁడు. [మాట.
కాఱొడ్డెము - పెళుసుమాట - కట్టివిఱుపు

కాలఁదన్ను(దాచు) } -తోసిపుచ్చు.
కాలదున్ను

కాలరి - కాలిబంటు. దూత, ప్రయాణపు పన్ను-రూ. కాలారి.

కాలరివాఁడు-దారి నడుచువాఁడు-బాటసారి.

కాలవ = కాలువ.

కాలవేయు-కాల్చు, మండఁజేయు

కాలసంచ-ఒక పశువ్యాధి-కాలివప్పె.

కాలాఁగు-నిలద్రొక్కుకొను - కాచూఁదు, కొంతకాలమాఁగు.

కాలాడు-నడచు, నడయాడు

కాలారి-చూ. కాలరి.

కాలారివాఁడు-కాలరివాఁడు.

కాలికంచములు- ఇసుకయందుకాలితోకంచములవలెచేసిఆడెడుబాలక్రీడ-అందలములు

కాలికడ-కాళ్లంచి పరుండుపైపు-కాళ్కడ

కాలికడియము-అందె-నూపురము

కాలికఱ్ఱ-పావకోడు-అడిగఱ్ఱ, పావాలు.

కాలికొద్ది-కాలికొలఁది. [జబ్బుగాలి.

కాలిగాలి-పశువులకాళ్ళకు పుట్టుచుండునట్టి

కాలిగూ(డు-గూ)డువలెపేర్చిన జొన్నకుప్ప

కాలిడు-అడుగుపెట్టు, చొచ్చు

కాలితెరువు } -కాలిబాట-ఎకపది. ఒకఁడు మాత్రమే నడువఁదగినదారి.
కాలిత్రోవ(దారి)
కాలిదోవ

కాలినడ(క)-పాదచారము.

కాలిపారువ-ఒక మల్లబంధము-కన్నాత.

కాలిపుట్టువు-శూద్రుఁడు-చౌదరి-పాదజుఁడు

కాలిబంటు-కాల్బంటు-కాలరి, కాలారి.

కాలిబందము-చెట్టెక్కు సాధనము.

కాలిబోను-కాలియురి-కాలురి.

కాలిమూక = కాల్బలము-పదాతిసేన.

కాలివప్పె = కాలసంచ. [బూతము.

కాలియ-కాళి = కొరవితాల్పు. దయ్యము,

కాలిసంకెల-పనుల కడ్డము వచ్చుట.

కాలు-మండు, పాదము, పద్యపాదము, నాల్గవవంతు, మంచపుకోడు

కాలుకంబము-ద్వారబంధపు కమ్మి.

కాలుకదల్చు-ముందడుగు వేయు.

కాలుకొ(గొ)ను - మండు, ప్రసరించు. కాలూంచు, నడచు, నిలుచు.

కాలుకొలుపు-కాల్చు, మండించు, నడిపించు, చెలరేఁగఁజేయు. [వాఁడు.

కాలుగాలినపిల్లి-బాధచే అటునిటు పరుగెత్తు

కాలుగిద్ద-గిద్దలో నాల్గవవంతు,

కాలుచు-మండించు, కాల్చు, కాల్పించు.

కాలుచ్చు-వేఁట పనిముట్టు-కాలిబోను.

కాలుజాచు-యత్నించు, సిద్ధమగు, వ్యతిరేకించు, అసమర్థతను దెల్పు.

కాలుజారు-పనిలో పొరపడు. [వంతు.

కాలుతళిగె-కంచెడు పదార్థములో నాల్గవ

కాలుత్రొక్కుకొను-తొట్రుపడు.

కాలుదన్ను-కాలూను, కదలకనిల్చు.

కాలుదివిటి } ప్రభువులు నడచునపుడుకాళ్ళకుఁ బట్టెడి దివ్వె-కాగడా.
కాలుదివియ

కాలుదువ్వు-సిద్ధపడు,

కాలుదూయు-పాఱిపోవు. లేచిపోవు.

కాలుదెరువు-కాలి(దోవ)బాట.

కాలుద్రవ్వు-కయ్యమునకు సిద్ధపడు.

కాలుద్రొక్కు-పెండ్లాడు, పెన్నాడు, నిలుచు, చేరు, తిరపడు, కదియు. [చంపు

కాలునకందిచ్చు-యముని వశము చేయు,

కాలుపట్టు-ఆశ్రయించు, చేర్లుకొట్టు.

కాలుపడు-చిక్కుకొను, లోబడు.

కాలుపించు-కాల్పించు-కాలుచు.

కాలుపు-దహనము-కాల్చుట-కాల్పు.

కాలుపొడుచు-కాలుంచు, కాల్మోపు.

కాలుబట్టు-పశువులకు వట్టలు గొట్టు.

కాలుబలము-పదాతిసేన-కాల్బలము.

కాలుమ(ము)డుచు-మూత్రము విడుచు.

కాలుమడి-ఉచ్చ-ఒంటేలు, పశువులమూత్ర బంధరోగము

కాలుమానిసి-కాలిబంటు = కాలరి.

కాలుముడుచు-మూత్రము విడుచు, ఆకార ణముగా సిద్ధపడు.

కాలుమ్రొక్కు-నమస్కారము చేయు.

కాలరి-కాలిబోను-కాలుచ్చు.

కాలువ-కుల్య = నీటిదారి, కోడు, పరంపర, పల్లె, పివారు, కాలవ-కాల్వ

కాలువపనిముఖాలు-కాలువ మరమ్మతులు.

కాలువురు-కాలిబంట్లు-కాల్వురు.

కాలువల-కాలిబోను [గొట్టు, కాలూను

కాలుసాచు-పయనమగు, పూను, బాకీ ఎగ

కాలూడు } కాళ్లపై నిలుచు చొచ్చు. అండ
కాలూను } దొరకు, తిరపడు, పోరుకు సిద్ధపడు.

కాలెత్తు-చెడిపోవు, రతికి సిద్ధమగు

కాల్చు-కాలుచు, వాతపెట్టు

కాల్చుకొనితిను-వేధించు, పీడించు.

కాల్దన్ను-కాలుదన్ను, నిలుచు.

కాల్దెరువు-కాలితెరువు, కాలిబాట.

కాల్పట్టు-నమస్కారముచేయు, కాలుమ్రొక్కు.

కాల్పడు-కాలుపడు, చిక్కుకొను.

కాల్పించు-కాలజేయు-కాల్చు, కాలుచు.

కాల్పుట్లు-పుట్టిలో నాల్గవభాగము

కాల్పుపడు-కాల్పునుపొందు, కాలు.

కాల్బలము-కాలుబలము, పదాతిసేన.

కాల్బాలు-ఒక దినుసువడ్లు.

కాల్వ-కుల్య = కాలువ-కాలవ.

కావంచి-కామంచిక = నాచు-కాకమాచి +

కావగు-ఎఱ్ఱనగు, కావియగు.

కావచ్చు-పూర్తికాబోవు, కాదగియుండు.

కావడి - కావటి = ఇరువంకల ఉట్లమర్చిన వెదురుబద్ద [కావడిగా కట్టు.

కావడించు - కావడితో మోయ వీలగు.

కావడిచేఋలు-ఉట్లత్రాళ్లు.

కావడిబద్ద-విహంగిక

కావడియుట్లు-శిక్యములు.

కావడివడుగు-నీళ్లకావడితెచ్చు విప్రుడు

కావను-కావుమను, రక్షింపవేడు. [క్రొవ్వు

కావరము-గర్వః = మత్తు, మంపు, కైపు.

కావరి-పొగరుబోతు-కావరుడు.

కావరించు-మత్తెక్కు, పొగరెక్కు

కావరితనము-కావరము-క్రొవ్వు

కావరుడు-ధూర్తుడు-కావరి.

కావలచు-కావలయు, కానగు.

కావలము-చూ. కావరము.

కావలయు-కోరు, అవసరమగు, చుట్టమగు, శిక్షయగు; కాబోలు.

కావలి-కాపుదల-పహరా. కాచుట.
కావలికాఁడు-కాపుండువాఁడు-కొత్వాలు.
కావలికాచు-కాపాడు. పారాయుండు.
కావలిపెట్టు-కాపుంచు. రక్షణచేయు.
కావలిబొట్టు-నల్లని దిష్టిబొట్టు
కావలియగు-రక్షకుఁడగు
కావలియుండు-కాపలా కాచు.
కావలియొసగు-రక్షణ నిచ్చు
కావలివాఁడు-కావలికాఁడు-కొత్వాలు.
కావలుఁడు-దిమ్మరి-దిమ్మరీఁడు-డిమ్మరి.
కావలె-కావలయు.
కావళులుపెట్టు-రక్షకులుగా నుంచు.
కావ = కావాకదము
కావాకదము గుండ్రముగాతిరుగుచు గుజ్జము వేయు చిందులు. [తిరుగు
కావాతిరుగు-గుజ్జము మండలాకారముగా
కావారి-ఆకుగొడుగు
కావా(ల-లి)లె = అవసరము.
కావి-ఎఱ్ఱబట్ట-ఎఱుపు-ఎఱ్ఱనిది.
కావించు-అగునట్లుచేయు.కల్పించు,వండు.
కావిగొను-ఎఱుపెక్కు, ఎఱ్ఱనగు.
కావిగోఁచిదారి } సన్యాసి-గోఁచుముదారి-కావి
కావితాలుపు } బట్ట కట్టినవాఁడు.
కావిపుట్టగోచులసామి } సన్యాసి - కాషాయ
కావిబట్టలసామి } వస్త్రధారి.
కావిరి-నలుపెక్కిన ముదురెఱుపు
కావిరికప్పు-నల్లనగు. కావిరిపర్వు.
కావిరిబొట్టు-దిష్టిబొట్టు-కావు.
కావిరివిరియు-నల్లఁదనము వ్యాపించు.
కావిబాయి-జేగురుబాయి, కెంపు.

కావిలించుకొను-కౌఁగిలించుకొను.
కావిళ్లు-కాపలా కాచుట
కావు-బొట్టు, దిష్టిబొట్టు, పచ్చికాయలను పండించుట, దొంగల పనిముట్టు వశ్యౌషధము, చంటిబిడ్డల యేడ్పుయొక్క మ్రోఁతకు అనుకరణము.
కావుకావు-కాకుల యఱుపు.
కావుట-డు- అగుట, అగుడు.
కావుడించు-పండ్లు కావునుండి తీయు.
కావుత-అగుత, అగుఁగాక, కాత.
కావుదిగు-పొట్ట యుబ్బు.
కావున-కనుక, కాన, కాఁబట్టి, అగుటచే.
కావుననేడ్చు-ఎలుఁగెత్తి యేడ్చు.
కావునించు-బొట్టుపెట్టు.
కావుపాఁతఱ-ధాన్యము నిల్వచేయుగోయి.
కావుపట్టు-మిక్కిలి బాధించు.
కావుపెట్టు-పండించు.
కావురు-కాంతి. మేఘములందు సూర్యకిరణములచే నేర్పడు ఎఱ్ఱరంగు.
కావులుగలాఁడు-కావితాలుపు, సన్యాసి.
కావువచ్చు-పండురంగువచ్చు. [కాఁగు·
కా(వు)వేయు-పచ్చికాయలను పండించు,
కావేరిగుజ్జములు-కాలికొలఁది పరుగెత్తెడు గుజ్జములు.
కావేషము-పగ, కంటు, వేరము.
కాస-కచ్చ = కాసెకోక-రూ. కాసె.
కాసండీ = కాచండీ, పానపాత్ర.
కాసంత-ఇంచుకంత, రవ్వంత, కాసింత.
కాసదము-కాస. కాసె, కాసెకోక.
కాసర-కాళహార = కాచర.

కాసరకూసరచేయు-చిందరవందర చేయు.
కాసరలు-ఒకజాతివడ్లు.
కాసరికుండలు-అయిరేని కడవలు
కాసలనాఁడు-ఒక దేశము, ఒక విప్రజాతి.
కాసా-వాఁడు = దాసీపుత్త్రుఁడు, పంశపరంపరగా దాస్యము చేయువాఁడు.
కాసి-ఒక ఆకుకూర, దట్టి, వారణాసి.
కాసించు-కాసెవలె బిగించికట్టు.
కాసింత-కొంచెము-కాసంత, కసింత.
కాసివి(న్ని)-కొన్ని, కొంతసంఖ్యగల.
కాసియ-కచ్ఛ = కాసెకోక-కాస, కాసె
కాసియబూరఁడు-జాతి పనివాఁడు.
కాసీఁడు-జాతిపనివాఁడు-కాసెవాఁడు.
కాసు-కాచః = పవరను, పైకము, దుగ్గనిలో నాల్గవభాగము.
కాసుచేయని-పనికిరాని, వెలలేని.
కాసువీసము-రోలీ-కాసుకప్పర, [ఉలి.
కాసె = కాసీఁడు, జాతిపనివాఁడు, టంకము,
కాసె = కాసియ, కాసెకోక, కాస
కాసెకట్టు-గోచీసవరించుకొను [గజ్జిగట్టు
కాసెకోక - లాఁగుపై బిగించెడు దట్టి,
కాసెనిలుకడ-మల్లుర ముప్పదిరెండు విసరులలో నొకటి-కాసెనిల్కడ.
కాసెబిగించు-నడుముకట్టు, సిద్ధమగు.
కాసెయులి-టంకము, ఉలి.
కాసెల్లడుల్లు-దబ్బంతయు వెచ్చమగు
కాసెవాఁడు-జాతిపనివాఁడు-కాసీఁడు.
కాసెవోయు-చెంగును వెన్కకు బిగించు.
కాస్త-కాసంత, కాసింత కొంచెము.
కాస్తకూస్త-మిక్కిలి కొంచెము.
కాస్యవాఁడు-జాతిపనివాఁడు-గ్రావహారుఁడు-కాసియబూరఁడు
కాళ-కాహళి = బాకా, కాళె,
కాళంగి-ఒక కులము పేరు [వాఁడు
కాళకాఁడు-కాహళి (బూరగొమ్ము) ఊదు
కా(ళ-ళా)ంజి = తమ్మఉమియు పాత్ర.
కాళియ = కాళ, కాళె, బాకా
కాళ్లజెట్టి-చెవిజొరుపాము-కర్ణజలూక,
కాళ్లకుపోవు-మలవిసర్జన కేగు.
కాళ్లనుగ్రుమ్ము-తన్ను, కాళ్లగ్రుచ్చు.
కాళ్లబాతు-కాలుపొడుగు మనిషి.
కాళ్లవేళ్లఁబడు-మిక్కిలిదీనముగాప్రార్థించు.
కాళ్లాడకుండు-ఏమియు తోఁచకపోవు.
కాళ్లు(గుంజు)తీయు-కాళ్లు నొప్పులు పుట్టు.

# కి

కి-షష్ఠీవిభక్తిప్రత్యయము.
కింక - అలుక. కిన్క, ఒక పశురోగము, పీడ, విడువని(పటు)ఏడ్పు, కినుక.
కింకటచేయు-బాధపెట్టు,పీడించు, కాటించు.
కింకపట్టు-కసిపట్టు, పగగొను.
కింకపెట్టు-మారామాచేయు, అలుగు.
కింకిరి-రోఁత, అలుక, నింద, కొద్ది, తప్పు దాటలాడువాఁడు.
కింకిరిచేయు-ఏరుగు, మలము విడుచు.
కింకిరిపడు-రోయు, కోపించు.
కింకిరిపాటు-ఏవగింపు, కినుక
కింకిరిపోవు-మకిలిపోవు, మురికియగు.
కింగళించు-మల్లురు కుస్తీపట్టు పట్టు
కింగళింపు-ఒకానొక జెట్టిపెనకువ.
కింగాణము-తాళమాల, వేణుపాటు.

కింగాణముసేయు-గేలిచేయు.
కింగాణి-కొఱగానిపని.
కింగిరి-తేలికది, తక్కువది, నీచుఁడు.
కించ-లోటు, మనోవ్యథ
కించపడు-చింతించు.
కించపఱచు-చుల్కనచేయు.
కించు-కించిత్ = కొద్ది(ది)వాఁడు, క్రించు.
కిందఁదనము-బడలిక, మాంద్యము.
కిండలు-ఎకసక్కెము, ఎగతాళి.
కింద-దిగువ, క్రింద
కిందగు-ఓడు, తగ్గు, క్రిందగు.
కిందు-క్రిందు.
కిందుప(వ)డు-క్రిందుపడు.
కిందుసేయు-క్రిందుసేయు.
కింబత్తులు-ఒక దినుసుపడ్లు.
కిక(కా)కిక-నవ్వుయొక్క మ్రోఁత.
కికింకిరి-చీఁదఱ, ఏవగింపు, రోఁత.
కికురించు - మోసగించు, చిక్కులుపెట్టు, ఓడించు, దొంగిలించు
కికురింత-ఓడింపు, దాఁగుట, మోసగింత
కికురింతలాట-దాఁగుడు మూఁతలు.
కికురింపు-కికురింత, దగా, మోసము.
కికురు-మోసము, దగా, కిక్కురు.
కికురుపొ(వొ)డుచు } మోసగించు,ఓడించు,
కికురుపెట్టు } దొంగిలించు.
కిక్కస-నలమను సుగంధద్రవ్యము.
కిక్కసాలు-గర్భిణి చన్నులమీఁది రేఖలు.
కిక్కిఱిబిక్కిఱి-సందిగ్ధబుద్ధిలేని.
కిక్కిఱియు-క్రిక్కిఱియు, కిటకిటలాడు.
కిక్కిసగడ్డి-కీచకము-నలము +
కిక్కు(రు)రింత-కికురింత, కికురు.
కిక్కురుమను-కొద్దిగ పలుకు.
కిక్కురుపెట్టు } చూ. కికురుపెట్టు.
కిక్కురువొడుచు }
కిక్కెస-బలాత్కారము,మిక్కిలి కసి యిక, గట్టిగా, బిగియునట్లుగా.
కిగ్గఁడి - కీకటః = కొఱగాని (ది) వాఁడు, అంబేద, కొద్దిది, క్రిందిది, చూఱఁబడినది.
కిగ్గఁడికాఁడు } సోమరి, మందఁడు కిగ్గఁడి.
కిగ్గాణి- } ఎంబెన్న.
కిగ్గు-జంకు, సందేహించు.
కిచాటు-కయ్యము, లోటు, లేమి.
కిచిడి-పులగము, కమలాఫలము.
కిచిడీలు } పిచికచెంబ అను సన్నజాతి
కిచిలి } బియ్యము.
కిచ్చాటుగానుండు - కొంచెము ఒత్తిడిగా (ఇబ్బందిగా) నుండు.
కిచ్చిరిపండు-ఒక దినుసు నారింజ +
కిచ్చిలి-ఒకతెగపడ్లు,నారింజ +,పెద్దనిమ్మ.
కిచకిచ = చక్కిలిగింత, గిలిగింత, కోఁతుల రొద మొ॥వాని మ్రోఁత
కిచకిచకొట్టు-చక్కిలిగింత కలిగించు, కిచకిచమని కూయు.
కిచకొట్టు-పక్షులు కోఁతులు రొదచేయు.
కిచుకు-పాము తినునప్పటి చప్పుడు.
కిచ్చడి-కిచిడీ, కిచిలి.
కిచ్చపెట్టు-గిల్లిపెట్టు.
కిటకిట-ఒక అనుకరణము
కిటకిట(మను)లాడు-క్రిక్కిఱియు.
కిటనత-కృతజ్ఞత = మేలుమఱువకుండుట.

కిటికి(టీ) | హి. ఖిడ్కీ = సోరడగండ్లు,
కిటికీ | గవాక్షము.
కిటి-కీర్తి. యశస్సు.
కిటికీచువ్వలు-కిటికీకమ్మ(గజా)లు.
కిటుకగు-పగయగు మోసమగు,మఱుగగు.
కిటుకు-కీలకము, చిక్కు, ఎత్తుగడ.
కిట్టనారమట్ట-తృణకేతకి +
కిట్టమి-పగ. కిట్టనితనము. రూ. గిట్టమి
కిట్టింపు-అనుకువ. గిట్టింపు.
కిట్టికోల-ఇఱికించు పనిముట్టు.
కిట్టు-తాఁకు.చేరు,కినియు,చంపు. ఒకముడి.
కిట్టుకొను-చేరు. సమీపించు.
కిడఱ-వ్యాపారపుపన్ను-క్రీడారము, కీడెఱ.
కిత-వరికుప్ప, కళ్లమున దేవతార్పణముగ పోయు మూఁడు దోసిళ్లవడ్లు.
కితకిత-చక్కిలిగింత, కిచకిచ.
కితాబు-హి. బిరుదు, పొత్తము.
కిత్త-నిప్పు-కిత్తి, కిత్తు.
కిత్తఁడు-కృష్ణః = కిచ్చయ్య. కన్నయ్య
కిత్తనార-చాఁగనార. మోటుగుడ్డ.
కిత్తలి(ళి)-కిచ్చిలి. నారింజ +.
కిత్తాను-కిత్తనారగుడ్డ.
కిత్తి-కృత్తిక*. నిప్పు, కిత్తు.
కిత్తికంటివలఁతి-శివుఁడు.
కిత్తు-కిత్త, కిత్తి = నిప్పు.
కిదుకు-మూల్గు, నీలు, మత్తెక్కు.
కిదుష-తక్కువరకము. తక్కువది.
కినగివపడు-మిక్కిలి కోపించు.
కినియు-కోపించు, చేరు.
కినుక-అలుక, కిన్క, కింక, ఉనికి.
కినుకకాఁడు-కోపశీలుఁడు.
కినుకము-కినుక, ఉనికి.
కినుపు-కినుక, కోపము, అక్కస్సు.
కినువడు-కినియు. కనలు, కిన్వడు.
కిన్క-కినుక, కింక, కోపము,
కిన్నెర-కిన్నర-ఒక జాతి వీణె.
కిన్నెసరులు-ఒక దినుసు వడ్లు.
కిన్వడు-కినువడు.
కిఫాయతు-లాభము, చవుక.
కిముఖాబు-హి. జరీపూల పట్టుబట్ట.
కిముడు-అలిపిరి, కీసర, చిన్న.
కిమ్మ-రహస్యము, గుట్టు, కీలు.
కిమ్మతు(త్తు)-ఖీమత్ = వెల, ధర.
కిమ్ము-ప్రీతి, ఇమ్ము.
కియావడి | హల్లుక్రింది యవర్ణము - యా
కియ్యా-ము | వడి, క్యావడి.
కియ్యావడి-కియావడి, క్యావడి.
కిరకిర-కిఱ్ఱుమనుట,గరగరమనుట,ఆకలివే ఒడలు కొంకరవోవుట.
కిరకిర(మను)లాడు-కిరకిరయను శబ్దము చేయు, కిఱ్ఱుమను.
కిరడు-పల్లకి బోయీల నడక.
కిరస్తాను-క్రైస్తవుఁడు
కిర(ణా)నా-ఆహారసామగ్రి-ఖిరానా.
కిరాయి-అద్దె, బాడుగ, కూలి.
కిరింజి. చినాలిరంగు.
కిరికిరి-అడ్డు, గొడవ, అల్లరి.
కిరికిరి(చేయు)పెట్టు-గొడవపెంచు,ఇబ్బంది పెట్టు, అడ్డుతగులు.
కిరియు-తేలికయగు.

కిరీటిపచ్చ-గరుడపచ్చ, మరకతమణి.
కిరుదెస-గృధ్రసి = నడుమువాతము.
కిరునాలుక-చిఱునాలుక, కొండనాలుక
కిరుసు-ఇరుప్రైపుల వాఁడిగల కత్తి.
కిర్దు-చూ. కిఱుదు
కిర్లి-ఒక శెట్టి పెనకువ-కెర్లి. కన్నాత.
కిర్లుకొను-కెవ్వున కేకవేయు.
కిఱకిఱ - రథము బండిసట్టాలు చెప్పులు మున్నగువాని మ్రోఁత
కిఱపు-కన్నుగీటు-కన్నైసఁగచేయు.
కిఱవుంచు-తాకట్టుపెట్టు. కుదువపెట్టు
కిఱుఁజెప్పు-కి(ఱుకు)ఱ్ఱుఁజెప్పు.
కిఱుకు-చెప్పుల చప్పుడు మోసము కిఱ్ఱు. రూ. క్రికుక్కు. క్రీ [కిఱ్ఱుమెట్టు.
కిఱుకుఁజెప్పు - కిఱ్ఱుమనిమ్రోయు చెప్పు -
కిఱుకూఁత-సన్నకూఁత.
కిఱుకుపొడుచు-తిరుగు, కదలాడు.
కిఱుగు-లొంగినది, వ్రాఁతది, మితిమీఱినది, రాసిబాకి.
కిఱుచు-తొలఁగఁద్రోయు, గెంటు
కిఱు(డు)దు-తక్కువైన, నాసిరకము.
కిఱుమకట్లు-బిచ్చెనపని, నగిషీపని.
కిఱుపు-కనుసైఁగ, కన్నుగీటు
కిఱుపులు-మానవ్రుబపెట్టు కష్టనష్టాలు
కిఱ్ఱు(ఱ్ఱు)మెట్లు-కిఱ్ఱుచెప్పులు-కిఱ్ఱుఁబాగాలు.
కి(ఱు)ఱ్ఱు-కిఱకిఱమను చప్పుడు.
కిఱ్ఱుఁబాగాలు-కిఱ్ఱుమను పావకోళ్లు
కిఱ్ఱుగానుగు-ఒక వినుకు బాలక్రీడ
కిఱ్ఱుసాగు-శుభకార్యము జరుగు.
కిఱ్ఱెక్కించు-కిఱ్ఱుపెట్టు.

కిలకిల-హాసధ్వనికి అనుకరణము.
కిలకిలలాడు / కిలకొట్టు } కిలకిలమని మ్రోగు, వెలఁగు,
కిలము-కిలుము, చిలుము, లోహమలము.
కిల(లా)రము-పసులమంద, రూ. కీలరము.
కిలాడి-నేర్పరి, పేచీకోరు, ఉంకులాఁడి.
కిలాదారు-కోట యధికారి.
కిలారి-పసులకాపరి, కాటిపాపఁడు.
కిలారించు-కిలకిలనవ్వు.
కిలారుచు(ర్చు)-బొబ్బరించు, గోటరించు.
కిలాసము-బలుపు, సిబ్బము
కిలించు-కూర్చు, పట్టుకొను. రూ. కీలించు.
కిలుము-కిలము, చిలుము, లోహమలము.
కిల్ల-దెబ్బ, అడపు, లేశము.
కిల్లాకు-చీటి, ఉల్లాకు-కిళాకు
కిల్లాడి-మోసగాఁడు, కల్లరి, నేర్పరి.
కిల్లాయి-చాడి, కొండెము, పైశున్యము.
కిల్లాయిలమారి-చాడీగొట్టు తంటాకోరు
కిల్లారి-పసులకాపరి రూ. కిలారి, కీలారి.
కిల్లి-కిళ్లీ-మల్లబంధవిశేషము-కన్నాత.
కిల్లేగిత్తిరిగాఁడు-జుట్టుపోలిగాఁడు.
కివకివ-పక్షుల కలకలధ్వని.
కివ్వు-చచ్చు, మడియు, నీల్గు.
కిస-నెమలికూఁత-కేకిస, కేస
కిసమస-కస్తి, వెత, నొగులు, బాద.
కిసరగు, బిడ్డలకు జలుబుచేయు
కిసరు-దిష్టి, ఈసు, కినుక, కస్తి.
కిసరుపడు-దిష్టితగులు, పగగొను.
కిసాయి-జేబు, కీస, కిసిరి.
కిసాలు-సంతసము, హర్షము

కిసాలున-ఒక అనుకరణము
కిసించు-కృషిచేయు, పొలముదున్ను.
కిసికింత-కొసికింత, కాసింత కసింత
కిసిమిసి-కిసుమిసు-కాకలీద్రాక్ష.
కిసుక-కృషి = దున్నకము, సేద్యము.
కిసుమి(మీ)సు-కిస్మిసు-చిన్నద్రాక్ష.
కి(స్త్రీ)స్తు-పన్ను చెల్లించు వాయిదా.
కిస్మి(స్మీ)సు-గింజలులేని చిన్నద్రాక్ష.
కిళాకు-కిల్లాకు, ఉల్లాకు, చీఁటి

—

## కీ

కీంద్ర-ఎక్కువగా నీరు పీల్చునేల.
కీఁక-ఘీకా = ఏన్గు(నెమలి)కూఁత-గీఁక
కీచంటపడు-వసుబాలులేక బిడ్డ చిక్కు
కీఁచట్లాడు-కీఁచులాడు, పోట్లాడు.
కీఁచరబాఁచర-అర్థముకాని భాష. గాబరా.
కీఁచా(యి)-జేబు, అంగరకాసంచి.
కీఁచు-పక్షికూఁతయొక్క మ్రోఁత.
కీఁచు(బిళ్ల)బుఱ్ఱ - అదిమినపుడు కీఁచుమని చప్పుడగు తలగడ
కీఁచుమను-కీఁచుమని ధ్వనించు
కీఁచుతాయి-చిమ్మట, కుమ్మరపురుగు
కీఁజీఁకటి-క్రిందిచీఁకటి, క్రీనీడ.
కీగాఁడి-కొఱగాని(ది)వాఁడు-రూ కిగ్గాడి.
కీటడఁగించు-గర్వమడఁచు, చంపు.
కీటడఁగు-చచ్చు, మడియు.
కీటు - ఒక తడవపెట్టిన మూరెడెత్తు మట్టి గోడ, చీలిక. [ఎక్కువ తిండితిను.
కీటువేయు - కీట్లతో మట్టిగోడ పెంచు,
కీడాడు-మాటు,తిట్టు,ఎగ్గాడు [కాయతరక.
కీడి(శ)స-సగము పాలుపోసిన వడ్లగింజ-
కీడు-తప్పు, చేటు, పాపము
కీడుతీయు-చెడు ముహూర్తమున రజస్వల అయిన పిల్లకు కన్నెరికము జరుపు.
కీడుప(వ)డు-లొంగు, దాఁగు చచ్చు ఓడు
కీడుప(డ్ప)ఱచు-కీడుపడఁజేయు.
కీడుపాటు-చేటు,హాని,కస్తి,ఓటమి,సిలుగు.
కీడువెట్టు-కీడు కలుగఁజేయు
కీడెఱ-వ్యాపారపు పన్ను.
కీత-కొఱఁత, కొంచెము, అధమము.
కీతు-కొబ్బరాకుల(చాప)మట్ట.
కీనీడ-దీపముక్రింది నీడ-రూ. క్రీనీడ
కీనీరునేల-క్రింద నీరుగల నేల
కీయు-చివ్వు, చీరు, చెక్కు.
కీరకాయ-పందిరి దోసకాయ.
కీరించు-కట్టు, కూర్చు, ఉంచు-కీలించు.
కీరితి-కీర్తి = యశము, ఖ్యాతి.
కీలకము-కిటుకు, కీలు, కొఱనంది
కీలనచేయు-తాల్చు, కీలించు.
కీలరము-కిలరము, పసులమంద.
కీలరముసేయు-మందకట్టు.
కీలరి-కిటుకు తెలిసినవాఁడు
కీలరు-కిలారము, పసులమంద.
కీలరువాఁడు-పసులకాపరి-కీలారి.
కీలారము-కిలారము, పసులమంద.
కీలారి-కిలారి, గొల్లఁడు, కోనారి,
కీలారితనము-పసులకాపరితనము,

కిలించు-కూర్చు-కీరించు
కీలు-కీల - సీల, మఱ, అతుకు, కిటుకు, రీతి, తారు, గుట్టు, ఉపాయము, కపటము.
కీలుఁగొప్పు-జాఱుముడికొప్పు, మూముడి.
కీలుకత్తి-మరకత్తి, మఱకత్తి
కీలుకాఁడు-మఱత్రిప్పువాఁడు, సూత్రధారి.
కీలుకొను - చిక్కుకొను, అంటుకొను, నాఁటుకొను. రూ కీల్కొను
కీలుకొలుపు-ల్పు - చేర్చు, కూర్చు, కట్టు, కలిగించు, చెక్కు, తాల్చు, అమర్చు, నిలుపు.
కీలుగంటు-జాఱుముడి, మూముడి, పిడిగంటి
కీలుగుడ్డ-కీలుపోసిన గుడ్డ
కీలుగుఱ్ఱము-మఱగుఱ్ఱము.
కీలుచాప-కీలుపోసిన చాప.
కీలుచు-కూర్చు, ఉండు, కట్టు, తాల్చు
కీలుచూపు-మర్మము నుద్దేశించు.
కీలుడ-స్త్రీలు వేసికొను వాల్జడ.
కీల్పడు-తగుల్కొను, అతుకుకొను.
కీలుప(ల్పు)అచు-అనుకూలపఱచు.
కీలుబొమ్మ-జంత్రపుబొమ్మ, అధీనుఁడు.
కీలుబొమ్మరము-మఱబొంగరము.
కీలుమండి-కీళ్లసంధులు, అవయవసంధులు, మోకాలు అనువానియందుఁ బుట్టువ్రణము.
కీలుప(ల్మ)లఁగు-వెనుదిరుగు-మరలు.
కీలుము(ల్మ)డి-జాఱుముడి-నూనెముడి.
కీవెలుఁగు-గుట్టు తెలిసికొన.
కీవాడ-ఊరిచుట్టునుండు పాటిపొలము.
కీస-తక్కువ, కొంచెము, జేబు
కీసంత-రివ్వంత, కొసంత, కొసంత.
కీసర-తి త్తిలోనగువాని పొర, జేబు, తక్కువది-కీవా, కింగిరి
కీసరబాసర-అర్థముకాని భాష
కీసవెలితి-ల్తి = కొంచెము తక్కువ.
కీసా(యి)జేబు-అంగరకాసంచి, కీవా.
కీశేరు-చెఱుపుకట్టక్రింది మాగాణి.

# కు

కు-ఆప-షష్ఠీవిభక్తి ప్రత్యయము.
కుంక-ముండమోపి, మానకమ్మ, కుక్క-అవిద, కుంకి.
కుంకటి-కూటక = పిల్లజుట్టు, జుట్టు
కుంకటిమూఁగ-కూఁకటిమూఁగ.
కుంకటివేరు-తల్లివేరు-కూఁకటివేరు.
కుంకట్లు-కూటక = ముంగురులు.
కుంకముండ } కుంక - చిన్నతనముననే
కుంకి } మగఁడు పోయినది.
కుంకీ-ఒక దినుసు పావురము [ము
కుంకుడు-కూగుడుకాయ-ఫేనిలము- అరిష్ట
కుంకు(ము)మ-కుంకుమము.
కుంకుమపూవు-ఒక విధమైన లేపనద్రవ్యము, తాంబూలపరికరము.
కుంకుమపూలు-ఎఱ్ఱనివడ్లు.
కుంకుమరేక-ఒక దినుసు నగ
కుంకురుగుండంగి-కూఁకురుగుండంగి.
కుంగు-క్రుంగు, వంగు, తగ్గు.
కుంచి-య } గుచ్ఛ - కుచ్చు, నెమలిపురికట్ట,
కుంచె } సురటి. రూ కుచ్చె
కుంచించుకొను-ముడుచుకొను.
కుంచెకాళంజి-తుమ్మపడిగము, తమ్మతొట్టి.

కుంచెకోల-తలుపుగడియ. ఒకాకొక బాణసంగు.
కుంచెలు-కట్టియిండ్లు, కనుముపండుగ.
కుంచె(విసరు)వీచు | ఉల్లాసపడు, తోఁక
కుంచెసారించు | జాడించు.
కుంచతుండు-కరుడుమొద్దు.
కుంచ(చా)ము-నాల్గుసేర్లకొలఁది-ప్రస్థము, బండి చక్రపు కుండ.
కుంచు - వంచు, ముణుఁచు, క్రుంగించు, గేలిచేయు, కొంచెపఱచు, పెరుగునట్లు చేయు-రూ. క్రుంచు.
కుంట-కుండమ్ = నీటిగుంట, చిన్నచెఱువు చెలమ,దొరువు, నాల్గవపంతు యకరము-ఒఱకము,గ్రామనామాంత్యపదము, గుంట,
కుంటగించు-ఆగు. నిలుచు.
కుంటదూలము - గోడకును కడదూలమునకును పైనుంచు చిన్నదూలము.
కుంటనేల- 6 బారల చదరపునేల.
కుంటముక్కు-ఒక జాతి చేఁప.
కుంటి-కుంఠః = కుంటు-పంగువు.
కుంటికత్తియ-త్తె = కుంటెనకత్తె.
కుంటికుదుపు-కుంటివాఁడు-కుంటు.
కుంటిగడపరి-కుంటివాఁడగు అనూరుఁడు
కుంటికూనమ్మ-చేతకానివాఁడు-ఎంబెన్న.
కుంటిగాము-కుంఠగ్రహః = శని-సౌరి
కుంటితనము-కాలు లేకుండుట.
కుంటిది-పంగుస్త్రీ-ఖంజ.
కుంటినకత్తియ-త్తె తార్పుకత్తె.
కుంటు - కుంఠః = కుంటివాఁడు. కుంటితనము-కాలు నేలపై బాగుగా అనకయే నడచు. చెడు. [డగు.
కుంటుగించు-కుంటు, వ్యవహారము ఆగు
కుంటుపడు-కడఁబడు, తగ్గు, చెడు, ఆఁగు, సొట్టపడు, నడువలేకుండు. కుఱుచపడు.
కుంటుపట్టు-వాసనపట్టు, జుల్మానావేయు.
కుంటుపఱుచు-చెఱచు, ఆఁచు.
కుంటుపిచ్చుక-కాలులేనివాఁడు, అనూరుఁడు
కుంటువడు | కుంటుపడు, నీరసించు,బక్క-
కుంటువాఱు | టిలు
కుంటెన-కుట్టని = తార్పు, తార్పుట
కుంటెనకత్తె-నాయికానాయకులను కూర్చునది-తాపికత్తె-పొంతకత్తె.
కుంటెనకాఁడు-కుట్టన = తార్పువాఁడు.
కుంటెన(కుమ్ములు) - ఒక విధమైన చెవి నగలు-ఈడ్పులు-కత్తెరబావిలీలు.
కుంటెనదూలము-గుంట(చిన్న) దూలము,
కుంటెననడచు-తార్పునడచు.
కుంటెననడపు-తార్పు దౌత్యముచేయు.
కుంటెనపంపు-తార్పుపనికై పనుచు
కుంటెనపని-తార్పు-తార్పుపని
కుంటెనపోవు-తార్పు, కూర్పునేగు
కుంటెనమోకు = జువ్వాయిమోకు.
కుంటెనవుచ్చు = కుంటెనపంపు.
కుంటెనీఁడు-తార్పుకాఁడు-ఎడకాఁడు
కుంటెళ్లు | స్త్రీల చెవి నగలు - కుంటెన -
కుంటేళ్లు | కుమ్ములు-ఈడ్పులు.
కుంట్లు-పనికి హాజరుకాని దినాలు.
కుండ-కుండమ్ = మట్టికడవ, బండివక్రపు గుబ్బ, స్ఫోటకపుపొక్కు, పాదు.
కుండంగి-కొండముచ్చు. కోఁతి.

కుండకడుపు-పెద్దబొజ్జ-పొట్ట.
కుండగోఁకరి-వంటవాఁడు.
కుండగడుగు-పూర్తిగ శోధించు, పూర్తిగా వ్యయము చేయి.
కుండగోలదాల్పు-సన్యాసి-గోణమువారి
కుండపులి-గుంటనక్కలను భయపెట్టెడు దిష్టిబొమ్మ.
కుండపొదుగు-కుండంతపొదుగు [ములు
కుండపోఁగులు - చెవిపోఁగులు, కుండల
కుండబంతి-కుండరూపుగల బంతి.
కుండవిరుసు-ఒకరకము బాణసంచు
కుండమార్చు-ఒకటియిచ్చి వేఱొకటిగొను.
కుండమార్పు-వినిమయము.
కుండమార్పుపెండ్లి-ఎదురు బదులు పెండ్లి.
కుండరాసి-కడవరాసి-కుంభరాశి.
కుండలు-కడవలు, గజకుంభము,
కుండవీనులజోదు = కుంభకర్ణుఁడు.
కుండవేలుగు-వేలుపడు.
కుండానబ } ఘటాలాబువు + -కుంభతుం
కుండానుగు } బి +, గోరక్షతుంబి +.
కుండు-కడవ, తొట్టె, మండిగ
కుండుగట్టు-గుండ్రముగా గుంటకట్టు.
కుండె-దారము-తంతువు.
కుండెవల-చేఁపలవల.
కుంతురు-కూఁతురు, కొమరిత.
కుంథ-గుంథః = రాడు, గుంజి, కంబము
కుందకము-బీడునేల, లోటు, అడ్డు, ఆట.
కుందటీల-ఒకదినుసు పిట్ట.
కుందనము = మేలిబంగారు-అపరంజి.
కుందము-గడ్డికుప్ప, గూఁడు.

కుందరుబీళ్లు-రెల్లుపొలము.
కుందా-తుపాకి (చివరభాగము) మొదలు.
కుందాపన-మనస్సులో తపన. [యాఁడుది
కుందాయి - కుందావలె అడ్డబలుపు గల
కంది-ఱోటికుదురు, ఱోలు, దీపప్రమిద, రూ కుంది(య)న, కుందెన.
కుందించు-అణఁచు, ఓడించు, తేలికచేయు.
కుందిక-కంత-కుందు.
కుందికట్టు(కాళ్లు)-ఒక దినుసు బాలక్రీడ.
కుందికుట్టాడు-ఎన్నిగంతులు వైచినను ఒక చోటనే యుండు.
కుందియన = కుంది(న). కుందెన.
కుందిలు-ల్లు-క్రుంగిపోవు. బాధపడు.
కుందు-క్రుంగు. కుదియు, అడఁగారు, తగ్గు, కుంటు, వగచు, సడలు, లోటు, తగ్గుదల, పశురోగము. కుందురుగడ్డి.
కుందుకొను-క్రుంగు, వగచు.
కుందురు-తృణవిశేషము, కుందు +
కుందుఱెల్లు-ఒకజాతిఱెల్లు-కాశము.
కుందు(ప)వడు-డిల్లపడు, వగచు.
కుందెన-ఱోటిగుంట, ఱాతికుదురు, ఉయ్యాల తొట్టె, ఒకచెట్టు, కుంది-యన.
కుందెటికొమ్ము } కుందేటికొమ్ము-హంశక్కి.
కుందెనకొమ్ము } ఒక జాతిగడ్డి.
కుందెనగిరి } ఒక దినుసు బాలక్రీడ.
కుందెనగుడి }
కుందెలు-కుందేలు-శశము.
కుందెవల-కుందేళ్లనుపట్టువల, హంశక్కి.
లొటారము-కుందేటివల.
కుందేటితాల్పు-చంద్రుఁడు-శశధరుఁడు.

కుందేటివల=కుందెవల.
కుందేలు-చెవులపిల్లి. చెవులపోతు
కుంపటి-నిప్పులుంచుపాత్ర. నిత్యవ్యథ.
కుంపటికుదురు-గొంతెమగోరు +.
కుంపపెత్తుకొను-కష్టములుతెచ్చిపెట్టుకొను
కుంపించు-బాధించు. పీడించు.
కుంపిణి-ణీ
కుంపిని-నీ } వర్తకసంఘము-కుంఫిణీ.
కుంపె-తాంబూలపాత్రము-కుప్పె. కంపె.
కుంపెనలు-అంటుపోఁగులు-తమ్మంట్లు.
కుంపెరుఁగు-కుండపెరుఁగు, పల్చనిపెరుగు
కుంబ-యజ్ఞశాలచుట్టును బెట్టిన కంచె
కుంబకోణము-మోసము.
కుంబీ-బట్టను చలువచేయుట. [కుమ్ములు
కుం(బీ)బులు-పిట్టగోడలు. రూ. కుమ్మీలు.
కుక్క-కుర్కుర=వ్యు. కురకుర హనునది-
కుక్కురము, కుకురము.
కుక్కగొడుగు-పుట్టగొడుగు, పుట్టకొక్కు.
కుక్కగొట్టె-అడవిగొట్టె-కాలుగొట్టె.
కుక్కచ్చు-చంపగూడనివారికి వేయు శిక్ష.
కుక్కముద్రగల వాఁత.
కుక్కతొల(శ)సి-మరువకము +
కుక్కనోమ-ఒకానొక కలుపుమొక్క.
కుక్కపాల-వటపత్ర, ఒక లత-కుర్కురిక
కుక్కపొగాకు-అనరువు-కుకుంద(ర)ము.
కుక్కబూరుగు-ఒకజాతి బూరుగు +.
కుక్కముంట్లు
కుక్కముల్లు-ళ్ళు } బొబ్బలు, దద్దుర్లు, పొక్కులు, చెమటకాయలువలె
ఆకస్మాత్తుగా కలుగునవి-పొక్కులవ్యాధి.
ఒక చర్మవాద్యము.

కుక్కమూతిపిందె-చెట్టు కాపు ఉడుగునపుడు
దిగిన వంకర పిందె.
కుక్కమేడి-కాకిమేడి-కాకోదుంబరిక.
కుక్కలకట్టు-కుక్కలు అఱవకుండుటకై
దొంగలుపయోగించు వస్తువు.
కుక్కవాయి(వి)ంట-శ్వానబర్బర, వావింట.
కుక్కవెఱ్ఱి-వెఱ్ఱికుక్క కాటువలనఁ గలి
గెడు రోగము-జలద్వేషము.
కుక్కి-గోయి, పల్లము, వదులు, లోఁతు
కుక్కిమంచము-త్రాళ్ళుసడలి పల్లముపడిన
మంచము.
కుక్కిరి-జల్ల-మక్కిరి. [కుక్కియగు.
కుక్కిపడు-త్రాళ్ళుతెగి వదులై పల్లమగు,
కుక్కు-అదుము. చొప్పించు.
కుక్కుడు-అమముడు-ఒత్తుడు.
కుక్కురుకో-యి
కుక్కురొకో-యి } -కోఁడి కూఁతయొక్క
అనుకరణము.
కుచోద్యము-అసూయ, ఎత్తుగడ [కొలది
కుచ్చళ్ళు-ఎనిమిదిగొర్ల నేల. 32 కుంట్ల
కుచ్చి-పాక-చిన్నగుడిసె.
కుచ్చితము-కుత్సిత=కుటిలత, నీచత-నాలి
కుచ్చితుఁడు-దుండగీఁడు. అల్పుఁడు.
కుచ్చిలు-కుచ్చిలి, కుచ్చెలు.
కుచ్చిళ్ళు-గుచ్చీ=వస్త్రపుపింజెలు. బాలికా
క్రీడా విశేషము.
కుచ్చె-కచ్చ కుచ్చెలి,పింజెమడత, కెంపు
పని. పిడకలకుచ్చె-రూ కుంచె.
కుచ్చెతీయు
కుచ్చెపెట్టు } పిడకలు మొ॥ వానిని అయి
దేసి చొప్పున పేర్చు. రత్న
ములు సాన (మెఱుగు) పెట్టు.

కుచ్చెల-కుచ్చె, పింజె, గాగరా, రాశి, పిడకలు పేర్చిన గుట్ట.
కుచ్చెలమేకము-చమరీమృగము-జడలబఱ్ఱె.
కుచ్చెలి-రేఁగు-కోలి + -కు(గు)చ్చలి +
కుచ్చెలిగంత-సన్యాసులు తాల్చు బొంత.
కుచ్చెలు-ళ్ళు = కుచ్చిళ్లు, బాలక్రీడావిశేషము
కుచ్చము-నాల్గువస్తువులు.
కుచ్చెఁ-కంచులి = అవిక. ఓడునేల.
కుచ్చెలి = కుచ్చెలి + -రేఁగు
కుచ్చెలిగ(బొ)ంత-కుచేల = సన్యాసులు తాల్చు కుచ్చెలి + వంటి బొం.
కుచ్చె-గుచ్ఛః = గుత్తి, కూర్చ = కుచ్చె.
కుచ్చుతోఁకమేకము-జల్లిమేకము-
కుచ్చుమీను-పెద్దతోఁకగల చేఁప.
కుచ్చులబఱ్ఱె / కుచ్చులమేకము } జడలబఱ్ఱె-చమరీమృగము
కుట-వర్తకుఁడు, వ్యాపారి.
కుటాక-ఒకదినుసుపక్షి.
కుటిలపడు-చెడు, భంగపడు.
కుటిలపఱచు-చెఱచు.
కుటువ-కూడిక, చేరిక.
కుట్టడము-కుట్టుట-కుట్టుపని-స్యూతి.
కుట్టారిక-గ / కుట్టారుగ } చిన్నఆరిక + - క్షుద్రకోద్రవము +
కుట్టావ(వా)లు-చిన్న(సన్న)ఆవాలు
కుట్టించు-కుట్టఁజేయు.
కుట్టిచూచు-చీల్చిచూచు.
కుట్టియ(ట్టె)-కుట్ట = కుత్త, గుద్ద-కుట్టె.

కుట్టు-కఱచు. గ్రుచ్చు, బట్టకుట్టు, పొడుచు. నొప్పి, బాధ, బూడిద.
కుట్టుకాడ = కుట్టు(తీఁగ)పోఁగు.
కుట్టుచేఁడు-చెవఁటి, తుంటరి.
కుట్టుడాకు-అంట, విస్తరి, పుల్లియ.
కుట్టుడు-కుట్టుట-సీవనము.
కుట్టుతేలు-తుంటరి, ముల్లు-కిగ్గాడి.
కుట్టుపేడు-మర్మము వెలిపుచ్చు శత్రువు.
కుట్టుపేళ్లు-కుట్టునట్టిపేళ్లు-ముళ్లు.
కుట్టుపోఁగులు-చెవిపోఁగులు.
కుట్టుపోయు-బట్టకుట్టు, కుట్టు.
కుట్టుసురు-కొనయూపిరి-కుట్టూర్పు.
కుట్టుసూల-శూలరోగము.
కుట్టూపిరి / కుట్టూరుపు-ర్పు } కొనప్రాణము-కొనయూపిరి-కుట్టుసురు.
కుట్ర = మాయ-పన్నుగడ-మోసము.
కుట్రపువాఁడు-కుట్టుపనివాఁడు-దర్జీ.
కుడ-గూఁడు. దీపస్తంభము.
కుడకె-గంధపుగిన్నె, కొబ్బరిగుజ్జు, తక్కెడ సిబ్బి. రూ. కుడుక.
కుడతా-చొక్కా-కుడితినీ.
కుడలు-పాత్రలు.
కుడవము-మానెఁడు. శేరుకొలఁది.
కుడిప్రక్క-దక్షిణము-వలవంక, కడుపు.
కుడికొప్పు-ధనికులగు స్త్రీలుదాల్చు కొప్పు.
కుడిచికూర్చుండు-సోమరియైయుండు.
కుడితి-కడుగునీరు, తండులీణము.
కుడితినీ-చొక్కా-జుబ్బా-లాల్చీ, కుడతా.
కుడినీరు-మంచినీరు-పానీయము.
కుడిపి-కురూపి = అనాకారి.

కుడిపించే-తినిపించు, త్రాగించు.
కుడిపినవారు-అనుభవింపఁజేసినవారు.
కుడిబుజము-ముఖ్యమైన అండ
కుడిమిగాఁడు / కుడిమివాఁడు -పాములవాఁడు, విషవైద్యుఁడు.
కుడిముట్టు-కంచము-భోజనపాత్ర.
కుడియ-గుడి పరిచారకుఁడు.
కుడియడుగుపరువడి-మల్లుర పదునాల్గు విసరులలో నొకటి.
కుడుక = కుడక-తక్కెడసిబ్బి, గిన్నె.
కుడుకనగోలు-కుత్ర-టక్కు.
కుడుకిలు-ముడుచుకొను. [కొను.
కుడుచు-తిను, త్రాగు, పొందు, ఫలపఱచు
కుడుచుకొను-చప్పరించు, చీకు.
కుడుపరి-కుడుచువాఁడు-కుప్పరి.
కుడుపు = కుడిపించు; విందుభోజనము, అనుభవము.
కుడుము-ఉండ్రము, ఉండ్రాయి, జిల్లేడుకాయ
కుడుము దాలుపు / కుడుములతిండికాఁడు - గణపతి - మోదకప్రియుఁడు.
కుడుపఁబెట్టు / కుడువనిచ్చు - కుడిపించు, విందిచ్చు, అనుభవింపనిచ్చు.
కుణంబము-కొయ్యతోఁటకూర.
కుతకుత-ఉడుకునప్పటి చప్పుడు.
కుతకుతమను / కుతకుతలాడు - కుతకుతమను చప్పుడగు.
కుతగుఁడు-కృతఘ్న = చేసినమేలు మఱచువాఁడు-దుండగీఁడు.
కుతి-కోరిక, కస్తి, కుతిలపాటు.
కుతిక-కంఠ = కుత్తిక, కుతుక, కుత్తుక.

కుతికంటు - కుత్తుక నంటుకొని ఉండు హారము-అడ్డిగ.
కుతికలపాటు-చింత, బాధ, వగ.
కుతికినపడు-గొంతునందు అడ్డుపడు.
కుతికిలఁబడు-కూలఁబడు, క్రుంగఁబడు.
కుతికిలు-కూలు, చదికిలు, కుదికిలు.
కుతిదీరు-దాహముతీరు, తృప్తియగు.
కుతినీ-ఖుతినీ = పట్టు దూది కలిసినబట్ట.
కుతిల-కుతి, కుతిలపాటు.
కుతిలకుడుచు / కుతిలగొను / కుతిలపడు - కలఁతనొందు, గాసిచెందు, కుదిలపడు.
కుతిలపఱుచు-కలఁతపెట్టు, నొప్పించు
కుదిలపాటు-వి కలఁత, వగపు, వంత.
కుతిలపె(వె)ట్టు-కలఁచు, నొప్పించు, తొందరపెట్టు.
కుతిలము-కలఁత, బాధ, కుతి.
కుతుంబిర్లు-కొత్తిమెరలు, ధనియాలు.
కుతుబు-ప్రశంస, పొగడ్త.
కుతుక / కుత్తిక - కంఠ = గొంతు(కు)కుతిక-కుత్తుక
కుత్తికంటు-నాగవల్లినాఁడు పెండ్లికూఁతుమెడకుఁ బెట్టెడు నల్లపూసలగొలుసు - పట్టెడ-కుత్తుకంటు-కుతికంటు.
కుత్తిని-చూ. కుతిని.
కుత్తుక-ము = కుతుక, కుత్తిక, కుతిక.
కుత్తుకంటు-కుత్తికంటు-అడ్డిగ.
కుత్తుకగందువాఁడు-శివుఁడు, కాటిఱేఁడు.
కుత్తుకబంటి-కంఠమువఱకు మున్నట.
కుత్తెము-ఇఱుకు, బిగుతు, త్రొక్కిడి.

కుదప-రొంపిదుక్కి. పెరుఁగుగడ్డ.
కుదపగట్టు-కండ్లలో కాయకాచు [చేయు.
కుదపచేయు - దమ్ముచేయు, దొంపిదుక్కి
కుదలు-చలించు-అదరు-రూ కుదులు.
కుదవ-కుదువ, తాకట్టు-ఉద్దర.
కుదించు-అదుము, బిగించు, తగ్గించు, అడ్డగించు, విదుర్చు, ముడుచు, వెతపెట్టు.
కుదికిలఁబడు | మొగముపై కెత్తుకొని గొంతు
కుదికిలు | కూర్చుండు.
కుదిచ్చు-కుదించు, తగ్గించు.
కుదియఁబట్టు-నొక్కి పట్టుకొను.
కుదియఁబడు-జంకు, కొంకు, బక్కటిలు.
కుదియించు-చూ. కుదించు.
కుదియు-ముడుఁగు, క్రుంగు,మరలు, చెడు, జంకు, బక్కచిక్కు, తగ్గు, అడఁగు, బిగియు, కుందు.
కుదిర-కుదరః = గుఱ్ఱము-అశ్వము
కుదిరించు-కుదురుచు, కుదుర్చు.
కుదిరిక-నెమ్మది, పొందిక, కుదురు
కుదిల-బాధ, వెత, గాసి-కుతిల.
కుదిలపడు-చూ కుతిలపడు.
కుదిలపఱుచు-కుతిలపఱుచు. [అదరుట.
కుదిలిక - కుదులుట, నాటుట. చలించుట,
కుదివడు-కదలు, వణఁకు, అదరు.
కుదుకనగోలు-మోసము-కికురింత.
కుదుచు-కుదించు, కుదియించు.
కుదుటఁబడు-పూర్వస్థితికి వచ్చు,శాంతించు.
కుదుప-కుదప,దుర్మాంసపిండము, మోసము
కుదుపు-కదలించు, కదలిక. ఆయాసము.
కుదుము-బిడ్డ, పాప, నిసుఁగు.

కుదురు - క్రి. నెలకొను, తగ్గు, దొరకు, చక్కఁబడు. పొఁదు, కొలము, మొదలు, నిలుకడ, కుంపటి, వరుస, ప్రాపు,చోటు, కంచము, అండ.
కుదురుకొను-కలుగు, నెలకొను, నిలుచు.
కుదురుకొలుపు-నెలకొల్పు. నిలుపు.
కుదురుచేయు-బాగుచేయు, నిలుపు.
కుదురుచు-రోగముమాన్పు. నెలకొల్పు.
కుదురువిండు-అంతట వ్యాపించు.
కుదురుపడు-నెలకొను,కట్టుపడు,నిలుకడగా నుండు, తేలుకొను
కుదురుపఱుచు-నిలుపు, మాన్పు,కలిగించు, ఒప్పగించు-కుదుర్పఱుచు [కట్టుపాటు.
కుదురుపాటు-కుదిరిక, ఏర్పాటు, నిలుకడ,
కుదురుపె(వె)ట్టు - గింజలు చిందకుండ తోటిపై కుందెనపెట్టు, రక్షణపెట్టు.
కుదులు-కుదలు, కదలు. [కొట్టుకొను
కుదులుకొను-క్రి. కదలు, బెదరు, విలవిల
కుదువ-దాఁపుడుసొత్తు, తాకట్టు.
కుదువపట్టు-తాకట్టుపట్టు.
కుద్దు-పన్నులేని రోకలిబండ
కునష్టి-చూ. కునిష్టి, కునుష్టు.
కుని-సన్నని భూభాగము,వీధిమలుపు,మూల
కునికిపడు-కునుకు, కూరుకు, తూఁగిపడు.
కునికిపాటు - కునుకు, తూఁగు, సోలుట.
కునికిలవేయు-క్రుంగవేయు.
కునికిల-తల-శిరము.
కునిష్టి - కుంటివాఁడు, జబ్బుతో సర్వదా బాధపడుచున్నవాఁడు-కునుష్టు.

కునుకు - నిద్రచే తూఁగు, కనుమోడ్చు, నిద్రించు-అల్పనిద్ర, కూర్కు, కునికిపాటు.
కునుకుపట్టు-పని మందగించు, నిద్రవచ్చు.
కునుము-నిద్రించు, కునుకు, కనుమోడ్చు.
కునుష్ఠు-చూ. కునిష్టి.
కునుసు-మంచపుపట్టెయొక్క కుసి.
కున్న-(డు) } కుణకః = బిడ్డ, కూన-ముక్క, కున్నె } కుఱ్ఱ, కందు, కొండిక.
కున్ని-చిన్నది, బాలిక
కున్నులు-కూనలు, బిడ్డలు, శిశువులు.
కుపకము-ఘోషాస్త్రీలకై తెరకట్టిన బండి.
కుపసము - కూర్పాసః = చొక్కా, అవికె, పాము శరీరముమీఁది పొర-రూ కుప్పసము, కుబుసము, కూసము
కుప్ప-ప్రోగు, వామి, ధాన్యపురాశి, వంపఁబడిన వ్రేళ్లుగల పుడిసిలి-పట్టిలి.
కుప్పఁగూరగా-కుప్పతిప్పలుగా.
కుప్పకొను-ఎక్కువగు, నిండుకొను.
కుప్పకోలు-ఆధిక్యము, పెంపు.
కుప్పకోలుగొను-మించు, నిండుకొను
కుప్పగించు-ఊఁగాడు. [లచే వ్రూన్పడు.
కుప్పగూలు - కుప్పలుగాఁ గూడు కష్టము
కుప్పగూల్చు-రాసులుగా పడవేయు.
కుప్పగొను-అతిశయించు.
కుప్పగోలుగొను-పెంపెక్కు.
కుప్పట-కూలి, దినబత్తెము.
కుప్పటగురిగింజ - గురివెందగింజల పందెముతో పిల్లలాడుకొను ఆట.
కుప్పతించు-కుప్పలుగాఁ జేయు, కురియు, గ్రుడ్లనులుము-కుప్పళించు.
కుప్పతిలఁబడు } కుప్పలుగాపడు, కుప్పలుగా కుప్పతిలు-ల్లు } రాలు, బోర్లపడు.
కుప్పతెప్పలుగా } విణ కుప్పకుప్పలుగా, కుప్పసగూర } కొల్లలుగా.
కుప్పసగూరు-గుంపుగూడు.
కుప్పనూర్చు-వడ్లను గడ్డినుండి వేర్పఱచు.
కుప్పపెట్టు-ప్రోగుచేయు, కూడఁబెట్టు.
కుప్పము-ఊరు, చెంబడివారిపల్లె.
కుప్పలుగట్టు-ప్రోగులుపడు
కుప్పలుగొను-రాసులగు, పెంపెక్కు.
కుప్పలుగొట్టు-కుప్పనూర్చు
కుప్పలుఱుకు-మెండుకొను, ఎక్కువగు
కుప్పలువడు-ప్రోగులగు, పెంపెక్కు.
కుప్పళి(తి)ంచు-ఉమకు, ఉప్పళించు.
కుప్పవడు-ప్రోగగు, పడిపోవు.
కుప్పవేయు-కోసినపైరు మేటగావేయు.
కుప్పసము-కుపసము, కుబుసము, కూసము.
కుప్పసుడి-చూ. గసేపుసుడి.
కుప్పి-త. కూపి = గాజుకుప్పె, బిరడా, మందుగుళిక, గాజుపాత్ర, పింగాణిచిప్ప, గొడుగుగుబ్బ, సదాప +, కారవీచి +.
కుప్పించు-గుంభ = దుముకు, ఊని దాఁటు.
కుప్పింట-హారీతమంజరి + -మూరుకొండ.
కుప్పింపు-గంతు, దూఁకు, దాఁటు.
కుప్పిగంతులు - బాలికల చిన్నగంతులు, బాలురపల్లటీలు.
కుప్పిగంతుగొను-గంతిడు, దూఁకు.
కుప్పిదొల్లి-పెద్దగంప, తట్ట.
కుప్పియ(ప్పె)-మెడనిడుపగు గాజుపాత్ర, గొడుగుగుబ్బ, జడనగ, గిన్నెమూఁత.

కుప్పిలు-పిల్లల క్రీడావిశేషము.
కుప్పు-దారములతోకూర్చి బిగించి కట్టు.
కుప్పె-కూపి = మందుకుప్పి, గాజుబుడ్డి. కత్తిపిడి [ఒక దినుసు మొక్క.
కుప్పెంట = కుప్పింట-దిబ్బలలో మొలచు
కుప్పెకోల-అలుఁగులేని బాణము
కుప్పెస-ఒక అడవిచెట్టు.
కుబిలి-పైఁడికంటి-శకునపక్షి.
కుబుసము-కూర్పాసః-రెలువుటంగీ, దుత్తాయ, తలుపునకు క్రిందుమీఁదుల నుండెడి కూచము-పాముకూసము- కుప్పసము.
కుబుసు-దగా, మోసము. కికురింత.
కుమడు-గుముడు +, ఒకచెట్టు
కుమారపున్నమ-భాద్రపద పౌర్ణమి
కుమారిత-ర్త-కుమారి = కూఁతురు. ఆఁడు పడుచు. [పొందు.
కుమారిలు-ల్లు - కుములు, వగచు, ఈను,
కుమి-గాదె, పౌఁణక, గరిసె, బాలికా క్రీడా విశేషము-రూ. కుమ్మి.
కుమిలించు-బాధించు, ఉడుకఁబెట్టు.
కుము = చూ. రూ.కుమ్ము.
కుముటు-వాంతియొక్క వికారము, దగ్గు. కక్కువాయి, వికారము కలుగు,
కుముదాళ్ళు-తెలికజాతి భేదము.
కుమురు = కపటము, కుంపటి [తపించు
కుములు-రగులు, రాఁజు, సడలు, లోలోన
కుమ్మ-నీరుపోసిన నిప్పు, ఊఁకనిప్పు.
కుమ్మకు(క్కు)-సాయము, గూడుపురాణి, దొమ్మి. [నల్లనిది.
కుమ్మర-కుంభకార = కులాలజాతి-విణ.
కుమ్మరగువ్వ-కాటుకపిట్ట-ఖంజనము.
కుమ్మరత-ది, కుమ్మరజాతిస్త్రీ-కులాలి.
కుమ్మరపురు(గు)వు | కుమ్మరపుర్వు | -కులాలకీటము-మట్టిపురుగు.
కుమ్మరపొనిక | కుమ్మరపోలి(క)కి | -కుమ్మరచెట్టు - నల్లని ముంజగడ్డి.
కుమ్మరబూచి - కుమ్మరపురుగు
కుమ్మరవాఁడు-కుమ్మరి-కులాలుఁడు.
కుమ్మరసాన | కుమ్మరసారె | -కులాలచక్రము, ఒకానొక బాలక్రీడ.
కుమ్మరసారెచుక్క-విశాఖ-చేఁటరిక్క.
కుమ్మరావము-కుమ్మరి కుండలు కాల్చుటకు పేర్చిన దొంతర-ఆవాపము
కుమ్మరసారెలు-బాలక్రీడావిశేషము.
కుమ్మరి-కుంభకారః-కులాలుఁడు
కుమ్మరించు-దిగఁబోయు, ఎక్కువగా వెలువరించు, పోయు, ఒలికించు-క్రుమ్మరించు
కుమ్మరింత | కుమ్మరింపు | -దిగఁబోయుట, మల్లబంధ విశేషము-రూ. కుమ్మలింత.
కుమ్మరిలు-ల్లు-జలాదులొక్కసారిగా వెలువడు, నీళ్లుచిందు, కాఱు.
కుమ్మరిసారి(రె) = కుమ్మరసాన,
కుమ్మరు-తిరుగు, చరించు-రూ. క్రుమ్మరు.
కుమ్మలు-కులాలకః = కుమ్మరి.
కుమ్మలించు = కుమ్మరించు.
కుమ్మి = కుమి, గొబ్బిళ్లు.
కుమ్ము-దంచు, పొడుచు, పొట్టునిప్పు,దెబ్బ, క్రేటు, పెత, వివాదము,ఇబ్బంది,క్రుమ్ము.
కుమ్ముకొను-పొడుచుకొను.

కుమ్ము(కా)గాఁచు - పిడుకమంటవద్ద చలి పోఁగొట్టుకొను, కుమ్ములాడు.
కుమ్ముదుమ్ముగు-పగగొను, వైరపడు
కుమ్ముపురుగు-వు } ఒక జాతి పురుగు.
కుమ్ముపుర్వు
కుమ్ములాడు - పోట్లాడు, క్రుమ్ముకొను.
కుమ్ములు-పిట్టగోడలు, కమ్మీలు. [తము.
కుమ్ముసుద్ది-పొడుపుకధ, సంకేత వృత్తాం
కుమ్ముసుద్దులు-గుసగుసలు-గ్రుద్దులాట.
కుమ్ముపేయు-పాడుచేయు.
కుమ్మె-పోటు, నొక్కు, గంటు, కుమ్ము.
కుమ్మెలువోవు - నొక్కులుపోవు, దెబ్బలు తగులు, గంట్లుపడు, అదుముడగు.
కుయి-మొఱ, రక్షణము-కూయి, కుయ్యి.
కుయిలు-కిటికి లేక వాకిలి చట్టములు బిగించుటకు కొయ్యల చివరవేయు తొలి
కుయివెట్టు-మొఱవెట్టు-కూయిడు.
కుయి(వో)పోవు-కాపాడఁబోవు, కుయిపెట్టు
కుయో-మొఱ్ఱో-ఆర్తధ్వనికి అనుకరణము
కుయ్యన్న-పనికిమాలినవాఁడు, ఎంబెన్న.
కుయ్యాడు-చూ కుయ్యిడు.
కుయ్యాలించు-మొఱవిను.
కుయ్యి-కుయి, కూయి, మొఱ.
కుయ్యిడు } మొఱపెట్టు,బిచ్చమడుగు,కోరు-
కుయ్యు } కూయిడు, కూయు-కుయ్యాడు.
కుయ్యో-కుయో.
కుయ్యోమొఱ్ఱో-మొఱ్ఱయొక్క అనుకరణము
కురంగట-వద్ద, చెంగట, చెంత.
కురంజి-ఒకానొక స్త్రీరాగము.
కురంజియోమము-కురంజివాము-ఖురాసాని వాము-యవాని-తురుష్క-మాదగము
కురంట-కురంగట, కురఁగట.
కుర(దల)వా-వెలితి. తక్కువ, లోటు.
కుర(బ)ఱు-ఒక అడవిజాతివారు-కురవ.
కురము-పశువుల జలుబురోగము.
కురవ-కొండదారి, లోయ, గొఱ్ఱెల కాపరి.
కురవకపులుఁగు-మందపిచ్చుక-ఖంజనము.
కురాకు-మాంసము, ఆకుకూర
కురాడము } మంచపు పందిరిగుడ్డ - చప్పరము.
కురాళము }
కురాసానియోమము-కురంజివాము
కురించి-ద్వితీయావిభక్తి ప్రత్యయము.
కురించు-కురిపించు, కురియించు.
కురికుడుము-కజ్జికాయ-కజాయము.
కురిచీ - = కుర్చీ, కూర్చుండు పీఠము.
కురిచీపీఁట-ఎత్తుకాళ్ల పీఁట.
కురిడి(డీ)-ఎండు కొబ్బరిగుండు-కుడక.
కురిపించు-వర్షము కురియించు.
కురిపె-త్రవ్వగోల. దోఁకుడుపాఱ.
కురివింద-ఆలిచిప్ప, నత్తగుల్ల
కురిమిడి-గనిమ-పొలముగట్టు.
కురిమిడి(గట్టు)-మడి చుట్టును వేసినకంచె, ఆనకట్ట, చెఱువుగట్టు.
కురియించు-కురిపించు, కురించు.
కురియు-వర్షించు, ఇచ్చు, గుప్పించు, కలిగించు, రూ. కుర్యు.
కురుజా - మంచె, అరప, దూలముమీఁది నిలువుకొయ్య, గుజ్జు, పొట్టివాఁడు.
కురుకు-నిద్దుర-కునుకు-కూరుకు.

కురుగు-తొడ-ఊరువు. [ఉత్తరువు.
కురుచకత్తు - క్రయము కావించుట కిచ్చిన
కురుజీ-చిన్న(కంట్లము)మూట. గంత.
కురుజే-జున్ను. దేగ. గూఁటిగువ్వ. ఒక దినుసు జాణసంచు. కూన.
కురుజుతేనె-పట్టుతేనె. జుంటితేనె
కురుడి-ఒకానొక సంగీతస్వరస్థాయి.
కురుత-ఒక దినుసు వేఁప.
కురుప-గొల్లవాఁడు-గోపాలుఁడు
కురుపగొఱ్ఱె-ఉన్నిగొఱ్ఱె. బొచ్చుగొఱ్ఱె.
కురుపు-కుఱుపు-వ్రణము. పుండు.
కురుబ-కురుప. కురుమ.
కురుము-చూ. కురుప. పశువుల కళ్లనుండి నీరు కారెడు వ్యాధి. బొచ్చుగొఱ్ఱె.
కురుమగొఱ్ఱె-బొమ్చుగొఱ్ఱె.
కురుమవాఁడ-గొంగళ్లు నేయువాఁడు
కురుమాడు-ఇంటి పెణక పైకప్పు
కురుమాపు-పాతది. కొద్దిగా మాసినది.
కురుమింద-నత్తగుల్ల. ఎఱ్ఱచిల్లపురుగు.
కురులు-కురుళః = తలవెండ్రుకలు.
కురువ - మెరక. కొండమీఁది కాలిదారి-కురవ. ఉన్నినేసికొను జాతి గొఱ్ఱెలను మేఁకలను పెంచుకొను జాతి.
కురువగొఱ్ఱె-ఒడలియందు ఎక్కువ బొచ్చు పెరుఁగు ఒకతెగ గొఱ్ఱె.
కురువడములు }
కురువడాలు } ఒక దినుసు వడ్లు. అక్షుల్లు-
కురువులు } అట్టగడలు.
కురువేరు - వట్టివేరువలె పరిమళించు ఒక వేరు-హ్రీ బేరము.
కురువేరుదంటనారి-మన్మథునియొక్క నాల్గవదియైన వింటినారి.
కుర్చ-కొద్దికాలము. పొట్టిఅచ్చు. లొచ్చు. అశ్వగతివిశేషము. పొట్టిది. తేలికైనది.
కుర్చీ-కురుచీ. కూర్చుండు పీఠము.
కుర్తక-తివాసీ. రత్నకంబళి.
కుర్తా-పదులు అంగీ-కుడతా.
కుర్పించు-కురిపించు. కుకియించు.
కుర్మట్టము-పొట్టిది-వినమ్రము
కుఱఁగలి } చెంత. అండ. దగ్గఱ-కుఱంగలి.
కుఱఁగట } కుఱంట.
కుఱకుఱ-మిక్కిలి చిన్నది-బుడిబుడి. గుడిగుడి. చికిచికి. పొటిపొటి.
కుఱు-కుఱుచ. చిన్నది. పొట్టిది.
కుఱుకు-ప్రోగు. రాశి. కుప్ప.
కుఱుకులుగట్టు } గుంపులుగా నగు. కుప్ప
కుఱుకులుగొను } గా నేర్పడు.
కుఱుకొ(గొ)ను-వేగిరపడు.
కుఱు(ం)గడ-ఇనుపగడ. బల్లెము.
కుఱుచ - కొద్ది. పొట్టి. లోటు. అశ్వధార. కూర్పాసః = పొట్టిచొక్కా.
కుఱుచకావించు-పొట్టి(క్రిందు)చేయు.
కుఱుచఁదనము - గుజ్జు. గూను. పొట్టు. గుజ్జుతనము.
కుఱుచది-పొట్టిది. గుజ్జు గిటక. [యగు.
కుఱుచపడు - కుందు. తక్కువగు. చిన్న
కుఱుచపఱుచు-తగ్గించు. పొట్టిచేయు.
కుఱుచలు-ఒక తెగ నాట్యము.
కుఱుచలుద్రొక్కు-నర్తించు. చిందులుత్రొక్కు
కుఱుచసేయు-చిన్నపుచ్చు. వమ్ముచేయు.

కుఱు(ఱి) నువ్వులు-సన్నని నువ్వులు-తిలలు.
కుఱుపంది-ఒక జాతి లేడి, అడవిపంది.
కుఱుపు-చిన్నపుండు-వ్రణము, కురుపు.
కుఱుమాడు-ఇంటి మూలకప్పు
కుఱుమాపు-డు-కొంచెము ముఱికియైనది.
కుఱువ-మెరక, మెట్టనేల, కొండదారి.
కుఱువు-గట్టు, గుట్ట, తొడ, పిక్క.
కుఱ్ఱ - కూన, కొడుకు, కోడెయెనుపోతు.
కుఱ్ఱడు-కుఱ్ఱవాడు-కుఱ్ఱ, కూన, కొండిక.
కుఱ్ఱి-ఆవు. పాడియావు-గిడ్డి.
కుఱ్ఱు-కూయు, అఱచు, మూల్గు, కూఁత, మిట్ట.
కుఱ్ఱువడు-చిట్టడవి యేర్పడు.
కులంబరము } కలగూరగంప సంసార
కులం(బ)ము } భారము. విసుగుగల
కులకరించు-సోనలువాఱు.
కులకుల-పురుగులొక్కచో కూడుటవలనఁ గటిగెడు మ్రోఁత.
కులకుల(లాడు)మను-లుకలుకలాడు.
కులపుత - కులపుత్రః = మంచికులమున బుట్టినవాఁడు-కులీనుఁడు.
కులాయించు-అభివృద్ధిపొందు.
కులాయి-టోపి-కుల్లాయి, కుళ్లాయి.
కులాలు-తక్కువజాతి కులములు
కులికించు-కులుకునట్లు చేయు-కుల్కించు.
కులిక్రిదము-నికృష్టము
కులిపి-మేఁకలు కాచువాఁడు-కురుప.
కులిరు-చల్లఁదనము-శైత్యము.
కులిరుగొను-చల్లనగు
కుఱుకరించు-సోనలువాఱు-కుఱుక్క.

కులుకు-మురియు, చిమ్ము, పూయు, తాకించు, వేయు, కదలించు, రంగరించు, చిలుకు, ఒప్పు. విలాసము, వలపు, కుదిలిక, వణఁకు.
కులుకు(ల్కు)దనము-శోభ, మురిపెము.
కులుకులాఁడి-విలాసిని, హొయలుకత్తె.
కులుకు(ల్కు)లాఁడు-విలాసకాఁడు,
కులుక్కగుంజ-కొఱవినిప్పు-ఉల్కాగ్ని.
కులుప-వాఁపు-ఉలుపు-శోఫ-ఉల్పడ.
కులుపు-తాయి-రాజావర్తమణి, కుళుపు.
కుల్లాయి } ఖోలకః = చిన్నటోపి కుళ్లాయి.
కుల్లావు }
కుల్లిమి } ఒక జాతి మలుఁగుపాము-పాఁప
కుల్లెము } మీను, రూ. కుల్లియము
కుల్లేరు-తాపీ, సిమెంటుపూయు పనిముట్టు
కువ-ప్రోగు-రాశి-కువ్వ. కుప్ప.
కువకువ-కోకిలధ్వనికి అనుకరణము.
కువలుపడు-తెల్లి పడు, కుప్పఁగూలు.
కువాదము - వాహనపు పీఁపుపైఁ గప్పెడు చిత్రపత్రము, ఓర్వలేనితనము, కుచ్ఛితపు పని-రూ. కువ్వాదము
కువాడి-శి-మోసగాఁడు-కపటి, రూ కువ్వాశి
కువారము-కుళ్లు, కుచ్ఛితబుద్ధి.
కువాళము-చూ కువాదము.
కువాళించు-గలిబిగాఁజేయు, కప్పు, మోసగించు, లోఁబర్చుకొను.
కువిచిలు-ఒకానొక మట్టిపాత్ర.
కువ్వ-ఊరిపాఁతలు, కుప్ప-కువ.
కువ్వనేల-కుఃకువలాడు నేల.
కువ్వెన-పొన్నలు, గరాటు.
కువ్వాద(శ)ము-కువాద(శ)ము.

కుళాలు-హి. సంతోషము, ఉల్లాసము.
కుష్టు-కుష్ఠమ్-ఉలుపువ్యాధి-రూ.కుస్టు.
కుసి-అవయవముల సంధి, చిక్కి-పోవుట, చింత, వగపు, కన్నము
కుసించు-సీరసించు, వగచు. [గుసు.
కుసిగుంపులు-విసుగువల, బడలిక, నలఁ
కుసిని-వంటిల్లు-బానసము.
కులిసివాఁడు-వంటవాఁడు, బట్లరు.
కుసిలించు-కుసించు, కుసులు, దుఃఖించు.
కుసిలింత-అతృప్తి, పరితాపము-కుసి.
కుసుంబా - కుసుంభ = పసుపు గలిసిన ఎఱుపు, ఒకానొక పుష్పము.
కుసుని-పొట్టివాఁడు-గిటక, గుజ్జు.
కుసుమ-ఒకజాతి పైరు, ఒక దినుసు(పూల మొక్క)చెట్టు, కుసుంబి, పుండుమొలక.
కుసుమపూవు-కుసుంభపుష్పము.
కుసుమ(పూరాజనా)లు-ఒకదినుసు వడ్లు.
కుసుమము-కుంకుమపూవు రంగు.
కుసుమలు-ఒక దినుసు వడ్లు.
కుసుమ-కుసుమ = ఆర్తనము.
కుసురుకొను-ఉపెక్ష వహించు.
కుసులు - కుసిలించు-కుశలము, కొయ్యల నొకదానితో నొకటి చేర్చియుండు నతుకులు
కుసులి-పొట్టివాఁడు-కుసుని, కురుఁజు.
కుసు(ఖ)ళ్లు-దండకడియములు.
కుస్టు-కుష్ఠమ్ = కుష్ఠు, పెద్దరోగము.
కుస్తరించు-ఓదార్చు, ఒప్పించు, ఆనతిచ్చు, కొలుచు, కప్పు, చప్పట్లు చఱచు, తట్టు, బుజ్జగించు, పవరించు.
కుస్తరింపు-కుస్తరింపుట.
కుస్తీపట్టు-మల్లురు దండపట్లు పట్టు.
కుశమ-దూలమ్ = కోసేరు, కొలను.
కుళాయ-ఖోలక = చిన్నటోపి-కుళ్లాయ.
కుళాయి-హి.టోపి, నీటిగొట్టము-కుళ్లాయి.
కుళుపు-ఉంగరపుతాయి. కుల్పుతాయి.
కుళ్లగించు - త్రవ్వు, పెల్లగించు రేఁపు, పురికొల్పు, కదలించు రూ.క్రుళ్లగించు.
కుళ్లగింత-కుళ్లగింపుట.
కుళ్లాయ } కుల్లాయ, కుల్లాయి, చిన్న
కుళ్లాయి } టోపి
కుళ్లు-చెడు లోన దుఃఖించు, పండ్లు చెడిపోవుట, ముఱికి, మనోవ్యధ-క్రుళ్లు.
కుళ్లుకుళ్లు-దగ్గుయొక్క అనుకరణము.
కుళ్లు(ళ్లి)కొను-లోన బాధపడు, పొడగు, అసూయపడు-రూ క్రుళ్ళుకొను.
కుళ్లుపోతు-ఎడ్పుగొట్టు, మచ్చరగొట్టు.
కుళ్లుపోవు-అసూయపడు.

## కూ

కూ-కోయిల కూఁత, మొఱ్ఱ, పిలుపు.
కూఁక-కేక, మొఱ, తిట్టు, కూఁత.
కూఁకట-నెమలిజుట్టు-సిక, చూడ.
కూఁకటి-కూటక = జుట్టుముడి, పిల్లజుట్టు, కాకిజెక్క, తల్లివేరు, నెమలిపురి, ముఖ్యము
లేఁతది-హూ. కుంకటి.
కూఁకటికువ్వె - కూఁకటిగువ్వ, అంటటి జోరిగాడు-ఎవ్రటింప.

కూఁకటిగుడ్డంగి-కూఁకురు గుండంగి పక్షి.
కూఁకటిగువ్వ } ఏట్రింత - పసుల పోలి
కూఁకటిముద్వ } గాఁడు మంగల పిట్ట.
కూఁకటిమూఁగ } చాకలపిట్ట,
కూఁకటిపేరు-తల్లి పేరు-కుంకటి పేరు.
కూఁకపెట్టు-పిలుచు-కేక వేయు.
కూఁకరించు-తిట్టు-కూఁకలు వేయు. [పెట్టు.
కూఁకలిడు-కూయు, అల్లరిచేయు, చివాట్లు
కూఁకలు-పెద్దకూఁతలు, కేకలు.
కూఁక(లు)వెట్టు-కూఁకఁడు, పిలుచు.
కూఁకవేటులు-పాములలో నొక తెగ.
కూఁకవేయు-కూఁకపెట్టు, పిలుచు.
కూఁకు-అస్తమించు-క్రుంకు, అస్తమిల్లు.
కూఁకుడు-కుంకుడు, అస్తమయము.
కూఁరుగుండంగి } వి ఏట్రింత-పసుల పోలి
కూఁకురుగుండె } గాఁడు - కాలకంఠము,
దాత్యూహము, కుఁకురుగుండఁగి.
కూఁగుటికాయ-కుంకుడుకాయ.
కూఁటు-కుంటినడక, పొణక
కూఁత-కేక, కూయుట, మొఱ.
కూఁతకైదువు - ఊదినంత మాత్రముననే పగతురి గుండెలు పగుల్చునట్టిది-శంఖము-బూరగొమ్ము.
కూఁత(పట్టు)నేల } కేకకు అందునంత
కూఁతవేటు(దూతము) } దూరము - కోసు,
కూఁతపెట్టు-వార్తనంపు.
కూఁతలిడు-కూయు, మొఱపెట్టు.
కూఁతు-కూఁతురు, బాలిక, ఆఁడుఁబడుచు.
కూఁతుకూఁతురు } కూఁతురగు లక్ష్మికి
కూఁతుబిడ్డ } కూఁతురైన నది-గంగ,
కూఁతురిబిడ్డ } దౌహిత్రి.

కూఁతుకొడుకు-దౌహిత్రుఁడు, మనుమఁడు.
కూఁతురు-కుమారిత, ఆఁడుబిడ్డ. ఆఁడుపి.
కూఁతు(రు)కొడుకు-మనుమఁడు.
కూఁతురుబుడమ-రేణుకలు, నూగుదోస + ఏలవాలుకము, హరివాలుకము +
కూకి(కీ)-పావురాయి-పల్లటీ
కూకీపలుకు-పావురముయొక్క రతికూజితము-మణితము.
కూకు-పాలవిఱుగు-ఆమిక్ష, తునుక.
కూకుబవత్తులు-ముక్కముక్కలు.మిక్కిలి కృశించుటలు.
కూకువు-ఎనిమిదేండ్లది-కన్య.
కూగు-కూఁతవేటునేల-క్రోసు.
కూచి(చీ)-వాఁడిమి, పదను, దాడి-
కూచికావించు } దండెత్తు, పదనుపెటు -
కూచిచేయు } కూచీచేయు
కూచిమతము-సాతాని మతభేదము.
కూచిమారము-పోకిరితనము.
కూచియగు-కూసియగు. [రించుటలు.
కూచీలు-పోరునకు సిద్ధమగుఁడవి హెచ్చ
కూచీ సేయు-దండెత్తు
కూచీఱుగు-పిచ్చుకపోవు.
కూచెంటి-మిక్కిలి చంటి.
కూచెము-గుంజ, గూటము, కుసి, కూసము.
కూజా-సన్నని మూతిగల పాత్ర.
కూటపడు-జతకలియు, కవగూడు.
కూటఁబడయు-పొందు, కూడు.
కూటమి-చెలిమి, పొడిక, రతి, అంటు.
కూట(టా)ము-కొల్వుకూటము-చావడి.

కూట(టి)ముత్తెము-చేఁతముత్తెము,కృత్రిమ ముత్యము.
కూటికుండ-అన్నము వండెడు కుండ.
కూటికుప్పలు-ఒక దినుసువడ్లు.
కూటినీళ్ళు-పుల్లనీళ్ళు-తరవాణి.
కూటినేరేడు-హ్రస్వజంబువు +.
కూటిపేద-కూడులేని(ది)వాఁడు.
కూటిముచ్చు-మిక్కిలి తిండిబోతు
కూటిసారా-అన్నమునుండి తీసినసారాయి.
కూటీ-చిలుకకొయ్య. నాగవాసము.
కూటు-కూటః = గాదె. వడ్లపురి. పులుసు. పచ్చడి. గుంపు.
కూటుకట్టు-వడ్లు పురికట్టు.
కూటువ(వు)-రతి. కుప్ప. మూక. బారు. దండు. గుంపు రూ. కూటువు.
కూటువమూఁక-పతికిపండల పేన.
కూటువ(లు)గొను-గుమిగూడు.
కూడ-అదియు. తోడ, సైతము
కూడఁదీసికొను } చేర్చుకొను. అనుకూల
కూడఁదెచ్చుకొను } పఱచుకొను.
కూడఁబలుకుకొను-కలిసియాలోచించు
కూడఁబడు } కూడు. చేరు. కుదురుపడు.
కూడఁబాఱు } కలిసికొను. అనుసరించి పరుగెత్తు.
కూడఁబెట్టు-నిల్వచేయు. తార్చు. కలుపు.
కూడని-నిషిద్ధమైన
కూడముట్టు-తఱుము. వెంటాడు.
కూడమెట్టు-అనుకూలముగ వ్రాయించు
కూడలి } త్రోవ,ఎల్ల,కూడిక, నాల్గుదారు
కూడలితావి } ల మొగ-వచ్చు. వారస్తా.
కూడలిపట్టు-కచ్చేరి సావడి. [శిల.
కూడలిఱాయి - సరిహద్దుఱాయి-సీమాంత
కూడలివాయి - రెండు పంచలు కలిసిన చోటున ఏర్పఱచిన పీటిదారి.
కూడా-సహార్థకము-కూడ, తోడ.
కూడించు-కూడఁబెట్టు-కూరుచు, కూర్చు.
కూడిక-చేరిక,కలయిక, పొందిక, కూటమి,
కూడికొను-కూడు, కలియు.
కూడిమాడు-కలసి మెలసి యుండు.
కూడియుండు-కలసియుండు.
కూడివచ్చు-అచ్చివచ్చు. కలిసివచ్చు.
కూడు-కలియు. చేరు. ఒప్పు. తగు. కూడఁబెట్టు వి. బువ్వ. బోనము. బాతు.
కూడుకవచ్చు-కూడు.
కూడుకొను-కలిసికొను, రతిచేయు. చెలిమి చేయు. గుమిగూడు.
కూడుగుడుచు-తిను. పాపడు.
కూడుజీతము-కూటికొఱకిచ్చు ద్రవ్యాదికము
కూడుదల-అదా. కూడిక. ఒడుపు.
కూడునీరు-గంజి-అన్నరసము. [కోడి.
కూఁతకువచ్చినకోడి-వయసువచ్చిన మగ
కూతు-వీధిభాగవతము
కూత్తాడు-నాట్యముచేయు.
కూన-కుణకః = బిడ్డ. పశుపక్ష్యాదులపిల్ల, కంటికాయ-రూ కున్న.
కూనము-జ్ఞాపకము. [-కూలగుంత
కూనగుంత-మీట మొదలు అనెడు పల్లము
కూనమ్మ-కూనవలె నడువలేని యాఁడుది. కుంటిది. [రాగము.
కూన(ని)రాగము - లోలోన పాడుకొను

కూనరోగము-కాయకాచెడు కంటిజబ్బు.
కూన(ఊ)లమ్మ - కొలిచినవారికి కూనల నిచ్చు ఒక గ్రామదేవత.
కూనలమ్మచీర-గళ్ళచీర.
కూనలు-పిల్లలకుకండ్లలో పెరుగు కండలు
కూనారి-నంగనాచి-నంగ.
కూని-నీ-ఖూనీ-నరహత్య.
కూను-చెవిటివి నిండుగా, పూర్తిగా.
కూపీతీయు-ఆరాతీయు, జాడకన్గొను.
కూపెట్టు-కూయు, మొఱపెట్టు- కూయిడు.
కూముడి-మాలకాకి, బొంతకాకి
కూయి-కూఁత, మొఱ. రూ. కుయి-య్యి, కూ.
కూయిడు = కుయ్యిడు మొఱపెట్టు
కూయిపోవు-వర్త వెంటవెళ్ళు.
కూయు-మొఱపెట్టు-అఱచు, ప్రే॥ కూపెట్టు మాటాడు, తిట్టు, పిలుచు [నము.
కూర-కూరమ్ = వండినశాకము, వ్యంజ
కూరట-పొర్లుట, దొర్లుట, పొరలిక
కూరనెల్లి-హవిష్మంతము+-నదీయ
కూరముక్కు-ఒకదినుసుచేఁప
కూరపసుపు-శాకహరిద్ర
కూరాకు-కూరగా వండుకొను ఆకు
కూరాకుచేయు-తేలికచేయు, చంపు
కూరాకుపురుగు-ఆకు కూరలకు పట్టెడు పురుగు.
కూరాడు-పులికడుగు గంజి కలి, కాఁడి,
కూరాడుకుండ - కులదేవతాస్థాపనకు బదులుగా నుంచిన అన్నపుకుండ.
కూరించు-కూరుచు, కూరు, కూర్చు
కూరిచి = కూర్చి, గుదిచి, గుదించి,
కూరిమి - చెలిమి, ప్రేమ. వలపు. మేలు. రూ. కూర్మి.
కూరిమికత్తె-చెలికత్తె, కూర్మికలది.
కూరిమికాఁడు-ప్రియుఁడు వలపుకాఁడు.
కూరు-చొప్పించు, పొందు, నిదురించు, పడు, క్రుంగు, మునుగు.
కూరుకిడు-నిద్రించు, కునుకు.
కూరుకు-కునుకు-నిద్ర, క్రి. కాంతిదక్కు, కనుమోడ్చు-కూర్కు, కురుక.
కూరుకుపాటు-కునికిపాటు-తంద్ర.
కూరుకువాఁడు-నిదురపోతు, నిద్రాళువు.
కూరుకొనిపోవు } కలుగు, క్రుక్కు, చొచ్చు.
కూరుకొను } దిగఁబడు = కూర్కొను.
కూరుచు-కూర్చు. చేర్చు. కలుపు, అమరు. ఇష్టపడు, కూర్చు, రచించు, కూడఁబెట్టు, కాలించు, కుట్టు, తాల్చు.
కూరుచుండఁబడు } కూలఁబడు, కూర్చుం
కూరుచుండఁబెట్టు } డఁజేయు.
కూరుచు(ర్చు)ండు-కూర్చుండు.
కూరుచు(ర్చు)కొను-పోగుచేసికొను. చెలిమి చేసికొను. వెంటఁబెట్టుకొను.
కూరుచు(ర్చు)కోలు-కూర్చుకొనుట.
కూరుపరి-కూర్చువాఁడు-కూర్పరి.
కూరుపు(ర్పు)-కుట్టు, రచన, అచ్చు.
కూరుమొన-పోరసిద్ధమైన సేన.
కూరేగంట్లు-చీరపోతులు, చీరపేలు.
కూర్చించు-ప్రేమించునట్లు చేయు.
కూర్చియిచ్చుమిటారి-తార్పుకత్తె [నుండు.
కూర్చుండఁబడు-కూరుచుండు, నిలకడగా
కూర్చుండఁబెట్టు-కూర్చుండఁజేయు.

కూర్పువాఁడు-కూర్పరి కూరుపరి.
కూర్పినిషాతు-మొక్కు. సలాము.
కూర్పన-ప్రోగగుట, గుమిగూడుట
కూర్పించు-కూర్చునట్లుచేయు
కూర్మికత్తియ-త్తె-ప్రియురాలు.
కూర్మికాఁడు-ప్రియుఁడు, అనుఁగు.
కూటు-పొందు, కూడు, కొలువు.
కూలఁబడు-చదికిలఁబడు, విరిగిపడు, నేల బడు, చచ్చు, కూలు.
కూలగుంత-కూనగుంత
కూలమ్ము-ఒక దినుసు బాణము.
కూలవేయు - పడఁద్రోయు, తటాలునఁ గూర్చుండఁబెట్టు.
కూలారుచు-ర్చు-కూర్చు-చంపు.
కూలి-జీతము, శిస్తు, భూమిపన్ను, బాడిగ.
కూలించు-చంపించు-కూల్చు
కూలికాఁడు-జీతకాఁడు-సంబళకాఁడు.
కూలిపడు - కూలిపనిచేయు, కూలిపోవు, విరిగిపడు.
కూలియాలు-వెలయాలు-రోయింతి
కూలివాఁడు) వైతనికుఁడు - సంబళకాఁడు,
కూలీ ) కూలికాఁడు
కూలు - పడు, చచ్చు. విఱుగు, పాడగు, వెడలు, (కొడవలి) మొదలు.

కూలుచు-ర్చు-అడఁచు. చంపు.పడఁగొట్టు, విఱుచు. [రూపము.
కూలురూపు - అమాంతముగా మాఱినట్టి
కూవి-చూ రూ కువ్వ.
కూవిత-కూఁతురు, కుమార్తె.
కూస-కుప్ప-కువ్వ-కూవ, మట్టిమూకుడు.
కూసంత-కాసంత, కాసింత, కసింత.
కూసము-కుబుసము, కుప్పసము.
కూసలేఁబగు-పాము.కూసముతో సమమగు.
కూసి-చిన్నపిల్ల. రూ. కూచి.[కూచియగు.
కూసియగు - కూఁలబడు, వాఁడియగు.
కూసు-శిశువు, తక్కువ. నీచము.
కూసులు - గుజ్జులు. బండిపరములమీఁద బిగించు చిన్న నిలువులు
కూళఁడు - (కూరః = అవివేకి, చెనఁటి, దుండగీఁడు. పిసినిగొట్టు, తేలికబుద్ధి వాఁడు, గరాసు, తులువ, పేద.
కూళతనము - దుండగము, పేదఱికము, పిసినితనము, తులువతనము. [పేద.
కూళమారి-చెనఁటి, దుండగీఁడు, తులువ,
కూళము-పొట్ట. ఉముక
కూళుఁడు-ఎడ్డెవాఁడు, వెంగలి-కూళ.
కూళ్ళు-కూలీలు(తె. సామె), కూలిపనులు.
కూళ్ళాపిడలు-ఒకానొక పిండివంట.

## కె

కె-కెంపుశబ్దలుప్తశేషము. [కెంగెట.
కెంగట-తాటిటెంక - తాళబీజము. రూ.
కెంగేలు-ఎఱ్ఱని అఱచేయి-రూ. కేఁగేలు.
కెంపుదయ-ఎఱుపు, తొగరురంగు.

కెంజిగురు-ఎఱ్ఱని చిగురు.
కెంజిగురులవిల్తుఁడు-మన్మథుఁడు.
కెంటలము-గర్భవతికిఏనిమిదవమాసమునఁ బెట్టెడు క్రొత్త యలంకారము.

కేకించు-కేకలువేయు, నెమలికూయు.
కేకిస. నెమలికూఁత-కిస.
కేకిసలాడు-కేకసలాడు.
కేకిసలు-కేరింతలు, కరధ్వనులు, గిడిగిళ్ళు
కేకిసలుకొట్టు-చప్పట్లుకొట్టు.
కేకూళి-గుంట, చెలమ, మడుఁగు.
కేగన్ను-క్రేగన్ను.
కేగరించు-దగ్గఱు, చెంతచేరు.
కేపి-బురద-అదుసు-రొంపి.
కేటత్రాడు-యమపాశము. [ప్రత్యేకించు.
కేటాయించు-వేఱుచేయు, మినహాయించు.
కేడ-చెడుగు, తుంటరి, తుఱువ.
కేడమాడు-కేరడముచేయు.
కేడము-(ఖేటక)డాలు-అడ్డనము.
కేడములుచ-మోసగాఁడు, తుంటరి
కేడి-ఎట్టబియ్యపు వడ్లు-క్రేడి.
కేడించు-తొలఁగు, త్రిప్పు, వదులువేయు, ఎడఁబాయు-క్రేడించు.
కేడించుకొను-పాఱు, తొలఁగు.
కేడిగింజ-ఒక ధాన్యమున కలిసిన వేఱుజాతి ధాన్యపుగింజ.
కేడిపడు-కేడిగింజపడు.
కేడియ(డె)ము-కేడెము, డాలు, పలక.
కెడు, కేడువాఱు } చచ్చు-చావు, నాశము - చచ్చు, నీల్గు. [కేవడము, కేడము.
కేతిగాఁడు-కేదరిగాడు-తోలుబొమ్మలాటలో హాస్యగాఁడు.
కేదగిబిళ్ల-మొగలిరేకువంటి తలసగ.
కేదారి-కేదారగౌళరాగము.

కేనము-మోసము, కొఱఁత, సాటి.
కేపు-నివాసము-టెంకి.
కేపుమారి-మోసగాఁడు-కేప్మారి.
కేబేజి-క్యాబేజి-కేముకము.
కేరసేము-ఒక పక్షి-కేర్జము. [ఈసడింపు
కేరడము-గేలి. నేర్పు. ఱంకరమాట, ఉపేక్ష
కేరడములాడు-గేలిచేయు.
కేరడములుచ-మోసగాఁడు, వంచకుఁడు.
కేరడించు, కేరించు } కెలయు, గేలిచేయు, చెలరేఁగు, ముమ్మరించు
కేరడములుచ-మోసగాఁడు, వంచకుఁడు.
కేరణాలు-కేరింతలు.
కేరమాడు-ఎత్తిపొడుచు.
కేరాకు-నాసిరకపు పొగాకు
కేరింత-నవ్వు. గేలి, ఎగతాళి, కేరియ.
కేరింతలుకొట్టు, కేరింతలాడు } నవ్వు-పరిహసించు.
కేరికొను-కేరుకొను.
కేరిజేము-కేరిజేము, కేర్జము.
కేరిజెవ్వ-ఒక జాతి దేగ-కేరుజవ్వ.
కేరియ-కేరింత.
కేరియ(లు)వాఱు-కేరింతలుకొట్టు
కేరు - కూయు, గేలిచేయు, క్రేడిసేయు, చెలరేఁగు, దూఱు, పూను, వేడుకపడు, పిల్లలయేడ్పు, గ్రుడ్లు పెట్టుటకుముందు కోడిపెట్టయొక్క కూఁత.
కేరుకొను, కేరుచు } వేడుకపడు, చెలరేఁగు, గొప్పగా చెప్పుకొను, పెంపెక్కు.
కేరుపు-చెలరేఁగుట, కేరుట, క్ష్వేళ, పూనిక.
కేర్జము-కేరి(ర)జము, అంబటి జోరిగాడు,

కేలు-కులి = చేయి, తొండము, కయి.
కేలుచూపు-నిర్దేశించు.
కేలుదండ-చేయూఁత-కైదండ-అండ.
కేలుదమ్మి-తామరవంటి చేయి.
కేలుదో(ల్దో)యి-రెండు చేతులు.
కేలుమె(ల్మె)కము-ఏనుఁగు-చేఁగలమెకము
కేలుమొగు(ల్మొ)చు-మ్రొక్కు. చేమోడ్చు.
కేలుమొ(ల్మో)గుపు | మ్రొక్కు. చేమోడ్పు-
కేలుమొ(ల్మో)గ్గ | అంజలి- కోపులు.
కేలుమో(ల్మో)డుచు(డ్చు) - మ్రొక్కు, నమస్కరించు. [చేమోడ్పు.
కేలుమో(ల్మో)డుపు (డ్పు) - మ్రొక్కు.
కేలువ(ల్వ)ట్టు-పెండ్లియాడు, చేపట్టు.
కేలువిడుచు-అనతిచ్చు, అనుమతించు.
కేలుసాఁచు-బిచ్చమెత్తు, అడుగుకొను
కేలొనఁగు-మ్రొక్కు, కేల్మోడుచు.
కేలలపు-చేతులు కలుపు
కేల్పట్టు-పెండ్లి-పాణిగ్రహణము.
కేల్మొగిడించు-మ్రొక్కు, నమస్కరించు.
కేవ-చెంత, చేరువ, దగ్గఱ, దాపు
కేవడము - ఖేటకమ్ = డాలు, నాశనము,
కేవడించు-చెఱచు, పాడుచేయు.
కేవరి-కేవు పుచ్చుకొనువాఁడు. [కాచువారు.
కేవలనులు - కెవనిబంటులు-కోటగుమ్మము
కేవు-ఓడకూలి, కెవ్వున అర్చుట.
కేస-కేసులికూఁత-కిస-కేక.
కేసరి-ఒక జాతి జంతువు, ఒక దినుసువడ్లు.
కేసరులు-ఒక దినుసు వడ్లు.
కేసి-వైపు, ప్రక్క
కేశము-కేడియము. [సరస్సు.
కేళ(ళా)కు(కూ)ళి-కేళికుండమ్ = క్రీడా
కేళి-చక్రకేళి అరఁటి+,ఒక వరితెగులు,
బెరుకులు.
కేళిక-క్రీడ, ఆట, నృత్యము.
కేళ్లు-క్రేళ్లు.
కేళ్లుదాఁటు | క్రేళ్లుదాఁడు, క్రేళ్లుఱుకు, గంతులువేయు.
కేళ్లుఱుకు |
కేళ్లువారు |

## కై

కై-కర = కేలు, తొండము, చతుర్థీవిభక్తి ప్రత్యయము.కవి=కబ్బపుకూర్పరి.కయి
కైక-కైకేయి = కేకయరాజు కూఁతురు.
కైకట్టు-సందర్భము, చేమోడ్పు
కైకర్ణిక-వశ్యక్రియ.
కైకలవాఁడు - సాలెవాఁడు - కై(కా)కోల వాఁడు-కరిణలు.
కైకలు-కూలి, కైలు.
కైకానుక-బహుమతి, లంచము, కట్నము.
కైకాసము-వంత, వేదన, లంచము.
కైకిలి-కైకూలి, కైజీతము, పెచ్చు.
కైకిలిపోవు-కూలిపోవు.
కైకూడు-కలుగు, సమకూడు.
కైకూలి-రోజువారి కూలి-కైకిలి.
కైకొను-ఎంచు, పాటించు, పూను,కలుగు, పెండ్లాడు, తీసికొను, తాల్చు, లోఁబర్చుకొను వెన్నాడు - సమ్మతించు, తిను, కయికొను.

కైకొలుపు(ల్పు)-కైకొనఁజేయు.ఒప్పించు, పొందించు

కైకోల-చేతికఱ్ఱ, సాలెజాతి.

కైకోలవాఁడు-సాలెవాఁడు-సాలీఁడు.

కైకోలు-ఒప్పుదల, ఇయ్యకోలు, ఒట్టు,

కైగ-పొదుపుగ, మంచిగా, రుచిగ.

కైచిప్ప-అల్చిప్ప, కొచిప్ప.

కైచెఱ-చేఁజిక్కుట, లోఁబడుట

కైచెఱయిచ్చు-మ్రొక్కు. బిచ్చమెత్తు,

కైచాఁపులు-మ్రొక్కు. కేకిసలు, ఏటికోళ్ళు

కైచూఱ-కొల్ల, సమృద్ధి, కయిచూఱ.

కైజీతకాఁడు-శంబళాయు:జీవి గురిమాసి

కైజీతము = కైనాలి, కైకిలి. [కయి

కై -వాఁగెను వెనుక కీడ్చి కట్టుట -

కై చేయు-కళ్లెపు పగ్గమును బిగించు.

కైజామోర-పగ్గముబిగించినగుఱ్ఱపుమూతి, గుఱ్ఱము తల ఆడించుట.

కై ఱు-బాకు, వాలుకత్తి, తెడ్డు, ఏట వాలుగానుండు, కైవ్రాలు.

కై -కపింజల - కౌఁజుపిట్ట-కైదు.కయిజు

కైత-కవిత = కయిత-కబ్బపు కూర్పు

కైతగాఁడు-కవి-రచయిత, కయితగాఁడు.

కైతట్ట-బంగారుగిన్నె-శృంగారము,

కైతప్పు-పొరపాటు, చేఁజాఱినది.

కైతవాలు-మడికి నీరుపెట్టి దున్నుట

కైతము = కైత, కవిత్వము.

కైతాళము = కంచుతాళము. కరతాళము.

కైదండ-చేయూఁత, సాయము,

కైదండగోను-చేయూఁతగోను.

కైది-చెరస్థుఁడు, బంధితుఁడు-ఖైదీ.

కైదు-చెఱ-కైజు, కార,

కైదు(వ)వు-కత్తి, వాఁడియంచు, కౌఁజు పిట్ట-కయిదువ-వు.

కైపీడ-క్రీపీడ.

కైపడు-క్రింది కొఱగు, కైవ్రాలు-కయిపడు

కైపదము-కవిపద్య-సమస్య-కయిపదము

కైపాల-కక్షపాల = జోలె-కకపాల

కైపు-మత్తు, పొగరు. నిక్కు, అందము, రీతి, సారాయి, టెక్కు, ఉద్రేకము

కైపుమిగులు } మత్తిలు, చెదరు. వదుఱగు,
కైపెక్కు } సోమరియగు

కైఫీయతి-ఒక సంగతియొక్క వివరము, వాఙ్మూలము [కట్టు

కైబజారుకట్టు - అంగడియందు సుంకము

కైముడి-తోలుమూసిన ఒక వాయింపు.

కైమోడుచు(డ్చు)-మ్రొక్కు.

కైమోడుపు(డ్పు)-మ్రొక్కుట. [పేరు

కైరఁడు = కయిరఁడు, గుఱ్ఱముయొక్క

కైరతు-వతురోపాయము.

కైరవడి-కయిరవడి, కవిరియుండ.

కైరా = తెల్లని పావురము.

కైరి = కయిరఁడు. కైరఁడు

కైల = కయిల, వరి

కైలగడ్డి-కైలుగడ్డి.

కైలపీల } బండి దొలుపును, పోలుకఱ్ఱను
కైలమేకు } బిగించి కొట్టిన మేకు.

కైలపనులు-కపిలగోపులు.

కైలాగు - చేయూఁత-కైదండ.

కైలాగుకట్టు-మ్రొక్కు, చేయూదికొను, వ్రాలిపోవు.

కైలాట = కయిలాట. మోసము, కైలా గొనగు-వేదండనిచ్చు.
కైలాటకత్తియ-త్తె = కయిలాటకత్తె
కైలాటకము-కీడు, మోసము
కైలాటకాఁడు = జగడాలమారి,వంచకుఁడు
కైలాటము-మోసము,మ్రొక్కు, జగడము
కైలాసకి-ఒక విధమైన నాట్యము.
కైలు-ధాన్యపురాశికొలఁత, ఒబ్బిడి-త్రైలు.
కైలుగడ్డి-గింజలు మిగిలిన గడ్డి
కైలుచేయు = కయిలుచేయు, పడ్లరాశిని కొలుచు.
కైలువాలు-మడి నాల్గవసారి దున్నుట.
కైలుదారుఁడు-కయిలుదారుఁడు.
కైలుపాలు-పండిన ధాన్యపు పరిమాణము.
కైలుసాలు = కైలువాలు, కైల్సాలు.
కైవడి-రీతి, తెలుగు, సాటి, కైవళి.
కైవడిముస్తె-కయివడిముస్తె తుంగముస్తె
కైవడు = కైవడు
కైవళి = కైవడి, రీతి, విధము.
కైవళ్ళు-వా. కవిరియుండలు,
కైవస మగు-పూర్తిగ లోఁబడు.
కైవసము-లోఁబడుట, వశము.
కైవారపుచేతలు-మ్రొక్కు, అంజలి.
కైవారము = కయివారము, పొగడ్త, గని మయంచు.
కైవారముచేయు / కైవారమొనర్చు - కొనియాడు, పొగడు
కైవారి = కయివారి, స్తోత్రపారకుఁడు.
కైవారించు-పొగడు, మ్రొక్కు.
కైవీఁగు = కయివీఁగు. అలయు, చేయి వాల్చు, పోరు, విరమించు.
కైవు = కయివు-ఉన్మాదము, కైపు.
కైవెక్కు-కయివెక్కు, కైపెక్కు, మత్తిలు.
కైవ్రాలు-కయివ్రాలు, కైజారు.
కైవ్రాలుచు-కయివ్రాలుచు
కైసడలు-వంగు, ఒఱగు, చేజారు.
కైసన్న-చేతిసైఁగ, పిలుపు, ఆమెత
కైసరుఁడు-కవీశ్వర = కైతగాఁడు రూ. కయిసరుఁడు.
కైసాటిచుక్క-కయిసాటిచుక్క, హస్త*
కైసేఁత-కయిసేఁత-అలంకారము
కైసేయు - కయిసేయు, అలంకరించు, సింగారించు, పూజించు.

## కొ

కొంకనక్క-పిఱికినక్క-గుంటనక్క-క్రోష్ట
కొంకర-వంపు, వంకర, మెలిక.
కొంక(గ)రపోవు-మెలితిరుగు,నరములీడ్చు
కొంకి-కోఁటి,వంపుచీల, ఆయుధవిశేషము, కాలిమడమమీఁది భాగము, మోకాలిచిప్ప యందలి ఎముక.
కొఁకికొను-కొంకుకొను.
కొంకిపిసిని-పొదజాతిమొక్క.
కొంకిబద్ద-గొడ్లకాపరి చేతికఱ్ఱ.
కొంకిరిబింకిరి-వంకరైనది.
కొంకు-జంకు, పెనుదీయు,సిగులు, బెదరు, సిగ్గు, వంకర, కొంకర.

కొంకుకొను-కొంకు(స్వాక్ష)
కొంకుకొసరు-జంకు, వెనుదీఁత
కొంకునక్క-కొంకివక్క కొంకనక్క.
కొంకుప(వ)డు-జంకు కొంకు వెనుదీయు.
కొంకుపాటు-సంకోచము తొట్రుపాటు.
కొంకుల(పో)వోవు-కొంకరవోవు
కొంకె-ఒకానొక పనిముట్టు
కొంగ-క్రుఞ్ = కొక్కెర, కొంచె
కొంగకాళ్లవాఁడు-ఎత్తు మోకాళ్లవాఁడు.
కొంగగుద్దలి-గడ్డపార-పిక్కాసు.
కొంగపురితెగులు-కొంగికతెగులు
కొంగముక్కు-ఒక దినుసుచేఁప.
కొంగవాఁడు-కొంగకాళ్లవాఁడు
కొంగవాలు-కృజ్వాల = మాదిగవానికత్తి.
కొంగాలుకత్తి-ఒక తెగ వంకరకత్తి
కొంగిరి-కొంకెతనము.
కొంగు-చీఁకొంగు, చెఱఁగు, చెంగు.
కొంగుచిచ్చు-చీఁచెంగున నున్న అగ్ని.
కొంగుపట్టు - తిట్లకు పడియుండు, స్త్రీని బలాత్కరించు.
కొంగుపఱచు-రతికి సిద్ధమగు, సిద్ధమగు
కొంగుపసిఁడి, కొంగుబంగారు | కొంగున గట్టిన బంగారమువలె సులభసాధ్యమైనది.
కొంగుబత్తెము - కొంగున పోసికొన్న బత్తెము.
కొంగుమాయు-ముట్టగు-చెఱఁగుమాయు.
కొంగుముడి-కొంగుచివర వేసిన ముడి.
కొంగుముడివేయు-పెండ్లాడు,నిశ్చయించు
కొంగుముడుచు-మా. పై.
కొంగులాగు-స్త్రీని బలాత్కరించు.
కొంగొంగురను-కొంగలు చప్పుడుచేయు.
కొంగొడ్డు-కొంగుపఱచు
కొంగోడు-ఒఱగిన కోడు. ఒఱగుట.
కొంగోడువడు, కొంగోడువోవు | ఒఱగు, ఒడ్డగిలు, తుక్కియగు
కొంచదనము సేయు-తక్కువపఱచు
కొంచించు-కొంకు, జంకు కొంచు.
కొంచియము - కించిత్ కొద్ది, కొలఁది, కొఱఁత, కొంచెము.
కొంచియము చేయు-పరాభవించు.
కొంచెకత్తె-కుంచా-అల్పురాలు, సామాన్య.
కొంచెకాఁడు-అల్పుడు, నీచుఁడు.
కొంచెతనము-తేలికతనము. నీచత.
కొంచెపడు-సన్నఁగిల్లు, మలకనగు.
కొంచెపఱచు-క్రిందుపఱచు, చెఱచు.
కొంచెపాటు-కొంచెమగు.
కొంచెపుఁదనము-లోటు. కొఱఁత.
కొంచెపువాఁడు-కొంచెకాఁడు-అల్పుఁడు.
కొంచెము-కించిత్తు = కొఱఁత, తక్కువ, చిన్న, కొద్ది, కాస్త-కొంచియము.
కొంచెముసేయు - క్రిందుసేయు, చెఱచు, చిన్నపుచ్చు.
కొంచె-క్రౌంచ = కొక్కెర, ఒక కొండ, అల్పుఁడు.
కొంచె(గట్టు)గుబ్బలి-క్రౌంచ = కొంచెమల.
కొంచెదనము-కార్శ్యమ్ = సన్నన.
కొంచెదీవి-క్రౌంచద్వీపము-ఒక లంక.
కొంచెపాఱు-జంకు, కొంకు.
కొంచెమల-క్రౌంచపర్వతము-కొంచె.

కొంచెమలఁగొట్టినజాణఁడు-కుమారస్వామి.
కొంచెమొగ్గరము-క్రౌంచవ్యూహము.
కొంచెసొరము-క్రౌంచస్వరః = సప్తస్వర ములలో నాల్గవది-మధ్యమస్వరము.
కొంచు-తగ్గు, జంకు కొంకు, లోటు, ముఱికి, చెమట, మత్తు-రూ కొంజు.
కొంచుఁడు-కొద్దివాఁడు-కించు.
కొంచుఁబోవు-పటుకపోవు.
కొంజా = కొణజా.
కొఁజు-కొంచు, కొసరు, కొంకు, జంకు.
కొఁజేరు = కోఁజేరు.
కొంట-కొనుట, కొనుబడి, గ్రహణము.
కొంటరి } కుంఠః-తుంటరి, పోకిరి, తులిపి.
కొంటె }
కొంటెతనము-అల్లరితనము, తుచ్ఛత.
కొంటెపాడికట్టు-చెడుగఁడు,చెనఁటి
కొండ-కుండః = గట్టు, తిప్ప, మెట్టు,మల
కొండంతచేయు-గొప్పచేయు.
కొండంగి } కుండగః = కొండముచ్చు-
కొండఁగి } రూ. కుండఁగి. [శము.
కొండకావిజాయి - ఇంగిలీకము - హింగు
కొండకంది-పెద్దకంది +. ఒకసస్యము
కొండకపి(వి)ంద-తీటకసింద-ములుకసింద
కొండకాకి-మాలకాకి-అద్రికాకము.
కొండకాలువ-సెలయేఱు-ఝరము.
కొండకాసులవాఁడు-వెంకటేశ్వరుఁడు.
కొండకొమ్ము-పర్వతశృంగము. [షము.
కొండకోఁతి-కొండముచ్చు, బాలక్రీడా విశే
కొండకోట-దుర్గము. కోటవంటికొండ.
కొండకోలు-కొద్దియగుట [పీచెడుగాలి.
కొండగాలి-ఉత్తర వాయవ్య దిశల నుండి
కొండగీఁడు - కొండెగాఁడు-ఇల్లామల్లి.
కొండగుద్దలి-జాళ్కు పెల్లగించు గుద్దలి.
కొండగుమ్మడు-పెద్దగుమ్మడు +
కొండగుఱుతు-స్థూలమైన ఆనవాలు.
కొండగొనుగు - కొండగోగు - అక్రోటు-
కొండగొ(ఱి)ట్టియ-ట్టె - కుండకురరి = గాడిదవంటి జంతువు-రోహితము
కొండగో(ఁగు)ను = కొండగొనుగు +.
కొండగోల-ఒకానొక జంతువు.
కొండచిలువ-కొండపాము-అజగరము
కొండచీఁపురు-ఒకజాతి చీఁపురుగడ్డి.
కొండచీమ-పెద్దచీమ-గామ.
కొండచేయు-గొప్ప(పెద్ద)చేయు.
కొండచెఱియ-కొండయొక్క ప్రక్క.
కొండచూలి-పార్వతి-గుబ్బలిపట్టి.
కొండజెట్టి-మూఁడుమూళ్ళ పొడవును, ఎత్తు నల్ల కట్లును, గలిగి జంతువులను తఱిమి తఱుమునట్టి పెద్దజెట్టి
కొండజివ్వి-కలుజువ్వి-కూటపర్కటి +
కొండజొన్న-కుండజూర్ణ = జొన్న.
కొండతంగేడు - వి శైలగోశ్రేణి = - హేమపుష్పకము +. [షపడు.
కొండతాకు-ఉన్నతిపొందు. ఎక్కువసంతో
కొండతేనె-వి కొండలలోని పట్టుతేనె.
కొండత్రిమ్మరి-కొండముచ్చు, కోఁతి.
కొండదాఁటరి-గుట్టలెక్కి-బిచ్చమడుగువాఁడు
కొండదిగు - జా. బింకము తగ్గించుకొను.
కొండనాలుక-చిఱునాలుక-ఉపజిహ్వా.

కొండన్న-తేలు, కొండెన్న, పలపురుగు.
కొండపగతుఁడు-దేవేంద్రుఁడు-గోత్రారి,
కొండపట్టు - గట్లపాలగు, కొండలలోనికి పాఱిపోవు.
కొండపలుకు-గుహల ప్రతి ధ్వని
కొండపిండి-ఱాళ్ళనుపిండిచేయునట్టిఆకులు గల చెట్టు-పిండికొండ +
కొండపిండిగొట్టు-ఎక్కువకష్టపడు.
కొండపిచ్చుక-పెద్దపిచ్చుక.
కొండప్రక్క-ఉపత్యక-సానువు.
కొండప్రత్తి-పెద్దప్రత్తి-కార్పాసి +
కొండబరిగె-ఒకజాతి సస్యము.
కొండబాతు-గిరిశము-ఆడేలు.
కొండబూరుగు-కూటశాల్మలి +
కొండబెండ-ఎద్దునాలిక, గంట్లకచోరము,
కొండమంగలి = తిరుపతి కొండపైనుండు మంగలి.
కొండమల్లయ్య-శ్రీశైలమల్లికార్జునుఁడు-శివుఁడు-కొండయల్లుఁడు,
కొండమల్లె-కుండమల్లిక = గిరిమల్లె.
కొండమామిడి-కోశామ్రము- పుల్లమామిడి.
కొండమారేడు-శైల మాలూరము +
కొండము-కుండము - గుండము, లోఁతు గుంట, నిప్పులగుంట
కొండముక్కిడి-ఒక దినుసుచెట్టు.
కొండముచ్చు / కొండమునురు / కొండముసువ / కొండ ముచ్చు — కొండయందు ముచ్చువంటిది-కొండ్రగి, కొండఁగి, కొండెఁగ-నల్లని మొగము గల పెద్దకోఁతి.
కొండయరఁటి-శ్రీకదళి +-గిరిరంభ +
కొండయల్లుఁడు-శివుఁడు-కాటిఱేఁడు.
కొండయూట-సెలయూట-ప్రస్రవణము.
కొండయుసిరిక-పుల్లయుసిరిక +.
కొండయెక్కు-మిన్నంచు, దీపమాలు, విఱ్ఱవీఁగు, సంతసించు, మిత్తెక్కు- కొండెక్కు.
కొండరా-కొండరాయి, కొండఱేఁడు.
కొండరాగి-కొండరావి +
కొండరాచూలి-పార్వతి-గుబ్బలిపట్టి.
కొండరాయఁడు-హిమవంతుఁడు.
కొండరి-కొండ(బోయ)వాఁడు.
కొండరులు-కొండజాతివారు
కొండఱెక్కలు గొట్టినదణి-ఇంద్రుఁడు.
కొండఱేఁడు-హిమవంతుఁడు, గిరీశుఁడు.
కొండలరాయఁడు - హిమవంతుఁడు, ఏడుకొండలసామి
కొండలుచేయు - కొండంతలుచేయు, పెద్దచేయు.
కొండల్లము-కుండోల్ల = తృణపుష్పిక.
కొండవంగ-గిరివార్తాకము
కొండవట్టు-కొండలకు పాఱిపోవు.
కొండవరగోఁగు-ధ్వంసి +
కొండవాఁడు-కొండరి, వ్యాధుఁడు.
కొండవీటిచేత్రాడు-మిక్కిలిపొడవు
కొండవీటిజంగము - శివుఁడు-కొండమల్లయ్య
కొండవీఁడు-కైలాసనగరము, ఆంధ్రదేశమున రెడ్డిరాజుల రాజధాని.
కొండసిక-పర్వతశృంగము, కొండకొన.
కొండసూడు-ఇంద్రుఁడు-నగారి.
కొండాట-ము-స్తుతి, పోరు, కృషి, వేడుక.
కొండాటమాడు-పోట్లాడు, కొనాడు, దుమ్ము.
కొండాడు-పొగడు, కొట్లాడు, కోరాడు,

కొండాముదపుచెట్టు-దంతి +
కొండి - తేలు(తోఁక)ముల్లు, పీఁతదెక్క., ఇనుపగొండ్లెము-కొండె.
కొండిక-కుణక = (చిన్న)పిల్ల, బిడ్డఁడు.
కొండికది-బాలిక, పడుచుది.
కొండికనగవు-చిఱునగవు, లేనగవు.
కొండికనాఁడు-చిన్ననాఁడు, బాల్యము.
కొండికవాఁడు-పిన్నవాఁడు, కుజ్జుఁడు.
కొండికాఁడు-సంకూదువాఁడు.
కొండికాలు } ఇనుప(కొండి)కొక్కెము.
కొండిమొల }
కొండికోల-దండము, ములుగఱ్ఱ
కొండిజడ-చిన్నపిల్లల ముందఱిజడ.
కొండియ-తలపై వేసికొను సిగ-కొండె.
కొండియము-కుండకీట = చాడీ, తంటా.
కొండియఁడు } చాడీలమారి-కొండెకాఁడు - రూ. కొండెఁడు.
కొండీఁడు }
కొండీ-కొక్కెము-కొం(డి)దె.
కొఁదుక-కొంచెము, పొట్టి, చిన్నది, చిన్న వాఁడు-కొండిక, కొందొక.
కొండుకవాఁడు-కుజ్జుఁడు, కొండుక.
కొండె-స్త్రీల సిగముడి-కొండియ.
కొండె(ం)ఁగ-కుండఁగి, కొండముచ్చు
కొండెఁడు కొండీఁడు, కొండెకాఁడు.
కొండెకత్తె-చాడీకత్తె, పిశున.
కొండెకాఁడు-కొండీఁడు, ఇల్లామల్లి.
కొండెక్కు-కొండయెక్కు, ఆరిపోవు.
కొండెగీఁడు-కొండెఁడు, కొండీఁడు.
కొండెపుఁగొఱవి-చాడీగొట్టు.
కొండెపుఁదపసి-నారదుఁడు-పోరుదిండి.

కొండెము-చాడీ, కొండియము.
కొండెవల-చేఁపలుపట్టు వల
కొండేలమారి-చాడీగొట్టు-పిశునుఁడు.
కొంతొక-(కించిత్) కొండుక, కొండిక.
కొందొకవాఁడు-చిన్న(పొట్టి)వాఁడు.
కొంద్ర-పొలము, చాలు-గొంద్ర.
కొంద్రకైదువు-నాఁగలి-హలము.
కొంద్రచేయు-భూమిదున్ను.
కొంద్రపోతు-ఎలుఁగుబంటి.
కొంద్రవేయు-భూమిని దున్నునపుడు చాలు పులుగా చాళ్లువెట్టు.
కొంత-కించిత్ = ఇంచుక, కొద్ది, కొలఁది.
కొంతము-కుంతః - ఈటె, ఆయుధము.
కొంతలము-ప్రాకారావయవము.
కొంతవడి-కొద్దిగా.
కొందఱు-కొంతసంఖ్య కలవారు.
కొందల-తెల్లని మంచినీటి చేఁప.
కొందలపడు-ఏడ్చు, వగచు, కలఁగు,
కొందలపఱచు-కలవరపెట్టు, కలఁచు.
కొందలపాటు-కలఁత, ఏడ్పు.
కొందలపెట్టు-కలఁచు, ఏడ్పించు.
కొందలమందు-దుఃఖించు.
కొందలము-దుఃఖము, జంకు, కలఁత.
కొందలించు-కలఁతపడు, దుఃఖించు.
కొందాక-కొంత(వఱకు)దాక.
కొందు-నలఁచు, కుందు, వఱకు.
కొంప-చిన్నఇల్లు-నెలవు-లొంప.
కొంపచెఱుపు-ఇంటివానిని జెఱచువాఁడు, పలుగాకి, చూపుగుజ్జము. [చెడు,
కొంపగూలు-ఇల్లు కూలిపోవు, ఇంటిపని

కొంపకూల్చు / కొంపఁదీయు / కొంపముంచు } కుటుంబమునకు గొప్ప అపాయముకలుగఁజేయు, పుట్టిముంచు, చెఱచు.

కొంపమునుగు-ఇంటికి అపాయము వచ్చు.

కొంపలార్చు-కొంప(తీయు)చెఱచు.

కొంపోవు-కొనిచను, కొనిపోవు.

కొకబిక / కొకిబికి } వికారముగా నున్నది.తప్పుకలది, తాఱుమాఱు.

కొకారము-క్రొక్కారము, కోడికూఁత.

కొక్కరాయ-ఒకానొక తీఁగ.

కొక్కరాయి-కృఞ్ = కొక్కెర, కొంగ.

కొక్కరించు-పక్షులు కాళ్లతో కెల్లగించు, కెక్కిరించు, కెక్కరించు-కొక్కిరించు.

కొక్కరింత-వెక్కిరింత, బెదరింపు, కెళ్లగింత. రూ. కెక్కిరింత.

కొక్కాయదగ్గు-పిల్లలకువచ్చు కక్కాయిదగ్గు-కోరింతదగ్గు-కక్కాయ్యదగ్గు.

కొక్కారము-క్రొక్కారము,కొకారము

కొక్కి-కొక్కెర,కొక్కెము,గుప్పిలి,గొగ్గి.

కొక్కిర-కొక్కెర, తెల్లకొంగ.

కొక్కిరాయి-కొక్కరాయి.

కొక్కిరించు-కొక్కరించు, కొప్పరించు.

కొక్కిరిబిక్కిరి-వంకరటింకర,చీకిలిమాకిలి

కొక్కిస-ఒక(చెట్టు), మల్లబంధము.

కొక్కు-పెద్దయెలుక,పందికొక్కు. కొంగ.

కొక్కు(తేజి)రవు(రౌ)తు-గణపతి- మూషక వాహనుఁడు, కలుఁగులాయపుతేజి

కొక్కుపెట్టు-లేవఁగొట్టు. స్త్రీని చెఱచు.

కొక్కురొకో / కొక్కురోకో } కోడికూఁతకు అనుకరణము

కొక్కె(ము)-కొలికి-కొల్కి.

కొక్కె-కొంగ, కొక్క(కి)రాయి-ఆడేలు.

కొక్కెరతొలివేల్పు-బకాసురుఁడు.

కొక్కె-కొక్కిస. ఒక మల్లబంధము.

కొక్కొ(కో)కొ / కొక్కొరొ(రో)కో / కొక్కొకో } కోఁడికూఁత యొక్క మ్రోఁత

కొచ్చెమాటలు-తొందరమాటలు.

కొజ్జ / కొజ్జా } అన్నగళ-రాణివాసపు కావలివాఁడు, పేఁడి. ఊబ

కొటాయి-పెద్ద పెండ్లిపందిలి, పెండాలు

కొటారము-కోష్ఠాగార-ధనపుకొట్టు, పసుల కొట్టము, చోటు-కొటారు, కొట్టరువు.

కొటారి-కొట్టుపెద్ద-కొఠారి.

కొటారు-కొటారము,కొట్టరు.

కొటి-వేగరి-చారుఁడు-రూ, కోటి-కొట్టి.

కొటిక-కొటిః = పల్లె, కరేర = పొట్టి వాఁడు-కొట్టిక, పిసినారి

కొటికాఁడు-వెట్టివాఁడు-తలారి చారుఁడు-కొట్టికాఁడు-కోటికాఁడు,

కొట్టకొన-(కొన+కొన) చిట్టచివర.

కొట్టడి - కోష్ఠ = సామగ్రులుంచు గది - కొట్టు-రూ. కొట్టిడి.

కొట్టము-గోష్ఠమ్ = అంగడి, కొట్టు, పసు సాల, చావడి. [-కొట్టారువు.

కొట్టరి-ధాన్యపుకొట్టుపై అధికారి-కొట్టరువు

కొట్టరువు = కొటారము, కొట్టరి.

కొట్టాడు = కొట్లాడు, కాట్లాడు, పోట్లాడు

కొట్టాము = చూ. కొట్టము, కోట్టము.

కొట్టాయి-ఆకుటిల్లు-పూరిల్లు, పాక.

కొట్టారువు = కొట్టరువు, కొట్టరి.
కొట్టి = కొటి, కోటి, చారుఁడు, వేగరి.
కొట్టించు - కొట్టఁజేయు, మ్రోయించు. త్రవ్వించు.
కొట్టిక-ఖట్టిక = ఊరు-పల్లె-రూ. కొటిక.
కొట్టికత్తి-పనికత్తె, వేఁగుకత్తె కొటికత్తె.
కొట్టికాఁడు-వేగరి-చారుఁడు-కొటికాఁడు.
కొట్టికోలాహలముచేయు - హడావిడిచేయు
కొట్టిగడ్డ-కాకిదొండ-కాకాంచి +
కొట్టిడి-కొట్టడి, కొట్టు
కొట్టినపిండి-లెస్సగా తెలిసినది.
కొట్టిపోయు-ఎక్కువగా మాట్లాడు.
కొట్టివేఁత-కొట్టివేయుట,తీసివేఁత [గించు.
కొట్టివేయు-కూల్చు, తుడుపుపెట్టు, తొలఁ
కొట్టు - దంచు, కూల్చు, చంపు, మొత్తు, అగు, ఆడు-కోష్ఠ = అంగడి-కొట్టడి.
కొట్టుకపోవు-ప్రవాహమునఁబడిపోవు.
కొట్టుకవచ్చు-ప్రవాహమునకొట్టుకొనివచ్చు
కొట్టుకలాడు-బాధలోనుండు,తన్నుకలాడు
కొట్టుకాడు-కొట్టాడు, బాధపడు.
కొట్టుకొను - కొట్లాడు, బాధపడు, కదలు, అల్లలాడు, శ్రమించు.
కొట్టుడుబల్ల-వరికట్టలు కొట్టు బల్ల.
కొట్టుడుబిళ్ల-గోళీకాయ, గోటీబిళ్ల.
కొట్టుప(వ)డు-దెబ్బతిను, వెచ్చమగు, దీలు పడు, పీచతనొందు
కొట్టుమిట్టాడు-మిక్కిలి కష్టపడు.
కొట్టుమిట్టిపడు-ఎగిరిపడు.
కొట్టులా(ట్లా)ట-పోట్లాట-కయ్యము.
కొట్టులా(ట్లా)డు-పోట్లాడు-కాట్లాడు.
కొట్టె-కాఁగు, బాన, గాదె, విత్తు.
కొట్టెక్కలు-ఒక దినసు భక్ష్యము.
కొట్నము-వడ్లదంపు కిచ్చు ధాన్యము, పేవ-కొట్టనము
కొట్రి - ఖద్దిరకః = మలుగుబ్జా - గిటక - గిలుక, ఎనటిపీరు, మాక.
కొట్రాకు-పైరు పొట్టపై విటారు వేసినఆకు-కొడియాకు-పొట్టాకు.
కొట్లమారి-దెబ్బలు తినువాఁడు.
కొట్వాలు-కొత్వాలు-నగరరక్షకుఁడు.
కొఠా-కోష్ఠః = సాల, భవంతి.
కొఠారి-కొటారి, కొట్టువాఁడు.
కొఠాకారిక-కోశాగారాధిపతి.
కొఠారు-కొటారు, కొట్టు.
కొఠీదారుఁడు-వడ్డీవ్యాపారముచేయువాఁడు.
కొఠీ(ఠే)-ధనాగారము, వ్యాపారసంస్థ.
కొడ-మంటయొక్క చివరిభాగము.
కొడక-చిన్నగిన్నె-పాత్రకము.
కొడతకొయ్య-దోకుడుపాఱ.
కొడతము - కుక్కగొలుసు. కొంకికట్టి, తుండు, మల్లులపరికరము-కొణతము.
కొడపము-కురపః = గుల్లమును తోమెడు పనిముట్టు-గొలిపము.
కొడమ-చేఁపలుపట్టు సాధనము-కొడము.
కొడమంగలి-మంగలి.
కొడమడువు-చెఱువుతూము. [హారతి.
కొడము - పీటికడవ, చేఁపలవల, కుంభ
కొడవలి-లవిత్రము, కొడవలిలిక్కి-పండ్లు గల వక్రాకారమైనకత్తి.
కొడవలిలిక్కి-చిన్నకొడవలి.

కొడస-కుటజః = కొండమల్లె +.

కొడి-కోటీ = దీపశిఖ, దీపపుపొగ, శిలము, జెండాగుర్తు, కాలినవత్తియొక్క చివర - రూ. కొండి.

కొడిగ-గె-ముంజూరు-రూ. కొణిగ-గె.

కొడిగట్టు-దీపము కాంతిహీనమగు, వత్తి కాలి చివర బొగ్గుగా నేర్పడు.

కొడిద-అఱచేయి, పుడిసిలి-కొణిద, కాణిదిలి

కొడిడి-ఒకానొక చెట్టు-కొడ్డి.

కొడిదిపూన - ఆఁడుబిడ్డల మొలయందుఁ గట్టెడు బిళ్ల-సిగ్గుబిళ్ల.

కొడిది(డ్డి)లి-కొడిద, కొణిదిలి,

కొడిపెదంటు-ఎన్నువేయని జొన్నదంటు

కొడిమి-బండినొగల వెనుకవైపు-కొడెము

కొడిమె-అపనింద, పడవ, పాపము, చేఁపల బుట్ట, దబ్బఱమాట-కొడివె.

కొడిమెలాఁడు-కొండెగాఁడు, పాపి, నిందించు, దూఱు. [కట్టుకొను.

కొడిమెలుగట్టు - నిందలువైచు, పాపము

కొడివడు-వడఁకు, కదలు, క్రుంగు.

కొడివళ్లు-పిండివంటలు.

కొడివె-కొడిమె, కడిఁది, కాటియ, కడగండ్లు.

కొడిస(సె)-కుటజః = కొండమల్లె, చేఁప.

కొడిసెపాల | కొడిసెవిత్తు, కొండమల్లె +
కొడిసెప్రాలు | కౌటిజము.

కొడుంక-కోడుంక-ఆధివాసము.

కొడుఁగురు - దీపపు చిట్టెము, దేహము చలిచే కొంకరలు వోవుట - రూ. కొణుఁగురు, కొడుఁదురు, కొణుఁదురు.

కొడుఁగురువోవు - దీపము చిట్టెముకట్టు, చలిచే కాలుసేతులు కొంకరలువోవు,

కొడుఁదురు-కొణుఁదురు.

కొడుకఁడు | కుణక = బిడ్డఁడు, కొమరుఁడు
కొడుకు-డ్కు |

కొడుకుకూఁతురు-పౌత్రి-మనుమరాలు.

/కొడుకుకొడుకు-మనుమఁడు-పౌత్రుఁడు

కొడుకుగుబ్బ-(చిన్న కొడుకు, గారాబుబిడ్డడు

కొడుకువారు-మగపెండ్లివారు. [ముక్క.

కొడుపు-కోణ = జేగంట మ్రోయించు కఱ్ఱ

కొడుపు-బలపము, జంతికలగొట్టము, అప్పడాలకఱ్ఱ, వరితెగులు, వీణమ్రోగించుగోరు. విచ్చెనమెట్టు.

కొడుపుకొను-వాల్చుకొను.

కొడుము-కడవ, బాన, గూన.

కొడె-గొడుగు-ఎండవాటు పుట్టువు.

కొడెపె-జొన్నకుపట్టు తెగులు.

కొడెము-చూ. రూ. కొడిమి.

కొడ్డిపూస-కొడిదిపూస.

కొణజేము | వాఁకిటి కావలియిల్లు - పంచ -
కొణజా | కొంజా.

కొణత(ము)-కొరతము, సంకెలలు, మల్ల సాధన విశేషము, కుక్కనుగట్టు కొయ్య.

కొణతాము-పెద్ద తాకపుచెవి.

కొణిఁగె-కుప్ప. దిబ్బ, ప్రోగు, కుప.

కొణిగ-చూ కొడిగ-గె

కొణిగమూరు |
కొణిగె | -కొడిగ-గె, ముంజూరు.

కొణిత-మల్లపరికరవిశేషము, కంబము.

కొణిద-కొడిద.

కొణిది-ఒక చెట్టు, ఒక జాతి.

కొణిదిరి(లి)-కొడిదిలి. చూ. కొడిద.

కొఱిదేఁడు-అరగుప్పెఁడు.

కొఱుగు-గొఱుగు

కొఱుఁగురు-కొడుఁగురు, దీపపు చిట్టెము.

కుఱుఁజే - పశురక్తమును పీల్చు పురుగు-కుక్కపేను-పిడుఁజు  కొసుఁడు-కొసుసు

కొఱుఁజెక్కు-కొఱుఁజు పురుగుల పట్టు.

కొఱుఁదురు-కొఱుఁగురు, దీపపుచిట్టెము

కొఱుపు-గొడ్లకు వాతపెట్టు శలాక.

కొతిమిరి / కొతిమె(ర)రి } కుస్తుంబరీః = కొత్తమరి, కొత్తిమిరి+. కొత్తమల్లి+.

కొతుమరి-కొతుమిరి, దనియము.

కొతిమెరిపురుగు - కాలునపుడు కొతిమిరి వాసనకొట్టు పురుగు.

కొతుకు-మాటలునమలు, కొంకు, కొదుకు, గొఱుగు-కొదుకు. [గొఱుగు.

కొతుకుపడు-తక్కువయగు, తగ్గు, జంకు,

కొత్త-నూతనము-క్రొత్త.

కొత్తకోపు-నూతనమద్యము, తాజాకల్లు.

కొత్తడము-కోటబురుజు-సాలావయవము-క్రొత్తడము-కొ(క్రొ)త్తళము.

కొత్తడి-స్త్రీసంఘము, గుంపు

కొత్తనేల-క్రొత్తగా సాగుచేయఁదగిననేల.

కొత్తమ(మి)రి-కొతిమిరి. [కొత్తెము.

కొత్తము - తాళబీజాంతర్గత మండము -

కొత్తముట్టు-నూలుపోగు అతుకు, సమర్త.

కొత్తళము-కొత్తడము, కోటబురుజు.

కొత్రాము-మెడవెనుకభాగము.

కొత్తి-ఆఁడుపి, ఇంతి మడిగట్టు.

కొత్తి(మెర)మిరి-కొతి(మెర)మిరి.

కొత్తుపడు-బట్ట మొ॥ చిల్లులుపడు.

కొత్తు(మ)మిరి-కొతిమిరి

కొత్తుమరివిత్తులు-ధనియాలు-కొదమర్లు.

కొత్తెము-తాటిపండుగుంజు. దెబ్బ.

కొత్తె(మ)మ్మ-సాని- యోగాభ్యాసముచేయు స్త్రీ-యోగిని-కొత్తెమ

కొత్వాలు-కొట్వాలు, పోలీసు అధికారి.

కొద-అవసరము. కొఱఁత. కోరిక, జంకు, తక్కువ, తమి, మిగులు,కొదుక-కొదువ.

కొదగొను-విశ్వాసమునొందు.

కొదదీరు-లోటు తగ్గు.

కొదమ-పశుపక్ష్యాదులపిల్ల. గుబ్బము; బాల మైన, లేఁతదగు, పడుచుది, గట్టి,మిగిలిన.

కొదమఏనుఁగు-ఏనుఁగుపిల్ల-గున్న.

కొదమరి-పిల్లలుకలది.

కొదమర్లు-కొత్తిమిరి విత్తులు

కొదరించు-కుదించు. కొదలించు. [కదురు.

కొదరు - చెదరు, రేఁగు, మించు, చిందు,

కొదలించు-తగ్గించు. కుదించు

కొదలు-తగ్గు. సంకుచితమగు.

కొద(ల)పడు-లోటగు, తక్కువగు.

కొదలుపెట్టు-తక్కువచేయు.

కొదవ-కొద, కొదుక. కొదువ.

కొదువచేయు-చిన్నపుచ్చు. లోటుచేయు.

కొదవడు / కొదవపడు } తగ్గు, లోటగు, తెగిపోవు, అడ్డుకలుగు.

కొదవపఱుచు-తగ్గించు, చెఱచు.

కొదవపెట్టు / కొదపెట్టు } లోటుచేయు. ముగింపకుండు, తక్కువపఱచు

కొదుక-కొద, కొదవ, కొదువ.

కొదుకు - కొంకు, జంకు, నత్తిగాపలుకు.

కొదుగు-పెడమొగము.

కొదుకుకొను-కొంకు, జంకు.
కొదుగు-పెదమొగము-కొదుకు.
కొదుగురవోవు-ముడిపడు. [శలాక.
కొదుపు-ఊరించు, చాలసేపు నమలు ఇనుప
కొదువ-కొఱ,కొఱఁత-కొదవ-కొద,కొదుక
కొద్ది-కొంచెము, కొలఁది. కొల్ది
కొద్దికాఁడు-అల్పుఁడు. కొద్దివాఁడు.
కొద్దిది-కొంచెపుది-అల్పము.
కొద్దిపడు-క్రింపడు, కొంచెపడు.
కొద్దిపఱమ్-చిన్నపుచ్చు
కొద్దిమీఱు-సమృద్ధమగు
కొద్దివాఁడు-కొంచెగాఁడు-అల్పుఁడు
కొన-కొస, గుబ్బపుజూలు.
కొనకొనఁగోడి-పీటికోడి-బొల్లికోడి.
కొనకొను-పూను, ఒప్పు, చొప్పడు. నెల కొను, పెరుగు, బయలుదేఱు-గొనకొను.
కొనగోరు-గోటిచివర-నఖాగ్రము.
కొనచెవి-చెవికొణిక. [హీనుఁడు
కొనఁటి(వఁడు)-కునష్టి - కురూపి, అంగ
కొనమునుఁగు-మిక్కిలి నష్టపడు.
కొనరిక్క-రేవతి, 27 వ నక్షత్రము.
కొనరు-చచ్చు, సీల్గు.
కొనలకెక్కు-వర్ధిల్లు. కొనలిడు. [లొత్తు.
కొనలిడు - పెంపొందు, కొనసాగు, కొన
కొనలునిగుడు-పెరుగు, అలముకొను.
కొనలువాఱు
కొనలుసాగు
కొనలె(లొ)త్తు
పెతుగు, అలముకొను, పెంపొందు. ఈడేఱు, కోల్కొను.
కొనసాగించు-పెంచు, నెరవేర్చు,చెల్లించు.
కొనసాగు-పెరుగు, బలియు, రేకెత్తు.

కొనాకు-చివరి ఆకు.
కొని-కొన్ని-కొంత సంఖ్యగలవి.
కొనిచను-కొనిపోవు, కొంపోవు.
కొనితె(వ)చ్చు-తీసికొనివచ్చు
కొనితెచ్చుకొను-ఆపదలు మున్నగు వానిని తనపై పడునట్లు చేసికొను.
కొనిపించు-కొనఁజేయు,
కొనిపోవు-కొంపోవు, కొంచుఁబోవు.
కొనియాట-పొగడ్త, సేవ, కొలుపు, కాపాడుట, చేకుట, ఆదరించుట.
కొనియాడు-పొగడు, కొలుచు, గారవించు, తలఁచు, పూను, కాపాడు, కొండాడు.
కొనివచ్చు-తెచ్చు, తీసికొనివచ్చు.
కొను - కైకొను, పొందు, దొంగిలించు, త్రాగు,కలయు.వెలయిచ్చితెచ్చు ఏర్పడు. ఎంచు, కొట్టు, నాటు, చెల్లు.
కొనుక-లోటు, కొఱఁత, దొసఁగు.
కొనుకొ(న్కొ)ను - వెలకుఁగొను - విలుచు.
కొనుగో(న్గో)లు-కొనుట, కొనుబడి.
కొనుచ్చు(న్చు)వచ్చు-తెచ్చు, కొనితెచ్చు.
కొనుపే = కొణుజు, గోమారి.
కొనుట
కొనుబడి
కొనుగోలు-వెలకుఁగొనుట-విలుపు-క్రయము.
కొనుము-గ్రహింపుము-కొమ్ము.
కొనుమొదలు-పెట్టుబడిసొత్తు-అసలు.
కొనేరు-వాడిపోవు.
కొన్నాళ్లు-కొన్నిరోజులు.
కొన్ని-కొంతసంఖ్యగలవి-కొని
కొపురు-గోపురమ్ = కొండకొమ్ము-

కొపెర-కర్పర = పెద్దమూతిగల చినపాత్ర కొప్పెర.
కొప్పరము-గోపురమ్ = మూఁపు. కొండ కొమ్ము-కొపురు-కొప్రము- ముమ్మరము. కైపు.
కొప్పరించు-కోపమున రోమాంచముపుట్టు. వెక్కిరించు. పుటముపైచు. మించు. వింపు. కేరు. ఉబ్బరించు.
కొప్పరింత-వెక్కిరింత. ముమ్మరము.
కొప్పించు = కొప్పరించు.
కొప్పియ-మందుగుళిక-మాత్ర.
కొప్పిరిగి-కంబళి (గోనెసంచి) ముసుగు.
కొప్పు-ముడిచిన వెండ్రుకలముడి. ఇంటి నడిమి కప్పు. ఇంటికొన,నాట్యవిశేషము. ఎత్తుచోటు-కోపు.
కొప్పుగొలుసులు-స్త్రీల తలనగ.
కొప్పులో కొలువి-మిక్కిలి తుంటరి.
కొప్పువల - తలవెండ్రుకలను బంధించు ముత్యాలసరము-జడబిల్ల. ఒగిడిగ.
కొప్పె = కొప్పియ.
కొప్పెర-కర్పర = కాఁగు. బాన. కమండలువు. తలపుఱ్ఱె. కొబ్బరి. కుడక. గోనె గూడ = కొపెర.
కొప్రము = కొప్పరము. [కుడక.
కొబ్బరి-కొప్రా = కొబ్బరిగుంజు. కొప్పర.
కొబ్బరికల్లు-నారికేళాసవము.
కొబ్బరికాయ-టెంకాయ. తెంకాయ
కొబ్బరిగుంజు-కుడక - కొబ్బెర.
కొబ్బరిచెట్టు-టెంకాయచెట్టు-టేమాను.
కొబ్బరినూనె-నారికేళతైలము.
కొబ్బరిపండు / కొబ్బరిబొండము } నారికేళఫలము. కొబ్బరి కాయ.
కొబ్బరియుండలు = కొబ్బరినవుకాఉండలు
కొబ్బెరి = కొబ్బరి కొబ్బెర. కుడక.
కొబ్బెరకల్లు-నారికేళాసవము.
కొబ్బెరగుంజు = కొబ్బరిగుంజు.
కొబ్బెరచెట్టు-టెంకాయచెట్టు.
కొబ్బెరనూనె-కొబ్బరినూనె.
కొబ్బెరపండు = కొబ్బరికాయ.
కొబ్బెరపూవు-కొబ్బరికాయలో నేర్పడిన తెల్లపియుండ.
కొబ్బెరబొండము-కొబ్బరికాయ.
కొబ్బెరయుండలు-కొబ్బరికోరున బెల్లము చేర్చి పాకముపట్టి తయారుచేసిన ఉండలు
కొమ-పెండ్లాము. స్త్రీ. చెట్టుకొమ్మ. కోమ.
కొమరసామి-కొమరుసామి. అగ్గిహాలి.
కొమరారు-ఒప్పు. బాగగు. మేలగు.
కొమరాలు-జవరాలు. కొమరె.
కొమరి(తె)త-కుమారి = కూఁతురు.
కొమరు-కూబరమ్ = బాగు. రీతి. ఒప్పు.
కొమరుఁడు-కుమారః = కన్నకొడుకు,మగవాఁడు. కుమారస్వామి-కొమారుఁడు.
కొమరుడాలు-కోడి-ఆజ్ఞవాలు.
కొమరుఁదనము - కౌమార్య = చక్కఁదనము. పడుచుఁదనము. ఈడు.
కొమరుఁబాయము / కొమరువాఁడు } పడుచుఁదనము. జవ్వనము.
కొమరుమిగులు-అందగించు. కొమరొప్పు.
కొమరులు - కొడుకులు. మాలముమీఁది గుజ్జులు-కొమరలు.

కొమరుసామి-కొమరసామి, షణ్ముఖుఁడు.

కొమరుసామితేరు-కోఁడి-కుక్కుటము.

కొమరె-కొమరాలు, కుమారి, జవ్వని.

కొమరేఱు - కుమారారామమందలి స్వామి పుష్కరిణి-కుమారవాహిని.

కొమరొందు-అందగించు.

కొమరొప్పు-అందగించు, మేలగు.

కొమర్త-ర్తె = కొమరిత-తె.

కొమారి-త(తె)-కుమారీ = ఆఁడుపడుచు

కొమారుఁడు-కొమరుఁడు, కన్నకొడుకు.

కొమార్త-ర్తె = కొమారిత-తె, ఆఁడుపడుచు

కొమిర-కొడుకు, లేఁబ్రాయపు

కొమిరె - కుమారీ కొమరె-జవ్వని, స్త్రీ.

కొ మరాలు; ఒసికత్తె. [నేల.

కొ(మిరి)ముచు-దున్నకము సరిగా కలియని

కొమెరత-సుకుమారి, కొమ్మ.

కొమ్మ-కొమ, కోమ. చేవ. కోటకొమ్మ.

కొమ్మెంకిమెకము-కోఁతి-అడవితిరుగుడు

కొమ్మంట్లు - కొమ్మను అతికించి పెంచిన క్రొత్త మొక్కలు.

కొమ్మతారుపుగుల్ల-ఎడకత్తె-తార్పుకత్తె.

కొమ్మత్రిమ్మరి } కోఁతి-కొమ్మచెంకి

కొమ్మదాఁటుమెకము } మెకము.

కొమ్మదాసరి-చెట్టెక్కి బిచ్చమునకై కేకలు వేయు దాసరి.

కొమ్మనఁటి-కొమ్మ(న)రఁటి +

కొమ్మనగొట్టెపిండిచెట్టు-పూతిక +

కొమ్మనగొలిమిడి-మూలఫల +

కొమ్మనగోర-కొండపిండి + పిండికొండ

కొమ్మ(న)రఁటి-కొమ్మువలెనుండు పచ్చ అరఁటి

కొమ్మపురుగు-లేతకొమ్మలను కాయధాన్యములను తినివేయు పురుగు

కొమ్మమెకము-కోఁతి, కొమ్మద్రిమ్మరి.

కొమ్మలువోవు-పెరుగు, పెంపొందు.

కొమ్మి - ఒక పండ్లచెట్టు, ఒక జాతిచేఁప. ఎఱ్ఱగోరింట +

కొమ్ము-జంతుశృంగము, చేఁపతోఁక, కోటకొమ్ము. పందికోలు, కొండకొన, కొన. చెఱువుకొన, పల్లకిదండె. పేన, చిమ్మనగ్రోవి, హల్లునకుఁజేర్చు ఉకారము, మాదిగవాని కొవ్వుపాత్ర, దుంప, ఏనుఁగుదంతము-కొనుము.

కొమ్ముకళింగ-చెఱువునీరు పోవుటకై కట్టిన ఱాతి కట్టడము-కళింగ.

కొమ్ముకాఁకర-కాంవేల్ల విశేషము.

కొమ్ముకాఁడు-పంది, కంసాలి, కొమ్మూఁదువాఁడు, బోయఁడు.

కొమ్ముకాటు-పంది, ఊటమెకము.

కొమ్ముకాఁకర-ఒక దినుసు కాకఁర +

కొమ్ముగొడిసె-గొడ్లకొమ్మున బుట్టువ్రణము.

కొమ్ముచీల-ఏడిచీల కొనయతుకు.

కొమ్ముచేఁప-ఒక జాతి ఆఁడుచేఁప.

కొమ్ముచాలి-కొమ్ముగల చాలిచేఁప.

కొమ్ముటుడుము-కొమ్ముగల ఉడుము.

కొమ్ముటేనుఁగు - కొమ్ముగల యేనుఁగు, మగయేనుఁగు.

కొమ్ముతేజి-ఎద్దు, గిత్త, గిబ్బ

కొమ్ముదుక్కి-చాలువెంట చాలుపట్టిదున్నుట.

కొమ్ముపట్టు-బాకా యూఁదు.

కొమ్మపురుగు - ఎన్నెమ్మపురుగు, కొబ్బరి చెట్టు మొవ్వు తొలిచి గెలలకు హాని కల్గించు పురుగు.
కొమ్మపెసర-ఒక జాతిపెసర.
కొమ్మపొట్ల(ళ్ల)-కన్యాకుబ్జలత.
కొమ్మమాచ(స)కమ్మ-కొమ్మ బండియు ముట్టుకాని యాఁడుపె.
కొమ్మలాడు-అడవిపంది. కొమ్మకాఁడు.
కొమ్మలువచ్చు-ఆధిక్యముపొందు.
కొమ్మసూపు-ఎదుర్కొను, డీకొను.
కొమ్మవాఁడు-మాదిగ,ఏనుఁగు, పంది.
కొమ్మసుద్దులు-సంకేతవృత్తాంతములు.
కొమ్మారిదాసరి-ఒక జాతి వైష్ణవుఁడు.
కొయగండ-కంటి దుర్మాంసము.
కొయగూర-కొయ్యగూర.
కొయిదు-దున్నగా మిగిలిన కోసు-కుని.
కొయిలగోపి-పెడకట్టెమనిషి.
కొయుగూర-కొయుగూర,పెరు(తఱు)గాకు
కొయ్య-కట్టె, గుంజ, దంతము, దొంగల పనిముట్టు.
కొయ్యఁబాఱు-మొద్దుపారు,
కొయ్యకాటుక-దట్టముగాపూసికొన్నకాటుక
కొ(య)య్యకా(గా)లు-జొన్న(వరి)కంకి, కోఁతకోసిన మోడు, కట్టెకాలు.
కొయ్యకూర-పెరుగాకు-కొయుగూర.
కొయ్యగండ-కొయగండ.
కొయ్యగూటి(టా)ము - దిమ్మిసా, నేల చదునుచేయుపనిముట్టు-దిమ్మెస, దమ్మసు.
కొయ్యగూర - కొయ్యతోఁటకూర, రూ. కొయుగూర.

కొయ్యజోడు-బొంద. ద్రుపదము.
కొయ్యతనము-దిట్టతనము.
కొయ్యతోఁటకూర-కొయ్యగూర.
కొయ్యద్రిప్పు-తుంటరి, అడిబంద.
కొయ్యనగాఁడు-మొద్దు, మొఱకు.
కొయ్యరోగము-మిర్చితెగులు.
కొయ్యాపండు-జామిపండు, గొయ్యాపండు
కొయ్యలగోపి-పెడకట్టెమనిషి, ప్రౌఢ.
కొయ్యుగూర-కొయ్యగూర, పెరుగాకు.
కొరందము-కురువిందము.
కొరక-దున్నని నేల-కొరద, కంచె.
కొరకాపువెట్టు-మండించు, పీడించు.
కొరకు-కొఱకు    [కూయుకూఁత.
కొరకూత - వయసు వచ్చిన కోడిపుంజు
కొరజా-కొంజా, కాకిటికావలయున్నయిల్లు
కొరటబండి-పిపంగులు తెచ్చు బండి.
కొరట-అంబలి, జావ-అంబకళము.
కొరడా-చబుకు, జాటి, తరటు,కక్కసము.
కొరడు-ఒక దినుసు చేఁప, ఒకానొక పోటు ముట్టు, గుడ్లగూబ
కొరడుపాఱు-తిమురుపట్టు.
కొరద-ఒక చేఁప, దున్నవినేల.
కొరదా-మిగతా, కడమ, శేషము,
కొరన-దున్ననినేల, కొరద, కంచియ.
కొరనాసిగండు-దుమ్ములగొండి.
కొరమీను-చెఱువునీటి చేఁపజాతి.
కొరవంజి-ఎరుకుల(నాట్యము) యక్షగానము ఎఱుకు(ది)వాఁడు.
కొరవ-ఒకానొక కొండజాతి.
కొరవి - కురవకః = ఎఱ్ఱగోరింట +, కడిమి+, క్రోవి +.

కొరవితాల్పు-దయ్యము, సోఁకుడు-ఎత్తు.
కొరసలు-ఉప్పు వర్తకులు,
కొరసానిగండు-దుమ్ములగొండి.
కొరి-తెప్పనడిమి వెంౘ్రుక, పక్ష్మ.
కొరితి-బండ(బొండ)కొయ్య.
కొరిపె-కురిపె యను చేఁప.
కొరునేల-మెట్టనేల, మిఱ్ఱు, మెరక
కొర్కు-కొఱుకు, కఱచు.
కొర్త-లోటు. కొఱ్ఱు, కొఱఁత.
కొర్న(పోతు) / కొర్నవగండు / కొర్నాసిగండు -దుమ్ములగొండి-కొరనాసి గండు.
కొ(ర్ని)ర్ను-బీటినేల-కంచియ.
కొర్వికోల-చిచ్చమ్ము. ఆగ్నేయాస్త్రము.
కొఱ-ఒక జాతి చేఁప, మిగులు, తక్కువ, పని, మేలు, శిల్పము, సొగసు, కొఱ్ఱు.
కొఱఁకు-బీడునేల-కొఱను, కొఱన, కొఱత.
కొఱఁత - లోటు, మిగులు, అవమానము, దోసము, కొఱ్ఱు, కొఱ, కొఱఁదల.
కొఱఁతనుఱుకు-అకార్యము చేయు.
కొఱఁతపడు-తక్కువపడు, దాఁగు.
కొఱఁతపఱుచు-తక్కువచేయు, దాఁచు,
కొఱఁతపెట్టు-మిగుల్చు, దాఁచు.
కొఱఁతవోవు-తక్కువగు, లోటగు
కొఱఁదల-కొఱఁత, వెలితి, లోటు.
కొఱకంచు(చ్చు)-సగము కాలిన కట్టె.
కొఱకరానికొయ్య-మూర్ఖుఁడు అసాధ్యము.
కొఱకు-కై, కోసము, నిమిత్తము.
కొఱకొఱ-పగ, ఊర్పులు విడుచుట,
కొఱకొఱలాడు-చిరాకుపడు, కోపించు.

కొఱగానిది-పనికిమాలినది. [ఎంబెన్న.
కొఱగానివాఁడు - పనికిమాలినవాఁడు -
కొఱగామి-చెడ్డపని, లోటు, నేరము.కీడు, చెడ్డ శకునము.
కొఱడి-ఆవరణగా వేసిన పొడిమట్టిగోడ,
కొఱడు-మోడు, మొద్దు,ఒక ఆయుధము, ఇంద్రధనుస్సు-కొఱ్ఱు.
కొఱడుకోల-ఒక ఆయుధము,ఉండసురియ
కొఱడుపాఱు } కొయ్యబాఱు, తిమ్మిరిపట్టు.
కొఱడువడు } మ్రాన్పడు
కొఱత-కొఱ్ఱున గ్రుచ్చి చంపుట.
కొఱతనుఱుకు-కొంటె, దుర్మార్గుఁడు.
కొఱతి-చూ. కొఱవత, కొఱవది.
కొఱనవ్వు-చిఱునవ్వు-మందహాసము.
కొఱను-కొఱఁకు, బీడునేల, చెలిక. [ము.
కొఱనోము-తక్కువనోము. అల్పసుకృత
కొఱపనికొయ్య-కొఱగానివాఁడు-అంబేద.
కొఱపము - క్షురప్రః = గుఱ్ఱమును తోము పనిముట్టు, గొఱపము - బాణవిశేషము.
కొఱమాలు-పనికిమాలు.దయమాలు,క్రూర మగు, వికారమగు, సొంపుచెడు.
కొఱముట్టు-పనిముట్టు-సాధనము.
కొఱయు-పొలకమాఱు.
కొఱలు-కోరు. కోపించు, మించు,పొందు, నిండు, ఒప్పు, బయల్పడు, వసించు, వెలుఁగు.
కొఱలుకొను-ఒప్పు. శోభిల్లు.
కొఱవ-ఒకానొక కొండజాతి.
కొఱవ(త)ది-కొండజాతి ఆఁడుది.
కొఱవి-కొఱకచ్చు-అలాతము.

కొఱవికంకి-ఒక జాతి వరితెగులు.
కొఱవికాటుక-ఒకానొక జొన్నతెగులు.
కొఱవికోల-కొర్వికోల.
కొఱవిచీమ - కొఱవితో కాల్చినంత మంట పెట్టునట్లు కుట్టెడు చీమ-ఎఱ్ఱచీమ-కపింజిక
కొఱవితెగులు-వరి మిరప ప్రత్తి మున్నగు పైరులు నల్లఁబడెడు తెగులు
కొఱవిదయ్యము - కొఱవితాల్చి తిరిగెడు దయ్యము.
కొఱవిపెట్టు-చితికి నిప్పు ముట్టించు.
కొఱవోవు-పౌరుషమారు. సొమ్మసిలు.
కొఱసంది-ఆయువుపట్టు-జీవస్థానము.
కొఱికికొను-కఱచు,పండ్లు పటపటలాడించు
కొఱు-కొఱ్ఱు, గూటము, మేకు,గసి(క)
కొఱుకరానికొయ్య-మొండికట్టె
కొఱుకు-కఱచు,దొంగిలించు-తినుట.తిండి, ఒకానొక సుఖరోగము,కాలినకఱ్ఱముక్క.
కొఱుకుపుండు-అవయవములను కొఱికెడు సుఖరోగ విశేషము.
కొఱుతనుఱుకు-తలకుమించిన పనిచేయు.
కొఱ్ఱ-ఒక పైరు. ఒక చేఁప. కొఱ
కొఱ్ఱచేఁప-కొఱచేఁప, కొఱ్ఱమీను.
కొఱ్ఱడచు-అతిగా బాధించు.
కొఱ్ఱనేల-కొఱ్ఱలుపండు నేల.
కొఱ్ఱబంతి-కళ్లము గట్టిపడుటకై త్రొక్కించెడు ఎద్దులపంక్తి-మూగబంతి.
కొఱ్ఱ(మట్ట)మీను-కొఱ్ఱచేఁప, మట్టగుడిశ.
కొఱ్ఱు-ముల్లు,ఇంద్రధనుస్సు, తెర, వరద గూడు, గసిక, కాలుచున్న పుల్ల.
కొఱ్ఱుదున్నకము-మొదటి చాలు.
కొఱ్ఱులఁబెట్టు-మిక్కిలి పీడించు.
కొల-కసటు,దోసము,పగ, హింస,కొలత.
కొలకఱ్ఱ-పడవలంగరు,కంబము, కొలబద్ద.
కొలఁకు(వు)-చెఱువు, కుంట, కొలను.
కొలఁది - మేర, మితి, రీతి, శక్తి, స్థితి, కొంచెము-చూ. కొల్ది, కొద్ది.
కొలఁదికిడాయు-దగ్గఱచేరు.
కొలఁదియిడు-లెక్కించు, ఎంచు.
కొలఁదిపెట్టు-కొంచెపఱచు, లెక్కించు.
కొలఁదివేరు-వట్టివేరు-కొలవేరు.
కొలఁదులఁబడు-పరిమితమగు.
కొలకలకోడి-సీటికోడి. [లోనికివచ్చు.
కొలకమాఱు-కుడుచునపుడు ద్రవముముక్కు
కొలకాసు-కొలగారము-కొలువడి.
కొలకుండ-ధాన్యము కొలుచు బాన.
కొలకొల-కలకల = పక్షులసందడి,గుంపున బుట్టిన మ్రోఁత-గొలగొల.
కొలకోల-కొలకఱ్ఱ, కొలఁతబద్ద.
కొలగము-లోహపుబిందె.
కొలగాఁడు-ధాన్యము కొలుచువాఁడు.
కొలగారము-ధాన్యపుకొలఁత కిచ్చు కూలి.
కొలచు-ధాన్యాదికమును కొలుచు.
కొలచేయు - స్త్రీలను జెఱచు, హానిచేయు. కొలుచు.
కొలఁత(ల్త)-కొలగారము, కొలువడి.
కొలదాకు-హానికలుగు. [ త్రకేగు.
కొలనాడు-కొలనున స్నానమాడు; తీర్థయా
కొలనిమబ్బులు-వస్త్రవిశేషము.
కొలను-కూలమ్ = చెఱువు,మడుగు,కుంట కుళము, కొలఁకు(వు), కొల్కు.

కొలపగ-జ్ఞాతివైరము.
కొలపగతుఁడు-జాతివైరి(ఆవు-పులి,పాము-ముంగిస, ఎలుక-పిల్లి మొ॥) [గుంపు.
కొలము-కులమ్ = వంగడము, వంగసము,
కొలపెట్టు-కొలుచు, కొలతచేయు.
కొలమాలు-కొలకమాలు, గుంపు,కూటువ
కొలయీఁగు-పగదీర్చు.
కొలవేరు-వట్టివేరు, కొలఁదివేరు.
కొలసామి-జాతిపెద్ద-కొలముసామి.
కొలారకము-కొలగారము,కొలువడి,కొలత
కొలారము-నాల్గింఢ్లచవంతి-చుట్టుకొల్లారు.
కొలారికము-జెట్టులు తమ కొలతను బట్టి ఆయుధములు గ్రహించుట.
కొలారు-కొలారము, చతుశ్శాల.
కొలారుబండి - నాల్గువైపులను కంబళితో తెరగట్టియున్న ఎడ్లబండి-హేయలుబండి
కొల్లి-బిల్లగోడు ఆటకై త్రవ్విన గుంట
కొళ్లిక-సాలెవాఁడు, తంతువాయుఁడు.
కొలికి(ల్కి)-కంటికొన,కొక్కెము,ముడి, గొంతుక, లొంగుబాటు, కొల్కి.
కొలికికిఁదెచ్చు-ముగించు స్థితికిఁదెచ్చు
కొలికికివచ్చు-ఫలోన్ముఖమగు.
కొలికిచెప్పు-కొలికిగల పాదరక్ష.
కొలికి(ల్కి)పూస-కొలికికి తలిగించుపూస-హారమధ్యమణి, ముఖ్యుఁడు.
కొలికి(ల్కి)ముడి-జాఱుముడి-దూముడి.
కొలికిలు-మున్నూరు కుంచములు.
కొలిపి(ల్పి)ంచు - సేవింపఁజేయు, ధాన్యాదులు కొలుచునట్లు చేయు, నటుఁడు తద్ధిత్తాపి శబ్దములు పలుకు.

కొలిమి(ల్మి)తిత్తి-కొలిమె-భస్త్రి.
కొలి(ల్మి-మి)మె-కమ్మరి లోహాదులు కాల్చునట్టి నిప్పుగుంట-కొలిమి.
కొలిపె-తెల్లమచ్చలుగల ఒక పిట్ట.
కొలుచు (ల్చు) - సేవించు, ఉపాసించు, మ్రొక్కు, తలఁచు, వడ్లు-కొల్చు.
కొలుచుపెఱుక-పెఱికలోఁ దెచ్చిన వడ్లు.
కొలువు(ల్వు)-ఇష్టమగు, చెల్లు,తగు, ఒప్పుకొను, కలిగించు, పురికొల్పు, కనుగీటు-సేవ, మ్రొక్కు, జంతుబలిలేని జాతర.
కొలుము-వ్రద్రఁగి కొలిమి.
కొలువగు-సభచేయు, విడియు, కొలువిచ్చు
కొలువడి-కొలత, కొలగారము.
కొడువాసము-చొలచేఁప-రాజీవమనుచేఁప.
కొలువిచ్చు-కొలువుతీర్చు-కొలువగు,దర్శనమిచ్చు, నమస్కరించు, ధ్యానించు.
కొలువు-చాకిరి,ఓలగము,సంబరము, చోటు
కొలువు(ల్వు)ందు-సేవించు, చాకిరిచేయు.
కొలువు(డు)కాఁడు - బంటు, సేవకుఁడు, ఊడిగీఁడు. [అంగడి.
కొలువు(ల్వు)కూటము-ఓలగము,రాజసభ
కొలువు(ల్వు)గొను-సేవలుగొను,సభచేయు
కొలువుతీరు-నవరాత్రములలోబొమ్మలుపెట్టు
కొలువు(ల్వు)దీర్చు - సభచేయు, విడియు.
కొలువు(ల్వు)మ్రొక్కు - సభాపతికి చేయు మ్రొక్కు.
కొలువు(ల్వు)విడియు-చూ. కొలువుతీరు.
కొలువు(ల్వు)విరియు-సభ చాలించు.
కొలువు(ల్వు)సేయు-సభచేయు,చాకిరిచేయు
కొలువొ(ల్వొ)సఁగు-కొలువిచ్చు.

కొలెన్-మొదలుకొని, కోలెన్.
కొల్డి-తూమున కర్దమగా పెట్టెడు కొయ్య-కరుడు మొద్దు, కుంచకుండు.
కొల్పుదుచేతులు-ముక్కులు, గొబ్బిళ్లు.
కొల్ల-దోపుడు-ఒడమోలు, లూటి.
కొల్లబోవు-దోపుడువడు. చెడు.
కొల్లకత్తె-దోపుడుకత్తె-లంటాకి.
కొల్లకాడు-ఎడకాడు-గజముచ్చు. ఎల్లాపి
కొల్లగు-నీటితో నిండు, అడగు.
కొల్లగొట్టు-దోచుకొను, దొంగిలించు.
కొల్లగొను-ఎక్కువగా గడించు, చూఱకొను.
కొల్లపడు-దోపుడుపోవు.
కొల్లపఱచు / కొల్లపుచ్చు(పెట్టు) } దోచుకొను. ఎక్కువగా గడించు.
కొల్లపోవు-దోపుడువడు, చూఱపోవు.
కొల్లము-కొండ పైభాగము-నెత్తము.
కొల్లరి-కొల్లకాడు-ఎడకాడు.
కొల్ల(లా-లి)డు-దోచుకొను-కొల్లపెట్టు.
కొల్లవట్టు-దోచు. దొంగిలించు.
కొల్లవాడు-దోపుడుకాడు, కొల్లరి.
కొల్లవిడు-కొల్లగొట్టు. [ఎక్కువగా విచ్చు.
కొల్లవిడుచు - లోబఱచు, చూఱవిడుచు.
కొల్లవెట్టు-కొల్లపెట్టు, దోచు.
కొల్లవోవు-కొల్లపోవు, చూఱవోవు.
కొల్లాటిపిట్ట-పిగిలి(పికిలి)పిట్ట.
కొల్లాడు-కొల్లలాడు, దోచు, అంకించు.
కొల్లాపురము-లేనిపోని, జంజాటము.
కొల్లాబండి-కొల్లారుబండి, హౌయలుబండి.
కొల్లాము-పెద్దగంప. [గావంచా.
కొల్లాయ(యి)పంచె-చిన్న అంగోస్త్రము -

కొల్లారము-చూ. కొలారము.
కొల్లారు-చుట్టుకొల్లారు, కొలారము.
కొల్లారుబండి-కొలారుబండి-గాడీ.
కొల్లి-ఒక జాతి చెట్టు.
కొల్లికూర-తోటకూర. [అరచు-
కొల్లు-కుండి, తొట్టె, నీటిగుంట; చంపు-
కొల్లు(కట్టు)గుంట-కుండి. నీటిగుంట.
కొల్లుపోతు-దున్నపోతు, ఎద్దినవిషి.
కొల్లేరు-కష్టాజిల్లాలో నొక చెఱువు.
కొల్వణి-ఒక రీతి నాట్యము.
కొవ్వు-మదము, బలుపు. మెదడు. మత్తిల్లు.
కొవ్వువత్తి-మైనపువత్తి, కొవ్వొత్తి.
కొవ్వెర-కొబ్బెర-నారికేళపేశము.
కొస-కొన, పురితునక, కొంగు, అంచు.
కొసకరించు-చివరకు కొనితెచ్చు.
కొసకు తుదకు, కడకు.
కొసరు-పెనుదీయు, కూయు, వేడు. కొనియాడు, మఱికొంచ మిమ్మని కోరు, చెలరేగు, వేడికోలు, పెచ్చు, లోటు, జలకు.
కొసవెలితి-తఱగిపి.
కొసికింత-కొంచము, కాసింత, కసింత.
కొస్పె-కుశః = దబ్బ-పుడక, పొదపు.
కొళబె-లోన బోలుగల కొయ్య.
కొళ్ల-కొల్ల, సమృద్ధి
కొళాయి-నీటిగొట్టము-కుళాయి, నల్లా.
కొళు(ళ్లు)-కులత్థః = ఉలవలు, దగ్గుయొక్క-అనుకరణము, ఎడతెగక దగ్గు.
కొళాచు-చెక్కు, తాపడముచేయు.

——

# కో

కో - కోడి కోయిల మున్నగువాని కూంత. ఉత్సాహము, ఏడ్పు మున్నగువాని ధ్వని. రూ. కొనుము, కొమ్ము.
కోంద్ర-కొంంద్ర, గొంట్ర.
కోంగట-గొఱుగుట-గోంగుట, క్షౌరము.
కోంగు-గొఱుగు, బోడించు. వరి మున్నగు వాని నారు. [చల్లజంపు
కోంచ - కోచ = పిఱికిపంద, పాఱుబోతు-
కోంచదనము-పిఱికితనము.
కోంచవాఱు-జంకు, బెదరు. దిగుల్పడు
కోజులు-పీచులు, మొఱకులు.
కోటండు-కౌటః = గూబ-ఘూకము, కొరడు
కోంటరి-దెనమొలగల యాండుది.
కోండు-గాజించు, చెరుగు, మలుసు.
కోంత-చేనుకోయుట, హింస.
కోంతపట్టు-కోయ మొదలుపెట్టు.
కోంతపదును-చేనుకోయు కాలము.
కోంతపడు-కోయంబడు, నఱుకంబడు.
కోంతలు-బదాయి(కల్ల)మాటలు.
కోంతి - కపి-వానరము, కీచుకీచుమనునది. (చెట్లకొమ్మలపై నెక్కి కాయలు పండ్లు, కోసికొని తినునది) దుండగీండు-క్రోంతి.
కోంతికొమ్మ(ంచి)చ్చి | చెట్లపై బాలురాడు
కోంతికొమ్మకట్టు | కొను ఒక ఆట.
కోంతిపిట్టమామిడి-చూత విశేషము.
కోంతిపుల్లలు - మగ్గపుపలక దారములను మీందికి తగిలించు పుల్లలు.
కోంతిమామిడి-కోంతులకు ప్రియమైన ఒక దినుసు మామిడి.

కోందాడు - కుంతాల = ఒక దినుసు తాడి
కోక-చీరె, బట్ట, స్త్రీ.
కోకటించు-కోయను, కూయు.
కోకదము-నవరపుమేకము-చమరి.
కోకారము-క్రొక్కారము.
కోకొల్లలు-ఎక్కులి సమృద్ధి.
కోగిరి-గుట్టపుజీను-ఖోగిరి.
కో(గి)గెల - కోకిలః = కిలకిలమని రొద చేయునది. రూ.కోయిల,కోయెల,కోవెల.
కోచ-సందేహము, పిరికితనము, మంది.
కోచెము-మంచి రుచిగల చిన్నచేంప.
కోజులు-పీచులు, మొఱకులు.
కోజేంరు-కోస-కొంజేరు.
కోట-కోట్ట = దుర్గము, చుట్టుగోడ, గ్రామ నామాంత్యపదము.
కోటండు-గూబ-కొరడు-పలుగుపిట్ట
కోటకొమ్మ-గడిబురుజు.
కోటకొమ్మలు-కోటమీంది దళములు.
కోటబురుసు-వప్రము-ధూళికుట్టిమము
కోటరము-కోడలితనము-రూ. కోట్రము.
కోటరించు-కెక్కరించు-కోరాడు, క్రుమ్ము.
కోటరింపు-పెద్దపులి కూంత-గోంంద్రింపు.
కోటరి-దెనమొలది-కోటవి.
కోటరి(టి)కము-కోటరము, కోట్రము.
కోటా-కోష్ఠ = ధాన్యపుకొట్టు, కొట్టము.
కోటాకు-కవటాకు, లేంతయాకు.
కోటాడు-చెల్లించు.
కోటానంగోటులు-కోట్లకొలంది.

కోటి-వేగు - చారుఁడు-కొట్టి. మాఱులక్షల సంఖ్య

కోటికాఁడు-వేగువాఁడు. కొటికాఁడు

కోటికొండలు-కోటానుకోట్లు,కొండంతలు.

కోటిభండాలు-బండిపై తెచ్చు సరకులు.

కోటిరకము-కోడలితనము, కోట్రము.

కోటేరు }
కోటెలు } తలక్రిందుగాఁ బట్టుకొన్న నాగలి

కోటేరువేయు-నాగలిని సంకుచితపఱచు.

కోట్టము-రాజ్యవిభాగము,

కోట్రము = కోటరము, కోడటికము.

కోట్లంక - పాపటకు - కుంచెవలె బట్టచుట్టి దానితో దున్నిన నేలను సదునుచేయుట-

కోడ-పొద, ముండ్లకంప, ఒకదినుసునాఱు, ఒక దినుసు తాయి.

కోడంగి-వికారపుచేష్టలచే మాటలచేనవ్విం చుచు బిచ్చమెత్తుకొను దాసరి - గండోలి గాఁడు-కోణంగి, కోణాంగి.

కోడంటికము }
కోడంట్రము } కోడలితనము-కోటరము-
కోడంట్రికము } కోట్రము, కోడటికము,
కోడంద్రము } కోటిరకము.

కోడకత్తి పోరుసల్పెడు కత్తి.

కోడబడి-ఒకానొక పిండివంట.

కోడరి(టి)కము = కోడలితనము.

కోడలు-(కొడుకు + ఆలు) కొడుకు పెండ్లా ము-స్నుష.

కోడాడు = కోరాడు, కక్కసపడు.

కోడి-కొక్కురొకోయని కూయునది,కుక్కుటః అలుగు, చెఱువు నీటితూము.

కోడికాడ }
కోడికాలు } పశుగ్రాసమగు ఒక దినుసు తీగ.

కోడికునుకు-అఃకొరనిదుర.

కోడిగ-హారము, రత్నముల యిరువదింటి సంజ్ఞ - కోడీ

కోడిగము-మోసము. కొంటెతనము. ఎగ తాళి.పలపుచేష్ట-విఙ-చెడ్డది, ఉపయోగము లేనిది-రూ.కోడిగెము.

కోడిగించు-పలపుచేష్టలు చూపు, గేలిచేయు, కూడు. [పిసినారి.

కోడిగీఁడు-కొంటెవాఁడు. విలాసకాఁడు.

కోడిగెము = కోడిగము, కోఅడము.

కోడిజెల్ల-ఒక దినుసు చేఁప.

కోడిటెక్కెము వాఁడు-కుమారస్వామి.

కోడిటెక్కెమువావన్న = గణపతి.

కోడిడేగ-పందెపు కోడిపుంజు-అరజుట్టు.

కోడిదుబ్బు-ఒక విధమగు వరితెగులు.

కోడిపందెము-కోడిపోరు.

కోడిపీఁట - కుక్కుటపీఠః = నొగచివర క్రింద ఎత్తుగా నుండెడు మోపుడుకొయ్య -అనుకర్షము.

కోడిపుంజు-మగకోడి-కుక్కుటము.

కోడిపెట్ట-ఆఁడుకోడి-కుక్కుటి

కోడిపేను-చిక్కినదూడలకుఁ బట్టుపేలు.

కోడిపోరు-కుక్కుటద్యూతము. కోడిపందెము

కోడిబడి-పిల్లల ఒక దినుసు పిండివంట- అంగరొల్లె.

కోడిబుడమలు-ధాన్యవిశేషము.

కోడిమేను-ఒక దినుసు చేఁప.

కోడిముచ్చు-ఒక దినుసు కలుపుమొక్క.

కోడియ-పెయ్య, అవుదూడ-గిత్త - కోడె, కూట = లేఁబ్రాయపు, పడుచుఁది. వాఁడు

కోడితెప్ప-నేత్రరోగ విశేషము.

కోడిఁవేడి-చప్పునవచ్చు కోపము.

కోడీ = చూ. కోడిగ.

కోడీఁడు = కొమరుఁడు, కోడెకాఁడు.

కోడు-ఖట్వ = మంచపుకాలు.

కోఁడు-ముళికికాలువ,ఊరుదరిసీటిపల్లము, గీఁత, చెరుగు, మలుమ.

కోడుతాలు-పైరు లెస్సగా ఎండు

కోడుబళ్లు-పెద్దచక్కిలాలు

కోడుబిళ్ళ-ఒకదినుసు బాలక్రీడ, చేగోడీ.

కోడె = కోడియ, కోడెఁడు, గిత్త, ఇరువది బట్టలు మొ॥ వాని మూట.

కోడెఁడు = కోడెకాఁడు. కోడె.

కోడెకాఁడు - పడుచువాఁడు, మిండఁడు, కొడుకు, గోవాళ్లు

కోడెకాలు-జవ్వనము, ప్రాయము.

కోడెకొండ-మంచుకొండ-చలికొండ.

కోడెగాడుపు-డ్పు-లేగాలి-పిల్లతెమ్మెర.

కోడెపెక్కమువానన్న-కుమారస్వామి.

కోడెతత్తడి-సామి = శివుఁడు.[చెలికాఁడు.

కోడెతత్తడిసామిచెలి-కుబేరుఁడు - శివుని

కోడెత్రాఁచు-పడుచు(మగ)త్రాఁచు.

కోడెదూడ-పాలువిడిచిన గిత్త-కోడియ.

కోడెము-గూడెము, ఊరివెలుపలి పల్లె.

కోడెయీడు-యవ్వనము, ప్రాయము.

కోడెరవు(రౌ)తు-శివుఁడు,అంగమొలవేల్పు

కోడేలు = కోచేరు.

కోడ్రికము = కోడటికము.

కోణంగితనము-వికృతచేష్ట, గేలి.

కోణంగి(దాసరి)- కోణంగివాఁడు- } రూ.కోడంగి,కోణాంగి, హాస్యనటుఁడు.

కోణవాటా-వంగలకొయ్య-అనుగట్టి.

కోణాంగి = కోణంగి, కోడంగి.

కోణిగి-నతి, మ్రొక్కు. ఎరఁగుడు.

కోణీ-అంతిపురము,రాణివాసము.

కోదండము-నేరస్థులను బాలురను పట్టు కొని వ్రేలాడఁజేయుటకై కట్టినత్రాడు.

కోదండరామములు-ఒక దినుసు వడ్లు

కోదాడికాయలు-హిజ్జలము

కోదు-(వాఁడు) = ఒక అడవి జాతివాఁడు,

కోదువాలు-వరి యెక్కువ యెండి గింజలు రాలిపోవు. [మంద, పల్లె.

కోన-కాననమ్ = అడవి, లోయ,కొన, ఆల

కోనంకి-ఏతపుకొయ్య, కోల, కట్టి.

కోనంగి-గంగిరెద్దుల ఆటలో హాస్యగాఁడు

కోన(తెంకి)తిమ్మరి - కోఁతి-కోనమెకము-అడవి తిరుగుడు.

కోనతిమ్మరిరాయఁడు-సుగ్రీవుఁడు.

కోనమనికి(పట్టు) కోనమెకము } -కోఁతి-కోనతిమ్మరి,

కోనతేఁడు-నైరృతుఁడు-మూలతేఁడు.

కోనవంక-సెలయేఱు-నది.

కోనారి-గొఱ్ఱెల కాపరి-కీలారి.

కోని-పురుషనామాంతపదము - ఉదా॥ శ్రీ పురుషోత్తమకోని (శాసన) [వారు.

కోనికాం డ్రు-కుండలు తెచ్చువారు, వంట

కోనె(నే)ఱు-చుట్టును మెట్లుగల చెఱువు-పుష్కరిణి.

కోపకత్తె-కోపన, కోపశీల,
కోపగించు-
కోపగిలు-ల్లు } కినుకపూను, కోపించు.
కోపరము = కొప్పరము.
కోపపడు-కినుకపూను.
కోపలు-మూత్రము మన్నుకలిపిన పేలికలు
కోపించు-కోపపడు-కినియు
కోపు-కడ్డీ, బలము,దెస,సొగసు,బలపము, రీతి, అంగడి, తీర్పు, నాట్యము, వింటి కొన, నిడివి, ప్రక్క, గాలపుసూది, నీటి దారి, ప్రవేశము, పొలముగట్టు, చెఱువున త్రవ్వినగుంట, తెక్క, కొప్పు.
కోపుదారుఁడు-దుకాణదారుఁడు.
కోపుపరువడి-మల్లుర 12 పరువడులలో(14 విసరులలో) నొకటి.
కోపులు-మేఁకల చనుకట్టు గుద్దలు, గిడిగిళ్లు, జేజేలు, కేకినలు.
కోపులెత్తు-దాడిచేయు, దండెత్తు
కోపువాఱు-అందగిల్లు, ఇంపగు,
కోబలి-పంటకోఁతకు ముందిచ్చు బలి.
కోమ-పుట్టచివరిభాగము, స్త్రీ-కొమ్మ.
కోమటి-గోమతి = సెట్టి, బేరి-కొమ్మటి గోమఠమతానుయాయులు-గోమరులు.
కోమటిపురుగు-వరికిపట్టెడు పచ్చపురుగు.
కోమటీఁడు = కోమటి-బచ్చు. [టులు
కోమట్లు = గోమరులు, కొమ్మరుల్గ, కోమ
కోమల్-కోమలా = సొగసుకత్తె,సుకుమారి
కోమలికము-చక్కఁదనము.
కోమలు-పుట్టల శిఖరాలు, పుట్టలు,
కోయ(ఁడు)-బోయ, కిరాతుఁడు.

కోయత-కోయది-కిరాతస్త్రీ.
కోయవాఁడు-కిరాతవిశేషము-అకరి.
కోయితోఁటకూర-కోసినను మొలకెత్తుఆకు కూర-కొయుగూర,
కోయిల-కోకిల, గుడి - కోవెల, కోగెల, కోకోయని కూయునది.
కోయిలకూర-ఒకజాతి కూరాకు.
కోయిలతెగదణి-మన్మథుఁడు.
కోయు-త్రుంచు,నఱుకు,తెంపు.
కోయుట-ఎచ్చుమాటలు, కల్లలు పల్కుట.
కోర-పానపాత్ర-డబ్బర, కొలగిన్నె, పళ్లెము. పెద్ద, వంకర
కోరంగి-ఉసిరిక, ఒక రేవుపట్టణము.
కోరకావడి-వంగిన కావడిబద్ద.
కోరకొండె-కోర(సిగ)పాగ, జుట్టుముడి.
కోరకొప్పు-ఓరగాముండు కొప్పు.
కోరకొమ్ము-పదునైన కొమ్ము.
కోర(కి)గించు-చెదరు, ఎఱ్ఱనగు, మొగ్గతొడుగు,మారాముచేయు,పుట్టు, దూరము చేయు.
కోరగొను-వంకరపోవు, కొంకరలగు.
కోరచూపు-క్రూరపుచూపు, వికారపుచూపు
కో(రా)ర(ద)డి-అడ్డు(కర)గోడ-కంచె.
కోరణాలు-పిల్లల జబ్బులు.
కోరదౌడ-చప్పిదౌడ.
కోరపాగ-గా. ఒరగిన తలపాగ.
కోరమీస-ము = వంగిన పెద్దమీసము.
కోరము-ఒక విష పుష్పము, కొబ్బరి తురిమెడు పనిముట్టు-గోఁకురు.
కోరమొక్క-సన్నని మొలక-తురిమొలుపు

కోరవాయి-వాతరోగము.
కోరవాఱు-కోపమున ఎఱ్ఱనగు, ఎఱుపెక్కు.
కోరవోవు-అంగములు కొంకర్లువోవు.
కోరసిగ = కొండెసిగ, జుట్టుముడి.
కోరా-చలువచేయని గుడ్డ, క్రొత్తది, ఉదుకనిది, తెలుపుచేయని.
కోరాటము-వాటము, ఒకజాతి గడ్డ.
కోరాడు-కోరియాడు, కెల్లగించు, కుమ్ము.
కోరాబంగారు-శ్రేష్ఠముకాని బంగారు.
కోరించు-కోరునట్లు చేయు.
కోరింత-ఒక ముండ్ల చెట్టు-ఆధారి +
కోరిం(త)దదగ్గు-కుక్కదగ్గు, కక్కాయిదగ్గు
కోరి(రె)ంద-ముచపత్ర +, జతుక +.
కోరిందపూసలు-గాజుపూసలు. [కోర్కె-
కోరిక-కి = కాంక్ష-ఇచ్ఛ, వరము-కోర్కి.
కోరికిపడు-కోరు, ముచ్చటపడు.
కోరికె = కోరిక, కోరికి, కోర్కి-ర్కె.
కోరికోలు-పంట మొ॥ వాని పాలు.
కోరిశదగ్గు-కక్కా-(యి)య్యదగ్గు, కొక్కాయదగ్గు-కోరిం(త)ద దగ్గు.
కోరు-ఇచ్ఛగించు, పిలుచు, ఎదురుచూచు-భాగము-వంతు, మగగుఱి, కొబ్బరిగుంజు తాకట్టు, వస్తురూపమైన కప్పము
కోరుగట్టు-కురుపు(పూనుకొని) అంచుకట్టు
కోరురాజేనాలు-ఒక దినుసువడ్లు.
కోరువెట్టు-బలి(కానుక)యిమ్ము.
కోరెగడ్డి-ఒకజాతి కలుపుమొక్క.
కోర్కి-ర్కె = కోరికి-కె.
కోర్టాయి-ఒకజాతి అడవిచెట్టు
కోర్లగండు = కొరనాసిగండు.
కోఱ-క్రూర = కత్తిరింపుపల్లు, పాముపల్లు, కొమ్ము-పెద్ద.
కోఱకైదువ = పాము-దంష్ట్రాయుధము.
కోఱకొమ్ము-పదునైన కొమ్ము.
కోఱడమాడు-గేలిచేయు.కోడిగమాడు.బాధ
కోఱడము-క్రూరత = కినుక,ఎగతాళి-గోఱడము. కోడిగము.
కోఱపల్లు-దంతము- ధంష్ట్ర-కోఱ.
కోఱము = కోరము.
కోఱమీసములు = పెద్దమీసములు.
కోఱలు = కొఱ్ఱలు, సస్యవిశేషము.
కోఱలు తీసినపాము-అసమర్థుఁడు.
కోఱుదుపాఱు = త్రవ్వుగోల-దోఁకుడుపాఱు
కోల-చేతికఱ్ఱ, గడ, ఈఁచ, పుల్ల, ఏడికఱ్ఱ. ములికి, గొడుగుకఱ్ఱ, విఱ, దీర్ఘము.
కోలంకి-ఒకానొకపక్షి.
కోలకట్టె-గడ్డిలాగెడు కొంకికఱ్ఱ.
కోలకఱ్ఱ-ఏతమందలి ఒకభాగము-సిడె.
కోలకాఁడు-చోపుదారుఁడు-కట్టిక.నర్తకుడు
కోలకుఁదెచ్చు-బాణమునకు గుఱిచేయు.
కోలక్రోఁతులు = కోఁతికొమ్మంచి యాట.
కోలగగ్గెర-కాళ్ళకు త్రాడుగట్టి ఎద్దును పడవేయుట.
కోలచారి-ఒకతెగ నాట్యము.
కోలచె(జె)ముడు = బొమ్మచెముడు +.
కోలజేన్ను-పుట్టతేనె-ఆశాలకము.
కోలతలచేయు - పోరునకు పూనుకొను, ఎచ్చరికచేయు.
కోలదబ్బ-బృహజ్జంబీరభేదము +
కోలదిండు-పొదవు దిండు.

కోలది(వియ)వ్వె-వెలుఁతురుకట్ల దివిటీ, దివిటీకట్ల, దివ్వెకోల-కాగడా.
కోలదోన-నాగళుండి +
కోలన-కోలతనము-పొడుగు, కోల.
కోలనిమ్మ-దూదివిమ్మ, పిడుపునిమ్మ.
కోలపాల-అర్క-పుష్పిక-సూర్యవల్లి +
కోలపొన్న-కోలాకుపొన్న-త్రిపర్ణి +
కోలమారి-దుండగీఁడు, మొఱకు.
కోలమారితనము-దుండగము, పీడ.
కోలము-ఒక దినుసు నాట్యము. వేషము,
కోలమెఱుఁగు-నిలువు మెఱుపు.
కోలలవారు-చాపుదార్లు-బద్దలవారు
కోలవస-జటిల అను నోషధి. [పొన్న.
కోలాకుపొన్న - పృశ్నిపర్ణి. ముయ్యాకు
కోలాట(ము)-పాటలు పాడుచు కఱ్ఱముక్కలు తాఁకించుచు, అడుగులు వేయుచు, ఆడెడు ఆట-హల్లీసకము.
కోలాట(పు)కమ్మ-ఒక చెవి నగ.
కోలారికము-కొలారికము.
కోలాస-అత్యాస-పేరాశ.
కోలాసపేయు-మిక్కిలి ఆశించు.
కోలాసెక(త్తియ)త్తె-పేరాసగలది.
కోలు-కొల్లు-చూ. కొనుధాతువుయొక్క భావార్థకము, చెట్లు పూచి కాచునట్టి కాలము, మిక్కిలి; మొదలుకొని, ఉండి; పెద్దది-గంగ-గజ-గనవ.
కోలుకా(ల్కా)ఁడు-తలారి-కావలివాఁడు, తలమనిషి, పన్ను పసూలు చేయువాని బంటు, ముద్రాధికారి [కాల్వ.
కోలుకా(ల్కా)లువ-ల్వ = ఏటికాల్వ, పెద్ద
కోలుకొ(ల్కొ)ను - కేలుకొను, పూను. పెరుగు, కొనలిడు,కొనలొత్తు,కొనసాగు,
కోలుకొలుపు-ప్రేరించు, కోల్కొనఁజేయు.
కోలుగొక్కెర-మూటకట్టు. [ముస్తాబు.
కోలుత(ల్త)ల - పోరు, యుద్ధయత్నము.
కోలుతలపేయు-పోరునకు సిద్ధపడు.
కోలుప(ల్ప)డు-చెడు, వశించు,కొల్లపోవు. అగపడు, కోల్పోవు.
కోలుప(ల్ప)అచు-చెఱచు, కొల్లపెట్టు.
కోలుపా(ల్పా)టు-కీడు, చావు, కీడ్పాటు, చేడ్పాటు, తలమాటు.
కోలుపు(ల్పు)చ్చు-చంపు,పోఁగొట్టు,చెఱచు.
కోలుపు(ల్పు)లి-పెద్దపులి-బెబ్బులి.
కోలుపో(ల్పో)క-కోలుపోవుట,కడచమట.
కోలుపో(ల్పో)వు-పోఁగొట్టుకొను.
కోలుమ(ల్మ)సఁగు-చంపు. పెంపొందు.
కోలుముందు-మున్ముందు. మిక్కిలిముందు.
కోలుమొ(ల్మొ)సడి | మిక్కిలి క్రూరమైన
కోలుమ్మొ(ల్మొ)సలి | ( పెద్ద ) మొసలి.
కోలుమో(ల్మో)ట-నీరెత్తుమోట, బోరుకపిలె.
కోలువేయు-చిరిగించు, పూఁతపట్టు.
కోలె-వెన్నుకోసిన కొయ్య. కొయ్యకాలు; పలుకు, మొదలుకొని, ఉండి-కొలె.
కోలెముక | వెన్నెముక, వెన్నుపూస -
కోలెమ్ము(క) | రూ. క్రోలెముక.
కోవ-హారములో నొకపేట, సరము, పిల్లల గొంతురోగము, ముత్తెము, వంశాను క్రమము, పొలముకట్ట, పుట్టచివర,కాలువ గట్టు, పాలమిరాయి, కోమ.

కోవగట్టు-పూసగ్రుచ్చినట్లు వ్రాయు, గని మలువేయు. [టకై కాపుంచిన కావలి.
కోవరము-అధికము-శత్రువుల నెదుర్కొను
కోవలుపడు-ముత్తెములు రాలినట్లుండు.
కోవాలుపెట్టు-పశువులకు వాతలుపెట్టు.
కోవి-జొన్నకాడ-జాడు-క్రోవి. క్రోల.
కోవిల-కోవెల, దేవాలయము, గుడి
కోవిలదుంప-నమ్మదుంప-కపేరువు.
కోవు-కోయని అర్చుటయందగు మ్రోఁత-
కోవురము-కోవరము, ఉక్కళము.
కోవెర-కొబ్బెర, కుడక.
కోవెల-గుడి-కోవిల, కోకిల-కోయిల.
కోవెలసొరము-పంచమస్వరము.
కోస-కోఁజేరు, కొంజేరు, మెడజాలు,
కోష్టు-చెంగల్వకోష్టు. ఒక వ్యాధి.
కోస(ర)ము-కొఱకు, నిమిత్తము.
కోసరలు-ఒక దినుసు బియ్యము.
కోసు-రెండుమైళ్లు, కోస, క్రోసు.
కోసుగడ్డ-కోసుపువ్వు-క్యాబేజీ.
కోసెఁడు-క్రోశప్రమాణము కలది.
కోస్టు-కోష్టు, చెంగలికోష్టు.
కోస్తా-సముద్రతీరము
కోస్సెగా-కోసుగా, కూచిగా.
కోహళి-మేలుకట్టు, ఆలవట్టము, కుళ్లాయి-టోపి, తలపాగ
కోహో-ఎగతాళి, గేలియొక్క అను
కోళ-ము = కొయ్యబొండ-ద్రుపదము.
కోళిగి-మ్రొక్కు-గిడిగిళ్లు.
కోశె-పిటికి, అచ్చెరువందువాఁడు.
కోశతనము-బెదరు, జడుపు.

---

# కౌ

కౌ-కాకికూఁతయొక్క అనుకరణము,కౌను శబ్దమునకు లుప్తశేషము-శరీరము.
కౌఁగిలి - ఆలింగనము, రెండు భుజముల నడిమిచోటు. [కౌఁగలించు-
కౌఁగిలించు-ఆలింగనముచేయు,ఆశ్లేషించు.
కౌఁగిలింత(పు)- ఆలింగనము.
కౌఁగిలు-కౌఁగిలించు-ఆశ్లేషించు, కవుఁగిలు.
కౌకౌ-కాకికూఁత-కావుకావు,
కౌచిప్ప-ఆల్చిప్ప, ముత్యపుచిప్పల జంట.
కౌచు-మాంసము, చర్మముమీఁది పొట్టు - చేఁపమీఁది పొలుసు, చెడుకంపు.
కౌచుముచ్చు | కౌచుమేపరి | రక్కసుఁడు-పొలసుదిండి - పిశితాశి.
కౌజే-కంపిలః = కవుఁజు, కముఁజు.
కౌట | కౌటు | కాలు బిగఁబట్టెడు పశురోగము రూ. కవుట-కవటు.
కౌటిగుల్ల-గొడ్లగిట్టలసందున లేచు గుల్ల.
కౌడ-మాలుపడకు పనిముట్టు-కదురు.
కౌడీలు-మ్రొక్కులు-జోహారులు, కవుడీలు.
కౌడు-కపటః = మోసము, కిటుకు,కవుడు.
కౌడువు-రీతి, కైవడి, మాదిరి.
కౌడు(పె)వెట్టు-మోసగించు, కికురించు.
కౌదారి-కవుఁజుపిట్ట, కౌఁజు, కంజు.
కౌను-కవును = (వింటి)నడుము, పాదరక్ష.
కౌయ-చిన్న నీటిజంతువు, చేఁపపొట్టు.
కౌరు-ముదురు ఎఱుపు-కవురు.

కౌరులు-క్రొమ్ముక్కులు-కోపులు.
కౌలిచ్చు-పొలము అమరకమున కిచ్చు.
కౌలు-ఖౌల్ = ఒడంబడిక-కవులు.
కౌలుదారు-రైతు-పరిటకాఁపు.
కౌసు-మాంసము-పొల(సు). కౌచు.
కౌసుమేపరి-రాక్షసుఁడు-పలలాశి
క్యాదరి - ఏటవాలుగా వేసిన మడవ-బారివాటము. రూ. కేదరి.
క్యాబేజి-కేబేజిపువ్వు-పేచువు [ధ్వని.
క్రంగు - గంట(మొ)మ్రోగు-కంగు- ఒక
క్రంచలు-క్రచ్చులు, క్రక్కున.
క్రంచఱు-మఱుఁగు లేకుండు.
క్రంచు-మఱుఁగు, జాగుసేఁత.
క్రంత-(గర్త) = చిల్లి,సందు,దారి,గోయి, రచ్చ, సభ, కంత.
క్రంతనడచు-మగపెండ్లివారు మేళతాళములతో మారేగి, పెండ్లికూఁతునకు చీరలు సొమ్ములు మొ॥ తెచ్చియిచ్చు.
క్రందగు } గుంపగు, రాశియగు, క్రందు
క్రందాలు } కొను.
క్రందిలు-ల్లు-సింహనాదముచేయు, మోఁగు.
క్రందు-ఏడ్చు, మొఱయు, ఏడ్పు,మ్రోఁత, సందడి, పెంపు, పగ, కీడు, ఎక్కువ, దొమ్మియైనది.
క్రందుకయ్యము-దొమ్మిపోరు, ఆరుపోరు.
క్రందుకొను-తఱచగు,ఒప్పు,తగు,నిండు, మూఁగు, వెల్లడియగు. అడరు.
క్రందుకొలుపు-పెంపొందించు.
క్రందుగ-ఎక్కువగా, ఒక్కుమ్మడిగా.
క్రందువడు-గుమికూడు, దాఁగు.
క్రందుపఱచు-మఱుఁగుపఱచు.
క్రందుపాటు-సందడి, మొఱ,అఱపు. కీడు.
క్రందువాయు-ధ్వనిచేయు.
క్రందుపేయు-భేదముపుట్టించు, ధ్వనిచేయు
క్రంప-ముండ్లమండ-నుదుము-కంప.
క్రక్కస-కర్కశ = గట్టిది. కక్కసము.
క్రక్కసపడు-గట్టిపడు. క్రూరమగు.
క్రక్కసము = క్రక్కస.
క్రక్కసించు-క్రౌర్యము వహించు.
క్రక్కించు = కక్కించు.
క్రక్కు = కక్కు. ఓకర; వాంతియగు.
క్రక్కున-తటాలున, గ్రక్కున.
క్రక్కువడు-తొట్రుపడు, బయటపడు.
క్రక్కెర-క్రకర = పెద్దకొంగ-కక్కెర.
క్రచ్చ-కోరిక, ఇచ్చ. క్రచ్చు.
క్రచ్చరన్-పరిపాటిగా, వెంటనే, ఏకకంతముగా, సమభాగముగా-గ్రక్కున.
క్రచ్చఱించు-మించఁజేయు, పెంపొందు
క్రచ్చఱు-మిగులు, పెంపొందు.
క్రచ్చు-చుట్టుకొను,కోరు; కోరిక, కోపము, ఊఁక, ముఱికి, తుక్కు.
క్రచ్చుకొను-దగ్గఱించు, చుట్టుకొను, చుట్టివచ్చు, క్రమ్ముకొను
క్రన్న(న)-తరువాత, మరల, వడిగా.
క్రమ్మటన్-మరల, క్రన్నన్, క్రమ్మఱన్
క్రమ్మనన్-వడిగా, తొరగా, క్రన్నన.
క్రమ్మఱన్ = మాటిమాటికి, సారె, మరల.
క్రమ్మఱఁబడు-మరలు, క్రమ్మఱు,
క్రమ్మఱి = క్రిమ్మఱ. [లించు.
క్రమ్మఱించు-క్రమ్మఱుచు, త్రిప్పు, మఱ

క్రమ్మఱి(రి)లు-ల్లు } మరలు, మరలివచ్చు-
క్రమ్మఱు } క్రమ్మఱఁబడు

క్రమ్మఱుచు-మరల్చు, త్రిప్పు.

క్రమ్మఱుదెంచు-మరలు, నివర్తిలు,

క్రమ్మించు-వ్యాపింపఁజేయు, మరలు.

క్రమ్ము-ఆలముకొను, పాఱు, కవియు, కాఱు, కలుగు, పైఁబడు, పెంపొందు, చుట్టుకొను, పొదువు-కమ్ము.

క్రమ్ముదనము-కుచ్చితము, కాపట్యము.

క్రమ్ముకొను-మూగు, ఆవరించు.

క్రమ్ముదల-క్రమ్ముట, కప్పుట, వ్యాపనము.

క్రమ్ముదెంచు } బయల్వెడలు, పైకుబుకు,
క్రమ్ముదేరు } చుట్టుకొను, ఆవరించు

క్రమ్మునన్-వడిగా-తౌరగా-గ్రక్కున.

క్రమ్ములించు = క్రమ్మించు.

క్రమ్మువడు-మూఁతపడు, పూడు.

క్రమ్మెక్కు-పాఱు, ప్రవహించు.

క్రయ్య-కుల్యః - కాలువ-కయ్య, అవుజు.

క్రయ్యఁబడు-కలియఁబడు, కలియు, చొరఁబడు, చొచ్చు, బలాత్కరింపఁబడు.

క్రయ్యఁబాఱు-కలయఁబాఱు.

క్రయ్యు-కలియు, సన్నగిలు-క్రియ్యు.

క్రెల్లు-బూడిద-బసుమము.

క్రల్లవడు-ఎండు, కాలు, బూదియగు.

క్రవ్వికొను-తృప్తిగా తిను.

క్రాఁక = కాఁక, వేఁడిమి, ఎండ, సెగ.

క్రాఁగు = కాఁగు, కినియు, కిన్వడు.

క్రాఁగుడు-క్రాఁగుట-కాఁగుడు, అక్కసము.

క్రాఁచిపుచ్చు- } చంపు, పెడలఁగొట్టు, చెఱ
క్రాఁచు- } చు, కరగించు.

క్రాచు-కాండ్రించి ఉమియు, వెలిగ్రక్కు.

క్రానుగ-కానుగ, ఉపాయనము.

క్రాయు-ఉమియు, దంచు, కాండ్రించు, క్రక్కు, చేఁటతో చెఱఁగు

క్రార(వడి) } అక్షరము క్రింది రేఫము-
క్రారావడి } క్రావడి-రావత్తు, గిలుక.

క్రాలించు-కదలించు, క్రాలఁజేయు.

క్రాలు-గిరగిరతిరుగు, చెదరు కొఱలు, క్రమ్ము, కదలు, బ్రదుకు ఒప్పు, చెలరేఁగు, కలఁతనొందు, అచ్చెరువందు, నడచుకొను, తహతహపడు. [శేషణ.

క్రాలుఁగంటి-బెదరు కన్నులు కలది. తర

క్రాలుఁగన్ను-కాకిచూపుగల కన్ను, విలాసపు చూపు.

క్రాలుకొను-ప్రకాశించు-క్రాలు.

క్రాలుగచ్చు-బావంజి + -కలుగచ్చు +

క్రాల్గంటి = క్రాలుఁగంటి.

క్రాల్గన్ను = క్రాలుఁగన్ను.

క్రిం-క్రిందుశబ్దముయొక్క లుప్త శేషము-క్రీ, క్రింద, క్రింది, క్రిందు.

క్రించు } కించిత్ = అల్పుఁడు, నీచుఁడు
క్రించుఁడు } మచ్చరుఁడు, దుండగీఁడు, అనద, కొంచెకాఁడు, కించు

క్రించుఁదనము-నీచత, అల్పత.

క్రింద = దిగువ, డిగువ, కింద.

క్రిందంటు-అడుగంటు, నేలపాలగు.

క్రిందట-క్రిందను, పూర్వము.

క్రిందటి-వెనుకటి, పూర్వపుది.

క్రిందల-క్రిందగుతల-తలక్రిందు.

క్రిందు = కిందు, అడుగు.

క్రిందుపడు = అడుగునపడి వంగు, ఓడు, తగ్గు, లోఁబడు-క్రిందపడు.
క్రిందుపఱచు-అడుగున పడునట్లు చేయు, ఓడించు, చుల్కన చేయు.
క్రిందులు-పాతాళములు,
క్రిందుసేయు = క్రిందుపఱచు. [వస్తువు.
క్రిక్క-బట్టువాఁడు, యతులు దాల్చెడు ఒక
క్రిక్కటిల్లు = వణఁకు, కంపించు.
క్రిక్కలు- చదువరులు, బట్టువారు
క్రిక్కిర్యు = చూ. క్రిక్కిఱియు.
క్రిక్కిఱి-మిక్కిలి ఇఱుకైనది. ఎడము లేనిది, నిండినది.
క్రిక్కిఱించు } ఎడములేకుండచేయు, ఇఱు
క్రిక్కిఱియు } కగు, మోసపుచ్చు, పెక్క
క్రిక్కిఱు } సమగు, కూడు, చేరు.
క్రిక్క-త్రిప్పు, తిరుగుడు, కిఱుకు, క్రుక్కి, నిండు, దట్టముగ నుండు.
క్రిక్కొను-నిండు, క్రిక్కిఱియు.
క్రిగ్గాఁడి(కాఁడు)-క్షుద్ర = క్రీగాఁడి.
క్రిగ్గాలి-తూర్పుగాలి.
క్రితము-కృతమ్ = మునుపు, పూర్వము.
క్రియ-విధము, అంగము.
క్రియ్య-సన్నగిలు, బక్కటిల్లు-క్రుయ్యు.
క్రియ్యాట-క్రింది యూట-క్రీయూట.
క్రీ-క్రిందిది-క్రింది, రూ. క్రి.
క్రీఁగడుపు-పొత్తికడుపు-వస్తి
క్రీఁదొడ-క్రిందితొడ, లోపలితొడ.
క్రీఁబడు-తక్కువయగు.
క్రీగాఁడి = క్రిగ్గాఁడి.
క్రీగాడ్పు-క్రిందిగాలి-పిత్తు.
క్రీగోరు-కాలిగోరు-నఖము. [-కత్తి.
క్రీడి-కిరీటి = కిరీటములవాఁడు- అర్జునుఁడు
క్రీడిచెలితేరు-గరుడుఁడు-వెన్నునరదము.
క్రీపీఁద = కీపీఁద.
క్రీపీరునేల-ఊటనేల-పీరుముంపు.
క్రీయూట-క్రియ్యాట.
క్రీవాడ-పాటిపొలము-పాడు.
క్రుంకించు-క్రుంకునట్లు చేయు.
క్రుంకిడు-స్నానముచేయు-క్రుంకులిడు,
క్రుంకు-గ్రుచ్చుకొను, మునుఁగు, చచ్చు, దాఁటు, మునుక, అస్తమయము.
క్రుంకుఁగడలి-పడమటి సముద్రము.
క్రుంకు(కొండ)గట్టు - అస్త్రాద్రి
క్రుంకుడు-మునుఁగుట-క్రుంకుట.
క్రుంకుడుగట్టు-క్రుంకు(గట్టు)కొండ.
క్రుంకుతఱి-అస్తమయవేళ.
క్రుంకుపుడమితాల్పు-అస్త్రాద్రి-పడమటిమల
క్రుంకు(మల)మెట్ట-క్రుంకుగట్టు- అస్త్రాద్రి.
క్రుంకులిడు-స్నానముచేయు, క్రుంకిడు.
క్రుంకులువెట్టు } మునుఁగు, తానమాచరించు,
క్రుంకువెట్టు } క్రిందికి వంగు.
క్రుంగఁబడు-దిగఁబడు, కుదియు-క్రుంగు.
క్రుంగఁబాఱు-మెత్తనగు, క్రుంగఁజొచ్చు.
క్రుంగిలు(ల్లు) } ముడుఁగు-క్రిందికి అడఁగు
క్రుంగు } -కుదియు, కుందు.
క్రుంగిలఁబడు-క్రుంగు. [క్రుక్కఁజేయు.
క్రుక్కించు-అదుమునట్లుచేయు, కూరించు,
క్రుంచము-(క్రౌంచః)క్రౌంచపర్వతము...
క్రుక్కి- అటమట, క్రిక్కు, కిచురు, కిక్కురు.
క్రుక్కిదమగు-పూర్తిగ నిండు.

క్రుక్కిదము-నిండినది, కప్పువడినది.
క్రుక్షు-అదుము, కూరు,ఆడఁచు,చొప్పించు, బొటనవ్రేలి గోటితో నొక్కు; వంచన.
క్రుక్షుమిక్షు ను-ఊపిరియాడు-శబ్దమొదవించు
క్రుక్కుడు-క్రుక్కుట, అదుముట.
క్రుచ్చు-చేర్చు, జతచేయు-కూర్చు.
క్రుమ్మడగించు-క్రుమ్ము.
క్రుమ్మరించు-ఎక్కువగా వెలువఱచు.
క్రుమ్మరిలు-ల్లు / క్రుమ్మరు } తిరుగు, ఒక్కసారిగాపడు, మెలఁగు.
క్రుమ్ము - పొడుచు, ద్రిమ్మరు, చెర్లాడు, పోటు, పొడుపు, ఎగుపు.
క్రుమ్ముడి-కురులముడి-కొప్పు-క్రొమ్ముడి.
క్రుమ్ముడు-పోటు, పొడుపు-క్రుమ్ముట.
క్రుమ్ముడుతగరు-కొంకుమన్నతగరు అనెడు ఆయుధము-కొమ్మతగరు.
క్రుమ్ముడువడు-పోటువడు.
క్రుమ్ములాడు-పోరు, కుమ్ముకొను.
క్రుమ్మెస-క్రుమ్ముడు-పొడుపు.
క్రుమ్మెసలాడు-పోట్లాడు-క్రుమ్ములాడు.
క్రుయి-కొప్పున ముడిచిన వెండ్రుకలముడి.
క్రుయ్యఁ(గ)బాఱు / క్రుయ్యు } బక్కటిల్లు, కొంకు, బడలు, తగ్గు.
క్రుళ్లగించు-లోలోనకుళ్లు-క్రుళ్లు.
క్రుళ్లగింత(పు)-అధి-మానసికదుఃఖము.
క్రుళ్లు-కుళ్లు, ముఱుగు
క్రుళ్లుపోతు-కుళ్లుపోతు. [కూర్చు, క్రుచ్చు.
క్రువ్వు - వాఁడియైన, నీటిలో ఉప్పళించు,
క్రూరు-వాఁడియైన, కూచి,
క్రెళ్లు-చచ్చు, నీల్గు, ఇలుగు.

క్రే-క్రేవశబ్ద ఉత్తశేషము.
క్రేఁగన్ను-కడకన్ను-అపాంగము.
క్రేఁగంటిచూపు-కడకంటిచూపు.
క్రేఁగయి-చేతిచివర, ఎడమ(పుణ్ణి)చేయి.
క్రేఁట-దగ్గుత్తిక, తబ్బిబ్బు, తొట్రు.
క్రేఁదొట్టు-గట్టొరయు.
క్రేగాలి-ప్రక్కగాలి, దక్షిణవాయువు.
క్రేఁటు(కొను) - తొట్రుపడు, తడఁబడు, వెక్కు, గొంతు సవరించుకొను.
క్రేగో-హంసకూఁతయొక్క అను ..
క్రేడి-గేలి, ఎగతాళి, ఎఱుపు తెలుపుల కలగలుపు వర్ణు-రూ. క్రేణి.
క్రేడించు / క్రేడిసేయు } గేలిచేయు, ఈసడించు, ఉపేక్షించు, కేరు.
క్రేణి-ఉన్నతపదవి, గేలి-క్రేడి, ఆట.
క్రేణించు = క్రేడించు, క్రేఁటు.
కేర్రిణియొనర్చు / కేర్రిణిసేయు } ఎగతాళిచేయు-కేరు, ఈసడించు.
కేర్రిణివట్టు-గడించు. ఆర్జించు.
కేర్రిణిసేయు-కేర్రిడిసేయు.
కేర్రితొట్టు = కేర్రిఁదొట్టు, గట్టొరయు.
కేర్రిపు-మేఁతపట్టినదూడ-లేఁగ,కొండకొన, పాఁడిపశువు.
కేర్రిపుఁగుఱ్ఱ-చిన్నదూడ-లేగ. [ధ్వని
కేర్రియో - తొలఁగఁగొట్టు నప్పుడు చేయు
కేర్రివ-ప్రక్క, వైపు, దగ్గఱ, చోటు.
కేర్రివు-అఱపు, సింహనాదానుకృతి.
కేర్రిళ్లు-గంతులు, పరుగులు, పెంపు,ఎగువ
కేర్రిళ్ళుచూచు-చంచలముగా చూచు.

క్రొళ్ళుతుళ్ళు } మిక్కిలి ఎగిరిపడు,దూఁకు,
క్రొళ్ళుదాఁటు } ఎగయు.

క్రొళ్లఁదోలు } పరుగులెత్తించు, గంతులు
క్రొళ్లఁద్రిప్పు } వేయించు. [రించు.

క్రొళ్ళుబ్బు-ఎక్కువగు, ముమ్మరించు,కొప్ప

క్రొళ్ళుమలఁగు-వెనుదీయు, నిరాకరించు.

క్రొళ్ళుమసలు-కదలిపోవు. తిరుగు.

క్రొళ్ళులు-ఎత్తు. పొడవు-కొపురు.

క్రొళ్లుఱుకు } క్రొళ్లదాఁటు. క్రొళ్లుతుళ్లు,
క్రొళ్లువాఱు } దుముకు, గంతులువేయు.
క్రొళ్లసను }

క్రొళ్లెగయు-మీఁదికెగురు, గంతులిడు.

క్రైలు = కైలు, పంట ఒబ్బిడి.

క్రైలుదా(రి)రు = కైలుదారుఁడు.

క్రైస్తవుఁడు-కిరస్తాను.

క్రొ-క్రొత్త శబ్దలు ప్తశేషము.

క్రొంకి = కొంకి, వంపుచీల. దోఁటి.

క్రొంచ-కొంచ-కొక్కెర.

క్రొంజెమురు-క్రొత్తనూనె.

క్రొంఛాయ-క్రొత్తకాంతి

క్రొంజిగురు-లేఁతచిగురు, అంకురము.

క్రొంజిగురువిలుకాఁడు = మన్మథుఁడు.

క్రొంజిలుఁగుఁజల్వ-క్రొత్తదగు సన్నబట్ట.

క్రొంజీకటి-లేఁజీఁకటి-ముంజీఁకటి.

క్రొంజెమట-క్రొత్తచెమట,

క్రొందమ్మి = కొత్తమ్మి.

క్రొందలిరు-లేఁజిగురు-కొంజిగురు.

క్రొందావి-క్రొత్త(కమ్మని) వాసన.

క్రొందొడిమ-క్రొత్త తొడిమ.

క్రొంబంట-క్రొత్తపంట.

క్రొంబట్టు-క్రొత్తపట్టు.

క్రొంబని-క్రొత్త(చేతిపని)శిల్పము.

క్రొంబదను-క్రొత్తపదను.

క్రొంబసిఁడి-క్రొత్త బంగారము.

క్రొంబసిమి-క్రొత్త పసుపురంగు.

క్రొంబిడి-క్రొత్తపిడి.

క్రొంబులకలు-క్రొత్త పులకలు.

క్రొంబుట్టము-క్రొత్త బట్ట.

క్రొంబువ్వు-క్రొత్త పూవు. [ధన్వుఁడు.

క్రొంబూవిలుకాఁడు- మన్మథుఁడు - పుష్ప

క్రొంబెరుగు-క్రొత్తగా తోడుకొన్న పెరుగు.

క్రొంబొగ-క్రొత్తగా వ్యాపించిన పొగ.

క్రొంబొగడ-క్రొత్త పొగడ.

క్రొక్కన్ను-కొత్తకన్ను.

క్రొక్కారము-కోడికూఁత-కొకా(క్కా)రము.

క్రొక్కారు-క్రొత్తకారు-వానకారు.

క్రొగ్గంటు-క్రొత్తగా పడిన గాయము.

క్రొగ్గండి-క్రొత్త గండి.

క్రొచ్చు-చెరుపు, చెక్కు.

క్రొచ్చె(ల)లిక-క్రొత్త బీటినేల.

క్రొడ్లు-ఎత్తు, తూనికలో విశేషము.

క్రొత్త-అపూర్వత, క్రొత్తది. [పోవు

క్రొత్తచేయు-వికృతి కలిగించు, సరిపడక

క్రొత్తడము - కోటబురుజు - రూ. క్రొత్త
శము-కొత్తడ(ల-శ)ము

క్రొత్తడి-మగవాలు-పువిస్త్రీ-గొత్తడి.

క్రొత్తది-నవము-నవీనము.

క్రొత్తప(వ)డు-క్రొత్తయగు.

క్రొత్తపఱుచు-ప్రకాశింపఁజేయు.

క్రొత్తమగఁడు-ఱంకుమగఁడు- జారుఁడు.

క్రొత్తమావాస్య-ఫాల్గుణ బహుళ అమావాస్య
క్రొత్తముట్టు-మొదటిరజస్వల-సమర్త.
క్రొత్తమ్మి - క్రొత్తగా పూచిన తామర-
క్రొత్తరఁగ-క్రొత్తయల.
క్రొత్తలిరు-క్రొందలిరు, లేఁజిగురు.
క్రొత్తలుసేయు-క్రొత్తపనులు ఆరంభించు
క్రొత్తవలచు-క్రొత్తదానినిగాఁ జేయు.
క్రొత్త(ల)ళము-చూ క్రొత్తడము.
క్రొత్తావి-క్రొందావి, క్రొత్తవాసన.
క్రొన్నన-క్రొత్త(పూవు-మొగ్గ)చిగురు.
క్రొన్ననఁబోఁడి-క్రొత్తచిగురు(పూవు)వలె సున్నితమైన ఆఁడుది-సుమాంగి.
క్రొన్ననలొత్తు-చిగుర్చు, పెంపొందు.
క్రొన్ననవింటివాఁడు | క్రొన్ననవిలుకా(ల్గా)ఁడు | క్రొన్ననవిలుతు(ల్తు)ఁడు | మన్మథుఁడు - క్రొంబూవిలుకాఁడు
క్రొన్ననవిల్కానితండ్రి-పెరుమాళ్ళు.
క్రొన్నురుఁగు-క్రొత్తఫేనము
క్రొన్నెత్తురు-క్రొత్తనెత్తురు.
క్రొన్నెల-లేఁతచంద్రుఁడు.
క్రొన్నెలతాలుపు-ల్పు | క్రొన్నెలదారి | బాలచంద్రుని జటాజూటమునఁ దాల్చిన వాఁడు-శివుఁడు-నెలదారి.
క్రొన్నెలదారిసింగిణి - శివుఁడు తాల్చిన విల్లు = మేరుపర్వతము.
క్రొన్నెలలు-గోటినొక్కులు,నఖక్షతములు
క్రొమ్మావి - లేఁతమామిడి +, క్రొత్తగా చిగిర్చిన మామిడి +.
క్రొమ్మి-కురవకః = ఎఱ్ఱగోరఁట-క్రోవి +
క్రొమ్మించు-కొత్త(మెఱుపు)కాంతి.
క్రొమ్మించుదారి-(తొలికారు)మబ్బు.
క్రొమ్ముడి-క్రొత్తముడి-కొప్పు- కీలుగంటు.
క్రొమ్మెఱుఁగు-తొలకరి(క్రొత్త)మెఱుపు.
క్రొమ్మొగడ-క్రొత్తమొగ్గ.
క్రొమ్మొన-క్రొత్తమొన.
క్రొమ్మొలక-క్రొత్తమొలక, లేఁజిగురు
క్రొయ్యపు-కైపు, మత్తు, ముమ్మరింపు
క్రొయ్యెక్కు-వదలు, చెదరు, చెలరేఁగు, కైపెక్కు, మత్తిలు.
క్రొవ్వడఁగించు-మదముతగ్గించు,క్రొవ్వడఁచు
క్రొవ్వణఁగించు-మదము తగ్గించు.
క్రొవ్వణఁచు-క్రొవ్వడఁచు.
క్రొవ్వాఁడి-క్రొత్తపదును-వాఁడిమి.
క్రొవ్వారు-క్రొవ్వెక్కు,బలియు, అందగిలు.
క్రొవ్విదము-బలుపు, క్రొవ్వు, ప్రాయము.
క్రొవ్విరి-క్రొత్తగా వికసించిన పూవు.
క్రొవ్వు-కొవ్వు, కైపు, గబ్బు.
క్రొవ్వుగొను | క్రొవ్వెక్కు | క్రొవ్వెత్తు | పొగరెక్కు, బలియు, పెంపొందు
క్రొవ్వడఁగు-పొగరడఁగు.
క్రొవ్వుపట్టు-పొగరెక్కు.
క్రొవ్వెద-కొప్పు-వేనలి-కబరి.
క్రొవ్వేఁడి-మిక్కిలి వేఁడిమి.
క్రొళ్ళు-కొళ్ళు.
క్రోఁతి-కోఁతి, అడవి తిరుగుడు.
క్రోడాడు-కోడాడు,ఏనుఁగు మొ॥వి కోరాడు
క్రోడించు-తఱచు, త్రచ్చు.
క్రోయు-సర్పాదులు నాల్కలు చాచు.
క్రోల-క్రోలు, గ్రోవి.

కోలగచ్చు-సర్పాక్షి-వాకుడు +
కోలించు-తాగించు-కో(లు)లు
కోలు-తాగు-అను, తిను, మింగు, వాసన చూచు,చిమ్మనగోవి,జాడు,తూడు-క్రోల.
కోలుకపవు - నడము-అంటినగడ్డి, కోవ.
కోలుచు(లు)-తాగించు, కూయు, పాట పాడు, నేర్చు, చప్పుడుచేయు.
కోలెముక-వెన్నెముక-కశేరుక.
కోల్పులి-పెద్దపులి-బెబ్బులి-రూ. కోల్పులి.
కోవ-వేరు, దండ, రోగవిశేషము-కోవ.
కోవి - తుపాకి, గొట్టము, కంఠనాళము. బడిజె,మూస,చిల్లి,తూడు, తూముకాలువ. కొనుగు +, ఎఱ్ఱగోరంట +, కొలవి.
కోవెముక-కోలెముక-వెన్నుపూస.
క్రోసు-క్రోశః = రెండుమైళ్ల దూరము-కోసు
క్వయినా-ఒక దినుసుమందు-క్వైనా.

## ఖ

ఖంగు-గంటమ్రోగుట, పెద్దగా మాటాడుట, లోహాదుల రాఁపిడి మున్నగువానివలనఁ గలుగు ధ్వనికి అనుకరణము.
ఖంగుఖింగు-ఆయుధముల చప్పుడు.
ఖంగుమను-కంచువలె మ్రోగు.
ఖంగురింగు-చిన్న ఫిరంగుల మ్రోఁత.
ఖండరించు-గండరించు.
ఖండా-కరడః = పెద్దకత్తి-రిష్టి.
ఖండిక-చిన్నపల్లె,పన్నులేని నేల-ఖండ్రిక.
ఖండియరాయ-వీరుల ఒక బిరుదు.
ఖండీ-పుట్టి, పెద్దగంప, పుటిక.
ఖండుక-ఎనుబది కుంచముల పరిమితి.
ఖండువా-పైబట్ట-ఓణీ-కండువా.
ఖండ్రిక-చూ ఖండిక.
ఖంతి-శాంతి = ఓరిమి.
ఖచిక్కు-మర్దించుట పక్షులు గింజలు కొఱుకుట ఏయుటయందగు ధ్వని
ఖందారాజు-వంటచేయు క్షత్రియుఁడు
ఖజాంచి-కోశాధ్యక్షుఁడు
ఖజానా-బొక్కసము, ధనము.
ఖజ్జము-ఖాద్యమ్ _ ఒకానొక పిండివంట - రూ కజ్జ(ము), కజ్జాయము
ఖజ్జా-జగడము-కయ్యము-కజ్జా.
ఖజ్జిక-ఖజ్జము, కజ్జికాయ.
ఖడాయము-కడ్డాయము.
ఖడాయించు-నిలఁబెట్టు, నిలుపు.
ఖడేరావను-ఆగుమని హెచ్చరించు.
ఖడియా-నామసుద్దవంటి మట్టి.
ఖణి-మ్రోఁతయొక్క అనుకరణము.
ఖణిలు-ల్లు-ఎద్దుయొక్క అంకె, ఖడ్గాదులు (విఱుగుట) తాఁకుట మున్నగువాని ధ్వని
ఖణిఖణి-మిక్కిలి మ్రోయుట.
ఖణిలుఖణిలు-ఖణిలు.
ఖణేలు-తుపాకి ప్రేలిన చప్పుడు.
ఖణేలు-చూ. ఖణిలు-ల్లు.
ఖత్తు-జాబు, కమ్మ, రీతి, చేవ్రాలు.
ఖద్దరు-నూలువడికి నేసినబట్ట-ఖాదీ.
ఖద్ది-బలము, పూనిక, వేడుక, అలవు.
ఖద్దించు-పూను, తక్కువచేయు, గద్దించు.
ఖద్దారు-రైతు, సేద్యకాఁడు.

ఖ(నియ)నె- స్తంభము-కంబము.
ఖబురు-కబురు, వార్త, సమాచారము.
ఖయిదు-చెఱసాల-కారాగృహము-ఖైదు.
ఖరడా-అధికారి-ఖరోడా.
ఖరా-కచ్చితమైన, సరియైన, అనుకొన్నట్లు సంపూర్ణమైన.
ఖరాగా-సరిగా, స్థిరముగా, నిక్కచ్చిగా.
ఖరాబు-చెడినది, చెడ్డవాఁడు.
ఖరాబుచేయు-పాడుచేయు, చెఱచు.
ఖరారు-ఏర్పాటు, నిర్ణయము.
ఖరారుచేయు-బేరము పరిష్కరించు.
ఖరారునామా-ఒడంబడిక, ఒప్పందము.
ఖరీదు-విలువ, వెల, జట్టి, రో.
ఖరీదుచేయు-వెలయిచ్చి కొను.
ఖరుచు(ర్చు)-వెచ్చము-వ్యయము.
ఖరుచుచేయు-వెచ్చించు. ఓడించు.
ఖరేలు-ఖాలున ముల్లు విఱుగునప్పటి ధ్వనికి అనుకరణము.
ఖసిచేయు-వట్టలుకొట్టు.
ఖశిఫెశి-వీరణధ్వనికి అనుకరణము.
ఖశీఫెశి-కోడిపుంజులు తన్నుకొనునప్పటి మోఁత.
ఖాణము } ఖాదనమ్ = దాణా, జంతువుల
ఖాణా } యాహారము.
ఖాత(తీ)రు-గుటి, లెక్క, ఎన్నిక.
ఖాతరుచేయు-లెక్కచేయు.
ఖాతా-పద్దు, జమఖర్చుల పట్టీ.
ఖాదీ-ఖద్దరు, బట్టతాను.
ఖాన-తురుష్కప్రభువు-ఖాను.
ఖానా-తూము, తూష్కరాణ.

ఖావిగి-సొంతముగా, మర్మముగా.
ఖాను(ఁడు)-ఖాన, తురుష్కప్రభువు.
ఖానూమసూపు-బాధపెట్టు.
ఖామందు-యజమాని-ఖావందు.
ఖాముఖా-గట్టిగా, ఆగత్యముగా.
ఖాయమగు-ఉద్యోగము స్థిరపడు.
ఖాయము-స్థిరము, నిక్కము.
ఖాయిదా-చూ. కాయిదా.
ఖాయిదాచేయించు-కట్టడి చేయించు.
ఖాయిలా-చూ. కాయిలా.
ఖారి-పుట్టి, మానవిశేషము.
ఖాలీ } ఉత్తది, ఆక్రమింపఁబడినది.
ఖా(ళ)ళీ }
ఖాళీచేయు-విడిచిపెట్టు, వట్టిదిచేయు.
ఖాల్సా-ప్రజల ఉమ్మడిసొత్తు.
ఖావం(దు)దు-ఖామందు.
ఖావందుదారు-యజమానుఁడు, ప్రభువు.
ఖాసా-సొంతము ప్రత్యేకము, జమీందారుల సేవకుఁడు.
ఖాహళ్లవాఁడు-కాహళికుఁడు.
ఖిరదారు-కృషి, వ్యవసాయపు లెక్క.
ఖిరానా-కిరానా.
ఖిలారి-పసులకాపరి-కిలారి, ఖిల్లరి.
ఖిల్ల(ల్లా)రి-కిలారి, పసులకాపరి.
ఖుడక-క్షుద్రకః = అల్పుఁడు.
ఖుతినీ-పట్టుబట్ట, మడిబట్ట.
ఖుదా-దేవుఁడు-స్వయంభువు, అల్లా.
ఖుద్దు(న)-సొంతముగా, సమక్షమున.
ఖురాను-మహమ్మదీయ మతగ్రంథము.
ఖురాసానివాము-కురంజివామము.

ఖలాసా-క్షేమము, సుఖము-కులాసా.
ఖ(ల్లసు)ల్లా-వివరాలు.
ఖుష్కీ-మెట్టపొలము-కుస్కీ.
ఖుసి-సంతోషము-హి. ఖుషి.
ఖూని(నీ)-కొల-నరహత్య-కూని-నీ.
ఖూనీఖోరు-హంతకుఁడు.
ఖాబు-హి. (ఖాబ్) పెటాసు, బళి.
ఖేట-వేఱైన, భిన్నమైన, పరాయి.,
ఖేటాయించు / ఖేటించు } వేఱుచేయు-కేటాయించు.
ఖేదము-ఖేటః = చిన్నపల్లె.
ఖేడి-కేడీ-దొంగ. అపరాధి.
ఖైది(దీ)-హి. చెఱసాలలో నున్నవాఁడు-రూ. ఖయిది-కైది-దీ.
ఖైదు-హి చెఱ-కారాగారము-కైదు.
ఖైదుచేయు-చెఱసాలలో నుంచు.
ఖొజ్జా-పేఁడి-నపుంసకుఁడు-రూ. కొజ్జా.
ఖోగిరి-హి. గుఱ్ఱపుజీను-రూ. కోగిరి.

## గ

గంగ-పెద్ద. గొప్ప, బొత్తిగా, గజ,గఱువ.
గంగచిప్ప-పెద్ద ఆలిచిప్ప-శంబూక.
గంగజాతర - వర్షముకొఱకుచేయు గంగ పూజ, పెద్ద అల్లరి.
గంగడోలు-పశువుల మెడక్రింద వ్రేలాడు పెద్దతోలు-డంగడోలు, పెద్దడోలు.
గంగనమ్మ-గంగ, గంగిమ్మ, గంగానమ్మ.
గంగనురుగులు-ఒక దినుసు భక్ష్యము
గంగపాయిల-పావలిఆకు, పాయిల.
గంగపాలుచేయు-సర్వనాశము చేయు.
గంగమయి(మై)ల-మిక్కిలి నలుపు,నలుపు పసుపు కలిసిన రంగు కలది.
గంగమయి (మై) లావు - పసుపు నలుపు గలిసి వరంగుగల యావు-గంగమైలావు.
గంగమ్మ-గంగనమ్మ, గంగాదేవి.
గంగరావి - బ్రహ్మదారువు - తూది - కపి ఘాతము.
గంగరే(ను)(గు-కర్కంధుః = కమ్మరేఁగు.
గంగలోఁగలుపు-చెఱచు, పాడుచేయు.
గంగవాడిజల్లు-గుఱ్ఱపు నడుమునకు గట్టెడి ఒక అలంకారము. [వెఱ్ఱి.
గంగవెఱ్ఱి-నరముల బలహీనత, కుందేటి
గంగసింధూరము-నాగసంభవము.
గంగానమ్మ-గంగనమ్మ - గంగమ్మ, వావ లకై కొలువఁబడు ఒక గ్రామదేవత.
గంగాజలాలు-అక్కుళ్లు.
గంగాబొండము - ఎక్కువ నీరుగల ఒక దినుసు పచ్చి కొబ్బరికాయ.
గంగాళచిప్ప-గంగచిప్ప. [కొప్పెర-అవికి.
గంగాళము - కంగాళము. పెద్ద(బాన)నీళ్ల
గంగి-సాధుగోవు, గంగమ్మ, సాధువు.
గంగికట్టి - సాధుగోవు, మిక్కిలి సాధు శీలము కలవాఁడు.
గంగిరెద్దువాఁడు-గంగిరెద్దు నాడించువాఁడు.
గం(గిరె)గెద్దు-బిచ్చగాండ్రు సింగారముగా అలంకరించి ఆడించు ఎద్దు.
గంగెద్దులాట-బాలక్రీడా విశేషము
గంజి-కాంజికమ్ = కలి, వార్పు(డు).

గంజిగుల్ల-నీటిబుగ్గవంటి బొబ్బ.
గంజితొరక - గంజిపై కట్టిన మీఁగడ = మాసరము.
గంజీఫాచీట్లు-ఆడెడి చీట్లపేక మొ॥
గంజే-పేద్యము చేయఁదగ్గ నేల-చేను.
గంజేన( గాలు ) - ఖంజపాదః = పిల్లలు కుంటుచు ఆడునట్టి ఆట-కుంటుకుట్టు.
గంజమ్మవారు-ఒకజాతి స్ఫోటకము.
గంజలము-పంచితము, మూత్రము.
గంజా(యి)వి-కై పెక్కించు ఒక ఆకు - మాదనిబంగు, రూ. గాంజ-గెంజాయి.
గంజో-అంగడివాడ, గొడ్లఉచ్చు, పెద్ద పాత్ర.
గంట-ఘంటా = చిఱు గంట. గడ్డిదుబ్బు, అరువది నిముసముల కాలము
గంటకట్టు-పైరుదుబ్బు ఏర్పడిన దగు.
గంటకఱ్ఱ-పైరుకాడ-కరుగు
గంటకొట్టు-చచ్చు, నశించు సీల్గు.
గంటచుక్క - పొద్దుపొడుచుటకు ముందు తూర్పునను పొద్దుగ్రుంకినవెనుక పడమరను గానవచ్చు నక్షత్రము - కుందేటి చుక్క.
గంటము-ఉక్కు-కలము-అయోలేఖిని.
గంటమొలనూలు-కింకిణిమేఖల.
గంటఱ్ఱు-పశువుల మెడమీఁది పుండు.
గంటలమొలనూలు-కింకిణీమేఖల.
గంటలమ్మ-గంటాలమ్మ, అంకలమ్మ.
గంటవాఁడు-గంట వాయించువాఁడు.
గంటవాయించు-ఎగవేయు, పూజించు.
గంటవేఁట-దీపముఖచిఱుగంటలు ఉపయోగించుచు రాత్రిలు ఆడు వేఁట-ఏదువేఁట.
గంటసుడి - పశువుల గంగడోలుపై నుండెడు సుడి-గాటిసుడి(ఇవి జోడెద్దునకుకీడు)
గంటా(ట)లమ్మ-ఒక గ్రామదేవత.
గంటి - గ్రంథిః = దాయము, కన్నము, బాము, వగపు, గంటు.
గంటిపడు-గాయమగు, కన్నమేర్పడు.
గంటిపఱుచు / గంటిపెట్టు } చిల్లి ఏర్పఱచు, కొలుకు.
గంటిపోట్లాటలు-బాలక్రీడా విశేషము.
గంటిసేయు-గంటిపెట్టు.
గంటీ(టియ)లు - చెవిపోఁగులు, చెంపసరులు-రూ.కంటీలు, గంట్లు.
గంటు-గ్రంధిః = ముడి, గాయము, గాటు, కోపము, సాము. పేచి, బొప్పి.
గంటుగూరు-ధనము సమకూరు
గంటుబారంగి-చిఱుతేఁకు + -కాసజిత్తు
గంటుపోవు-నష్టమగు గాయపఱచు.
గంటుసేయు-డబ్బు నిలువచేయు.
గంటె-గరిటె, సజ్జపైరు-గంటియ
గంటెకలుపు-వంటచేయు.
గంటెకాడ-ఒకచెట్టు, గరిటెకాడ.
గంటెన-గిరికర్ణిక-అపరాజిత +
గంటెనేల-గంటెలు పండెడినేల.
గంటెలు-సర్జము = కంబులు, సజ్జలు
గంటెసము-తొట్రుపడనిమాట.
గంట్రకవోరము-గంధమూలి +
గంట్లకానుగు-షడ్గ్రంధ-శావఘ్న +
గంట్లము-గర్భిణులకుఁబెట్టు సూడిద.
గంట్లాడు-లాగు-ఆకర్షించు.
గంట్లు-గంటీలు, చెవిపోఁగులు, తునకలు.

గండ-ప్రమొక్కుబడి, మిండఁడు-
గండంగి-కొండముచ్చు-కొండ్రంగి.
గండఁడు-శూరుఁడు, మగఁడు, జెట్టి.
గండకట్టెలు-వంట(కట్టెలు)చెఱకు.
గండకత్తెర-కంఠకర్తరి = మెడకత్తిరించు పెద్దకత్తెర, సంకటము
గండకత్తెరవేయు-మరణశిక్షవేయు
గండకబరిణెపురుగు-ఎన్నెమ్మ పురుగు.
గండగొడ్డలి-ఖండకుఠారః - నేల త్రవ్వు పనిముట్టు. [రాముడు
గండగొడ్డలితాలుపు - (ల్పు) = పరశు
గండడఁగించు = గండడఁచు.
గండడ(ణ)ఁగు-మదమడఁగు, చచ్చు.
గండడఁచు-నశింపఁజేయు, మదమణఁచు
గండఁడు-జెట్టి, జోదు, ఉక్కడీఁడు.
గండతల-బలిగానిచ్చుతల, మ్రొక్కుబడి.
గండదివ్వె-మ్రొక్కుబడికై పెట్టు జ్యోతి.
గండదొంగించు-మదమణఁచు
గండపక్కమాదలు-నాణెవిశేషము.
గండపెండ(ణా)రము | శూరుఁలు కవులు
గండపెండియ(డె)ము | మున్నగువారు
గండపెండియ(డె)రము | కాలికి బిరుదుగా
గండపెండె(డే)రము | తాల్చెడు అందె
గండపెరోజా-గంధపెరోజా = శ్రీవాసము
గండబేరుండము-ఒకనొకమృగము, రెండు తలలు మూఁడుకన్నులు గల పక్షి.
గండముఁగిశలు-వీరులు కాఁపుండఁదగిన ముంచిటి వాఁకిళులు.
గండము గడచు-ఆపదతీరు.
గండమాడ-అర్ధనిష్కము.
గండము-ప్రమాదము. ఆపద, వరిమడి.
గండరగండఁడు-వీరులలో శ్రేష్ఠుఁడు.
గండరించు-పుట్టు, చేయు, ఉబ్బు, పెంపొందు
గండరుఁడు-మగఁడు, జోదు.
గండరులు-ఖండః = ముక్కలు. గండ్రలు
గండరుపు-పడియచ్చు-గండారము.
గండరువానరించు = దేవతాప్రతిమచేయు.
గండలించు-కలుగు. పుట్టు
గండలీయతీఁగె-మాహేశ్వరి.
గండవడము-కొండపట = తెర, పరదా.
గండాగొండి-అరితేరిన దిట్ట.
గండాడు-కూడు. కవియు, పొందు.
గండాదీపము = గండదీపము.
గండారపు బొమ్మ = దిష్టిబొమ్మ.
గండారము-అచ్చునఁ దీసిన ఆకృతి.
గండారు-చెఱసాల-కార-గిడ్డంగి
గండి(క)-కన్నము, గుంట, సందు, తెగిన చెఱువుకట్ట, గండశి-లోయ.
గండికొట్టు-దొంగిలించు.
గండిచేయు-చిల్లు(బొక్క)పొడుచు.
గండిదొంగ-కన్నపుదొంగ-గజదొంగ.
గండివడు-గట్లుతెగు.
గండివనము-గంధిపర్ణి = పశ్చాకు.
గండీఁగ-పెద్దనల్లయీఁగ-గండ్రీఁగ.
గండు-గండ = మగతనము, కోపము, గర్వము, మదము, శక్తి, విజ, పగది, గొప్పది
గండుఁగోయిల-పొగరుఁగోయిల-దగరు.
గండుఁజీమ-పెద్దనల్లచీమ-ఉలంగవము.
గండుతెప్ప-పెద్దమబ్బు.
గండుబేడు-బలిమకు, గర్వించు

గండుపిల్లి-బావురుఁబిల్లి, బావురుగాడు.
గండుమడి-వరిమడి, గద్దెమడి.
గండుబెండువడు-నీరసించు, బక్కచిక్కు.
గండుమిగులు-చెలరేఁగు, ఒప్పు
గండుమీను-త్రిశృంగి, ఒకపెద్దచేఁప.
గండుమీఱు-సమర్థత హెచ్చు
గండుముసురు-జడివాన-ఆసారము.
గండుమెఱయు-చెలరేఁగు, ఒప్పు,
గండుఱాయి-మగఱాయి-వజ్రము, రవ్వ.
గండువావిలి-పోతువావిలి-నిర్గుండి
గండె-గడః - మంచినీటిచేఁప,లోయ.రూ. గెండె, గెండ, గండి.
గండెక్కు-మత్తిల్లు, పొగరెక్కు.
గండోలి(గాఁడు)-వికృతవేషముచేనవ్వించువాఁడు-కోణంగి. [తునుకలు,ముక్కలు.
గండ్ర-దిట్టతనముకలవాఁడు,పెద్దది గట్టిది-
గండ్రకత్తెర = గండకత్తెర.
గుండ్రగుద్దలి-నేలత్రవ్వెడు పనిముట్టు.
గండ్రగొడ్డలి-గండగొడ్డలి,ఒకవేఁటకుక్క
గండ్రచీమ-గండు (పెద్ద)చీమ-ఉలంగవము
గండ్రమాకలు-పెద్దబియ్యపు మాకలు.
గండ్రపురి-పెద్దపురి, పోటికట్టు.
గండ్రలు-కంకర, కఱకు,
గండ్రలుచేయు / గండ్రించు } ఖండించు = నఱుకు
గండ్రిక-ఖండకా = చెఱకుముక్క,తునుక, ఒకానొక పిండివంట-గండ
గంత-కంధః = బొంత, మెత్త, చినిఁగినబట్ట, జంతువుల కనుమూఁత, సందు.
గంతకట్టు-కండ్లకు మూఁతలుకట్టు, మోసము చేయు.
గంతమోయు-బరువుమోయు.
గంతసుడి-వీఁపునకు రెండు వైపులనుండు సుడి, గంగడోలు క్రిందనుండు సుడి.
గంతాడు-ఎగురు-గంతువెట్టు.
గంతి-బొప్పి-కంతి, కణితి.
గంతు - క్రాంతి = దుముకు, కుప్పింపు, ఒకానొక గుఱ్ఱపు నడక.
గంతుకొ(ట్టు)ను-దుముకు, చచ్చు, కూలు.
గంతువేయు-ఎగురు-గంతాడు.
గందకము-గంధక = ఖల్బరిపువు.
గందపటక / గందప(ట్టియ)ట్టె } తలుపుపై నమర్చెడు అడ్డుకొయ్య, గందముతోఁ బెట్టిన రేక,
గందపుగొండ-మలయపర్వతము.
గందపుఁగొండటాణెదారు / గందపుఁగొండపె(ంకి)క్కి } మలయ మారుతము.
గందపుకుడక-చందనపు గిన్నె.
గందపుమల-మలయపర్వతము.
గంద(పు)పొడి-బుక్కా-గందవొడి.
గందపుమచ్చ-పశువుల మెడక్రింది చాఱ.
గందపుమ్రాను-చందనవృక్షము.
గందము - గంధః = చందన వృక్షము, చందనగంధము, పరిమళము,
గందరగోళము - కంధరాగోళః = అల్లరిగొల్లు, గండ్రగోళము.
గందవొ(వ)డి-గందపొడి-బుక్కా.
గందసరులు-ధాన్యవిశేషము.
గందిక-సందడి, కోలాహలము.
గందువ-గొలుసు, బంగరుహారము.
గందెపట్టె-చందనపుపూఁత, కవాటపట్టిక.

గందెవాటు-బ్వారపు కొయ్యచట్రము
గందెపట్లతలుపులు - తలుపుపై నమర్చు అడ్డుకొయ్యతలుపులు
గంబొడి-గండవొడి, బుక్కా.
గందొడివాఁడు } గందోళిగాఁడు, కేళి
గందోలి(ళి)గాఁడు } గాఁడు, కేదరిగాఁడు.
గంద్రగోళము-గందరగోళము.
గంప-తట్ట, పెద్దబుట్ట-జల్ల.
గంపచిప్ప-దృఢకర్పరము.
గంపమక్క-సూర్యుఁడు-ప్రొద్దు.
గంపజాతర-ఒకానొక ఉత్సవము, గంపల తో తినుబండారములుపెట్టుకొని ఊరేగుచు ఊరివెలుపల తోఁటలో దేవతలకు కొలుపు చేసి, గ్రామస్థు లెల్లరు కలిసి భుజించుట.
గంపగంగమ్మ-ఒక దేవత,ఆమెను తట్టలో నుంచుకొని తిరిగి బిచ్చమెత్తుకొను స్త్రీ.
గంపగంగానమ్మ-గంపలమ్మ అను దేవత.
గంపపులుగు-అడవికోడి-కంపపులుగు.
గంపలమ్మ-(గంప)గంగానమ్మ, గయ్యాళి.
గంపసిడి-గ్రామదేవతకు మ్రొక్కు చెల్లించు నపుడు మనుష్యుని గంపయందుఁ గూర్చుండఁబెట్టి యాచించెడు వరము.
గంబుర(ము) } కప్పురః = కప్పురము -
గంబురా } ఘనసారము.
గంబూర-ము }
గంబూరరాజనాలు-అక్కుళ్లు అను వడ్లు.
గంబూరు-గంబూర(ము), కప్పురము.
గంభరము-గంభీరము.
గగనము-దుర్లభము, అరిది.
గగురించు-గగుర్పొడుచు.

గగురు(పాటు) } భయహర్షాదులచే మేని
గగురుపు } వెండ్రుకలు నిక్కపొడు చుట-రోమాంచము-గగ్గురు, గగుర్పు.
గగురుపొడము-పులకించు, గగురుపుట్టు.
గగు(రుప)ర్పడు-వెండ్రుకలునిక్కఁబొడుచు
గగు(రుపా)ర్పాటు-రోమాంచము కలదగు -మైమోజు పర్వు-గరుపాటు.
గగు(రుపొ)ర్పొ(డము)డుచు-పులకించు.
గగు(రుపొ)ర్పొడుపు = గగుర్పాటు.
గగ్గ-చెవివద్ద లేచు కురుపు.
గగ్గతిలు(ల్లు)-వణఁకు, కంపించు.
గగ్గి-గింజలులేని కంకి-పీచ. [రము.
గగ్గిరెట్టు-ఎద్దుకొమ్ములకువేయు బోలుఉంగ
గగ్గు-కొంకు, వెనుదీయు, గద్గదః = డగ్గుత్తిక, బొంగుగొంతు.
గగ్గురు-గగుర్పాటు.సీతాఫలము,రూ.గగురు
గగ్గురుపొడుచు = గగుర్పొడుచు.
గగ్గులకాడు-వడ్లు రాల్చిన కంకులప్రోగు. వల్లకాడు,ధ్వంసము,వధ,సారము లేనిది. చెల్లాచెదరైనది, చెదరఁగొట్టునది.
గగ్గులకాడు గావించు-చంపు. [కంకులు.
గగ్గులు-గింజలు రాల్చినవెన్నులు, మూర్చిన
గగ్గెర-కటచ్ఛదము + - ఆర్జవము + కాలికి వేయు బిరుదు కడియము.
గగ్గెరగద్ద = కరింజరపు దుంప.
గగ్గో(డు)లు-కలఁత, అల్లరి,శక్తి,దిగులు. ప్రియము, పెల్లు.
గగ్గోడు(లు)పడు-కలఁగు, అక్కిలిపడు.
గగ్గోలుపెట్టు-కలఁచు, బెదరించు.
గచ్చ-గ్రచ్చ + -గెచ్చ + యజ్ఞకీ +

గచ్చకాయ-యక్షిశిలాటువు.
గచ్చకాయలాట-బాలికాక్రీడావిశేషము.
గచ్చతీఁగ-లతాకరంజము, వజ్రబీజక.
గచ్చపొద-యక్షి + -గచ్చతీఁగ.
గచ్చు-గార, కాంతి, పూఁత, సున్నము, అబద్ధము, పీటితొట్టి, డాబు. వర్ణ(పద) లోపము-గ్రస్త = కొతుకైనది, లోపించినది, [పట్టుకొను.
గచ్చుకొను-అంటియుండు, బిగిపికొను,
గచ్చుచేయు-సున్నముచే గారచేయు.
గచ్చులాఁడి-మాయలాఁడి, డాబుకత్తె.
గచ్చులిడు-బడాయి చెప్పు.
గచ్చు(ప)వడు-లోపించు, తగ్గు.
గచ్చువిచ్చగు-కార్యముచెడు,అఱుమాడగు
గచ్చువిచ్చు-కలఁత, తాఱుమాఱు.
గజపతిలాగీలు-ఒక దినుసువడ్లు.
గజిబిజించు, గజిబిజిపడు } కలఁతపడు, తొట్రుపడు.
గజిబిజిచేయు-చెల్లాచెదరుచేయు.
గజిబి(బీ)జి-కలఁత, చిక్కు, నలఁగుడు, సందడి, అల్లరి, తొందరపాటు, నలఁగినది, కలఁగినది.
గజిముచ్చు-పెద్దదొంగ, గజెదొంగ.
గజ్జి-ఖర్జువు = కచ్ఛువు,తీఁటకుఱుపు-పామ
గజ్జి(జ్జె)కట్టు-నాట్యము నేర్చుకొను,
గజ్జివట్టు-తీఁటకురుపులు మొలకెత్తు.
గజ్జియ-జ్జె = చిఱుమువ్వ-కింకిణి
గజ్జెగొలుసు-స్త్రీల కాలిపట్టాలు-పాఁజేబులు
గజ్జెలగుఱ్ఱము-తెగతిరిగెడు భోగస్త్రీ, గలగల మాట్లాడునది.

గజె-గజః = పెద్ద, గొప్ప. ఉక్కడము.
గజెగజెలాడు-భయముచే వణఁకు,
గజెదండ-మల్లవిద్యావిశేషము-సమదండ.
గజెదొండ-పెద్దదొండ + [డహుంవు.
గజెదొంగ-గొప్ప దొంగ, మేటి దొంగ-
గజెనిమ్మ-పెద్దనిమ్మ-లకుచము +
గజెను-డాబు, మోసము, గబ్బి, గబుసు.
గజెపిప్పళ్లు = కపివల్లి-గజకృష్ణ +
గజెపుసుడి = ఎద్దుమూఁపుమీఁది సుడి.
గజెబిరుసులు-ఒకజాతి బాణసంచు.
గజెబొంకు-పచ్చి అబద్ధము
గజెము-గజః = రెండు మూరల కొలఁది, ఇనుపయూచ, అడ్డబీల.
గజెముచ్చు-కొల్లగాఁడు, గడిదొంగ.
గజెయీఁత-గొప్పయీఁత, [పోవు.
గజెరుగజెరులువోవు-గగుర్పొడుచు,నలఁగి
గజెవాళము-ఒక దినుసుబట్ట
గజేరము-ఖర్జూరః = ఖర్జూరపుపండు.
గజ్జ-ఖర్జూః = గజ్జి, తొడసందు,
గజ్జదుముకు-మల్లవిద్యావిశేషము.
గజ్జు-కచ్ఛువు = మత్తు, పెంపు, కైపు.
గజ్జుగెలయు, గజ్జువట్టు } పొగరెక్కు, మత్తిలు.
గజ్జుమను-బెదరు, జంకు. [రము.
గజ్జురము-ఖరూరః = పేరీఁదు-కజ్జు (జ్జూ)
గజ్జురేఁగు-పొగరెక్కు, కైపెక్కు.
గజ్జులాఁడు-మత్తెక్కినవాఁడు,పొగరుబోతు
గటక-జావ, అంబలి. జొన్నన్నము
గటకచొప్ప-కంతులతో నున్నగడ్డి.
గటనము-ఘటనమ్ = కూర్పు, కలయిక.

గచె-ఘట్టము, అంగడివీధి.
గట్ట-ఘట్టః = మూఁత, విరడ. దిమ్మిని.
గట్టన-ఘట్టన = గట్టింపు, దిమ్మిస, గడన.
గట్టనచేయు = గట్టించు, దిమ్మిసచేయు.
గట్టము-కల్ = గట్టిది, దట్టము.
గట్టి-కఠిక, దిట్టతనము, బంటుతనము, గందపుటుండ, ఘట్ట = కఠినము, బిగువైనది, దట్టమైనది, నిజమైనది, ఎక్కువైనది.
గట్టించు-ఘట్ = గట్టనచేయు, దట్టించు.
గట్టిగ-గా = పెద్దగా, బిగువుగా, బాగుగా, తేటతెల్లముగా, నిండుగా, దట్టముగా.
గట్టిచేయు-గట్టించు, దట్టించు.
గట్టిదెందమువాఁడు-ధీరుఁడు-దిట్టరి
గట్టిది-దట్టమైనది, బిగువైనది, వదులుకానిది కదలికలేనిది, బిరుసైనది.
గట్టినబోది-ఒకానొక బాలక్రీడ.
గట్టిపడు | బెదరు విడుచు, బిగియు, దృఢ
గట్టిపాలు | పడు. [రంగుపూయు.
గట్టిపెట్టు-పలకపై చిత్రము వ్రాయుటకై
గట్టిపోఁక-ఒకజాతి పోఁకవక్క
గట్టిబోది-ఒకతెగ బాలక్రీడ.
గట్టియిడు-ఒంటికి నలుగుపట్టించు, గట్టించు
గట్టిల్లు-కలుగు, సమకూడు, ఘటిల్లు.
గట్టి (వ) (వా) వాయి-గయ్యాళి - జాగ, పెళుసుమాటలు పలుకునది(వాఁడు), మాటకారి. దుండగీఁడు.
గట్టివాచాన-గయ్యాళి-జాగ, మిండకత్తె.
గట్టివా(యి)తనము-గయ్యాళితనము, జాగతనము, మాటకారితనము.
గట్టివాలు = గట్టువాలు, సైరంధ్రి.
గట్టివాలొప్పటులు = పుష్పలావికలు.
గట్టివెసు-పడుచుఁదనము-ప్రౌఢతనము.
గట్టివెసుది = పడుచుది-ప్రౌఢ. [తిప్ప.
గట్టు-ఘట్టః = ఒడ్డు, కట్ట, కొండ, మెట్టు,
గట్టుగ-గర్భస్రావము.
గట్టువిలుకా(ల్కా)ఁడు-శివుఁడు.
గట్టుచూలి-పార్వతి-గుబ్బలిపట్టి. [వేయు.
గట్టుచేర్చు - కష్టములనుండి బయట పడ
గట్టురాపట్టి-పార్వతి, మైనాకుఁడు.
గట్టుతా(లుపు)ల్పు-కృష్ణుఁడు, విష్ణువు.
గట్టుత్రిమ్మరి-కోఁతి, దపితిరుగుడు.
గట్టుదాయ-ఇంద్రుఁడు. గట్లసూడు.
గట్టుదారి = గట్టుతాలుపు.
గట్టు(దొర)పట్టి-పార్వతి, మైనాకుఁడు.
గట్టురా(ట్రా)కొమరిత-పార్వతి-హైమవతి
గట్టురా(ట్రా)కొమరుఁడు-మైనాకుఁడు.
గట్టురా(ట్రా)చూలి-పార్వతి-అమ్మిక.
గట్టురాకొమరునిగాఁచిననేర్పరి-సంద్రుఁడు
గట్టురా(ట్రా)జెల్లుఁడు-శివుఁడు.
గట్టు(ట్రా)రాజు | హిమవంతుఁడు -
గట్టుల(ట్ల)యెకిమీఁడు | నగాధిపుఁడు.
గట్టుల(ట్ల)యెకిమీనిపట్టి = పార్వతి.
గట్టుల(ట్ల)యెకిమీని పట్టిపట్టి = కుమారస్వామి. [పర్వతరాజు.
గట్టులరాయ(జే)ఁడు - హిమవంతుఁడు -
గట్టువా(యి) = గట్టివా, గయ్యాళి, జాగ.
గట్టువాలు-పరులయిండ్ల యజమానులకు గంధపుష్పాదులు సమకూర్చుచు అలంకరించుచు స్వేచ్ఛను గోల్పోవక జీవింపనట్టిది-సైరంధ్రి-గట్టివాలు.

గట్టువిలుకా(ల్డా)ఁడు | మేరు పర్వతము ను
గట్టువిలుతు(ల్తు)ఁడు | విల్లుగాఁ జేసికొన్న
గట్టువిల్దా(రి)లుపు | వాఁడు-శివుఁడు
గట్టెక్కు-నెఱవేఱు, కృతార్థుఁడగు.
గట్ర-మొదలయిన. [వాఁడు-ఇంద్రుఁడు
గట్లగొంగ-కొండలరెక్కలను ఛేదించిన
గట్లయేలిక-గట్టురాజు-హిమవంతుఁడు.
గట్లయేలికమనుమఁడు = కుమారస్వామి
గట్లరాయ(తే)ఁడు = హిమవంతుఁడు.
గట్లరాయనిపట్టి | పార్వతి, మైనాకుఁడు
గట్లతేనిబిడ్డ |
గట్లసూడు-ఇంద్రుఁడు-గట్టుదాయ.
గడం(చి)చు-తలుపులమర్చని గడమంచ.
గడ-ఒక ప్రత్యయము, కాండః = ఈఁటె, చెఱకుకఱ్ఱ, వెదురుకఱ్ఱ, పడవకొయ్య, చెట్టుబోదె, గెడ-ఘటః = గుంపు. గుమి.
గడకుప్పె-ఎడ్లకాఁడి కన్నమున దిగఁగొట్టిన కఱ్ఱచీల-గొడికట్టె. [కట్టు.
గడగట్టు-నెలకొల్పు, నిశ్చయించు, జెండా
గడగడ-షణుఁకుటను దెల్పు పదము, ఒక అనుకరణము.
గడగడ(పడు)లాడు-వణఁకు, బెదరు.
గడగు-ఇరుసు-అక్షము
గడచీల-ఏతపుకొనకు అమర్చిన కొయ్య.
గడచు = కడచు. [పొగడ్త.
గడన-ఘటనా = గణన,ఆర్జన,దొంగమేపు,
గడనకత్తియ-త్తె గణికా = రోచెల్వ-
గడనచేడియ-డె వెలయాలు-బోగముది
గడనపడ(తి)తుక గడించు ఆఁడుది.
గడనము-ఘటః = గుంపు, గడన.
గడప-గుమ్మము, వాకు, చీల.
గడపత్రొక్కు-ఇంటికివెళ్ళు.
గడపపన్ను-ఇంటిపన్ను.
గడపు = కడపు. గడచునట్లుచేయు.
గడబ(బి)డ-అల్లరి, తొందర, బాధ.
గడబిడచేయు-అల్లరిచేయు.
గడమం(చి)చె-ఘరోంచి = పెక్కుఅరలు అమర్చిన ఎత్తు కోళ్ళబల్ల-చిన్నమంచము
గడరుఁగోయిల = గండుఁగోయిల
గడవేయు-పడవనడపు.
గడవం(చె)చి-గడమంచె. గడగంచ.
గడసాదన-సాము-గరిడి, వ్యాయామము.
గడ(న)సాని-గడనకత్తె,బోగముది,గడపై ఆడునది-దొమ్మరసాని.
గడసియ(సె)-ఆటుక, మిద్దె, మదురు.
గడసిల్లు-చివరదగు, సమమగు, ఒఱగు, క్రుంగు.
గడము-మూఁకుడు, శరావము.
గడాము-చిన్నగునపము
గడారంకాయలు-పుల్లదబ్బ(నిమ్మ)కాయలు
గడా(ర)రు-గడ్డపాఱ, ఇరుసు, పలుగు.
గడాలు-అరకలు, నాఁగేళ్లు.
గడి-పొలిమేర, కుండమూఁత, చెంత, కట్టుపాటు, కోట, బందము, బిలము, మేర.
గడించు-పాటించు, ఆర్జించు, కల్పించు
గడించుపడఁతి-వెలయాలు, రోయింతి.
గడికట్టు | ఆటితేఱు, రెండుపశువుల
గడికాళ్లువేయు | కాళ్ళకు ఒక్కత్రాడు కట్టు.
గడిగ-ఒకపాటి కడవ.
గడిగొయ్య బండిజల్ల ప్రక్కకు తొలఁగ
గడిగొట్టు | కుండుటకై నిలువుపట్టెలకు
గడిచీల | బిగించిన కఱ్ఱ-ఒసికొయ్య.

గడిఁడు-వీరగీతములనుపాడుచుబిచ్చమెత్తి కొనువాఁడు
గడితకెక్కు-గణుతికెక్కు, తిరపడు.
గడితపడు-గట్టిపడు, చిక్కనగు.
గడితము-ఘటితమ్ = చిక్కని, దట్టమైన, ఎక్కువైన, పెద్దదైన, చిక్కని, మోటు, గడిత్రాడు, పలుపు.
గడిత్రాడు-బందపుత్రాడు
గడిదల-ఒకానొక ఆయుధము.
గడిదేఱు-ఆరితేఱు, దిట్టపడు.
గడిదొంగ-గజదొంగ, కన్నగాఁడు.
గడిపరక-తృణలేశము.
గడిపోతు-ఆఁబోతు, ఆలపోతు, ఎద్దు.
గడిబిడి = గడబిడ, తొందర, అల్లరి.
గడిమంచ = గడమంచ, గడమంచె.
గడిమి-కడప, గుమ్మము.
గడిమేకము = వ్రేటుకు చిక్కని పశువు
గడియ-అర్గళము, (ఘటిక) ఇరువది నాల్గు నిమిషముల కాలము-గడె
గడియకుడక-గడియల కాలమానము తెలిపెడు చిల్లులుగల ఒక పాత్ర.
గడియారము-ఘటికాయంత్రము-గడేరము
గడియించు-గడించు, గడిచ్చు, ఆర్జించు.
గడియు-దగ్గఱించు, చేరు.
గడివడ-గట్టి వడియము.
గడివాఁడు-ఎల్లలవద్ద కాఁపుండువాఁడు.
గడివిప్పు-చీరమడతవిప్పు, మడతవేయు
గడివోతు-ఉడుపకుక్క, ఒక వేఁటకుక్క.
గడిసిలఁబడు, గడిసిలు-ల్లు } చెడు, క్రుంగు-గరిసిలఁబడు, గరిసిలు.

గడిసె-ధాన్యము విల్వచేయు గాదె-గరిసె.
గడీ-కోట-దుర్గము-రూ. గడి.
గడు-బల్లిదెక్క, గొప్పతనము, గొప్పవాఁడు. సాధ్యముకానిది, కష్టమైనది-గడ్డు.
గడుగ్గాయ-గడుసుకాయ-ఘటికుఁడు.
గడుచు-కాలము జరుగు, కడచు.
గడుపు-కడపు, కాలము వెళ్లఁబుచ్చు.
గడుమన్నెము - లోమన్నెము, చొరరాని కొండప్రదేశము-గడ్డుమన్నెము.
గడులఁడు-బొక్కిబొమ్మవాఁడు.
గడువఁబడు-మించఁబడు.
గడువు-మేర, కట్టడ-వాయిదా.
గడుసరి-దిట్టరి, కటికి, గుండా, జెట్టి.
గడుసరితనము, గట్టితనము, గడ్డుతనము, ప్రౌఢతనము, పలువతనము.
గడుసు-గడుసరి; గడుసైన-గరాసు.
గడుసుఁదనము-గడుసరితనము.
గడుసుకుంక-గడుసరి, దిట్టరి. [పూను.
గడుసుపడు-బండయగు, మొండితనము
గడుసుఖుజ్జు-మిక్కిలి తెలివి కలవాఁడు.
గడుసుమాట-కుచ్చితమైన పలుకు.
గడుసురాలు-గడుసరి ఆఁడుది-ప్రౌఢ.
గడుసువడు-మొండితనము తాల్చు.
గడెకన్నము-తలుపుగడియ కన్నము.
గడె(డే)కారి-ఈఁటెకలవాఁడు, పోకిరి.
గడెత్తు-కుయుక్తి, పెద్ద పన్నుగడ.
గడెమంచము - పరుపులు దుప్పట్లు తలగడలు పెట్టుకొను మంచము-గడమంచ.
గడెమాను-ద్వారబంధపు కొయ్యగడియ.
గడెము-గుంటక మున్నగువాని దిండులో చేర్చు కొయ్యచుక్క-గొజ్జు.

గడె(మ్రాను)-గడియ-గడ-అర్గళము.
గడెలువడు-చెవులు అరాత్తుగా వినిపించక పోవు
గడెవెట్టు-తలుపు గడియపెట్టు.
గడెసావి-గడసాని, దొమ్మరసాని.
గడేరము-గడియారము-ఘటికాయంత్రము
గడ్డ-కుఱుపు, వేరు, ఏరు,ఏటిఒడ్డు, మంటిపెల్ల, దుంప, లంక, ఏటియొడ్డు, కరుడు, నేల-గెడ్డ.
గడ్డకుఁబెట్టు-చంపు, చదుము.
గడ్డగు-దుష్కరమగు.
గడ్డగొట్టు-నష్టపఱచు, అన్యాయముచేయు.
గడ్డగొఱ్ఱు-పెద్దగొఱ్ఱు.
గడ్డతీరువ-కొలిచిన పొలము.
గడ్డనేల-సారవంతమైన నేల.
గడ్డ(పలుగు)పాఱ-గునపము, గుద్దలి.
గడ్డపాఱు-ఘనీభవించు. గడ్డకట్టు.
గడ్డపెడ్డ-మంటిపెల్ల, మంటిగడ్డ.
గడ్డపెరుఁగు-గట్టిగా తోడుకొన్న పెరుఁగు.
గడ్డప్రొయ్యి-గడ్డలతో నేర్పఱచిన ప్రొయ్యి
గడ్డము-గండ = చిబుకము-గద్దువ.
గడ్డవిఱువ-పొలములో మెఱకతీయు
గడ్డారు-గడ్డపాఱ-గడారు, గునపము.
గడ్డాలబాబు-ఋషి, జడదారి.
గడ్డి-కసవు, గాదము, పుల్లు, పూరి.
గడ్డిచుట్ట - నిప్పు చేయుటకై ముందుగా అంటించుటకు చుట్టగా జుట్టిన గడ్డి.
గడ్డిగడ్డిచేయు-పాడుచేయు.
గడ్డితలకాయ-చపలుఁడు, మందబుద్ధి.
గడ్డిగఱచు } చిక్కుఱుపడు, అంచముతిను,
గడ్డితిను } ఓడినట్లు సైఁగచేయు.
గడ్డిదమనము-చోరకము-కితవ.
గడ్డిదుబ్బు-పొట్టకట్ట, గంటకట్ట
గడ్డినూనె-మంటినూనె-కిరసనూనె.
గడ్డిపరక(పోచ)-అల్పతృణము, తృణము వలె నల్పమైన(ది)వాఁడు.
గడ్డిపాము-ఒక జాతిపాము-కట్లెద.
గడ్డిపిట్ట-ఒక జాతిపిట్ట.
గడ్డిపెట్టు-చివాట్లుపెట్టు. [మోపు.
గడ్డిబొద్దు(వ) - చుట్టుకుదురు, గడ్డి(మట్ట)
గడ్డిమొలత్రాడు-మౌంజి.
గడ్డివడ్లు-చామలు-శ్యామాకసస్యము.
గడ్డు - గండః = అధికుఁడు, కష్టమైనది. సాధ్యముకానిది. మిక్కిలి, అధికముగా-గండు, గడుసు.
గడ్డుకొను-పంపుమీఱు, చెలరేఁగు
గడ్డుగ-ఒక విధమైన సుంకము.
గడ్డుతిరుగు-పరిష్కారము కాకుండు.
గడ్డుదంటు-కంకివేయని గొడ్డుదంటు.
గడ్డుమన్నెము-గడుమన్నెము.
గడ్డుఱుకు-పైఁబడు, పాఱిపోవు.
గడ్డువడు-గడ్డుతిరుగు, అడ్డువడు.
గడ్డువమడి-వరిపంట, పల్లపునేల.
గడ్డెవబొ(డ్డి)ద్దు-బాలక్రీడావిశేషము.
గడ్యారము-గడియారము, కాలదర్శిని.
గణగణ-గంటకొట్టుట, చుఱుకుగా మాట్లాడుట అనివాని మ్రోఁత.
గణగణలాడు-గంటమ్రోఁగు.
గణాకు-చుక్కకూర, ఒకజాతి కూరాకు.
గణియము-నటులుతాల్చు అక్కసొమ్ము.
గణిల్లు-ఎద్దుఱంకెవేయుటయందగుఁమ్రోత.

గణుతి-గణితమ్ = ఎన్నిక, స్తుతి
గణుతించు-పొగడు, ఎంచు, లెక్కించు.
గణుతిపేయు-ఎంచు, లెక్కపేయు.
గణు(న్ను)పు-కణుపు, కొడుపు, గంటు.
గణుసుగడ్డ-చిలగడదుంప.
గణెము-చూ. గణియము.
గతపడు-చచ్చు, గంతుకొను, ప్రాప్తించు.
గతుకు - నాకిత్రాగు, ఎంగిలితిను, గోయి-
రూ. గదుకు-కతుకు.
గతుకులుపడు-ఎగుడు దిగుడగు.
గతుక్కుమను-బెదరుచే గుండెజాఱు, చచ్చు
గత్త(ము)-ఎరువు, గొఱ్ఱెపెంట.
గత్తర - గలబా, దోపిడి, గాబరా, కలరా,
అమ్మవారిజాతర, రట్టు.
గత్తరపడు-చెదరిపోవు, బెదరు.
గత్తు-ఉచ్చకంపు, బెదరింపు, దిటవు.
గదగలమ్మ-గవదలు వాచెడు అంటువ్యాధి·
గదమాయించు-గద్దించు, గదుము.
గది-ఇంటిలోపలి అఱ, ఓవరి-అఱ.
గదిగె-ఒపికట్టు, గది(గొట్టు)కల.
గదిరి(ద్ది)ంచు-బెదరించి గట్టిగా మాట్లాడు.
గదరు-కంపు, చెడువాసన-గబ్బు, గౌలు
గదుకు-గతుకు, కతుకు, చప్పరించు.
గదుగుడు-జారుడు, జరుగుడు.
గదుము-గద్దించు, నెట్టు, బొప్పి.
గదుముకొను-ఉఱుము, బెదరించు.
గదురు-చెడుకంపు, పొందు, క్రమ్ముకొను,
పచ్చివాసన కలది
గదురుకొను-చెడుకంపుకొట్టు, క్రమ్ము
గదురుపిల్ల-పదేండ్లలోపు బాలిక.

గదువ-గవ(వు)ద, గద్దవ, చెంపక్రిందిచోటు.
గద్ద-గృధ్ర = గరుడపక్షి-గ్రద్ద, గ్రెద్ద.
గద్దకాఁడు-గడుసరి, పరాసు, నేర్పరి.
గద్దగోరు-గృధ్రఖురః-దొంగల పనిముట్టు·
ఒకానొక గొండ్లెము, ఒక దినుసుచెట్టు,
తాళపుచెవుల గుత్తి.
గద్దన-అద(ద)లింపు, గద్దింపు.
గద్దముక్కుఁవాడు-ఖరణసుఁడు.
గద్దఱి-నేర్పుకత్తె, పొగరుబోతు, దిట్ట.
గద్దఱించు-గద్దించు, గదుము.
గద్దఱికాఁడు-గద్దఱి, గడుసు, గరాసు, గుండా
గద్దఱితనము-నేర్పు, పొగరు.
గద్దవ-చెంపక్రిందిభాగము-గవుద.
గద్దించు-గదుము, గదమాయించు.
గద్దింపు-గదమాయింపు-గద్దన.
గద్దిగ-గద్దెపై పఱచు కంబళి.
గద్దియ - గద్య = సింహాసనము, పూవుల
లోని దుద్దు, పీఁట, వరహా, పోదె, గద్దె.
గద్దువ-గండ = గడ్డము-గౌద, చిబుకము.
గద్దె-గద్దియ, ఎఱుక, వరహా.
గద్దెకాళ్లది-పందెపు కోడిపుంజు-అరజుట్టు.
గద్దెనగరులు-శైవులుతాల్చు లింగకాయ.
గద్దెపొంకములు - తలకుమించిన డాబులు,
పరువునకుఁ దగినమాట.
గద్దెము-గద్యాణమ్ = వరహా.
గధిక - గాంధికః = సుగంధ ద్రవ్యము
అమ్మువాఁడు. [కరణము, కాంతి·
గనగన-తపించుట మండుటయొక్క అను
గనగనలాడు-గనగన మండు.
గనప-పెద్ద, గజ, గఱువ, గంగ.

గనపర-కరవీర = గన్నేరు-గనిమెర.
గనపరాతులు-గన్నేరాకులవంటిముల్లులు.
గనమ-పంట(చిన్న)కాలువ.
గనము-ఘనమ్ = గొప్ప, దొడ్డ, పెను.
గనయము-పోఁకముడి, వింటికొప్పు.
గని - ఖని = వంశము,ఆకరము,చిల్లి,గడ్డ.
గనికట్టు-మూర్దకట్టు, గడ్డకట్టు.
గనికెకుండలు-బాలక్రీడావిశేషము.
గనికెపురుగు - కణుపులలో పుట్టి జొన్న చెఱకు మున్నగువానిని డొల్లచేయు పురుగు
గని(మ-మి)మె } గట్టు, పొలము (చెరువు)
గనిమారు } కట్ట'గనె(ను)ము,గెణెము.
గనిమెర-గన్నేరు-గనపర +
గనియ(నె)-కణిక = గంట్ర, తునుక.
గనివోటు-గుర్తుకై తాతిపై వేయు పోటు.
గనీబు-తలగడ(కత్తి)యొఱ-గలీబు.
గనుపు = కణుపు.
గనుము-చూ. గనిమ.
గనుసు(గడ్డ)-గెనుసు
గనెవరము-పొలముచుటును ఎత్తుగా వేసిన గట్టు-పోతుగనెము.
గన్న-అక్కఱ, అవసరము.
గన్ను-ఘనమ్ = సమ్మెట, కనుపు
గన్నెర(రు)-గన్నేరు-కరవీరము +
గన్నెరాకమ్ము } గన్నెరాకువంటి అలుగుగల
గన్నెరాకులు } బాణము-గన్నేరాకులు
గన్నేరు-కణేరువు = గన్నెరు
గపగప = గబగబ, గవగవ.
గపద-చెంప-గవుద, గౌద.
గప్పళించు-పీల్చు-ఇంకు.
గప్పాలు-గల్బ = గొప్పలు-డప్పాలు.
గప్పాలుకొట్టు-కోఁతలు కోయు.
గప్పు-గుప్పున వాసన కొట్టుట.
గప్పున-వెంటనే, గమ్మున-గుప్పున.
గప్పుళించు-పీల్చు, ఆను, త్రాగు.
గబగబ-పరుగుయొక్క అనుకరణము.
గబగబలాడు-తొందరపడు.
గబా(లు)న-వెంటనే, గమ్మున, గబాల్న.
గబిల్లను = గబీలుమను.
గబీలు-గ్రుద్దుట, ఒక అనుకరణము.
గబీలున = గబాలున [బాధకలుగు.
గబీలుమను - మండినట్లగు, ఒక్కసారిగా
గబుకు(క్కు)-ఉఱుకుట,గ్రుద్దుట,మఱదుట మున్నగువాని అనుకరణము
గబుక్కున-గబా(లు)న-గబీలున.
గబుసు } కిటుకు, మోసము, డబ్బు, గబ్బి,
గబ్బ } గజను, గౌరు.
గబ్బగీము-కారుచీఁకటి, కటికచీఁకటి.
గబేలున-గబుక్కున, గబాలున, త్వరగా.
గబ్బరించు-గబగబ చప్పుడుచేయు, గర్జించు
గబ్బాటు-కిటుకు, డాబు, కలఁత, చవుక.
గబ్బి-గర్వి = నిక్కిన(డి)వాఁడు, కిటుకు, మోసము, డాబు, గబ్బ, గబుసు.
గబ్బిడము } గబ్బిలము. తలక్రిందుగా
గబ్బిడా-(యి) } వ్రేలాడు ఒక పక్షి, చపల బుద్ధిగలవ్యక్తి-గబ్బిరాయి, గబ్బిలాయి.
గబ్బిమీఱు-గర్వ మతిశయించు.
గబ్బిరాయి-గబ్బిడాయి, గబ్బిలాయి.
గబ్బిరి(లి)-పిడికిలి-ముష్టి, గుప్పిలి.
గబ్బి(లము)లాయి-గబ్బిడము, గబ్బిడాయి

గబ్బివాఁడు-కొంటెవాఁడు, కపటి-గర్వి.
గబ్బు-గర్వ = గెబ్బు-పొగరు, చెడుకంపు, మురికి, బెడగువ్వ, దట్టము, గట్టి, ఒక జాతి కలుపు మొక్క.
గబ్బుకొను-వాసనకొట్టు.
గబ్బుగడుగు-అవమానించు.
గబ్బుచీఁకటి-కటికి చీఁకటి-చిమ్మచీఁకటి.
గబ్బుచెంక(ప)మెకము-మదగంధము గల చెక్కిలి గలది = ఏనుఁగు-అత్తి.
గబ్బుదేఱు-కంపుకొట్టు, మత్తిల్లు
గబ్బునూనె-మట్టినూనె-కిరసనాయిలు.
గబ్బు(పు)లుఁగు-గంపపులుగు-శకునపక్షి.
గబ్బుమీఱు-కంపుకొట్టు, దట్టమగు
గబ్బులేచు-అల్లరిపాలగు, సంగతిబైటపడు
గబ్బువలఁచు-మాంసగంధమువేయు.
గబ్బెక్కు-కంపుకొట్టు, దట్టమగు.
గభిల్లున } అరాత్తుగా దూఁకునప్పటి ధ్వనికి
గభీలున } అనుకరణము.
గభేలుమను-ఎక్కువ అదరు-గుభేలుమను
గభాగాల-గర్భాగారః = పడకగది.
గమకము-పూనిక, నేర్పు, పుష్టి, ఇంపైన, ఎక్కువైన, లావైన.
గమకముగొను } పూను, తలఁచు, అదలించు.
గమకించు }
గమకింపు-అదలింపు, పూనిక.
గమగమ-సువాసన, పరిమళించుట కోపించుట యందగు అనుకరణము.
గమగమలాడు } గమగమయనివాసనకొట్టు.
గమగమించు }
గమనిక-విధము, రీతి, సూచన.

గమళ్లవాఁడు-క్షత్రియ స్త్రీయందు శూద్రునకుఁ బుట్టినవాఁడు-కల్లుగీఁతకాఁడు, ఈడిగ(గవుండ్ల)వాఁడు.
గమాయించు-వాసనకొట్టు-గమగమించు-గుమాయించు. [తఱుము.
గమి-గుంపు, గుమి-గుమురు-గుబురు;
గమికత్తె-అంతఃపురదాసి.
గమికాఁడు-అంతిపురపు కావలివాఁడు, దళవాయి, కన్నాకు, కాకి, ఏలిక.
గమికాండ్రు-అధికారులు [కొట్టు.
గమికీలుకొట్టు-పిల్లిగింతలుకొట్టు, బడాయి
గమి(గూడు)గొను-ప్రోగుపడు, గుంపగు.
గమిడిగేదె-ఱంగిడిగేదె-గొడిగేదె.
గమియించు-పోవు-గమించు. [పోఁగొట్టు.
గమియు-దట్టమగు, అణఁచు, అందిచ్చు.
గములుకొను } గుంపు(కూడు)గొను.
గములుగట్టు }
గమ్మత్తు-వేడుక, ఆనందము, నేర్పు.
గమ్మత్తుచేయు-వినోదము కలిగించు.
గమ్మను-వాసనకొట్టు-గమ్ముమను.
గమ్మము-ఘర్మః = చెమట-స్వేదము.
గమ్ము-గ్రుద్దులాట, వాసనకొట్టుట యందలి అనుకరణము.
గమ్మున-ఒక్కసారిగా, వెంటనే.
గయగొట్టు-చచ్చు, మరణించు.
గయాలి-లు = బీడుపడిన నేల, దొరతనము వారి అధీనమున నుండెడు భూమి.
గయాళము-ధిక్కారము, నిందావాక్యము.
గయాళి - గయ్యాళి-జాగ, వదరుబోతు-
గయా(య్యా)ళించు-అఱచు, ఉద్ధతిచూపు.

గయా(య్యా)ళు - సేద్యము చేయఁదగని పొలము-బీడు, బీటినేల.

గయావళి - గయాక్షేత్రమువద్ద స్నానము చేయించు పండా బ్రాహ్మణుఁడు.

గలు-గుంట, వెదురుబొంగు, గౌరవము,

గయిరమ్మ - గౌరీ = గౌరమ్మ, గైరమ్మ, గవురమ్మ. [దారి-గైసు.

గయిసు - పొలము కంచెకు ఏర్పాటుచేసిన

గయ్యాళము-గయాళము.

గయ్యాళి-గయాళి, ధూర్తురాలు, జాగ.

గరంచె-గరిఁచె, గంచె, ఇనుపతెడ్డు.

గరండాలు-వంతెన, ఇనుపదూలాలు.

గర-గడ్డ, ముద్ద.

గరకట్టు / గరకొను } గడ్డకట్టు, ముద్దకట్టు-గనికట్టు.

గరకట్టు(కొలు)-గడ్డకట్టుకొను.

గరకసా-ఖర్ఖటా, తగవులాట, దావా.

గరగ-కరక = అమ్మవారి ఘటము, కుండ, కల్లుపాత్ర, రూ. గరి(గ)గె.

గరగడ-గల్లా-యి, గరా(టా)టు.

గరగడము-ధాన్యరాశి చుట్టుగీచిన గీఁతపై పోసిన పేడనీళ్లు. [బాగైన,

గరగర-కాంతి, జిగి, చక్కనైన, నునుపైన

గరగరనివాఁడు-చక్కని(మన్నని)వాఁడు.

గరగరలాడు-శోభిల్లు, అందగిల్లు.

గరగరి-పింజపింజ-గరాగరి.

గరగరిక - అందము, శుచి, నగ, నేర్పు, రీతి, పింగారము-గరాగరిక. [తెచ్చువారు.

గరగలవారు - అభిషేకమునకై గరగలు

గరగు-లోయ, ఎఱ్ఱమన్ను, ఒకచెట్టు,

గరజు-కార్యమ్, పని-అక్కఱ-గరుజు.

గరడి - సాముకూటము - గరిడి - డీ. సమీపము, చోటు

గరపనాగల్లి-మెట్టనేల దున్ను నాఁగలి.

గర(రు)పనేల-గులకరాళ్లుగల మెటక

గరయ-లోహపుబిందె, [బచ్చెనపని.

గరలమురుపులు-కుమ్మరి కుండలపై చేయు

గరవడ(ళ)ము-ఒకానొక జెట్టిపెనకువ

గరవడు-గడ్డకట్టు, ముద్దకట్టు.

గరవన-ఘర్షణ = పోట్లాట.

గరాగరిక = గరగరిక, చక్కఁదనము.

గరాకు-వరిపైరుయొక్క కొనయాకు.

గరాటా / గరాటు } వడపోయుగాజుపనిముట్టు-గల్లా, కువ్వెన.

గరాసు-కర్కశః-తులువ, చెనఁటి, గడుసు

గరాసులు = రక్కసులు-పొలదిండ్లు.

గరి-ఎక్కువ, పచ్చని పైరు, యుద్ధసన్నాహ వాద్యము,

గరించె / గరిఁచె } లోహపుతెడ్డు - కంబి. గంచె - గరిఁటియ

గరిఁచెకామ-ఒకదినుసు ఓషధి.

గరికసూదులు-ఒక దినుసు వడ్లు.

గరికెసన్నాలు-గరికెవడ్లు.

గరిగ-గె = గరగ, కుండ, చందనపుబుడ్డి.

గరిగొను-అల్లుకొను, పెంపొందు,

గరిడి = గరడి, గరిడీ, తావు, చోటు.

గరిడికెక్కు-ఆరితేఱు, నేర్పరియగు.

గరిడిముచ్చు-ఆరితేఱిన దొంగ, గడిముచ్చు.

గరిడియ-డీ = చూ. గరిడి.

గరిడీసాల-తాలింఖానా, సాముచేసెడియిల్లు

గరిత(ర్త)-గృహస్థా = గేస్తురాలు-ఇల్లాలు
గరిపడు-కలియఁబడు-డీకొను.
గరిమ-ము = రీతి, పగిది, పోల్కి
గరిమకొప్పనివారు-కానివారు.
గరిమిడి-గఱిక, కొక్కు, వెల్ల మెఱక.
గరిమిడికొక్కు-పందికొక్కు.
గరియ-గరుగు +, ములుగ +.
గరివడి(డెము) / గరివడియ } ఖాదిరవటకము.
గరివించు-గర్వపడు నిక్కు, టెక్కుచూపు.
గరిసించు-అతిశయించు, జయించు.
గరి(సియ)సె-గంజః = గాదె, పాఱక, 600 తుంచములు, మూఁడు పుట్లు కొలఁది.
గరిసెన-ఒక దినుసు భక్ష్యము.
గరిసెబావి-ఒక రకము నూయి.
గరిసెవిల్లు-వడ్లకొట్టు, గాదె.
గరీబు-పేద, ఒకజాతి తురక, పరాయి.
గరు-గగుర్పాటు, గురుః = పెద్దలు.
గరుకు-పైరు పొట్టవేయుటకు ముందఱిదశ
గరుగు-గులకఱాతినేల-మెఱక.
గరుజే-ఆక్కఱ, అగత్యము
గరుజుపట్టు-అక్కఱపడు.
గరు(డా)టా(ల)మంతుఁడు-గరుడుఁడు
గరుటి-గరుడి, గరుత్మంతుఁడు.
గరుడ-గారుడమ్ = గరుడపచ్చ.
గరుడఁడు-అరజుట్టు, ఒకపందెపుకోడి.
గరుడకంబము-ధ్వజస్తంభము.
గరుడసరులు-ఒక దినుసు వడ్లు,
గరుడి-గరుత్మాన్ = గరుడుఁడు.
గరుడిరవుతు / గరుడిరౌతు } గరుడధ్వజుఁడు-పెరుమాళ్లు

గరుదాల్చు-గగుర్పొడుచు
గరుదాల్పు-గగుర్పాటు, పులకలు, గగురు.
గరుపాటు = గగురుపాటు, గరుపొడుపు.
గరుపాటుమొన-పందిమూతి, ముట్టె.
గరుపాఱు / గరుపొడుచు } గగుర్పొడుచు, మీఁదికి తూఱిపడు.
గరు(ము)బు - గరపనేల, గరు(గు)వు, గరుసు, వెడఁద,* విరివి.
గరువ(తన)ము-గొప్పతనము, విరివి, విస్తరించినది-గర్వః = టెక్కు, నిక్కు.
గరువు = గరుగు, గరు(బు)ము, గర్వము.
గరువుసెలక-మెఱక పొలము.
గరుసు-గడి, మేర, ఎల్ల, గట్టు, తోలు. గరువు.
గరుసెక్కు-పొంగు, హద్దుమీఱు.
గర్పాడు = గర్వాడు-తిండితిను.
గర్భదులు-గర్భర్తుః - పుష్యములో వచ్చు జంటకార్తెలు, ఓదెలతడుపులు.
గర్వాడు-మేయు, మేపుమేయు-గర్పాడు.
గర్ప-గరిశె, గులకఱాతి నల్లనేల.
గర్పు = చూ. రూ. గరుసు.
గర్పె-గరుసుభూమి-ఖరభూమి.
గఱకట్టు / గఱకొను } నెత్తురు గడ్డకట్టు-గఱకు, కఱకు.
గఱగఱ-భక్ష్యములు నమలుట, గఱుకు వస్తువులుతాకుట యందగు మ్రోఁత, గడుసు.
గఱగఱలాడు-గఱగఱ అని మ్రోఁగు.
గఱగొఱ-లోటు, కొఱఁత, కొఱ.
గఱవడు-నెత్తురు గడ్డకట్టు.
గఱి-గరుత్ = బాణపుటెక్క, పక్షియాఁక, తాటికమ్మ, గఱుకుఁదనము, గఱుకైనడి.

గఱిఁటె-గంటె.

గఱిక(కె)-దూర్వ + గఱికె + ,గరిమిడి +

గఱికపూజలమెచ్చు గబ్బివేల్పు - గణపతి.

గఱికచె(క్క)క్క } పచ్చికపెల్ల, పచ్చిక
గఱికమోడిచెక్క } తోఁ గూడిన మట్టిపెల్ల

గఱికమ్మి-గఱిబద్ద-గఱిగమ్మ.

గఱికసన్నాలు } సన్నజాతివడ్లు-కల మోత్త
గఱికసూదులు } మము +

గఱికొను-పదునెక్కు, బిరుసెక్కు, తగు లొక్కొను, పెంపెక్కు.

గఱిగమ్మ-గఱుకైన తాటికమ్మ.

గఱిచిప్ప-ముత్తెపుచిప్ప-శుక్తి, సీపి.

గఱిచిలుకు-ఱెక్కలు కట్టిన బాణము.

గఱిపడు-కఱకుపాఱు, పగపూను, పట్టుదల వహించు.

గఱిబద్ద-గఱికమ్మి, గఱుకైన తాటికమ్మ.

గఱియాఁక-పక్షిఱెక్క, ఈఁక.

గఱిపె-గరిసె, కణఁజము. గాదె, పౌఁజక.

గఱుకు - అంపము కొడవలి లోనగువాని కక్కు; గఱగఱకలది-రూక్షము.

గఱుగు-గరియ +, ఒక చెట్టు.

గఱువ - గురుః = పెద్ద, గారవము కలది. ప్రౌఢయైనది,గంభీరమైనది,గొప్పవాఁడు, దండి-దొడ్డ-దొడ్డు.

గఱువునేల-ఇసుకనేల.

గఱువు-ఘనః = పెద్దది. గొప్ప(వాఁడు)

గఱుసుదే(మీ)ఱు - కఱకుఁదనముచెందు.

గఱ్ఱు-గర్వము, పొగరు, అదటు.

గఱ్ఱు-త్రేఁచుటయందగు మ్రోఁత.

గఱ్ఱి-వేఁపఁజపట్టెడు ఒక పనిముట్టు.

గల = గలగల. [గర(రి)గ. గరిగె.

గలఁతి(య)తె-గలంతికా = చెంబు-గిండి -

గలగండపక్షి-మర్కటము.

గలగర - గుంటకలగర, గుంటగలిజేరు.

గలగరించు-బాగుగ కలుపు, రంగరించు

గలగల-నగలు చెట్ల ఆకులు కదలుటయం దగు మ్రోఁత. [పోవు, కలహించు.

గలగలలాడు - గింజలు ధ్వనిచేయు, నీటు

గల(లి)జేర } గలిజేరు + పునర్నవ +
గల(లి)జే(జె)రు }

గలతరించు-ఒడలు జల్లుమను.

గలదము-సామాన్యగంధము.

గలపరించు-గగుర్పొడుచు.

గలపడింపు - అప్రయోజకుఁడు, అంబేద. ఎంబెన్న. ఈబరి, దూబ. వ్రాజె.

గలబ(బా)-గలభా = అల్లరి, దుండగము. జగడము-కలఁత, రూ. గల్బా.

గలబరించు-నీళ్లు కలపెట్టు. డోఁకువచ్చు. కలఁగు, పుక్కిలించు

గలబాచేయు-అల్లరిచేయు, పాడుచేయు.

గలబెల-రొద, సందడి, దొమ్మి.

గలన(నేల)-మెట్టపొలము-గరువు.

గలహా-గర్హా-తృణీకారము,రోఁత. [రింపు

గలాటా-గోల, అల్లరి, అంటువ్యాధి విస్త

గలామ-కళ్లెము-ఖలీనము. [పాడుచేయు.

గలాయించు - దొంగిలించు, కరగించు,

గలినేల-చిగురుగానుండు గట్టినేల.

గలిబిలి-గలబెల, గంద్రగోళము.

గలిబిలిసేయు-అల్లరిచేయు, కలఁచు, నలు గుడుపెట్టు-గజిబిజిసేయు.

గలీ(లే)బు } తలగడ (పఱుపు) తొడుగు,
గలేబ } కత్తియొఱ-గనీబు.

గ(లుమ)ల్మ-వేణౌకమడికి నీళ్లుపోవుదోవ.

గలువరించు-నీళ్లుపోసి దేవు.

గలుసు-గులకరాతి నేల-గలస.

గల్లి-మాదిగవాని చట్టి. మంచిగింజలప్రోగు, పొల్లు. గల్లా, డబ్బులపెట్టె.

గల్లంతుచేయు-అల్లరిచేయు, కాఁజేయు.

గల్లంతు } అల్లరి, గత్తర - గంద్రగోళము.
గల్లత్తు }

గల్లాకొలుపు-ధాన్యమమ్మ.

గల్లాపెట్టె-అంగడిలోని అమ్మకపు డబ్బు ఉంచుకొను పెట్టె. [యిచ్చిన కౌలు.

గల్లామత్త(త్తా)-రైతు ఈనాందారుకు వ్రాసి

గల్లీ-ఇఱుకుసందు-క్రంత, కంత.

గల్లు(రు)-నగల మ్రోఁత-ఘల్లు.

గల్లుగల్లుమను-నగలు ఘల్లుమని మ్రోగు.

గల్లురుమను = గల్లుగల్లుమను.

గవఁకు } కోటవాకిలి - గోపురము - గవను,
గవక } గవుకు, గవిని.

గవగవ = గపగప, గబగబ, గమ్మన.

గవటము-గ్రామకరః = గ్రామస్థుల ఉమ్మడి నేల-గావుటా-ను.

గవతము-గడ్డి-కసవు-గాదము.

గవ్వాట్లాడు-పవిలేక తిరుగు.

గవద-చెవి క్రిందిభాగము, గాలిబిళ్ళ,గౌద.

గవదలమ్మ-చూ. గదగలమ్మ.

గవని(ను) = గవఁకు కోటవాకిలి.

గవని(ను)కాపరి-కోటవాకిలి, కాపరి.

గవు[illegible]-గౌర = కొంచెమెఱుపు, [illegible] పోచిక, ఒక జాతివాఁడు, కొంచెమెఱ్ఱనిది

గవరన-కొలఁది యెఱుపు, ఎఱ.

గవాటా-గలాటా, అంటువ్యాధి ప్రబలుట.

గవలవాఁడు = గమళ్ళవాఁడు, ఈడిగ.

గవురమ్మ-పార్వతి-గైరమ్మ. గౌరమ్మ.

గవాళము-నగలపెట్టె, దేవతార్చన పేటిక. తోలుసంచి.

గవాసిలి-కిటికీ-పోరణగండ్లు-గవాక్షము.

గవి-గహ్వరః = గుహ, గుంట-గయి.

గవిని = కోట ముఖద్వారము, ఊరి వీధి చివర-రూ. గవిడి.

గవియ-నాగవల్లి సిదత.

గవిరి-గౌరీదేవి, పార్వతి.

గవిల(లె)-కపిలా = పుల్లావు, కపిలగోవు.

గవిలెములు-ఒకదినుసు పరిమళ బీజములు.

గవిసె-గాదె-పౌణక-గరిసె.

గవిసెన - గవుసెన, గౌసెన, గలీబు.

గవుండ్లవాఁడు-గోండ = సారా అమ్ము వాఁడు-గౌండ్లవాఁడు, గమళ్లవాఁడు.

గవుఁడు-గమళ్ళ (గౌండ్ల) వాఁడు.

గవుకు-కోటవాకిలి-గవ(ఁకు)ను.

గవుకు(క్కు)న-తొందరగా-గబుక్కున.

గవుడపేరు } చెంపసరులు. చెంపకల్లీలు.
గవుడసరము } గౌదసరము.

గవుడ-గడ్డము, చెంప, చెక్కిలి-గద్దుప-రూ. గవద-గౌద.

గవుదకట్టు-చెంపలను మూసి కట్టిన కట్టు.

గవుర-వర్తకుఁడు-బేహారి-రూ. గౌర.

గవురు-ఎన్ను, దాకా, మోసము-రూ. గౌరు.

గవులు-వాసిన. చెముకంప్ప-రూ. గౌలు

గవుసు-తా [illegible]

గవుసుపోవు-తాలుగింజపడు-గౌసుపోవు.
గవుసెన-కోశః = గలీబు. తొడుగు, ఎద్దు మూఁపుమీఁది చిత్రవస్త్రము-గౌసెన.
గవ్వ(లి)శి-బల్లి-గౌడలి-గౌశి.
గవ్వ-ఒకానొక పురుగుచిప్ప. వరాటిక, గుల్ల, గులక, ఒక చిన్న నాణెము.
గవ్వచుక్క-పశువు నొసటిమీఁది మచ్చ.
గవ్వచౌకము-నాల్గుగవ్వలు, వెలిగారము.
గవ్వము-ఒకక్షుద్ర జలచరము.
గవ్వసరులు-ఒక దినుసు వడ్లు.
గస-కాసః = ఉబ్బసము-వగర్పు
గసగస(సా)లు-గసక = నల్లమందు విత్తులు-ఖసఖస.
గసాబు-తుపాకి, ఫిరంగి మొ॥
గసాలు = గసగసలు. [నూనె(నేతి)మడ్డి.
గసి-గశిక = మేకు, ఒకవేఁట పనిముట్టు.
గసిక-కొయ్య + మేకు, శూలము
గసి(కి)గిపోవు-తెలియకుండా తగ్గిపోవు.
గసిబిసి = గజిబిజి.
గసిబిసిచేయు } కలఁతపెట్టు, తాఱుమాఱు
గసిమసిచేయు } చేయు.
గసిరా-పగడము, మెఱుఁగురిక్క
గసుకు-గెంటు, కదలియాడు.
గస్తాలు-మల్లవిద్యలోని కొన్నిపరుసలు.
గస్తీ-వేగుఁజరాత్రులందు కావలియుండుట
గస్తీలు-కావలివాండ్రు-తలారులు.
గస్తు-రాత్రి కావలి, చెడుకంపు.
గళకత్తెర-జెట్టి పెనఁకువలలో నొక తెగ.
గళ్ళ-కళ్లెము-కళ్ళ, తోలునానవేయుపాత్ర.
గళ్లుగళ్లు-గజ్జెలచప్పుడు-ఒకఅనుకరణము.
గళ్లుబాళ్లుచిక్కు-పొలిమేరలతోసహా లోఁబడు
గళ్లుపడు-చెవులు అరాత్తుగా వినపడకపోవు
గళ్లెము-లేఁతకొబ్బరిగుంజు, కుడక.
గా-మహద్వాచకముతోగూడి నీచత్వమిత్రత్వములు దెలుపును - ఉ॥ సోమిగా.
గాంగేరు-జిబిడిక-దండ +
గాంజ-కలంజః = గంజాయి, బంగి.
గాండ్ర-కాండ్రుమను చప్పుడు.
గాండ్రించు-పెద్దగా అఱచు, పడిసెముచే మొగముబ్బు.పులిగోండ్రించు-గాఁడించు.
గాండ్రు-పులియఱపు-కాండ్రు.
గాండ్రుపెట్టు-గాండ్రుమను-గోలురించు,
గాండ్ల-తెలికజాతి; గాండ్లది-తెలికలది.
గాండ్లవాఁడు-తెలికలవాఁడు, గాళ్ళవాఁడు.
గాఁదారి-నోరుగల (జగడమాడు) స్త్రీ
గాఁపెర-కలంజః = పొగాకు; గృంజన-ఎఱ్ఱముల్లంగిదుంప, గాఁజరగడ. [పల్లము.
గాఁడి-జాతితొట్టె. బండి, నిడుపుగాత్రవ్విన
గాఁడికళ్ళము-వరికుప్పవద్ద కుప్పమార్పుకై చదను చేసిన నేల - గూడు కళ్లము,
గాఁడిగడుగు-సంచయనముచేయు.
గాఁడిపండుగ-పశురోగనివారణకై రైతులు చేసెడి ఉత్సవము.
గాఁడిపొయి-గాఁడిగాత్రవ్వినవంటపొయ్యి
గాఁడు-దురద, మదము. గుదము, నీచార్ధకము, గ్రుచ్చు, నాటు.
గాగర(రా)-పరికిణీ-పావడ.
గాఁజర } దుంపమూలము, కశంజము,
గా(జియ)జె } గంజః = పొణక-గాదె.
గాజేరుదుంప-గృంజనమ్ = గజీడము.

గాజుపరుచే-కత్తిపిడి-త్సరువు.

గాజు-కాచః = ఒక దినుసు మన్ను. కంక ణము, చేతికడియము. ఇనుపకట్టు.

గాజుకడియములు } ఒక దినుసు వడ్లు.
గాజుకప్పెరలు }

గాజుకాయ-సీసా-గాజుబుడ్డి.

గాజుకుప్పె } కాచకూపి = గాజుగిన్నె-
గాజుకొప్పెర } కుహనము.

గాజుపండ్లు-పెద్దకొసర-ఫలాగ్లు +

గాజుపడు-కాంతితగ్గు, గాజువాఱు.

గాజుప్పు-గాజువండగావచ్చిన మడ్డి-కాచము

గాజురాయి-కాచమణి = హలాకు.

గాజురొయ్య-పెద్దరొయ్యచేఁప.

గాజులగాఁడు-ఒక పందెపు కోడిపుంజు.

గాజులు-మురుగులు, ఒత్తులు, తోడాలు.

గాజులబలిజె } గాజుసామగ్రి తయారుచేసి
గాజులవాఁడు } అమ్మెడువాఁడు.

గాజువాఱు-వన్నెచెడు, కాంతితగ్గు.

గాఢము-గాఢమ్ = ఎక్కువ, దట్టము, గుబురు, గుమురు. [గడించు.

గాటాలుపడు - కష్టములచే అనుభవము

గాటు-కటు = కారము, ఘాటు, తీవ్రవాసన

గాజంగి-జపావృక్షవిశేషము.

గాటిబిగువు-స్థానబలము.

గాటిలు-చచ్చు, ఇలుగు

గాడవాలు-ఒక విధమైన పొద.

గాడా-కోట, చోటు.

గాడిగడగు-కడతేర్చు, సంచయనముచేయు

గాడి-గాఢమ్ = గాటము-బండి-గాడీ,పశువ లకు పీరు(గడ్డి)నిల్వచేయుతొట్టి. కోనేటి

గాడించు = గాండ్రించు. [ఖరము.

గాడిద-గా(గ)ర్దభ = గాలిగాఁడు-గాడ్ద-

గాడిదకాళ్లవాఁడు-ముడికాళ్ళవాఁడు.

గాడిదగడప(ర) - పిండీతకము-బస్తాంద్రి.

గాడిదగత్తర = గాడిదల గోల.

గాడిదగుడ్డు-హుళక్కి-శూన్యము.

గాడిదగ్రుడ్లు-ఖరనందన సంవత్సరములు

గాడిదపులి-దమ్ములగొండి.కొర్నవగండు.

గాడిదీయు-లోఁతుగుంట తీయు.

గాడిపట్టు-నివాసస్థలము, కొట్టము.

గాడిదె-గాడిద, గాడ్ద, గాలిగాఁడు.

గాడిదెకాళ్లవాఁడు-ముట్టుమోకాళ్లవాఁడు.

గాడిపాడు-ఆరున తొలిచిన గాడి.

గాడిబండి-ఒంటినొగ(పోలుగట్టు)బండి.

గాడీ-గాడి కొలారుబండి.

గాదు-పిట్ట, చేటు, హాని, నాటు, పొగరు.

గాదుపు(డ్పు) - గాలి, ఒక పశురోగము, గాలిరోగము, కలరా.

గాదుపు(డ్పు)కొడుకు- } హనుమంతుఁడు.
గాదుపు(డ్పు)పట్టము } భీముఁడు. అగ్ని-
గాదుపు(డ్పు)చూలి-లు } వాయుసఖుఁడు.

గాదుపు(డ్పు)చెలికొడుకు- కుమారస్వామి.

గాదుపు(డ్పు)టరడపుదొర-మన్మథుఁడు.

గాదుపు(డ్పు)తండ్రి-ఆకాశము-గాలితండ్రి

గాదుపు(డ్పు)తూపు-వాయవ్యాస్త్రము.

గాదుపు(డ్పు)నెచ్చెలి-అగ్ని = గాడ్పుచెలి.

గాదుపు(డ్పు)పట్టి } అంజనేయుఁడు.
గాదుపు(డ్పు)బిడ్డఁడు } భీముఁడు.

గాదుపు(డ్పు)మేపరి-పాము-వాతాశి.

గాదుపు(డ్పు)సంగడీఁడు-అగ్ని-అంజనిశేజె

గాడుపు(డ్పు)దిండి-పాము-వాతాశనము.
గాడుపు(గ్పు)దిండిమ లికి-నాగాస్త్రము.
గాడెము-నీళ్లు తోడెడు తాటిదోనె,బండిదారి.
గాడెమువడు-బండిదారి యేర్పడు.
గాణ-గాయన = పాట(కత్తె)కాఁడు.
గాణతనము-గాయకత్వము
గాణి(ణీ)-గాయని = పాటకత్తె; గానుగ.
గాణు-హాని, చేటు, కీడు-గాడు.
గాణుఁడు-గాయనః = పాటకాఁడు, గాణ
గాత - ఘాతః — దెబ్బ, గొడవ, సంగతి-
గాధా = కథ, ఆశీరర్థకము. [పల్లము,
గాత(తా)ము - ఖాతమ్ = గోయి, గుంత,
గాతముతీయు-గుంటచేయు.
గాతి-ఘాతిః = దెబ్బ, ఖాదిలి = గ్రాసము
గాతిగొను-కొట్టు-ప్రహరించు.
గాతు-ప్రేల్చుట, గద్దింపు, దిట్టతనము.
గాతుకలఁగు-ప్రేలు, పగులు, వీడ్వడు.
గాతుగా-తప్పక, విడువక.
గాతుగావించు-ప్రేల్చు, పగుల్చు
గాత్రము-మెడ, తోరము-వలము.
గాత్రవాలు-మొనగాలు-ఆస్కందితము.
గాద-గడ్డి, బొప్పి, చెమటకాయలు పేలుట,
గాథా = వార్త, కత.
గాతకట్టు-గడ్డకట్టు, గాదము.
గాదము-కలుపుమొక్క, కదుము, గడ్డి.
గాది(య)-గాదె, గాజ, ఔాణక.
గాదిలి-ప్రేమ,పెండ్లాము,చుట్టము,మగఁడు,
అనుఁగు-చెలిమి,నెమ్మి-మక్కువ-ముద్దు.
గాదె-గంజః = ఔాణక. రూ. గాజె.
గాని-కాన, కనుక, అయితే.

గానిగ-గానుఁగ-తైలయంత్రము.
గానిత్యలు-గాణిక్యమ్ = సానులు.
గాను-బండిచక్రము-గాలు.
గానుఁగ-నూనె(చెఱకు)ఆడెడు యంత్రము-
గాన్గ-గానిగ-గానుఁగు. [డు పలక.
గానుగ(న్గ)పట్టె-గానుగాడువ్యక్తి కూర్చుం
గానుఁగ(న్గ)పిండి-తెలికపిండి
గానుఁగ(న్గ)రోఁకలి-గానుగాడెడురోఁకలి
గానుఁగ(న్గ)ఱోలు - గానుగాడెడు కొయ్య
ఱోలు. [వాఁడు.
గానుఁగ(న్గ)వాఁడు-తెలికవాఁడు - గాండ్ల
గానుఁగా(న్గా)డు-నువ్వుల సారముతీయు.
గానుఁగు(న్గు)-గానుఁగ,గానిగ, గా(న్గు)న్గ.
గానుఁగు(న్గు)బిండి-తెలికపిండి.
గానుఁగు(న్గు)లాడు-గానుఁగాడు.
గానుఁగె(న్గె)ద్దు-గానుఁగు త్రిప్పెడు ఎద్దు.
గానువు = గానుఁగు, గానిగ.
గాప(బ)తాడు-మోటబొక్కెనకుఁగట్టినతాడు.
గాబ(ము)-కలుపుగడ్డి, చెవిగూబ.
గాబరా-తొందర, బెదరు, గత్తర.
గాబరాపడు-కంగారుపడు, బెదరు.
గాబాగూబీ-గడబిడ-అల్లరి,గందరగోళము.
గాబారు-గడ్డిపరకలు-గాబు.
గాబు-(కర్పర)కాఁగు, కొప్పెర, బాన,
కలుపుమొక్క, చెత్త, జొన్నపొట్టు
గాబుతొట్టె-నీటి(కాఁగు)తొట్టె.
గాబు(బ)దీయు-కలుపుతీయు.
గామ-ఒక దినుసు చీమ, పల్లె, గ్రామము.
గామడఁచు-గ్రహమావేశించు.
గామము-గ్రామః = ఊరు, పల్లె, కొటిక.

గామిడి-గ్రామణీః = శ్రేష్ఠుఁడు, గయ్యాళి.
గామి(డి)కత్తె-గయ్యాళి-జాగ. [పెద్ద.
గామి(డి)కాఁడు-శ్రేష్ఠుఁడు, పందులమంద
గాముఁడు - గ్రామీణుఁడు, శూద్రపురుష నామాంత్యపదము.
గాముండి-గ్రామాధికారి, గావుణ్డి.
గాము-గ్రహః = రాక్షసుఁడు, గ్రహము, దయ్యము, తాపము, విరహబాధ.
గాముకోసు - ఊరుచుట్టుకోట, మాయ, మోసము, మోహము.
గాముగానాలు-గ్రామవారి లెక్కలు.
గాముగొను-తపించు, కాఁతియపడు.
గాము లదొర-శివుఁడు-ఘాతేశుఁడు [రాజు.
గాముల(మేటి)ఱేఁడు - సూర్యుఁడు-గ్రహ
గాములతేనిపట్టి-శని. [ఇష్టము.
గాయకము-గిరాకీ, పిరిము, కిటుకు,మాయ,
గాయకుఁడు-గ్రాహకః = నేర్పరి.
గాయపడు-దెబ్బతిను, బాధనొందు.
గాయపాకు-గాయము మాన్పెడు ఆకు.
గాయపెట్టు-నొప్పించు, పెద్ద కేకవేయు.
గాయము-దెబ్బ-నలుసు, పుండు, కడి.
గాయి- అల్లరి-అలుపు-గోల.
గాయిణి-గాయినీ = పాటకత్తె.
గాయమానము-నలుకుపరువడి, విసరు.
గార - క్షారః = సున్నము, గచ్చు, మరక, దంతదోషము, పట్టు, ఇంగుది +, గార గింజము, ఒక దినుసుచేప.
గారకాఁడు-సున్నపుపనివాఁడు- కూసరి.
గారకాయ-ఇంగుదీఫలము, ఒక బాణసంచు,
గారకాళ్లు - బొట్టెలు మొదలగు జంతువుల ముంగాళ్లు. [రము +
గారచెట్టు-గౌరత్వక్ = ఇంగుది +. అంగా
గారచేయు-గచ్చుచేయు, గారపూయు.
గారడము | విషమంత్రము, మాయ, ఎగతాళి
గారడి | దబ్బర, కికురింత, ఆట.
గారడివాఁడు-పాములవాఁడు, మోసగాఁడు.
గారిడి-గారుడమ్ = మాయ, గారడము.
గారడీఁడు-గారడివాఁడు-దుడిమిగాఁడు
గారనూనె-ఇంగుదీతైలము. [కప్పువేయు.
గారవ(డు)ట్టు-తాంబూలముచే పండ్లు ఎఱ్ఱ
గారపిండి-గారకాయల పిండి.
గారపోఁత-తూర్పారఁబట్టునపుడు మేలురాశి ప్రక్కఁబడు పొల్లు.
గారబము | గౌరవమ్ = వలపు, మర్యాద,
గారము | చెలిమి, గొప్పతనము, మక్కువ, కూర్మి. రూ. గారవము, గారా(బ)ము.
గార(రా)ము వేయు-గారవించు, ముద్దుచేయు.
గారవము-చూ. గారబము, గరువము.
గారవించు-మన్నించు, బుజ్జగించు.
గారవింపు-ఆదరము, బుజ్జగింపు.
గారవిలు(ల్లు)-ఆదరింపఁబడు, బుజ్జగింపఁ బడు, ప్రేమపొందు.
గారాకాయలు-మందుసామ్రగిరిూరిన పెలగ కాయలు-ఒక దినుసు బాణసంచు.
గారాబము | గౌరవమ్ = ఆదరము, ప్రేమ
గారా(ము)బు | దయ, మక్కువ-గారబము
గారిము-ఘారికాః = గారె, మినపపిండి.
గారియముచేయు-ముద్దుచేయు, గారవించు.
గారు-పూజ్యవాచకము, బ. గార్లు.

గారె(ర్య)-ఘారికా = మినపవడ, మోట బావిగిలక-రూ, గారి, గారియ.
గాలకాఁడు-జాలరి, బెస్తవాఁడు.
గాలకురాలు-ప్రౌఢ, ప్రోఢ, ఉరియ.
గాలపుఁజువ్వ-చేఁపలుపట్టు పనిముట్టు.
గాల(లా)ము-చేఁపలుపట్టు పనిముట్టు,నూతి నుండి చేఁదతీయు పనిముట్టు-బడిశము.
గాలి - గాడ్పు, దయ్యము, జంతురోగము, ఆధారములేనిది, పసిపట్టుట.
గాలిఅమ్మవారు-చూ, గాలికుంటు.
గాలించు-వెదకు చెరుగు, పలచు,కోఁయు
గాలింపు-వెదకుట, వడఁబోఁత.
గాలింపుగంగ-దండుగగాఁ దిరుగువాఁడు.
గాలిఁబుచ్చు-వమ్ముచేయు, గాలిలోకలుపు.
గాలిఁబోవు-గాలికెగురు, చెడు, దండుగగు.
గాలికబురు-కింవదంతి, నానుడి.
గాలికల-శూన్యమైన కల
గాలికవణంపుమేఁపుడు-పాము.
గాలికుంటు-పశువుల(నోటియందు) గొరిజ లందు పుండుపుట్టెడు రోగము.
గాలికుండలు-ఒకజాతి పొంగురోగము.
గాలికుక్క-వేఁటకుక్క-జాగిలము.
గాలికొడుకు-గాడ్పుకొడుకు,ఆంజనేయుఁడు భీముఁడు, అగ్ని.
గాలికొమ్ము-ఒక తెగ వాద్యము
గాలికొలుపు-వెట్టిసేయు.
గాలిగాడు-గాడిద-చలువగుట్టము.
గాలిగుడి - సూర్యచంద్రులచుట్టు ఏర్పడు మండలము, వలదగుడి.
గాలిగుమ్మటము-గాలిగోపురము.
గాలిగూడు - గాలికి ఆరుటకై గూడువలె పేర్చిన పనలకుప్ప.
గాలిగొను-గాలిపాటు, ఎండు.
గాలిగ్రుడ్డు-పేద, మొద్దు, మొటకు, ఆంజనేయుఁడు, భీముఁడు, ఎండమావులలోఁ గనఁబడు గ్రుడ్డువంటి ఆకారము.
గాలిచీర-తెరచాప, దొంగల పనిముట్టు.
గాలిచూలి(లు) - గాడ్పుచూలు, అగ్ని, భీముఁడు, హనుమంతుఁడు.
గాలిజల్లు-ఆటలమ్మ, చిన్నస్ఫోటకము.
గాలితండ్రి-ఆకాశము-చదలు.
గాలితెగులు-వాతరోగము.
గాలితేరెక్కుమన్నీఁడు-మన్మథుఁడు-మలయవాయువు రథముగాఁగల దొర.
గాలిదిండి-పాము-గాడ్పుమేపరి.
గాలిదినిపించు-మోసగించు.
గాలిదుమ్ము-దుమ్ముతోఁగూడిన గాలి.
గాలిద్రిమ్మరి-దయ్యము-పిశాచము.
గాలినెచ్చెలి-అగ్ని-గాడ్పుసంగడీఁడు.
గాలిపంట - వర్షాధారపు పంట, స్థిరములేని పంట. [జెండా
గాలిప(టము)దగ - గాలిలో నెగురవేయ
గాలిపట్టి-చూ గాడ్పుచూలు.
గాలిపోయు-మళూచిసోకు.
గాలిబిళ్ల-దవుడల వాపు.
గాలిపాట-వినికిడి పాట.
గాలిబ్రతుకు-స్థిరజీవనోపాధిలేని బ్రతుకు
గాలిమండె-ఆరఁగట్టిన పొగాకుకుప్ప.
గాలిమంద-గాలికిఁ ద్రిప్పెడు పసులమంద
గాలిమాట-ఆధారములేనిమాట-నానుడి.

గాలిమెకము-లేడి-వాతాయుపు.
గాలిమెసఁగుఱేఁడు-సర్పరాజు-వాసుకి.
గాలిమేడలు-వట్టి ఆశలు. [కుప్ప.
గాలిమేడెము-కంకులు పైకి పేర్చిన జొన్న
గాలిమేఁత(ప)రి-పాము-గాడ్పుదిండి.
గాలిమేపరిఱేఁడు-సర్పరాజు-శేషుఁడు.
గాలివాన-తుపాను,ఒక దినుసుచెట్టు,కసరు.
గాలివేఁత-ఒక జ్వరము, గాలికొట్టుట.
గాలిసూను-మబ్బు-వాతారి.
గాలిసోకు-దయ్యము పట్టు.
గాలు-గుదిబండ, గుదిగట్టు.
గాలుక్రుంగు-బండిచక్రము దిగఁబడు.
గాలులు-దయ్యములు, బూచులు.
గావ-అంబటి జోరిగాడు
గావంచా-తుండు, తువ్వాలు, కొల్లాయ.
గావరపెట్టు-కడుపులోత్రిప్పు. కలఁతపెట్టు.
గావు-గ్రామదేవతకిచ్చు బలి, ఎర.
గావుకేక-బలికాలమునవేయు పెద్దకేక.
గావుకొను-బలిగొను
గావుకోడి-ఒక దినుసు మూలిక.[నాలుక+.
గావుజబాన్-గౌజుబాన్, బెండ, ఎద్దు.
గావుటాను-గవటము, గ్రామకంఠము.
గా(వు)త-ఆశీర్వాదము-కాత. [దల-దీక్ష.
గావుపట్టు-చంపు, చెఱచు; గట్టిపట్టు-పట్టు
గాసటబీసట - గందరగోళము, సలక్షణము
గాని చదువు, కలఁత.
గానము-గ్రానః = గడ్డి, జీతము, బత్తెము.
గాసి-వెత, బడలిక, బాము, కాఱియ.
గాసించు-వెతపెట్టు, శ్రమపెట్టు.
గాసిఁగొను-దుఃఖించు, బాధించు.
గాసి(వ)ఁబడు-వెతనొందు, చెడు, వగచు.
గాసిఁబఱచు-చెఱచు, పీడించు.
గాసిఁబెట్టు-గాసించు, ఏఁచు, కాఱియపెట్టు.
గాసిచేయు-చెఱచు, పీడించు, చంపు.
గాసియగు-చెడు, బడలు, వగచు.
గాసిలు(ల్లు) - బాధపడు, బడలు, చెడు,
కోపించు, కొఱకొఱలాడు.
గాళకుఁడు-దిట్ట, గడుసరి, గుండా.
గాళకురాలు-గయ్యాళి-ప్రౌఢ, జాగ.
గాళు-పాటు, చేటు,
గాళుచేయు-చెఱచు, పాడుచేయు.
గాళ్లవాఁడు-గాండ్లవాఁడు. [వచ్చు.
గాళ్లుపోయు-గొడ్లకు మశూచివంటి జబ్బు
గి - నింద-గేలి-అనాదరార్థకములందు గలి
గెడు ఆదేశము-గీ, గ్రీష్మపక్షము.
గింగిరాలుతిరుగు-కళ్లు బయర్లుకమ్ము.
గింగురు - బాణవేగధ్వనికి అనుకరణము-
గింగ్రు. [పడు.
గింగురులెత్తు - ధ్వనిచే చెవులు గడియలు
గింజ-విత్తు,పిక్క-గిజరు, గుజురు.
గింజలేరుమనికి-ఉంఛవృత్తి.
గింజు-కదలించు, చిమ్ము.
గింజుకొను - చిమ్ము, విదిలించు, మిక్కిలి
శ్రమించు, పిడివాదముచేయు.
గింజెలు-అనుములు-నిష్పావము.
గింటెన-గిరికర్ణి-దింటెన+
గింటెము-జముకి నేఁతబట్ట-దుప్పటి - టెం
టెము-రేఁటెము; గట్టిది, గొప్పది, పట్టు
మైనది-గెంటెము.
గింది(రి)-మోసము, దొంగపని.

గిండి-కుండీ = కమండలుపు-జారీ, కైతట్ట.
గికురించు-మోసగించు, తప్పించు-కికురించు
గిచ్చు-గిల్లు, గీచు, గీయు, గీఱు.
గిచ్చులాట-గిచ్చుచు ఆడెడు ఆట.
గిజి(జ్జి)గాడు-బంగరుపిచ్చుక, పచ్చపిట్ట.
గిజిబిజి-నమలుటయందగు అనుకరణము.
గిజ్జిణి-ఒక దినుసు భక్ష్యము. [కరణము.
గిజేగిజే - కలఁత, తడఁబాటు. ఒక అను
గిజేగిజేకుడుము- } కలఁతపడు, తహతహ
గిజేగిజే(కొను)పడు } పడు.
గిజేగిజే(యగు)లాడు-కలఁతపడు
గిజె(జు)రు-గింజ, గుంజు-గుజ్జు, గుజురు,
గిజాటపడు-ఒత్తిడిచే విసుగుచెందు.
గిట-కృశింపునకు అనుకరణము
గిటక-పొట్టివాఁడు, ఎండుకొబ్బరి చిప్ప.
గిటకబారు-గిడసబారు. [మోఁత, సన్నము.
గిటగిట-పండ్లుగీఁటుట, వణఁకుటయందగు
గిటగిటన-కొలఁది, సన్నని, చిక్కిన
గిటికె-కుండపిడత, దాక.
గిటగిటమను-వడఁకు, జవ్వాడు.
గిటుకుబారు-గిడసబారు ముదిరిపోవు.
గిట్ట-ఘట్టః = పశువుల కాలిగోరు డెక్క-
 జాణము. కలుపుమొక్క, పొట్టి-గిటక.
గిట్టకఱచు-దంతములు దగ్గఱపడు.
గిట్టమి-చాలమి, లాభింపమి, పగ, మచ్చరము
గిట్టించు-చంపు, భేదించు.
గిట్టింపు-గిట్టుబడి, చావు, చంపుట,
గిట్టిపట్టు-గట్టిగా పట్టుకొను.
గిట్టు-చాలు, చెడు, చచ్చు, లాభించు, వీలుపడు.
గిట్టు(బడి)బాటు-అమ్మకపులాభము-గిట్టింపు

గిడసవాఁడు-కుమ్మరి-కులాలుఁడు.
గిడస-పొట్టి-గిటక-గిఱక, గిడ్డ.
గిడసపండ్లవాఁడు-అల్పదంతుఁడు.
గిడసబాఱు-ఏపుగా పెరుగకయే ముదురు.
గిడసవల-చేఁపలుపట్టెడు వెదురుఫేళ్లబుట్ట.
గిడి-బింకము, బిగువు, బిగుతు.
గిడికొ(గొ)ను-బిగుతగు, చప్పట్లుకొట్టు.
గిడిగి-తప్పెట-గిడియ-గుమ్మె(ట)త.
గిడిగిళ్లు-చిఱుతలు, (మొక్కలు, గుంజిళ్లు.
గిడిబిడి-ఉరుము-ఒక చర్మవాద్యము.
గిడియ-ఒక దినుసు తప్పెట-గిడిగి.
గిడుగు-కామలేనిగొడుగు-జిడుగు.
గిడ్డ-కృష్ణ పొట్టివాఁడు-గిట్ట, గిడి
గిడ్డంగి-నిల్వకొట్టు, చెఱసాల, కార.
గిడ్డజొన్న-చిఱుజొన్న-జూర్ణక +
గిడ్డది-పొట్టిది-కుఱుచది.
గిడ్డవాఁడు-గిటక, గిట్ట, గిడస.
గిడ్డి-ఘృష్టి = (పొట్టి)ఆవు, గిడసవి.
గిడ్డు-ఒకజాతి దేగ-గిద్దు.
గిత్త-కోడెదూడ, ఎద్దు-గిబ్బ, గోద.
గిత్తతత్తడితేఁడు-శివుఁడు.
గిదరాయించు-ముట్టుకొను, వ్యాపించు.
గిద్ద(ద్దె)-పావుసోల, పిడత.
గిద్దవాన-కుండపోఁతవాన.
గిద్దు-గిడ్డు, ఈలగ్రద్దకఱఁజు.
గినియ-(కటభి)మానేరు + -నల్లగినియ.
గినుమాడు-మోసగించు-కికురించు.
గినుము-మోసము, అటమట, గారడము.
గిన్ని-నేరేడు +, గిన్నె.
గిన్నియ(న్నె)-పానపాత్ర, డబ్బర.

గిన్నెవారు-తీపుతాడు. [గోణి, గోద.
గిబ్బ(టేఁడు)-గిత్త,అమ్చపెద్దు, ఆఁబోతు.
గిబ్బడాల్దొర
గిబ్బతత్తడిదొర
గిబ్బబాబాజోదు
గిబ్బరవు(రా)తు
| శివుఁడు-వృషభవాహనుఁడు; ఎద్దునెక్కి తిరుగువాఁడు.
గిబ్బరౌతుసకుఁడు-కుబేరుఁడు.
గిబ్బిలతేఁడు-నందీశ్వరుఁడు.
గిబ్బసిపాయి
గిబ్బవయాళిజోదు
| శివుఁడు - గిబ్బవాబాజోదు.
గిబ్బ-చంపు, కొట్టు
గిరంగు-కొండజాతి దున్న.
గిరక-నూతిరాట్నము-గిఱక.
గిర-చక్రము-గీర.
గిరకతాదు-ఈఁదాడు + - హింతాళము +
గిరకది-పొట్టిది-గిడసది, మట్టపుది
గిరకపడు-పొట్టిదగు-గుజ్జుపడు.
గిరగిర-తిరుగుటయొక్క అనుకరణము.
గిరగిరతిరుగు-గుండ్రముగా తిరుగు.
గిరిజా(దా)లు-జుట్టునరుగలపొట్టి వెండ్రుకలు, గిరదాలు, గుండ్రని.
గిరతట్ట-వెదురుపేళ్ల బుట్ట.
గిరదాయించు-చుట్టి తిరుగు-గిదరాయించు
గిర(రి)వాటు-గిరగిరత్రిప్పి విసరివేయుట.
గిరవు-తాకట్టు, కానుక, గీవు, అగావు.
గిరస-పిఱికి, పంద, కోచ, పార్వోతు.
గిరసకాలు-గొడ్ల గిట్టలకు తగిలెడు జబ్బు.
గిరసటబాలు-గిరసబాలు, గట్టిపడు.
గరాకి-కీ = గిరాక్-పిరిము, దొరకమి.
గిరాటువేయు-బు(ప్పు)వ్వు, విసరు,వైచు.
గిరిగ-పాదముల పై భాగము.
గిరిగి(గ్గి)టలు-నృత్యకాలమునవాయించెడు కంచు తాళములు.
గిరిగె-మడమక్రిందిభాగము.
గిరివి-తాకట్టు, కుదువ, అగావు.
గిరిసింగన్నవత్తి-బాలక్రీడావిశేషము.
గిరిసెము-శిరీషః = దిరిసె(న)ము.
గిరుకు-రాట్నపు చక్రము.
గిర్దావరి-ఆజ్ఞాపత్రము, ప్రకటనపత్రిక.
గిఱక-నూతిగిలక, పొట్టి-గిటక.
గిఱకతాఁడు-ఈఁదాఁడు-హింతాలము.
గిఱకపడు-పొట్టిదగు, లగ్గు, చెడు.
గిఱపు-సంజ్ఞచేయు-గిరుపు,
గిఱి-గుండ్రనిరేఖ, బరి, గీఁత.
గిఱిక-చిక్కు, మెలి, పెన.
గిఱికెత్రిప్పు-గుండ్రముగా త్రిప్పు.
గిఱికొను - ఆవరించు, పాఱు, పెరుగు, నెలకొను, మెలికొను,మట్టుకొను.అరికట్టు.
గిఱికొలుపు-క్రమ్ముకొనఁజేయు.
గిఱిపిల్లాడి-కాలిమట్టె-పిల్లాణి,చిటిబొద్దులు.
గిఱురసు-చప్పుడగు [గిలుకు, గిరుకు.
గిఱుకు-తప్పువ్రాఁతపై దుడుపుపెట్టు,గీఁచు-
గిఱుకను-గిఱుక్కని ధ్వనిచేయు.
గిఱుక్కు-వడిగా మరలుటయొక్క అను...
గిఱుక్కున-గిఱ్ఱున, గుండ్రముగా.
గిఱుపు(ర్పు)-కనుత్రిప్పు, గీఁటు,కదలించు. నిమురు, గిలుపు, గొప్పతనము.
గిఱ్ఱ-గుండ్రముగా, గీటు, గిఱగిఱ్ఱ, గీఁత, బండిచక్రపుబాట.

గిజ్జు-ముడుచుట-గుండ్రముగాఁ దిరుగుట వడిగా మరలుటయొక్క అనుకరణము

గిజ్జున-గిఱుక్కున, త్వరగా.

గిజ్జుపురుగు-గిజ్జుమనికూయు పురుగు.

గిల-మట్టెలు మువ్వలు గిలకలు మున్నగు వాని ధ్వనికి అనుకరణము

గిలక-రాట్నపు రేకుబిళ్ల, ఒక ఆటవస్తువు, కాలి చీలమండకు వెనుకటిభాగము, ఒకానొక ఆంత్రరోగము, మోటబావిబిళ్ల, నూతిగిలక-గిరక.

గిలకచెట్టు-గిలగిల, గిలిగిచ్చ-గిలిగింత +,

గిలకట-ఒకానొక ఓషధి

గిలకబండి-చిన్నచక్రములబండి-శకటిక.

గిల(లు)కరించు-చిలుకు, వ్రేళ్లతో కలఁచు.

గిలకలపండుగ-దసరాపండుగ.

గిలకమంచము-గిలకలుగల మంచము.

గిలకసరులు-స్త్రీల కంఠాభరణము.

గిలకొట్టు-గిలకరించు, వ్రేళ్లతో కలచు.

గిలగిచ్చ | గిలగిల | గిలిగి(లి)ంత } గిలకచెట్టు - గిలిగిట్ట + - ఘంటారవ +

గిలగిలలాడు-బాధచే విలవిలతన్నుకొను.

గిలవకాయ-శరీరమందలి కండ,

గిలా(వ)బ(బా)-గోడకుచేయు గచ్చు.

గిలాబుచేయు-సన్నగా గచ్చుచేయు

గిలి-బెదరు, జంకు, దిగులు.

గిలిగించు-గగురు పుట్టించు,గిలిగింతపెట్టు.

గిలిగింత-గగుర్పాటు-చక్కిలిగి(ంత)లి.

గిలిగింత - గిలకచెట్టు-గిలిగిచ్చ-ఝుఁఝుర.

గిలిగింతలార్చు-గగుర్పాటు కలుగు.

గిలిగింతవాఱు | గిలిగింతవోవు } గులగులమను, గిలిగింత కలదగు.

గిలిగి(చ్చ)ట్ట-గిలకచెట్టు-శణపుష్ప + .

గిలిగిలి-మంచపుసకినల చప్పుడు. బిల్లకట్టె ఆటలో ఆయిదవ గణనముయొక్క పేరు, గిలిగింత, గిలకచెట్టు. [చు-గిలిగించు.

గిలిగిలించు-గిలిగింతపెట్టు, పులకలు పుట్టిం

గిలుక-గిలక +, క్రార.

గిలుకు(ల్కు) - మట్టెల యలికిడి, సవ్వడి, కొక్కిరిబిక్కిరిగా వ్రాయు. [కూకీపలుకు.

గిలుకుపలుకు - రతికాలమందలి గళధ్వని -

గిలుక్కు-గిలుకు, గిల్కు. [లు.

గిలుగా(ల్గా)డు-గిలుబాడు,మ్రుచ్చిలు, దొంగి

గిలుగిచ్చ-గిలిగిచ్చ +,గిలక + .

గిలుగుకొను - మేదుకొను, వ్రాసికొను, పూయు, ప్రేరేపించు.

గిలుపు(ల్పు)-గిఱుపు, త్రిప్పు.

గిలుబా(ల్బా)డు-మోసగించు, దొంగిలించు, ఎన్ను, ఏఱు-గిలుగాడు-గిల్గాడు.

గిలుబు(ల్బు) - దొంగతనము, మోసము -

గిలుబు(ల్బు)కొను-గిలుబాడు, అంకించు.

గిలుబు(ల్బు)కోలు-మోసము,దొంగతనము.

గిలుబు(ల్బు)సేయు-దొంగిలించు,వంచించు.

గిలువు(ల్వు) - దొంగతనము, మోసము -

గిల్లి-మెల్ల, పిల్లల ఆటలోని పెంకుముక్క.

గిల్లకన్ను-మెల్లకన్ను, కడకన్ను.

గిల్లచూపు-గిల్ల, మెల్లచూపు.

గిల్లవేయు-ఆటలో అంశ విధించు.

గిల్లాలాట-ఒకానొక బాలికాక్రీడ.

గిల్లికజ్జాపెట్టు-కయ్యమునకు కాలుదువ్వు.

గిల్లు-గిచ్చు. పూజకోయు. గోటితోత్రుంచు; గోటినొక్కు-గిల్లుడు.
గిల్లుడు-గోటినొక్కు. గిచ్చుట.
గిల్లుమను-చెవులు గింగురువోవు
గివుటు-గీకు, బరుకు. ఱక్కు. రూ. గీఱు
గిసరి-సింగము-కేసరి-ఖేచరము.
గిసుకు - క్షు = తుమ్ముయొక్క అనుకరణము-తుసుకు-క్కు. [గేస్తు.
గిహిత - గృహస్థః ఇంటి యజమాని.
గీ - నింద్యార్థమున వచ్చు ఒక ఆదేశము. గంటయొక్క ధ్వనికి అనుకరణము
గీంద్రు-గింగురు.
గీఁక-ఘీంకారః = ఏనుఁగుకూఁత-కీఁక.
గీఁకు-గీఁచు, గీయు, గీఱు, గోఁకు, గిచ్చు
గీఁటించు-గీఁటు, కొఱుకు.
గీఁటు-కన్నుగీఱువు.కొఱుకు.కొట్టు చిమ్ము. చీల్చు; అనాదరము.
గీఁటుకంప-కళ్లమూడ్చు చీపురు-పొలికట్టె.
గీఁటువఁబుచ్చు-త్రోసివేయు. అనాదరించు.
గీఁటుపెట్టు-మేలుకీళ్ల పరీక్షకై బంగారును ఒరగంటిపై నొక్కి గీయు.
గీట్లు-చదువుసంధ్యలు.
గీఁత-గీఁటు, గీఱ. గీయుట-గెఱ.
గీఁతకట్టియ-ట్టె = వడ్లవాఁడు నాములు గీసి కొను పనిముట్టు-కత్తికాసు.
గీఁతకత్తి-ఈంద్రవాని కల్లుగీఁత కత్తి.
గీచు-గీయు, గీఱు, గిచ్చు.
గీజాడు-ఇచ్చువటకు పీకులాడు.
గీ(దు)పోరు-మిక్కిలి మారాముచేయుట, విరామములేక విసుగెత్తించు పోరు.

గీటడఁగించు-చంపు, పొగరడఁచు.
గీట(ణ)డఁగు-చచ్చు. ఓడు. పొగరడఁగు.
గీట(ణ)డఁచు, గీటణఁగించు } చంపు. ఓడించు. పొగరడఁచు.
గీటు-నుదుటిబ్రాఁత, పొగరు, అనాదరము-గీఁత, గీఱ, గెఱ.
గీటుకొట్టు-గీఁతపెట్టు, ఒల్లకపోవు. [చు.
గీటునఁబుచ్చు-పోఁగొట్టు.ఈసడించు,ఎగ్గించు.
గీట్పాటు-దురదృష్టము. ఆపద.
గీట్లబద్ద-గీఁతకట్టె-రేఖాదండము.
గీతగోవిందముపాడు-ఏడ్చు.
గీదరపెట్టు-పోరుపెట్టు. అల్లరిచేయు.
గీపెట్టించు-మొఱపెట్టించు.
గీపెట్టు-మొఱపెట్టు, గట్టిగా ఏడ్చు. కూయు.
గీమాలు-బ్రతిమాలు, దేవురించు.
గీము-(గేహః) ఇల్లు, ఇరవు, ఇక్క.
గీమువేల్పు-గృహదేవత-ఇలువేల్పు.
గీయు-గోఁకు. చెక్కు. గీచు, గిచ్చు.
గీర(ణ)వగింజలు-బాలక్రీడావిశేషము
గీర-గర్వ = పొగరు, మత్తు, చక్రము.
గీరె-మోటబావి గిలక-గిరక.
గీఱ-గీఁత, గీటు, గెఱ-రేక.
గీఱు - గోఁకు, గీకు, చీల్చు, చీకు, నఱకు, నాటు, దువ్వు. రూ. గివుఱు.
గీఱుగాజులు-ఒక దినుసు గాజులు.
గీఱుడు-గోఁకుడు, గీకుడు, గిచ్చుడు.
గీఱు(నామము)బొట్టు - గీఁతగలనామము -
గీఱెత్తు-దిమ్మతిరుగు, మత్తెక్కు.
గీలు-ఉట్టు, కాఱు-స్రవించు
గీలుగొ(ల్కొ)ను-[illegible] [ల్చు.

గిలుకొ(ల్కొ)లుపు-పొందించు, పుష్పాదులు
గీవు-లాకట్టు, అగావు, కానుక-గిరవు.
గీస-సగబాలు, వాటా.
గుంగురు-ఘుంఘురః = ఎద్దుమెడమువ్వ
గుంజికొను-లాగికొను, అంకించు.
గుంజిగాఁడు-పనికిమాలినవాఁడు.
గుంజిలి-దాఁపటీకము, గుంపులు
గుంజిలిపెట్టు-గుంజిళ్లుతీయు, దాఁచు.
గుంజిళ్లు-గుంజీలు; గిడిగిళ్లు, ఎరఁగుడు.
గుంజిళ్ళుతీయు-గుంజీలుతీయు.
గుంజిళ్ళుపెట్టించుకొనువేల్పు-గణపతి
గుంజీలు-శిక్షార్థము చేతులు కాళ్ళు కట్టుకొని పలుమార్లు కూర్చుండి లేచుట.
గుంజె - గుంద్ర = కంబము, కట్టుగొయ్యి, రాట్నపుకొయ్య, ఏతపుమ్రాని నిలువు కొయ్య-కొమిరి. [గొడ్డాట.
గుంజెనుసు(కు)గు-ఎగతాళిచేయు, ఎలుఁగు
గుంజెమ్మ-ఒక తిట్టు
గుంజెర-తుంగజాతి కలుపుమొక్క
గుంజలిపెట్టు-దాచు, మఱుగువెట్టు.
గుంజా-ఒక దినుసు రంగు.
గుంజాటన-ఊఁగులాట, ఆరాటము.
గు(జ)ంజాటము-లంపట, తగులము.
గుంజాయిషు-అవకాశము-తెఱపి
గుంజు-ఈడ్చు ఉదుకు. జాడించు లాగు, కొట్టు-గుజ్జు,క్రొవ్వు,మువ్వ, బుట్టగుంజు.
గుంజెకపోవు-బక్కచిల్లు, పట్టుకొనిపోవు.
గుంజెకొను-రోషపడు,లాగుకొను [యాట
గుంజెనుసుకు - గేలిచేయు, ఎలుగుబంటి
గుంజెపిట్ట-ఒక జాతి పక్షి.

గుంజెలాడు-లాగులాడు, అల్లిబిల్లిగొను.
గుంట - కుండమ్ - చిన్నగోయి - గుంత - కొంద్ర, ఊతిగుట్ట, బాలిక-కుంట, భూ మానవిశేషము, చిన్నది, మొసగించునది.
గుంట(కలగర)గలిజేరు-చూ. కలగర.
గుంటక్రోవ-క్రోవి-ఒక తెగ ఫిరంగి
గుంటక-మెట్టచేను చదునుచేయు పనిముట్టు
గుంటచాళ్ళు-పిల్లలాడుకొను ఒక ఆట.
గుంటకాలు-గుంటలు , గోతులు.
గుంటఁగూలు-కూలిపోవు, కూలఁబడు.
గుంటఁడు-చిన్నవాడు-పోఱఁడు.
గుంటఁబెట్టు-రూపుమాపు, చెఱచు.
గుంటనక్క-కొంకనక్క-కిఖి. [ప్రొయ్యి.
గుంటప్రొయ్యి - గుంటత్రవ్వి నిర్మించిన
గుంటయోనమాలు-తొలిమెట్టు.
గుంటలుపడు-పల్లమగు, లోఁతగు.
గుంటి-సేద్యపుపొలము, నెలవు, మడి.
గుంటికాలువ-చిన్నపంటకాలువ.
గుంటి(క)కె-చూ. గుంటక.
గుంటిక్రోవి-తుపాకి, దాణపంచు
గుంటు-ఒక దినుసు ఆయుధము.
గుంటుకాఁడు-గుంటు చేఁబట్టినవాఁడు
గుంటుగు-సేద్యకాని పనిముట్టు-గుంటక.
గుండ-గుడ్డ, బట్ట, పొడి, పంచమీ విభక్తి ప్రత్యయము.
గుండంగి | నీరుకోడి - బుద (బొల్లి) కోడి,
గుండఁగి | తోకలేని కోతివంటి జంతువు.
గుండఁడు-బంటు-గులాము, లాము.
గుండకూడు-గుంపుకట్టు
గుండక్రియ-ఒకానొక రాగము.

గుండగొయ్య - తుంటరి, బొక్కెనపైన త్రాడు కట్టెడు ఇనుప కడియము, బండి తొట్టికట్టు-గుండి.
గుండగొయ్యతనము-తుంటరితనము.
గుండతనము-మిక్కిలిక్రూరత్వము, తెగువ.
గుండతుంగ-దీర్ఘరాజము +
గుండము-కుండమ్ = నిప్పులగుంట, నది యందు లోఁతైనచోటు, తనంతట ఏర్పడిన జలాశయము, పెద్దసున్న.
గుండవ-దాసి-తొత్తు-బానిస.
గుండా-దిట్టరి, పోకిరి, గడుసరి.
గుండాడు-పొడిచేయు, గుండకొట్టు.
గుండాతనము-గుండతనము
గుండాము-యాగము, అగ్నిగుండము.
గుండారము-గుడారము.
గుండారు-చీర, కోక-వల్వ-సేల.
గుండాల-గోండాల-జలోద్భవ +.
గుండి-గుండగొయ్య, ఒక వంటగిన్నె.
గుండిగ - కుండికా = పెద్ద లోహపాత్ర.
గుండిగె-గొంతు-కంఠధ్వని.
గుండియ-గుండెకాయ, చొరవ-గుండె.
గుండీ-బొత్తాము, ఒక జాతి పువ్వు, డబ్బి.
గుండు - గండః = బండతాయి, ఉండ, ఇనుపగోళీ, లంగరు, తూకపురాయి, కొండ, పొద, గుబ్బము, గుండ్రనిది
గుండుఁబులుఁగు-జక్కవ-కోకము.
గుండుఁబులుఁగులవేఁటకాఁడు-చంద్రుఁడు.
గుండుక-గుంటక-గుంటుగు,
గుండుకొట్టించుకొను-బుఱ్ఱగీయించుకొను.
గుండుకొను-చుట్టుకొను, అరికట్టు.
గుండుగల్లు-గుండ్రాయి, సన్నెకంటిపొత్రము
గుండుగిలు-ల్లు = చాపచుట్టగాఁబడు.
గుండుగుత్త-సర్వహక్కులతో ఇచ్చుగుత్త
గుండుగూడు-నిలుచు, ఒక్కసారిగాపూను.
గుండుజెల్ల-పెద్దగంప, బండిజెల్ల.
గుండుపులుఁగు-జక్కవ-చుట్టుఁబులుఁగు.
గుండుబెండాడు-చలించు, కదలించు,
గుండుమల్లె-బొండుమల్లె-వృత్తమల్లి +.
గుండుములుపుగాఁడు-ఒక జాతి పిట్ట.
గుండువేయు-తుపాకిప్రేల్చు, అడ్డుపెట్టు.
గుండుసున్న - గుండ్రనిగీఁత, పూర్తిగా (లేనిది) చెడినది.
గుండుసూది-పైన గుండుగల చిన్నసూది.
గుండె - గుండియ, వ్యు. హృదయమున గుండువలె నిమిడి యుండునది.
గుండెకాయ-కందనకాయ-గుండె.
గుండెకళ్ళు-కొఱగానివాఁడు-అంబేద.
గుండెగాలము-హృదయశల్యము.
గుండెగూడువట్టు-గుండె తల్లడపడు.
గుండెచెదరు-బెదరు, జాలికలుగు.
గుండెచేర్లు-పశువుయొక్క ఎదురుఱొమ్ముపై నునికెడు ఉబ్బుజబ్బు.
గుండెతల-ఱొమ్ము-వక్షస్థలము.
గుండెతల్లడము-గుండెబెదరు.
గుండెడిగులు-మనోవ్యాధి-ఆధి, వైరి.
గుండెనీరగు-మిక్కిలి(బెదరు)జాలిపడు.
గుండెపగులు-మిక్కిలి(బెదరు)బెంగగొను.
గుండెబెదరు-భీతు-వెఱపు.
గుండెముక్కర } పశువుల గుండెజబ్బు
గుండెముక్కు } నెరిడె.

గుండెలు తీసినబంటు-కఠినహృదయుఁడు.
గుండెలో గాలము-హృహాయశల్యము.
గుండెవగరు-పశువుల శ్వాసరోగము.
గుండెవట్టు-ఊటముకొను, బలపడు.
గుండ్ర-కుండలమ్ = తిరుగుట. గ్రుడ్లగూబ కూఁత, ఒకానొకచెట్టు-గుండ్రనిది
గుండ్ర(న)తనము-గుండ్రన-వర్తులత.
గుండ్రతుంగ-గుండాల + -గుండ్రా +
గుండ్రని-వర్తులమైన.
గుండ్రనిది-గోళాకారవస్తువు.
గుండ్రము-కుండల = గుండ్రని. గుడుసు, ఉండ్రము, ఉంట. [కంబములు.
గుండ్రలు-పిండియుండలు, చెఱకురాట్నపు
గుండ్రలుకొను-గుండ్రయని ధ్వనించు
గుండ్రలు కొలుపు - గుండ్ర గుండ్రయని గుడ్లగూబ కూయు.
గుండ్రా(యి)-చక్రాయి, సన్నెకల్లు,పొత్తరము; గుండ్రా = గుండుతుంగ +.
గుండ్రించు-కడుపులో త్రిప్పు, తిరుగాడు. త్రేచు, తిరుగఁబడు.
గుండ్రింత(పు)-గుండ్రించుట, త్రేచుట.
గుండ్లకమ్మ-ఒకానొక నది.
గుండ్లుబెండ్లాడు-కదలు, చలించు.
గుంత-గర్తః = చిన్నగోయి,కుంట; గుంట, పల్లము-గ్రుంత. వ్రంత.
గుంతపురువు-గర్తపులకమను పురుగు.
గుంతపొంగలి-అవిరికుడుము.
గుందరి-వైద్యుఁడు-వెజ్జు, మందరి.
గుంపించు-కుప్పవేయు, దాఁటు.
గుంపు-గుంఫః = ప్రోగు, గుబురు, గుమి.

గుంపుకట్టు-గుంపుగాకూడు.
గుంపుగూడు, గుంపుగొను } గుంపుగాఁ జేరు - మల్లడిగొను.
గుంపుచేయు-ఒక చోటికి చేర్చు.
గుంపుచేరు-గుంపుగూడు, గుమిగూడు.
గుంపుదీర్చు, గుంపుదేర్చు } చెదరిన కురులు సవరించి గుంపుగాఁ జేయు.
గుంపెన - పోటు, గంతు, కైపు, చెలరేఁగుట, ఉంకింపు, ఒకానొక చెట్టు
గుంబము-వాకిలి-దువారము-రూ గుమ్మము
గుక్క-నోరుపట్టునంత ద్రవము, శ్వాసకు శ్వాసకు మధ్యనున్న కాలము - గుక్కిలి
గుక్కత్రిప్పుకొను-ఆశ్వాసము పొందు.
గుక్కపట్టు-శ్వాస బిగించి యేడ్చు.
గుక్కమిక్కను, గుక్కిరిమిక్కిరిలాడు } ఉక్కిరి బిక్కిరియగు.
గుక్కిలి-గుక్క, గుటక.
గుక్కెఁడు-గుక్కకొలఁది.
గుగ్గిలము-గుగ్గులు = గుగ్గిలపుచెట్టు, గుగ్గిలపు(పట్ట)బంక, దేవధూపము.
గుగ్గిళ్లు-ఉడికిన అనుములు మొ॥-పొళి.
గుచ్చలి-కుచ్చలి, పాలివికూర.
గుచ్చు-కూర్చు. నాటించు-గ్రుచ్చు.
గుజరి-రీ, గుజి(లి)రి-రీ } చీఁకటివేళ, రాత్రులు తెఱచు అంగడి-దొంగబజారు.
గుజేస్తా(స్తు) - గడచిపోయిన, వెనుకటి సాలుకు సంబంధించిన.
గుజారతు-వశము-లోకువ.
గుజ్జన-ఆకులబుట్ట,బిడ్డలకుసంబంధించినది

గుజ్జెనగూళ్లు-బాలికాక్రీడావిశేషము. నెలపిల్లలకు అనుకూలముగా గుజ్జువలె వండిన వంటకము. [అల్లరి, కలకలము.
గుజేగుంపు-సంకడి, గుసగుస, అడావుడి.
గుజేగుంపుపెట్టు-అల్లరిపెట్టు.
గుజేగుజే-అనుముడు, గజిబిజి, గుసగుస, త్రొక్కులాట, గులగుల, [లాడు.
గుజేగుజే(పడు)పోవు - రహస్యమంతనము
గుజేగుజేయగు - తహతహపడు. విలవిలలాడు, గజిబిజియగు.
గుజేగుజేపేకులు-ఒక బాలికాక్రీడ.
గుజేగుజేలాడు-ఇంట్రపడు, త్రొక్కుటపడు.
గుజేగుజేలు-గుసగుసలు, ఇక్కట్లు
గుజేగుజే(లు)వోవు-గుసగుసలాడు.
గుజే(జ్జ)రాతి-ఘూర్జర(భాష)దేశము, అరవము, నాట్యగతివిశేషము-గుజరి, గుజ్జరి
గుజేరానాయిచ్చు-భరణమిచ్చు.
గుజేరాని-వృత్తి, జీవితము.
గుజేరాను-(గుజరానా) = ఇచ్చుట
గుజేరానుప(వ)అచు } ఈఁగిచేయు, సమర్పించు, ఇచ్చు, వెళ్లఁబుచ్చు, దాఁటించు.
గుజేరాయించు
గుజేరీ-చూ. గుజరాతి, గుజరు, గుజ్జరి.
గుజా(జి)డి-ధనికుఁడు-అమ్మకుప్ప.
గుజారా-ద్వారా, చేత.
గుజేరు-గింజ, గుంజు, గుజ్జు, గిజురు.
గుజ్జనగూళ్లు-గుజ్జెనగూళ్లు
గుజ్జరి-రీ = గుజరాతి.
గుజ్జరివాఁడు-ఘూర్జరదేశస్థుఁడు.

గుజ్జు-కుబ్జః = పొట్టికోయ్య, గుంజే, కోడెదూడ-పొట్టియెద్దు, వస, గుంజు, క్రొవ్వు, పొట్టి(ది)వాఁడు, చిక్కనిది.
గుజ్జుఁదనము-కుబ్జత-పొట్టితనము.
గుజ్జుది-పొట్టిది, గిడసది.
గుజ్జుపొట్లు- పొట్టికాయల పొట్లు.
గుజ్జుప్రాలు-ఒక జాతి బియ్యము.
గుజ్జుమామిడి-పొట్టి(రాచ)మామిడి +.
గుజ్జుమెణకరి-పొట్టివడుగు-వామనుఁడు.
గుజ్జుమొలకలు-ఒక జాతి మోటువడ్లు.
గుజ్జుల(పట్టి)పీఁట-డొంకిపట్టి, కోడిపీఁటల బండికిఁ గల రెండవ దిండు.
గుజ్జువాఁడు } పొట్టిదేవుఁడు - వామనుఁడు, గణపతి.
గుజ్జువేల్పు
గుజ్జువేల్పుతండ్రి-శివుఁడు
గుజ్జుసైదోడు-కుమారస్వామి. [మ్రింగుట.
గుటక - ఘట్టః = గుక్కెఁడు, నోటెఁడు
గుటకలు(మ్రింగు)వేయు - పదార్థము తిననాశించి నోటి కందునంతలో నోట రసమూరి మ్రింగు-ఉవ్విళ్లూరు.
గుటిక-నీటముగ్గిలేచుట-ఋటక.
గుటగుటలు-గుడగుడలు, పెద్దటికపు మాటలు, ఒక ధ్వన్యనుకరణము.
గుటు(కు)క్కు } త్రాగుట మ్రింగుటయొక్క అనుకరణము.
గుటుకుగుటుకు
గుటుక్కను-చచ్చు, గిటడఁగు.
గుటుక్కన-ఒక్క గ్రుక్కలో.
గుటుక్కమను-గుటుక్కను, చచ్చు.
గుట్ట - గోత్రః = కొండ, మెట్ట, పిట్ట. ప్రోగు; పిటికివాఁడు.

గుట్టకూలు-గుట్టగాపడు, చచ్చు.
గుట్టకూల్చు-చంపు. పాడుచేయు.
గుట్టజాలు / గుట్టవఱద / గుట్టవఱ్ఱ(వాగు) — కొండవాగు, సెలయేఱు-నిర్ఝరము.
గుట్టిచ్చు-రహస్యము తెలుపు.
గుట్టు - గూఢమ్ = గోపము, కీలకము, అనరులు, పేరిమ
గుట్టుకీడు-రహస్య(వైరము)వైరి.
గుట్టుచెడు-రహస్యము వెల్లడియగు.
గుట్టుపట్టు-గుండె-హృదయము.
గుట్టుఁబేడు-మంత్రము వెల్లడియగుట.
గుట్టుమట్టు-లోఁతుపాతు, రహస్యము.
గుట్టుసాకిరి-గూఢసాక్షి,పొంచి విన్నసాక్షి
గుడక-గుండకః = కొబ్బరిచిప్ప. కొబ్బరి పెంకు, ఆలిచిప్ప, ఉగ్గుచిప్ప.
గుడగుడ-ఉడుకుట త్రాగుటయొక్క అనుకరణము-గుటగుట.
గుడగుడలాడు-గునగునలాడు గుణగుణలాడు, అజీర్తియందు కడుపులో గూండ్రించు.
గుడాకు - బెల్లముతోఁ జేర్చి మర్దించిన [పొగాకు-తంబాకు.
గుడాణము-చిన్నమూతి బాన, కూజా.
గుడా(రము)రు-కుటీరః-డేరా, చెవిభాగము.
గుడారమెత్తు-వెనుతిరుగు, తోఁకముడుచు.
గుడారి-నీరు ప్రవహించు దోనె,
గుడాలు-గుగ్గిళ్లు చుండలు
గుడాలపంగి = దోరగా పండినగింజ,
గుడి-కుటీ = కోవెల,గుండ్రని గీఁత, గుడారము, చంద్రుని చుట్టు వేసిన వలయము, అండుగుటి, గాలిగుడి, ఇకారపుగుర్తు.
గుడికట్టు-గ్రామసీమల ఏర్పాటు, సూర్యచంద్రులచుట్టును ఏర్పడిన గాలిగుడి.
గుడికొను-భ్రమ్మ్మ, గుండ్రముగా తిరుగు, ఎక్కువగు, ఉబుకు, అలముకొను.
గుడికొల్వు-గుడిసేవకుఁడు.
గుడిగ-చిన్నమట్టిపాత్ర.
గుడిగి(గీ)-లాగు-ఇజారు, నిక్కరు.
గుడిగుడి-ఉబుకునది, కొద్దిది-అన్నువ.
గుడిగుడి కుంచములు / గుడిగుడి గుంజము — ఒక బాలక్రీడ-అందలములు.
గుడిగుడీ-హుక్కా-గొట్టము.
గుడిగె-కట్టు, బందము-గుదికొయ్య
గుడిచెంచలము-ఒక ఆకు కూర.
గుడిచేటి-దేవదాసి, లంజ, గుడిసేటి,
గుడిచుట్టు-గుండ్రముగా తిరుగు; అశ్వమండలాకార గతి, గాలిగుడి
గుడిజెల్ల-కుడిశ = ఒక దినుసుచేఁప.
గుడితిరుగుకొను-చుట్టుగా తిరుగు.
గుడిత్రిప్పు-గుండ్రముగా త్రిప్పు.
గుడి దిరుగు.- గుండ్రముగాఁదిరుగు.
గుడిదె-తలుపు తిరుగుటకు వేసెడు కీలు, మేకు, గూటము.
గుడిదొమ్మలు-చిన్న మంచిపీటి చేఁపలు.
గుడిపాత్ర-గుడిసాని-దేవదాసి.
గుడిపాము-ఇల్లువదలని వ్యక్తి. [పత్యము.
గుడిమణియము - గుడిపెత్తనము, స్థానా
గుడిమాని-దేవాలయ సేవకుఁడు.
గుడివడు-గుండ్ర నగు, ప్రదక్షిణించు.
గుడివడుఁగు-పూజారి-అర్చకుఁడు,తంబళి.

గుడిసాని- దేవదాసి-భోగస్త్రీ.
గుడి(సియ)సె-కుటీ = చిన్నపాక,గుడిసె, ఒక విత్తుచింతపండు. ఒక జాతిపక్షి.
గుడిసెతెవులు-వేరుసెనగకు పట్టుచీడ.
గుడిసెవా(వే)టు(ది)-కులట, అంటిగది.
గుడిసే(చే)టి-లంజ-దేవదాసి.
గుడుక్కు = గుటు(క్కు)కు
గుడుమ-ఉరుముట.
గుడుగుడు-గంజాయి త్రాగుడుయొక్క అను కరణము, కబడీ ఆటలోని కూఁత.
గుడుగుడుకుంచ(గుండ)ములు-పిల్లలు ఇసుకలో గుండ్రముగా తిరిగెడు ఒకబాలక్రీడ.
గుడుగుమల్లప్ప-ఉరుముల అధిదేవత.
గుడుగురావిలము-ఒక దినుసుపక్షి-అంబటి జోరిగాడు. [ఇనుపదుడ్డు.
గుడుప-గుడుపము, గునుపము, గుదియ-
గుడుపు-బొప్పి, బుడిపి.
గుడుసరి-మోసగాఁడు, వంచకుఁడు.
గుడుసు - కుటీర = పాక, గుడి, గాలిగుడి. ఇకారచిహ్నము; గుండ్రనిది. [వాలు.
గుడుసుకైదువ-చక్రము-సుడికత్తి, కంటి
గుడుసుకైదువజోదు-వెన్నుఁడు-చక్రి.
గుడుసుకైదువు-విష్ణుచక్రము-చుట్టుకైదువు
గుడుసుకొండ-చుట్టుకొండ-చక్రవాళము.
గుడుసు(వ)పడు-గుండ్రమగు, తిరుగు.
గుడుసుపఱచు-త్రిప్పు, తగ్గించు.
గుడుసులుపడు-చుట్టుకొను.
గుడుసువాలు-గుడుసుకైదువు, కంటివాలు.
గుడుసువాల్దాలుపు - } వెన్నుఁడు-చక్రి.
గుడుసువాల్మెఱజోదు }

గుడెము-కూట: = బోయపల్లె, పేఁట, చిన్న పల్లె-గూడెము, గుణెము.
గుడ్డ-బట్ట-పేలిక,ముట్టుగుడ్డ,చోటు,బిడ్డ.
గుడ్డబొందెము - చిక్కము కట్టిన మోట బొక్కెన. [పొలము.
గుడ్డ(డ్డా)ము - చేను, చెలక, కొండ్ర -
గుడ్డి-కాణః = గ్రుడ్డి (వాఁడు). చీఁకు,ఆట్ట చెమ్మ ఆటలో వెలికిలఁబడ్డకాయ. మిట్ట పొలము. [వరుణుఁడు.
గుడ్డికన్నొదుసా - కుబేరుఁడు- కాయకంటి.
గుడ్డికొంగ-చీకు కొక్కెర.
గుడ్డికొక్క(క్కె)రాయి } గుడ్డికొంగ - చీకు
గుడ్డికొక్కెర } కొక్కెర.
గుడ్డిదివ్వె-తక్కువ కాంతినిచ్చు దీపము.
గుడ్డిపురుగు-జొన్నతెగులు, కంకిదోమ.
గుడ్డిమబ్బు-వర్షింపని మబ్బు.
గుడ్డిలోమెల్ల-కొంతలో కొంతమేలు.
గుడ్డీఁగ-ఒక జాతి యీఁగ.
గుడ్డు - గోళః = కనుగ్రుడ్డు. పక్షిగ్రుడ్డు, చంటిబిడ్డ, సున్న, చొప్పదంటు గనుపు.
గుడ్డు కుడుచు-గర్వమణఁగు.
గుడ్డె-మిట్టపొలము-మెఱక-గుడ్డి.
గుడ్డెంగలము-ఎక్కువముల్లుగల చేఁప.
గుడ్లకాటుక-ఒక జాతి వరితెగులు.
గుడ్లగుబ్బలి } పశువులకు గుడ్లవలె నేర్పడు
గుడ్లగూబ } పుండు-పుట్టపుండు. గూబ.
గుణపడు-తగు, చక్కఁబడు, అత్తు.
గుణపడు- మెరుగుపడు,గుణియగు. [మగు
గుణపగు-నయమగు, మెరుగుపడు, ఆష
గుణహా-జరిమానా-జుల్మానా.

గుణింతము-గుణితమ్ = అంకెలను హెచ్చవేయుట, హల్లులతో అచ్చులను హల్లులను జేర్చుట. [చేయు.
గుణి(యి)ంచు - హెచ్చవేయు. ఆవృత్తి
గుణు(పిం)పు-సణుగు, బులిపింపు.
గుతాయించు-నిర్బంధించు, గూటించు.
గుతుపకట్టె-దుద్దుకఱ్ఱ, బడితె
గుత్త-భూమిని కౌలుకు గైకొనుట, జట్టీ - ఇజారా-గుత్తగ-గుత్తవ, గుడ్డ-వలువ.
గుత్త(గా)కాఁడు - గుత్తకుఁగొన్నవాఁడు,
గుత్త(వ)గ-గుప్తిః = మక్తా,జట్టీ,ఇజారా.
గుత్తగొను-గుత్త(వట్టు)యెత్తు.
గుత్తజట్టీ-టోకుబేరము-జట్టీబేరము.
గుత్తపుసాల-వసులకొట్టము-ఇలారము.
గుత్తము-గుప్తమ్ = గట్టిది, గొప్పది, బిగువైనది, చాలైనది.
గుత్తలంజియ | సమూహముతోఁ బోవు
గుత్తలంజె | కులట-దండులంజె.
గుత్తలంజెకాఁడు-కోడెకాఁడు-బొజుగు
గుత్తవట్టు-గుత్తకుఁ దీసికొను, సొంతము చేసికొను. కౌలుకు తీసికొను.
గుత్తి-గుచ్ఛః = అత్తము-మంజరి, గుంపు పీలమండ, కవ్వపుబిళ్ల. కష్టము, మనికట్టు క్రిందిభాగము, ఒక చెట్టు-గొత్తు-గుది.
గుత్తిక-గుచ్ఛకః = పాదము-గుత్తుక
గుత్తికగువ్వ-కపోతాంఘ్రి-గువ్వగుత్తి(క)
గుత్తికట్టు-అరకకట్టెడు మోకు మొ॥
గుత్తికవ్వము-గుత్తివలెనుండు కవ్వము.
గుత్తికాయలు-వేరుసెనగలు-బుడ్డలు.
గుత్తిక్రానుగ-దంతధావనము.
గుత్తిజల్ల-గుదిజల్ల.
గుత్తిపూసలు-ఒక జాతి వడ్లు.
గుత్తిబీఱ-లఘుకోశాతకి-సప్తపుత్రి +
గుత్తినెమలడుగు(మ్రాను) క్రనుగు-స్నిగ్ధపత్రము-ఫేనిలము +.
గుత్తు-గుత్తి. కొత్తు,గొత్తు, గుది.
గుత్తిమల్లెలు-ఒక దినుసువడ్లు
గుత్తివడు-ముడుఁగు, ముడుచుకొను.
గుత్తుక-గుత్తిక. [కమికరణము-
గుత్తుగుత్తు-ప్రాణములువిలవిలకొట్టుకొనుట
గుత్తు(లు)గుత్తులు-ఒక దినుసువడ్లు.
గుత్తులుగొను-గుత్తులు మొలకెత్తు.
గుదగుద-గుజగుజ-డగ్గుత్తిక.
గుదగుదపడు | పరితపించు-డగ్గుత్తి
గుదగుద(మను)లాడు | కతో ఏడ్చు, అనుమానపడు.
గుది - గ్రంథిః = గుత్తి, దండ, కంతి, చీలమండ, కాళ్లబందము
గుదికట్టు-కాళ్ల స్తంభించు, భారముమోపు. సమూహమగు.
గుదికా(గా)లు-చీలమండకు దిగువనుండు పాదము వెనుకటిభాగము-అడుగుకాలు
గుదికూర్పు-మాటలకూర్పు-రచన
గుదిగఱ్ఱ-గుదిబండ, గుదె, దుడ్డు.
గుదిగుంజలు-నిలువుగా పాతిన రాటలు.
గుదిగుంపులు-గుదిగా గ్రుచ్చిన గుంపులు.
గుదిగుంపులుచేయు-మాలుమూలల నున్నవాని నొకచోఁ జేర్చు-గుదిగ్రుచ్చు.
గుదిగొను-దట్టమగు, పెంపొందు, తొట్రుపడు, గుంపులగు, మీఁదపడు.

గుది[గుచ్చు-[పోగుచేయు-గుదిగూర్చు.

గుదిచిపట్టు-కుదియఁబట్టు. [పాయిమేకు.

గుదిచీల-చక్రపుటిరుసు చివరవేయుమేకు.

గుది[త్రాడు-బందము-దూడకాలికిగట్టుత్రాడు-

గుది[తోయు-కాళ్లుకట్టి [తోయు.

గుదిపి-చేతికట్టె, గుదియ, బడితె.

గుదిబండ - పెంకెయావు మెడను గట్టెడు

కొయ్య-గుదిగఱ్ఱ.

గుదిమె-పూఁతకురాని మామిడి మొ॥

గుదిమోకు-జువ్వాయిమోకు. [గద.

గుదియ-గదా = కఱ్ఱ.ఇనుపదుడ్డు, యముని

గుదియకఱ్ఱలు - గుదిగుంజల కడ్డముగాఁ

జొప్పించెడు కఱ్ఱలు.

గుదియతాలుపు } యముఁడు, దండమును
గుదియమోపరి } తాల్చినవాఁడు.

గుదియలు-ఒక జాతి వడ్లు.

గుదియించు-నిలుపు, నెలకొల్పు.

గుదిలకొను-వెతనొందు, వగచు

గుదివడు-వడఁకు, కట్టువడు, [ప్రాన్పడు.

గుదివాపు - పశువుల ఱొమ్మువాపు జబ్బు-

గుండెముక్కెర.

గుదివెట్టు-కట్టు, బంధించు.

గుదుపులు-దెబ్బలు-పోట్లు.

గుదుముకట్టు-పైరు గుబురుగా పెరుగు.

గుదుఱుకొను-తూలు, ఎక్కువలగు,సంకట

పడు, వెతనొందు,

గుదులుపట్టు-కాళ్లు తిమ్మిరెక్కు.

గుదె-గదా = కఱ్ఱ,దుడ్డు,గుదిగఱ్ఱ, గుదియ.

గుదెతాల్పువీడు-నరకలోకము.

గుదెతాల్పు-యముఁడు-దండధారి.

గుదెలవాఁడు-బద్దలవాఁడు-వేత్రధారి.

గుద్ద-గుద = ముడ్డి,ఆఁడుగుఱ్ఱ-పిఱ్ఱ-

గుద్దవిల్లు-మొలవిల్లు-అంగవిల్లు.

గుద్దలి-కుద్దాలః = గునపము, గడ్డపలుఁగు

గుద్దలించు } పెల్లగించు, వెదకు. త్రవ్వు.
గుద్దలిగొను } కీడు చేయుటకు ఊహించు;

గుద్దు-గుమ్ము.|పొడుచు-పిడికిలిపోటు-గ్రుద్దు.

గుద్దులాట-కొట్లాట, పోట్లాట, ముష్టిముష్టి.

గుద్దువాలు-గుద్దలించు ఆయుధము-గుద్దలి.

గునకలు - చిన్నపరుగులు. ఒక దినుసు

అడవివడ్లు, అమడలు. [మోఁత.

గునగున - వేగముగా నడచుటయందగు

గునపనకోడి-అడవికోడి, గువ్వనకోడి.

గునపము - ఖనిత్రమ్ = గడ్డపార-గునప

ము, గుఱుపము, గుదపము.

గునబాన-వెడల్పుమూతిగల బాన.

గునామొలనూలు-ఆఁడుపిల్లలకటిసూత్రము

గువియు } కులుకు, చెదరు, ఊఁగు.
గువిసాడు } ఆఁడు, గొణుగు, నర్తించు.
గువిసియాడు } చలించు, చిందుద్రొక్కు.

గువిపె-పొట్టివాఁడు-గిఱక. రూ. గొవిపె.

గుసుక-చిన్నపరుగు-గుసుకు(డు).

గుసుకలు-ఒక దినుసు పైరు.

గుసుకు - తొలఁగు, పరుగెత్తు - ఊఁగు,

మూయు, మలుపు, చిన్నపరుగు, ఒక

జాతి గడ్డి, మందమైనది.

గుసుకుడు-గుసుక, గుసుకు.

గుసుకుఁబ్రాలు - గుసుకుధాన్యము దంచగా

వచ్చిన బియ్యము.

గుసుకునడ } మెల్లని నడక-మంద
గుసుకు(గు)నడుపు } గమనము.

గునుకు(గు)పరుగు } మెల్లని పరుగు.
గునుకుపరువు-ద్వు }
గునుకులు-ఒక జాతి వడ్లు, అమడలు.
గునుకెత్తు-పరుగుడియు.
గునుగు-ఒక జాతి గడ్డి, తృణము.
గునుగుడు-గునుక, మెల్లని పరుగు.
గునుచు-గునియు, చిన్నగా ఏడ్చు.
గునువము-గునపము, ఇనుపదుడ్డు.
గునుపు-సొగసు, కులుకు, ఒక చెట్టు.
గున్న - కుణకః = ఏనుగుగున్న.గున్న మామిడి, బాలుడు, పొట్టిచెట్టు, పొట్టిది.
గున్నంగి-ఒకానొక(ఓషధి)పిట్ట.
గున్నవకోడి = గునప(అడవి)కోడి.
గున్నపెంకు-పూలతొట్టి, కుండీ.
గున్నపురుగు-అవిసిచెట్లకు పట్టెడిపురుగు
గుపారము-మల్లయుద్ధవిన్నాణము-కన్నాత
గుపారు-అంతటను వ్యాపించుట.
గుప్త- వైశ్యవి ఉపనామము.
గుప్పటించు-పుక్కిలించు, బట్టఉప్పళించు, చిమ్ము, కలిగించు, పెంపొందు, ఎగురు.
గుప్పన-తియ్మన-మధురిమ.
గుప్పనకూర-చిందఅవందట.
గుప్పిలి-గుప్పిడి-ముట్టి- గబ్బిలి.
గుప్ప(ప్పి)లించు-గుప్పటించు.
గుప్పించు-ఎక్కువగావిచ్చు,కురియు,గుప్పు
గుప్పిడి (లి) ముష్టి-పిడికిలి-గబ్బిలి.
గుప్పు - ఎక్కువగాప్రయోగించు, చల్లు, పొడుచు, కురియు, గట్టిగావంపు, దెబ్బ, ఒక అనుకరణము.
గుప్పుప్పున-మిక్కిగులి తొందరగా.
గుప్పుడు-ప్రోగు-రాశి, కుప్ప.
గుప్పుతెప్పున = గుప్పుగుప్పున.
గుప్పున-వడిగా, ఎక్కువగా, [పించు.
గుప్పుమను-వార్త (వాసన) వెంటనే వ్యా
గుప్పెడు-పిడికెడు, గబ్బెడు.
గుబ-ఘూకః = గ్రుడ్లగూబ -కొరడు-గూబ.
గుబక-కుంభకః = తలుపుయొక్క గండ పట్టెమీది గుబ్బ.
గుబగుబలాడించు = తొందరచేయు.
గుబగుబ-కోకిలధ్వన్యనుకరణము.
గుబగుబలు-తొందరపములు-గడబిడ.
గుబలకమ్మ-చన్నులరావియాడుపి.సోమరి
గుబిలి-పైడికంటి-గుమిలి, గుబ్బలికాడు.
గుబాటున-చటుక్కున, వెంటనే.
గుబాదెబ-హాయలు, టెక్కులు.
గుబారము-మల్లయుద్ధవిశేషము గుపారము
గుబార-లేనిమాటలు కల్పించుట.
గుబాలను-గుండెగుబేలను-గుబిల్లను.
గుబావరి-స్త్రీ చెవి గూబలకు తాల్చు నగ.
గుబాలున = గుబాటున, గుబ్బున.
గుబాలుమను = గుబాలను, గుబిల్లను.
గుబాళించు - గుబాలున వాసనకొట్టు, గుమాళించు, ఉక్కపెట్టు.
గుబిలి-చెవిగూబ - గుబ్బలి; కర్ణమలము-గుమిలి, గులిమి, గులివి. గుమ్మి.
గుబిలికాడు-చెవిగూబ-నకినాలపులుగు.
గుబిల్లను-గుబేలుమను,గుండెబెదరు.
గుబుకు-గ్రుద్దు, పొడుచు-గుముకు.
గుబుక్కున = గుబాలున.
గుబురు-గుంపు, దట్టము,దొంవము;దట్టమైనది. దూ. గుముదు.

గుబురుకొను-పొదగానేర్పడు, గుంపుకట్టు.
గుబులు-గుప్పనికొట్టువాసన, వెఱవు, పిచ్చి, ఉడుకు-బుగులు.
గుబు(ల్కొ-)లుకొను-గుప్పున వాసనకొట్టు
గుబుసు-మోసము, కిటుకు, కీలు.
గుబేలను | అకస్మాత్తుగా గుండెయందు
గుబేలుమను | బెదరు కలుగు.
గుబేలున-గబేలున, గబాలున.
గుబ్బ-కుంభః = చన్ను, కంతి, కొండ, గొడుగుపొన్ను, తలుపుగందపట్టెలమీఁది లోహపుగుండు, కాలిజోడుమీఁది ముడి, గుండ్రనిది.
గుబ్బకాయ-వీణ సొరకాయ.
గుబ్బగొడుగు-గుడ్డగొడుగు.
గుబ్బతి-కుంభః = కొండ-గుట్ట.
గుబ్బ(టి)తిలు(ల్లు)-పెంపొందు, ఉప్పొంగు, చింతించు, మండు, తిరుగుడుపడు.
గుబ్బనన్ = గుబాలున, క్రంచరన్.
గుబ్బపేట-కొండచఱియ, క్రేపు.
గుబ్బమేకు-గుండ్రతలగల చీల, మేకు.
గుబ్బమ్రాను-కుండలుచేయు పనిముట్టు.
గుబ్బలకొమరాలు | పెద్దచన్నులుగల యాఁ
గుబ్బ(లాఁడి)లి | డుది-జవ్వని
గుబ్బలికాఁడు-చిఱుగూబ-పైఁడికంటి.
గుబ్బలిదొర-హిమవంతుఁడు, గట్లయేలిక.
గుబ్బలిపట్టి-పార్వతి-కొండమాలి
గుబ్బలిపట్టిగుఱ్ఱము-సింహము.
గుబ్బలియెకిమీఁడు = గుబ్బలిదొర.
గుబ్బలిరాకన్నియ-పార్వతి-అగజ.
గుబ్బలిఱేఁడు-హిమవంతుఁడు.

గుబ్బలిఱేనిగారాబుకూఁతురు-పార్వతి.
గుబ్బలివిలుకా(ల్కా-)ఁడు | మేరు పర్వత
గుబ్బలివిలుతు(ల్తు)ఁడు | మును విల్లుగాఁ దాల్చినవాఁడు-శివుఁడు, గుబ్బలివిల్దారి.
గుబ్బలివిల్దారి-శివుఁడు-గట్టువిల్తుఁడు.
గుబ్బలు-చనుమొనలు-అంచులు.
గుబ్బసరము-ఉత్తరిగ-మెడగొలుసు.
గుబ్బి-ఒకదినుసుచెట్టు.
గుబ్బిక(కె)-ఉచ్చు, ఉరి, వాగుర. [కంటి
గుబ్బిలి(కాఁడు) = గుబిలిగాఁడు - పైఁడి
గుబ్బిసలాడు-గుసగుసలాడు.
గుబ్బు-గుండె యదరుట పగులుటయొక్క అనుకరణము, జొన్నకంకుల (సజ్జ)పొట్టు.
గుబ్బున = గుబాలున, గుబుక్కున.
గుబ్బుర(మ)ను-గుబేలుమను.
గుబ్బెత = గుబ్బలాఁడి, కొమరాలు, గుబ్బలి.
గుభాలున | గుబుక్కున, గుబాలున,
గుభిల్లున | గుబ్బున, గ్రుద్దునప్పటి
గుభీ(భే)లున | శబ్దానుకరణము.
గుమంజి-ఒక పరిమళద్రవ్యము.
గుమగుమ-మండుట పరిమళించుట యందగు అనుకరణము, సువాసన.
గుమగుమలాడు-గంధము వెదజల్లు.
గుమర-మద్దెలవంటి సన్నని వాద్యము.
గుమాని-అనుమానింపఁదగిన.
గుమాను-అనుమానము, కొంకు.
గుమాయించు-పరిమళించు, ఉక్కచే చెమట పోసి తపించు, ఉక్కపోయు.
గుమాయింపు-ఉక్క, పరిమళము.
గుమాస్తా-వ్రాఁతపనిచేయు క్రింది తరగతి ఉద్యోగి - గుమస్తా.

గుమి–పొద, మడుఁగు, గుంపు–గమి.
గుమిక–గౌల్మికః = నాయకుఁడు.
గుమికట్టు–గుంపుగూడు, ప్రోగగు.
గుమికాఁడు–కాకి,వృ గుంపున నుండునది.
గుమిగూడు } గుంపుగూడు, గుమికట్టు,
గుమిగొను } మల్లడిగొను.
గుమిడికము–విల్లు–సింగా(గి)ణి.
గుమితి–ఒక ఆయుధము–గుమ్మితి–తీ.
గుమిరిక–ఒక విధమగు నవల.
గుమిలి–శకునపక్షి, గుబిలి–గులిమి,
గుమిలించు–తపింపఁజేయు.
గుముకు = గుబుకు, పిడికిటితోఁ బొడుచు,
గుముడు–కుముదిక = ఉఁకు–గుమ్ముడు.
గుమురు = గుబురు, గుమి, గమి,గుంపు
గుమురు(ర్కొ–)కొను–ప్రోగగు, గుంపగు.
గుమురుగట్టు–గుమిగూడు, గుంపుకట్టు,
గుములు(కొను)గట్టు } గుంపులుగా చేరు
గుములుగూడు }
గుమ్మ–స్త్రీ, పొణక, పాలధార.
గుమ్మఁడు–సొగసుకాఁడు, చెన్నుఁడు.
గుమ్మకాంభోజి–ఒక నపుంసక రాగము.
గుమ్మటము–తాటాకు కాగితము మున్నగు వానితోఁ జేసిన దీపపుగూడు.
గుమ్మటిల్లు–గుబ్బటిల్లు, గుబ్బతిల్లు.
గుమ్మడి(ళి)–కూష్మాండః = తియ్యగుమ్మడి.
గుమ్మడిరేఁగు–కట్ఫలము–కాయఫలము.
గుమ్మత(తీ)లు–కత్తెరబావిలీ, అంటుజోడు
గుమ్మను–అలుసుకొను.
గుమ్మపడు–కుప్పలుగా పడు,
గుమ్మపాలు–అప్పుడు పితికిన పాలు,
గుమ్మము–వాఁకిలి–దారబంధము–గుంబము.
గుమ్మరింపు–మల్లయుద్ధవిన్నాణము.
గుమ్మరులు–ఒక దినుసువడ్లు.
గుమ్మా(లి)ళి–పాదుక–పాదరక్ష, ఉద్దాలు,
గుమ్మి–గుంట, చెఱువు, గాదె, గరిసె,
గుమ్మితి–తీ = గుమితి, ఒక పోటుముట్టు.
గుమ్ము–కుమ్ము, పొడుచు, పోటు, ధాన్యపు కొట్టు, వాసనకొట్టుటయందగు అను .
గుమ్ముడు–కుముదా = గుముడు +
గుమ్మె–చిన్న పీటిగుంట–గుమ్మి.
గుమ్మె(ట)త–గిడిగి–తుడుము.చిన్నగుడారు
గుమ్మెట(త)కాఁడు – తుడుము వాయించు వాఁడు.
గుమ్మెతగుడారము–గుండ్రని డేరా.
గుయ్యారము–గుహ్యాగారమ్–చెఱ, చీఁకటి.
గురగుర–దురద, ఇట్టిచేయు ధ్వని, పంది యఱపు–గుఱుగుఱ, గుటగుట
గురగుర లాడు–గొంతులో గురకపెట్టు.
గురపిడి–అడవిగ్గోవు–గవయము,
గురపోతు–పురుషగవయము.
గురస్తు–గృహస్థః = గేస్తు, ఇంటికాఁపు.
గురాలు–గొబ్బిబొమ్మలు, గురిగెలు.
గురి–ములక + –వార్తాకి +
గురికొచ్చ–తెలివి–అరువు–శేముషి.
గురి(క)గ } లక్క–పిడుత, గొబ్బెమ్మలు –
గురిగి } గయ్యాళి, గురియ,
గురి(గిం)జే – గుంజా = గురిజపూస–బాల క్రీడావిశేషము. రూ గురి వి(వె)ంద +
గురిశే–గృంజన = ముల్లంగి +
గురిపూసి–కై డీఁపాఁడు, బత్తెగాఁడు

గురిమిడి-ఒకజాతి దుంప.
గురియ-గురిగ, లక్క-పిడుత.
గురివి(వె)ంద-గురిజ (పూస) తీఁగ; పిల్ల లాడుకొను ఒక ఆట.
గురు-ఆడవియెద్దు-గురుపోతు-గోవ.
గురుకు-తుప్పు, గురక, పల్లము.
గురుగు-ఒకానొక భక్ష్యము, కలుపుమొక్క-భూరుండి, ఒక కూరాకు, బొమ్మపిడుత.
గురుగుపల్లిక | శ్రీహస్తిని, గురుగుపల్లిక
గురుచ | భూరుండి
గురుజ-ఒక దినుసు కూరాకు, కంకిమీఁది మూఁగు, గట్టిపడుచున్న గింజ
గురుజా-వజ్రము-రవ్వ-మగతాయి.
గురుపి-గుజ్జు, కొయ్య, కంబము
గురుపెలు-ఒక దినుసు బాణసంచు.
గురు(ఱు)తు-గుర్తు-అంకనము.
గురువాక త్తి-గురుజా, వజ్రాయుధము
గురుపోతు-గోన, గుఱపోతు.
గురులువాఱు-గిరగిరతిరుగు, పెంపుమీఱు
గురువు-పెరుగు, హెచ్చు, పేగపుపరుగు.
గురువుదేఱు-నురుగులుగట్టు, రక్తముచిమ్ము-పరుగెత్తు, పైకుబుకు.
గురువులు దాటు-మించు, మీఱు.
గురువు(లు)వాఱు - ఉబుకు, ఎక్కువగు, పరుగెత్తు, పొగరెక్కు, అదరు.
గురువెంద-గురివెంద, గురిజపూస.
గురుసు-మొదలు,మగఁటిమి,ఆయువుపట్టు, పశువ్యాధివిశేషము, మేర, కుదురు.
గురుసువడు-కలఁగఁబాఱు.
గుర్గురించు-ఘుర్ఘుర = పంది గురగురమను గుర్గురించుమెకము - అడవిపంది - కొమ్ము కాఁడు-బంటుమెకము.
గుర్గురింత-గుర్గురింమట, పంది.
గుర్తగు-చిహ్నమగు, గుఱుతువచ్చు.
గుర్తించు-గుఱుతుపట్టు.
గుర్తు-ఆనవాలు-చిన్నె-గుఱుతు.
దుర్వ(డ)ఱఁగించు-చెఱచు, చంపు.
గుర్వ(డ)ఱఁగు-పెంపడఁగు, చెడు.
గుర్వు-పెంపు, విండిన ఎక్కువైన.
గుర్రెట్టు-గుఱకపెట్టు, గుఱ్ఱుపెట్టు.
గుఱక - గుడాక = కోపము నిద్ర అనివాని యందలి గుఱ్ఱు, పశువుల గొంతుజబ్బు-
గుఱకగొను | నిద్రించు, గుఱువెట్టు, గుఱు
గుఱకపెట్టు | పోదుచు.
గుఱకపోతు-నిద్రపోతు-నిద్రాళువు.
గుఱకయిడు | నిదురలో గుఱ్ఱుమను ధ్వని
గుఱకలుపెట్టు | చేయు-గుఱువెట్టు.
గుఱగుఱ-తీఁట-దురద,ఒక అనుకరణము.
గుఱగుఱలాడు-దురదయెత్తు.
గుఱుము-ఖరు-గుఱ్ఱము, గోడా.
గుఱాము-ఎత్తుయొక్క ఒక పరిమాణము.
గుఱాలగోచ-అశ్వపాలకుఁడు - గుల్లాము-
గుఱి-గుర్తు,ఏర్పాటు,మితి,వెరవు,నమ్మిక, మచ్చ, గిరి, సాక్షి, హద్దు, రుజువు.
గుఱించి-ఉద్దేశించి, కూరిచి, కూర్చి-గుఱిచి
గుఱించు-తలపెట్టు, మితియిడు, గుఱిగాఁ జేసికొను-రూ. గుఱియించు.
గుఱికాఁడు-అంపకాఁడు, విలుకాఁడు.
గుఱికుదురు-నమ్మక (గౌరవ) మేర్పడు
గుఱికొండి-కొఱఁత-గఱగొఱ, అచ్చిక.

గుఱికొను-గుఱిగాఁ జేసికొను, పూను.
గుఱిచి-గుఱించి, గుఱియించి, కూర్చి.
గుఱిచెదరు-నమ్మకము తగ్గు,
గుఱిచే(సే)యు-ఉద్దేశించు,ఎన్ను,గణించు సరకుసేయు.
గుఱిపడు-ఏర్పడు, పేరుపడు.
గుఱిపఱుచు-ఏర్పఱుచుకొను.
గుఱిపెట్టు-గుఱిచూచు, గుఱిచేయు.
గుఱియగు-లక్ష్యమగు, చాలు.
గుఱియించు-తలపోయు, గుఱిగాఁజేయు.
గుఱివేయు - లోఁబఱ్చుకొను, గుఱిచూచి కొట్టు, వాతపెట్టు.
గుఱ్ఱివ్రాయు-గిఱిగీయు
గుఱిసేయు-లెక్కచేయు,నమ్ము,నిర్దేశించు
గుఱు=గుఱ్ఱు, గుఱక, పగ.
గుఱుక = గుఱక.
గుఱుకు-ఒకానొక పశువ్యాధి.
గుఱుకొను-ఎక్కువగు, పూను, కైకొను.
గుఱుగుఱ్ఱు-పాము బుసకొట్టుటయందగు ధ్వనికి అనుకరణము.
గుఱుతగు-ఘనమగు.
గుఱుతించు-ఆనవాలుపట్టు.
గుఱుతిడు-కోరు, గుర్తుపెట్టు.
గుఱుతు-ఆనవాలు, మేర, కీర్తి, రీతి, లెక్క, కొలఁది, మచ్చ, సాకిరి, చోటు; గొప్పది, నిజమైనది. తెల్లమైనది-గుర్తు.
గుఱుతు(ర్తు)గా-చక్కఁగా, నిజముగా.
గుఱుతుపెట్టు-ఆనవాలుపెట్టు
గుఱుతుమాట-లోకోక్తి, నానుడి, సామెత.
గుఱుతుమీఱు-తెలియకపోవు.
గుఱుతెఱుఁగు-గుర్తించు, ఆనవాలుపట్టు.
గుఱుపెట్టు } మొఱుఁగు, గుఱకపెట్టు..
గుఱుపొడుచు } గుఱ్ఱుపెట్టు-గుఱువెట్టు
గుఱు(మ)ము-గింజ, విత్తు, బీజము.
గుఱ్ఱపుఁగొంకి-పశువులకు కాలుబిగఁ దీసికొనిపోవు జబ్బు.
గుఱ్ఱపుఁజదువు-నెమరునకు రాని చదువు.
గుఱ్ఱపుఁజెక్క-అశ్విని-తొలురిక్క
గుఱ్ఱపుఁజొంగ-హాలాహలము.
గుఱ్ఱపుడెక్క-పుటము
గుఱ్ఱపుఁదోఁకలు-ఒక దినుసు వడ్లు.
గుఱ్ఱపుఁబిల్ల-అశ్వపోతము-ఏరాది.
గుఱ్ఱపుఁబీఁట - దారబందముమీఁది గుఱ్ఱపుమూతి కొయ్య.
గుఱ్ఱపుఁబెరజు-ఒకజాతి పాము
గుఱ్ఱపుమూతి చేఁప-అపహారము.
గుఱ్ఱపుమూతిపురుగు-కుమ్మరపురుగు.
గుఱ్ఱపుమూతివాఁడు } కింపురుషుఁడు-
గుఱ్ఱపుమోమువేల్పు } తురంగముఖుఁడు.
గుఱ్ఱపుసొరము-ధైవతస్వరము.
గుఱ్ఱపెక్కుడు-అందలములు, ఒకక్రీడ.
గుఱ్ఱము-ఖరుః - కత్తలాని జక్కి, కోడిపీఁట-కొయ్యపీఁట
గుఱ్ఱమెక్కు-గుఱ్ఱముపై నెక్కు,గర్వించు.
గుఱ్ఱమెక్కుడు-ఒక దినుసు బాలక్రీడ.
గుఱ్ఱు-గుడాక = గుఱక, పగ, రూ గుఱు.
గుఱ్ఱుకలుగు-గుఱ్ఱెత్తు, గుఱ్ఱుపట్టు.
గుఱ్ఱుగుఱ్ఱు-గుఱకయొక్క అనుకరణము.
గుఱ్ఱు(మను)పెట్టు-గుఱకపెట్టు, కోపమున గుఱ్ఱుగా మాట్లాడు

గుజ్జెత్తు-గుజ్జుపెట్టు, గుజ్జుకలుగు.
గుల-దురద-జిల-తీఁట-నస.
గులక-గుడికా = పశువులు తినఁగా మిలిగిన చొప్పదంటు; గుళికా = గువ్వరాళ్లు.
గులకనేల-మొరపనేల-గులకరేవడి.
గులకరము-మొలక, మొక్క, మోక.
గులకరములుగొను-మొలకలెత్తు.
గులకఱాయి-మొరము, చిన్నరాళ్లు.
గులకరించు-మొలకెత్తు, కలిగించు, నిండు, వెలార్చు, అందగిల్లు.
గులకరింత-చిన్న నీటిజంతువు.
గులకరేవడి-మొరపనేల, గులకఱాళ్లు కలిసిన రేవడినేల.
గులగుల-పక్షులు కూయుట, ఎలుగుబంటి, పుట్టలుకోరాడుటయందగు మ్రోఁత, దురద.
గులగులయగు-గుల్లయగు, లోఁటుగానగు, బూటకమగు, దురదెక్కు. [ప్రాకు.
గులగులలాడు-పురుగులు కుప్పలుగా నేర్పడి
గులగులలు-పొడి, ముక్కలు, అదుముదు.
గులప-గుజ్జువాఁడు-గుల్లాము.
గులాంకాయలు-నాగజెముడు పండ్లు.
గులాపువాఁడు-బిచ్చగాఁడు-గులాము.
గులాబి-రోజాపువ్వు, పన్నీరుపువ్వు.
గులాబి(నేరేడు)జామి-జంబుకము.
గులా(ల్లా)ము-బిచ్చకత్తె,బిచ్చగాఁడు,తొత్తు
గులాముసేయు-సేవించు.
గులామెత్తు-బిచ్చమెత్తు-యాచించు.
గులాలుపొడి-బుక్కా,గంధపొడి.
గులి(బి)మి - కర్ణమలము-గుబిలి, గుమిలి.
గులిమికదురు-గులిమితెడ్డు, పింజూషదర్వి.
గులిమిడి-ఒక దినుసు పూలచెట్టు.
గులిమితెడ్డు-గులిమి తీసికొను పనిముట్టు.
గులివి-గులిబి, గులిమి, గుబి(మి)లి.
గులు-గురుః = పెద్దలు, గరు(శాసన).
గులుగు - లోలోనగొణుగు, కులుకు.
గులుగులుసేయు-గిలిగింతపెట్టు.
గులెదావుది-పీతమాధవియను పూవు.
గుల్క(లక)ందు-గులాబీపూల లేహ్యము.
గుల్బందు-చిన్న ఉన్నిగుడ్డ-రుమాలు.
గుల్మి-గులిమి, గుబిలి, గులివి, గుమిలి.
గుల్ల - ఖోలకః = చింతగుల్ల, నత్తగుల్ల, కప్పచిప్ప, ఆలిచిప్ప, పొక్కు, తట్ట, పొల్లు;
గుల్లకాఁడు-లోనసారము లేనివాఁడు, పేద
గుల్లకావి-నలుపు కలిసిన ఎఱుపు.
గుల్లకాసు-వెలతక్కువ నాణెము, బోలుగాఁ జేసిన కాసు.
గుల్లగుట్టు-తఱుఁగు, నశించు.
గుల్లచేయు-పూర్తిగా వెచ్చించు. [నేఁత.
గుల్లనేఁత - గట్టనచేయక పలుచగా నేసిన
గుల్లపడు-బోలగు, పేదపడు, మొక్కపోవు.
గుల్లపఱుచు-క్రిందుపఱచు,చెఱచు,ఏమియు లేకుండఁజేయు.
గుల్లపుటికె-చిన్నగంప-బుట్ట, సజ్జ.
గుల్లడి / గుల్లరేవడి } బిగువు తక్కువగా నున్న రేవడినేల.
గుల్లసున్నము - నత్తగుల్లలు చిటిగవ్వలు కాల్చి తయారుచేసిన సున్నము
గుల్లాము-గులాము,గుండఁడు,గుఱాలగొచ
గుల్లి-చిన్నది, తోఁకలేనిది.
గుల్లించు-కుదించు, విదుర్చు, నాటు.

గువ్వ-అడవిపావురము, పిల్ల- గ్రువ్వ.
గువ్వకరి - పావురముల గుంపు, ఎడతెగ కుండుట, ముమ్మరము. [చెలరేఁగు.
గువ్వకరిగొను - చుట్టుకొను, పెంపొందు,
గువ్వకుత్తుక - ఆఁకలిచేఁ గలుగు నీరస స్వరము. తీఁగయెలుఁగు [చెడిపోవుట
గువ్వకూర్చుండుట-నీరులేకుండా టెంకాయ
గువ్వకొను-గుంపుకూడు, మంతనాలాడు,
గువ్వకోలు-గుమికూడుట
గువ్వకో(లుకొ)ల్కొను-చెలరేఁగు, మంతనాలాడు, చుట్టుకొను, గుంపుకూడు
గువ్వగుత్తి-క | హీనస్వరము, నలియను
గువ్వగుత్తుక | గంధద్రవ్యమిచ్చు మొక్క-గుత్తుకగువ్వ. [పోవు.
గువ్వగుత్తుకపడు - నీరసిల్లు, నోరెండుక
గువ్వగుత్తులు-స్త్రీల నగలు
గువ్వపుల్లుడు-గువ్వవన్నె చౌటినేల
గువ్వము-ముక్కలి పులుసు, ఆనకాయ లోని పిండి, గుజ్జు.
గువ్వముసురు-తెలుపిలేని జడివాన.
గువ్వతాయి-గులకతాయి-మొరపతాయి.
గుస-లోఁతుతక్కువగల చేప [ముసగెన.
గుసగుస - రహస్యపు మాటల సవ్వడి-
గుసగుసలాడు | చెవిలో మెల్లగా అస్ప
గుసగుసలుపోవు | ష్టముగా చెప్పుకొను
గుసాయి-వంటచేయు ఓడ్రుఁడు
గుసి-వా. బండిగూటము.
గుసిలింత-నవ్వు-హాసము
గుసులూను-సంధి బంధములు తెగు,
గుళి(క)-ఉండ, ము త్తెము, ఆటబంతి, గోళీ.

గుళ్ళారిగాఁడు-పొడుగాటివాఁడు.
గుళ్లు-కుందెనగుడియను బాలక్రీడ, గుడులు.
గుహారు-వాదు, అగడారు, గుపారు.
గూంటము-గూటము, కొయ్య(ఇనుప)సుత్తి.
గూంద్ర - గుడ్లగూబ కూఁత, కడుపులో పుట్టు వికారము-గుంద్ర.
గూంద్రించు | కడుపులో వికారముపుట్టు.
గూంద్రిలు-ల్లు | గుడ్లగూబకూయు, అర్చు.
గూఁటి-ఘృష్టిః = పంది-ఊటమెకము.
గూఁటిగువ్వ-ఈకలురాల్చిన పక్షి-అణుజా.
గూఁటిపడు-దాఁగు, మఱుఁగగు
గూఁటిపఱచు-దాఁచు, మఱుఁగుపఱచు.
గూఁటిసుడి-పశువు తోఁకక్రింది సుడి.
గూఁడు - కులాయః = పక్షి యిల్లు, ఆకు గుడిసె, పంజరము, దీపపుగూఁడు, వరి కుప్ప, బండి పైకప్పు, కళ్లజోడుపెట్టె.
గూఁడుకట్టు-సూర్యచంద్రుల చుట్టును గుడి కట్టు, చుట్టును గుడ్డకట్టు.
గూఁడుకాను | గూఁటిలోఁబడినది - పక్షి,
గూఁడుపుట్టువు | నీడజము
గూఁడుపురాణి-కుట్ర, మోసము,
గూఁడుబండి-పైన గూఁడుకట్టిన బండి.
గూకు-గుద్దు, దెబ్బ, గుముకు.
గూగు-రోమాంకురము, మిక్కిలి సన్నిని ముండ్లు-నూఁగు.
గూగుళ్లు - నీటి పరిమాణమును దెల్పెడు చెఱువునందలి రాతిగుండ్లు
గూజు-చూ. గుజ్జు
గూట(టా)ము - కూటమ్ = దేరామేకు, కొయ్యమేకు, దేరగుంజ, మాదిగవాని (చర్లవాని) పనిముట్టు, చిలుకకొయ్య.

గూ(టాయిం)టించు - కూట = దట్టించు, చివాట్లుపెట్టు, నిర్బంధించి యడుగు.

గూటింపు-దట్టించుట, దూఱుట.

గూటి-పంది-కిటి, చప్పరింత.

గూటిపఱచు-కప్పిపుచ్చు, దాచు

గూటు-దూఱు, తిను, గూటించు

గూడ - తిరుపగూడ, దొప్ప, చేఁపలవల, పెద్దగంప, చేలకు నీరు తోడు పనిముట్టు, పూలసజ్జ, బండిజెల్ల, తలపై నుంచుకొను తుంగచాఁప.

గూడకట్టు-గోఁచిపెట్టని పంచికట్టు

గూడకొంగ } పెద్దకొంగ-కొక్కెర, కొంచ-
గూడతోఁటు } బలాక

గూడదాసరి-ఒక తెగ మాలదాసరి.

గూడపాల-మామెన +, దూడపాల +

గూడబాతు-పెద్దఱెక్కల బాతు.

గూడవేయు-చేనికి గూడతో నీరుపెట్టు.

గూడార(రు)ము-(గుణాలయ) గుడారము.

గూడుకట్టు-గూడుగా కట్టు.

గూడుకళ్లము-గాఁడికళ్లము.

గూడుకానుపు-పక్షి, పిట్ట

గూడుదిగు-గుండెబరువు తగ్గు.

గూడుపరిగె-ఒక దినుసు భక్ష్యము

గూడుపుటాని-మోసము(కుట్ర)చేయుట.

గూడుపుట్టువు-పక్షి.

గూడుపురుగు-అముదపు మొక్కలను జెఱచు పురుగు.

గూ(గు)డెము-కూటః = పేఁట, బోయపల్లె.

గూద-గుదమ్ = ప్రకృతికిందికిఁజిగిన గుదము. ఒకానొక రోగము.

గూన-ఱాన, పెద్దబొక్కెన, పెంకు.

గూనపులి-గూనకడుపుగల పులి.

గూని-వీఁపుపై వంకర కలిగిన.

గూనిది-గూనుకలది-కుబ్జ.

గూనివాఁడు- పొట్టివాఁడు, మఱుగుజ్జు.

గూను-వీఁపుమీఁది వంకర, పొఱడు.

గూనుగిలు-ల్లు-వంగు, గూను కలుగు.

గూనుపోవు-వెన్ను వంకరపోవు

గూపము-గుంజు, గుజ్జు, గూబము.

గూపెట్టు-ప్రోగుచేయు, గుంపుచేయు.

గూబ-చెవి మొదలు, ఏతవు బొక్కెనపైన అడ్డచీల దూర్చెడు కడియము, ఘూకః = గుడ్లగూబ, చెడ్డది, తక్కువది.

గూబతడ్డ-నులితడ + -మహాబల +

గూబజంకెన-గూబవలె బెదరించుట.

గూబము-గుంజు, గిజురు, గూపము

గూబరి-మాదిగ-ఆసాది-గోసంగి.

గూబి-ఘూకః = గుడ్లగూబ-గూబ.

గూబు-ఒకజాతి గుల్మము.

గూబ్బాలీలు-(చెవి) గూబబావిలీలు.

గూపినాఇ-ఒక దినుసు బాలక్రీడ.

గూస-ఆఁబోతు, బలిసిన బాలుఁడు.

గూళి-గృధ్రమ్ = బోరువ-పెద్దగద్ద.

గూళియెద్దు-దేవరపేర వదలిన ఆఁబోతు.

గూళ్ళతెగులు-ఆకులపై గూళ్లుపెట్టి పైరు తినివేయునట్టి పురుగులు పట్టుతెగులు.

గూళ్ళాపిడలు-ఒక దినుసు భక్ష్యము.

గూళ్లపడు-చిక్కిపోవు, కన్నులు గుంటలు పడు, ఱబ్బలు నొప్పిపెట్టు.

గూళ్లు-చొన్న(సజ్జ)దంటు కుప్పలు.

గెంగమ్మ-కలరా, యా. గంగ(న)మ్మ.

గెంగెట = కెంగె(గ)ట. [గాంజే.
గెంజాయి-కలంజః = గంజా(యి) వి.
గెంటని-ఎడతెగని-స్థిరమైన. [శూరుఁడు
గెంటరి-పగతునిగెంటివేయువాఁడు-పోటరి
గెంటసమాడు-గేలివేయు. క్రిందుచేయు.
గెంటసము-గేలి, కట్టె విరుపుమాట, ముల్లు.
గెంటించు-కడపు, త్రోయు, ఓడించు
గెంటు-త్రోయు. తీర్చు. పోవు. త్రోపు.
గెంటుగొంటు = చెక్కు-చెదరు.
గెంటుప(వ)డు-తప్పుకొను, తొలఁగింపఁ బడు, తక్కు. [గోతము.
గెంజెపుబోరెములు-జములు నూలుసంచి-
గెంజె = గంజె, ఏటకట్టు.
గె(గి)ంజెము-జములు నేఁతబట్ట,గాటము.
గెంట్లము-గుడ్డు-గుడ్డు-అండము.
గెండ-(కము) / గెం(డియ)-డె – గండకః-చేఁపపిల్ల, గండు చేఁప-మగమీను.
గెంతు-క్రాంతి = ఎగురు-దూఁకు-గంతు
గెందిరి-ఉడుకుఁజోతు, ఈసుకాఁడు.
గెగ్గ(లి)లు / గెగ్గెలు – మిక్కిలిగేలి, ఎగతాళి, గడ్డలు
గెచ్చియ-చ్చె = ఒకజాతి చేఁప-గెజ్జె.
గెచ్చ-గచ్చ-గ్రచ్చ-యక్షాక్షి +
గెజ్జె-అంబుపక్కెర-గెచ్చె.
గెట్టించు-బట్టించు, పలకకట్టు.
గెమ్చ-పొడవుగా పెరిగినవాఁడు.
గెట్టె-గుబ్బపుదెక్క-ఖురము.
గెడ-కాండః = వెదురు-గడ.
గెడ-దగ్గఱ. చెలిమి, వేఁటసామగ్రి జంట
గెడంచు-గడమంచి, గడవంచి.

గెడకత్తియ / గెడకత్తె – చెలికత్తె. గెడపై ఆడెడు దొమ్మరిసాని-గడకత్తె.
గెడగూడు-జతపడు, రతికూడు,వెన్నంటు.
గెడనేయు-కూర్చు, కలుపు.
గెడపులాట-కొట్లాట, పోట్లాట.
గెడయు-చమ్చు. గిట్టు-రూ. కెడయు.
గెడసాని = గెడకత్తె, గడకత్తె.
గెడి(గ)గె-కుండ. చిన్నకుండ. బుంగ.
గెడుము-గెంటు, త్రోయు, గదుము.
గెడెము-సేద్యపుసామగ్రి-గెలె(శె)ము.
గెడ్డ = గడ్డ, పెల్ల, పెడ్డ, బెడ్డ.
గెణికెలు-గనుపు గనుపునకు నడుకఁబడిన చొప్పదంటు కట్టలు. [గనెము.
గెణెము-పొలముగట్టు - గనిమ, గనిమె,
గెణుసుగడ్డ-చిలగడదుంప.
గె(గ)త్తము-ఎరువు-పెంట, గొబ్బరము.
గెదుము - అదలించు, గదుము, గొడ్లను పరుగెత్తించు, గద్దించు
గెద్దగోరు-చిన్నగొండ్లెము, నల్లఉప్పి +
గెనయు-పెంపొందు, వర్ధిల్లు, తృప్తిపడు.
గెన(ను)సు / గెనిసె – చిలగడదుంప, రత్నపురిగడ్డ, తియ్యకంద-గునుసు, గెణుసు,
గెపితి-జ్ఞప్తిః = గుర్తు, బుద్ధి-గెప్తి.
గెబ్బ-గర్వః = పొగరు, మత్తు, గబ్బ.
గెబ్బ-గెంటు, చంపు, దొంగిలించు, తెలిసి కొను, కైకొను. ఈసడించు.
గెరవాటు-గిరవాటు, విసిరివాటు.
గెరవు-వానలేమి-వఱపు
గెరాంచి-రొలుపొలము, రొలు-
గెఱ-గీఁత, గిఱి, గీటు, సున్న, రూపు.

గెలు(కట్టు)గొను-గెలిగీయు, రూపేర్పడు.
గెలు(వ్రా)యు-హద్దు నేర్పఱచు, గెలిగీయు.
గెడాయించు- చుట్టుకొను, అరికట్టు.
గె(గొ)ల-గుళుచ్ఛః = పూగుత్తి,పండ్లగుత్తి
గెలిపి(ల్పి)ంచు-గెలువఁజేయు
గెలివి(ల్వి) - సంతోషపు కేక, సంతసము, గొడవ, పూనిక, ఓర్పు-గెలివిడి.
గెలివి(ల్వి)కాఁడు-సంతోషమున గోలచేయు వాఁడు-రవణుఁడు.
గెలివి(ల్వి)డి-గెలివి, గెలువము, ఓర్పు.
గెలుచు(ల్చు)-పుచ్చు, ఓడించు, కడుపు
గెలు(పము)పు-నెగ్గుట-జయము-గెల్పు.
గెలుపుఁ(ల్పు)గంబము-విజయస్తంభము.
గెలుపు(ల్పు)కాఁడు-జయశీలుఁడు- గెల్వరి.
గెలుపు(ల్పు)కొను-గెలుచు, ఓడించు
గెలుపు(ల్పు)పేరు(వజీరు)గలాఁడు / గెలుపు(ల్పు)బాసయొడయఁడు } అర్జునుడు.
గెలుపు(ల్పు)లచ్చి / గెలుపు(ల్పు)సిరి } జయలక్ష్మి-విజయశ్రీ.
గెలువ(డి)ము-నెగ్గుట-గెలుపు-గెల్వడి
గెలువ(ల్వ)రి-గెల్పుకాఁడు-జేత
గెలెము-గెడెము.
గెల్ల-వైపు, ప్రక్క, చక్కి, తట్టు.
గెల్లాడు-కదలు, చలించు
గెల్లి-ఉప్పుకుప్ప-ఉప్పిలము-లవణరాశి.
గెల్లు-ఘర్షః = కదిలిక, రొద గొల్లు.
గెల్లుప(వ)డు-చెలరేఁగు, అంకెవేయు.
గేగులు-తాటిమొలకలు-తేగలు, తీఁగలు.
గేడి-ప్రక్క, గోడు, నిటారు, ఉబ్బెత్తు.
గేడించు-గెంటు, నిరసించు, తఱుము.

గేడి(డె)కాళ్లవాఁడు-కొంగకాళ్లవాఁడు.
గేడియ(డె)ము-నీళ్లతోడు తాటిదోనె.
గేతు-మిడత, శలభము, ధివ్వార్పువులుగు.
గేదఁగి-కేతకీ = మొగలి(పూవు)-గొమలి.
గేది / గేదియ-దె } బఱ్ఱె, పొట్టిబఱ్ఱె, ఎనుము, పడ్డ.
గేదెకాళ్లు-కొంగకాళ్లు, కదురుకాళ్లు.
గేదెచెలప-మూఁడేండ్ల బఱ్ఱెదూడ. [ము.
గేదెమాడ-ఏఁడాదిలోపు గేదెదూడ-కయాహా
గేదెపడ్డ-నాల్గేండ్ల బఱ్ఱెదూడ.
గేదెపెయ్య-రెండేండ్ల ఆఁడు బఱ్ఱెదూడ.
గేనము-జ్ఞానమ్ = తెల్వి-ప్రజ్ఞ.
గేబు-తాటిమొలక, తేగ.
గేర-దున్నిన రెండుచాళ్ల నడిమిచోటు.
గేరకాళ్లు - పొట్టేలు మున్నగు పన్నజీవాల ముంగాళ్లు
గేరా-గిరజాలు.
గేరచ్చ-రాచబాట, వాడ, సొమ్మ.
గేలి-కేళీ = ఎగతాళి, ఎక్కలి, గ్రేణి.
గేలించు / గేలి(గొను)కొట్టు / గేలిచేయు } ఎగతాళిచేయు, వేళాకోళముచేయు, ఎకసక్కెమాడు, వెక్కిరించు.
గేలిడు-గేలిచేయు, ఎగతాళిచేయు.
గేస్తు(ఁడు) - గృహస్థః = సంసారి, సోమయాజి, మగఁడు-రూ. గ్రస్తు.
గేస్తురాలు-ఇల్లాలు, పెండ్లాము.
గైకట్టి-ఏతపుబొక్కెన తగుల్చు గడ
గైగడ్డ-పెండలము-పిందాలువు.
గైత-బోయవాఁడు, వేఁటకాఁడు.
గైరంగము-ఉమ్మకాపు, రెండవకాపు.

గైరంగామీ-అనావృష్టి, వఱపు.
గైరమ్మ-పార్వతి-గౌరమ్మ, గయిరమ్మ.
గైసు-చూ రూ. గయిసు.
గైరు-మిన్నయైనది
గొ-గో (అదిగొ, ఇదిగొ మొ॥) చూపుట యందు వచ్చును. గొట్టియొక్క సంక్షిప్త రూపము.
గొంకిమ్రాను-ఒక దినుసు చెట్టు
గొంకుమన్నుతగరు-ఒకానొక శస్త్రము.
గొంగ-పగ(ది)వాఁడు-గొట్టు, చావు.
గొం(గో)గడి-కంబళః-గొంగళి (పురుగు)
గొంగడికాఁడు-ఒకజాతి పక్షి.
గొంగళి-కంబళః-కంబడి - గొంగడి.
గొంగళిచిక్కుడు-శూకరపాదిక +
గొంగళిపురుగు = కంబళి పురుగు
గొంగి-ఒకజాతి ఆకెరువు మొక్క.
గొంచికాఁడు-ఉమ్మడి సేద్యపు పెద్ద.
గొంచిసేద్యము = సమష్టి సేద్యము.
గొంజి-ఒక అడవి పండ్ల చెట్టు.
గొంజె-గొడ్రాలు, గొడ్డుటావు, గొడ్డు.
గొంజఁగి-కుబ్జకః = పచ్చపూమొగలి -
గొంజెగొడుగు-పెద్దగొడుగు
గొంటరి-కటికి,కట్టిడి,కూళ-గొంటు, గొట్టు
గొంటి-చెడ్డది, దోసకారి
గొంటు-మొంటా = మొద్దువక్క, చెడ్డది. కుంఠః = నేర్పరి, అడిగొంటు, మోసకాఁడు, కలడికలవాఁడు అను నర్థమిచ్చు ప్రత్యయము-గొట్టు-గొంటరి,
గొంటుకాఁడు-మోసకాఁడు, నేర్పరి.
గొంటుతనము-జాలిలేమి, మోసము, నేర్పు.
గొంటు(ట్టు)పోఁక-గొట్టువక్క.
గొండ్రట-కొండ్రడ-పొలము, చాలు
గొండ-కంకిపొట్టు వీడని గింజలు. జొన్న మొదలగువాని బొంతు.
గొందము-గుందము-నిప్పులగుంట.
గొండి-స్వభావార్థమునవచ్చు ప్రత్యయము. మిక్కిలి ఏటవాలుచోటు. [పాఁ.
గొండిలి(ల్లి)-క్రీడా = ఆట(కత్తె)-గొల్లి
గొండీలు-మొక్కలు-గిడిగిళ్ళు, గొటిగలు.
గొండెము-తలుపు చిలుకు-గొండ్లెము.
గొండ్లికాఁడు = ఆఁటకాఁడు-నర్తకుఁడు.
గొండ్లికొను-నాట్యముచేయు, ఆడు.
గొండ్లియాడు-నాట్యమాడు
గొండ్లెము-కుంపటి గంగాళము మున్నగువాని చెవి, గుండ్రని కడియము, తలుపు చిలుకు. రూ. గొణ్ణె(ల్లె)ము.
గొంతరించు-పెంపెక్కు, చెలరేఁగు.
గొంతాటిపోవు-గొంతెండు.
గొంతి-కుంతి,అతివ, పాండుపత్ని-గోఁతి.
గొంతు తడుపుకొను-దప్పి తీర్చుకొను
గొంతు-(క)-కంఠః = కుత్తుక,కంఠధ్వని. కంఠముపొపలిభాగము, కుక్కుటాసనము.
గొంతుకపోఁక-కంఠము పుండటి ఎముక
గొంతుకూర్చుండు } మోకాలి చిప్పలు గొం
గొంతుకొను } తువలకు వచ్చునట్లు కూర్చుండు
గొంతుకోయు-అపకారముచేయు.
గొంతు(కోలు)క్రోవి-కంఠనాళము.
గొంతుచించుకొను-గొంతువిచ్చునట్లఱచు.
గొంతుపట్టుకొను-అపాయ మేర్పడు.

గొంతు(పోఁక)ముడి - గొంతుక యందు పోఁకకాయవలె నుండెడు ఎముక.
గొంతుమాఱు-కంఠధ్వనిమాఱు, మల్లబంధ విశేషము-రఘ్నాత.
గొంతుమూఁగవోవు-స్వరము తగ్గు.
గొంతువిచ్చు-గొంతుచించుకొను.
గొంతెండు-గొంతారిపోవు.
గొంతెత్తు-కంఠధ్వని పెంచు-ఎలుఁగెత్తు.
గొంతెమ-గొంతెమ్మయను గ్రామదేవత.
గొంతెమ కోర్కెలు-తగని కోర్కెలు.
గొంతెమగొమ(గో)రు-లంజెసవరము +
గొంతెమ్మ-నిప్పచ్చరము, శూన్యము.
గొంతెమ్మలుపెట్టు-గొబ్బెమ్మలు పెట్టు.
గొంది-మూల, సందు, చోటు, వంటిల్లు, ఇఱుకు
గొందిపెట్టు-దాఁచు-మఱుఁగుపఱచు.
గొగ్గాళ్లు-వంకరగా మడచినకాళ్లు-గొగ్గికాళ్లు
గొగ్గి-ఎచ్చుతగ్గులు గల ముత్తెము. బొమిడికము-ఎచ్చుతగ్గులు. కొక్కి.
గొగ్గిట-గఱుకు(మొఱకు)తనము.
గొగ్గిపండ్లవాఁడు-కొక్కికోఱలవాఁడు.
గొగ్గు-వంకరటింకర, కొక్కి.
గొజ్జెఁగ | కుబ్జికా = పన్నీటిపూమొక్క,
గొజ్జఁగ | తెకులచేమంతి + - గొజ్జంగ.
గొజ్జఁగి | గొజ్జంగి, గోజఁగి, గోజంగి,
గొజ్జ(ఁ)ంగి-గొజ్జఁగ, గొజ్జఁగి. [బువు.
గొజ్జఁగినీరు - పన్నీరు-పూనీరు, హిమాం
గొజ్జఁగిపూవు-పన్నీరుపూవు. గొజ్జెఁగ
గొజ్జఁగిఁబ్రాలు-ఒక జాతి వడ్లు.
గొజ్జు-పులుసు పచ్చడి-రూ. గ్రొజ్జు.
గొజ్జుఁబ్రాలు-ఒక దినుసువడ్లు.

గొటగొట-పులిగాండ్రింపు మొ॥ మ్రోఁత.
గొటిక-గట్టిగొంటుగింజ. గొటుకు.
గొట్టపురోగము-ఒక జాతి వరితెగులు.
గొట్టము-క్రోవి, మూస-తారాజువ్వ, కొళాయి
గొట్టాలపురుగు - జొన్న మొదలగువాని దంటు తొలిచి పాడుచేయు పురుగు.
గొట్టి | ఒక ముండ్లపక్షి, ఒక జాతి
గొట్టికంప | ముండ్లచెట్టు, ఒక జాతి గడ్డి.
గొట్టికాఁడు-వేగరి-చారుఁడు-కొట్టికాఁడు.
గొటికాయ-గోలీగుండు-గోలీకాయ.
గొట్టు-కటుః = గొడవ, చెట్ట, గాలి, బెడిదము, క్రూరము, గాటుగలది, చెడ్డది. స్వార్థమునను తాచ్ఛీల్యమునను వచ్చు ప్రత్యయము-గొంటు, గొంగ, ఒక చెట్టు.
గొట్టుకాలము-కఱవుకాలము.
గొట్టుసేయు-వెల్లడించు, దూఱు, బాధించు
గొట్టె-ఘట్టః = పశువులకాలిగిట్ట, రేఁగు +
గొట్టెలు-ఒక దినుసు వడ్లు.
గొ(ట్లియ)ట్లె-ఘొంటా = రేఁగు, రే(ను)వు
గొడ-హింస, బాధ, మారితెగులు.
గొడఁగు - గొణఁగు - నసుకు, గులుగు, కూయు, పలుకు, కసరు. [గొణగ.
గొడగ-కూటకమ్ = ఏడికోలలేని నాఁగలి -
గొడగప(వాఁడు)-మాదిగజాతి-గోసంగి.
గొడగిరి-మాదిగ-గొడారి, గూబరి. గోచరి.
గొడగించు-మ్రోఁగు, గిపెట్టు.
గొడగొడలాడు-వదరు, వాగు, గొణఁగు.
గొడ(బ)వ - పోరు, కీడు, తప్పు, జోలి, కలఁత, అల్లరి, అడ్డంకి, వెత, పగపు -
గొడవగొట్టు | అల్లరిపెట్టు స్వభావము కల
గొడవపోగు | (వాఁడు)వి, కయ్యాలక్రచ్చు.

గొడవు-ఛత్రము = గొడు(గు)వు.
గొడవుకామె-గొడుగు పట్టిన ఆఁడుది.
గొడసాల-గోడపాల+- దేవగంధ + ,
గొడారి-మాదిగ-గొడగరి, గోదరి,కసాయి.
గొడిగ-గులికా = గులక(మవ్వ)టాయి.
గొడిగుజ్జు-గుడికా = ఎడ్లు కాడిలోవైపునకు జరుగకుండుటకై కాడికన్నములో దిగ వేసిన కఱ్ఱ-గొడికట్టె
గొడితె-మోకు చివర వేసిన ముడి-గొణితి.
గొడిదబ్బ-మోటలాగెడు ఎద్దుల మెడక్రింద వేయు కొయ్యబద్ద
గొడిబూమి-గులకరాళ్లు గల రేవడినేల.
గొడియ-పల్లకియొక్క అంగము, నేరస్థుని చేతికి తగిలించు బంధన సాధనము.
గొడివారు-కాఁడికి కట్టెడు తోలు త్రాడు.
గొడివె-ఇక్కట్టు, అడ్డు. గొడవ,
గొడిసె-చింతకాయ, గొరిసె, గొడ్లజబ్బు.
గొడుగు-ఎండచాటు-ఎల్లి, ఒక విధమైన క్రీడ-రూ. గొడువు.
గొడుగుక్రిందిరూపు-జేఁడు, ఛత్రపతి
గొడుగుగడ్డి-గ్రుడ్డికామంచి-గుహ్యాము.
గొడుగుపా(గ)వలు-అడిగఱ్ఱలు,పాదుకలు.
గొడుగు రూపురిక్క-వి. జ్యేష్ఠ*
గొడుగుబల్ల-ద్వారముమీఁది బల్ల.
గొడుగులవారు-దేవునిపల్లకివెంట గొడుగు లను బట్టుకొని నడచువారు.
గొడుగులు-నీటిబుడగలు.
గొడుగుసుడి-ఎద్దుమూఁపు క్రింది సుడి.
గొడువు = గొడుగు, ఎండచాటు పుట్టువు.
గొడె-గొడియ, ఇనుపగొలుసు.

గొడ్డ-కుట్టః = బిఱుసు,కోపము, తొడబిళ్ళ. రాయి, [బాధించునది.
గొడ్డ(క)గము-కుట్టకమ్ = దుండగము-
గొడ్డతనము = బిఱుసు (మొండి) తనము
గొడ్డము-కట్టః = కీడు, చెట్ట
గొడ్డలి-కురారః = పరశువు-గొడలి
గొడ్డలికత్తి-రెండువైపుల పదునుగలకత్తి -మడ్డుకత్తి.
గొడ్డలిచిప్ప-చిన్నకంచెముక్క.
గొడ్డలు-కట్టెవిఱుపు మాటలు.
గొడ్డవెట్టు-అడ్డగించు, నిలుపు.
గొడ్డాఁగొఁకర = వంధ్యాకర్కోటకి +.
గొడ్డావు-వంధ్యగోవు-గోవ
గొడ్డు-సంతతిలేమి,గొంజె,పశువు. గొడ్రాలి తనము,గాటు, మొద్దు, కాఁపులేమి, వమ్ము. ఉత్త, వట్టి.
గొడ్డుఁగొఁకర-గొడ్డాఁగొఁకర-కందశాలిని.
గొడ్డుఁబోతు-గొడ్డుకాఁడు, గొడ్రాలు,అప్ర యోజకుఁడు, అంబేద, జాలిలేనివాఁడు.
గొడ్డుకారము-ఉప్పు కలుపని కారము.
గొడ్డుగేదె-ఈనికలేని బఱ్ఱె.
గొడ్డుటాఁగొఁకర-పుత్రధాత్రి భ్రామరి +
గొడ్డుటావు-సంతులేనిఆవు-గొంజ,
గొడ్డుతెవులు-పైరులకుఁబట్టు తెగులు.
గొడ్డువీఁగు-సంతానవతియగు, గొడ్డుతన ము తగ్గు. [అలిడిపడు.
గొడ్డు(పో)వోవు-గొడ్రాలగు, వమ్మగు.
గొడ్డెలుఁగు-ఎలుఁగుబంటి-కరిడి.
గొడ్డేలు-గుత్తుఁగొను, గొడ్డువోవు. వి. చిన్నయేలు. ఒకదినుసుచెట్టు.

